# తెలుగు సాహిత్యచరిత్ర

## చతుర్థభాగము

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్
విశ్రాంతాచార్యులు, తెలుగు శాఖ
ఆంధ్రవిశ్వకళాపరిషత్, వాల్తేరు.

రమణశ్రీ ప్రచురణ
విశాఖపట్టణము

# అంకితము

శ్రీవిన్యాసకళావిలాసకవితాశీర్వాదమోదమ్ముతో
జీవాత్మస్పృహణీయగేయకవితాశ్రేయోభిలాషమ్ముతో
స్త్రీవిద్యాఫలితాశుచిత్రకవితాస్నేహార్ద్రభావమ్ముతో
దైవానుగ్రమదత్తమైనయది మత్సాహిత్యచారిత్రమున్

సరససంగీతసాహిత్యసౌరభముల
సరళమార్గదేశివిభాగపరిమళముల
అతివిలక్షణమౌ దక్షిణాంధ్రయుగము
'మల్లెమాల' మనస్వికి మల్లెమాల

ప్రకృతియే పాఠశాలగా పరిగణించి,
స్వీయకృషియే తపస్సుగా స్వీకరించి,
సాటివారిలో మేటియౌ సహజకవికి -
చలనచిత్రనిర్మాతకు - చతురమతికి -

పలుకు నుడికారము కులుకు పద్యకవికి -
లలితలలితమ్ములౌ పాటల రచయితకు -
చిత్రనిర్మాణమార్మికశేఖరునకు -
సుప్రథితకళాసాగర్‌ప్రచోదకునకు -

కోమలబాలనటీనట
రామాయణచలనచిత్రరసలోకపురో
గామికి - **ఎమ్మెస్రెడ్డికి**
హేమాద్రిగభీరధీరహృదయాగ్రణికిన్ -



## స్వీకారము

నిత్యసత్యాలు వడగట్టి నిగ్గు తేల్చి
తెలుగు సాహిత్యచరితను తీర్చి దిద్ది
పిలిచి నాచేత నిడినట్టి ప్రేమమూర్తి
కొర్లపాటికి అర్పింతు కోటినతులు -

మా వియ్యము మా నెయ్యము
లావణ్యము వెల్లివిరియు లక్షణములతో
కోవిదుల మెప్పు బడయుచు
జీవించునుగాక! భువిని చిరకాలమ్మున్ -

- మల్లెమాల



## కృతజ్ఞత

రామాయణనిర్మాణము
క్షేమముగా నిర్విరామకృషిఁ జేయునెడన్
శ్రీ మల్లెమాల కూర్చెను
సీమావధి లేని ప్రేమ స్వీకారమ్మున్ -

సంయమనశీలి ప్రతిభా
సంయోజితచలనచిత్రసద్యఃకవితా
హంయజనశాలి డాక్టర్
యం. యస్. రెడ్డికి కృతజ్ఞతాక్షరసుమముల్ -

\- కొర్లపాటి

# భూమిక

పవనాందోళితనారికేళకదళీపత్రావళీనృత్యకో
నవనాంతవ్యవసాయజీవనవిధానప్రాప్తి చెట్టెక్కి, స
త్కవనోద్దీపితనారికేళకదళీద్రాక్షాపరీపాకవ
ర్ణవితానవ్యవసాయజీవనవిధానధ్యాస సంప్రాప్తమై 1.

వరగురువాక్సుధారసము వాకలు కట్ట నిసర్గలాలసాం
కురమును ప్రోది చేసి నునుక్రొంజిగురాకిడ పాదుకొల్పి పం
దిరిపయి నిల్పుకొంటి మది తీగలు సాగిన సాహితీలతన్
పరిణతపత్రపుష్పఫలభారగభీరసముజ్జ్వలాకృతిన్ 2.

కన్నుల నిప్పులైన వడగాల్పుల ధాటికి వాడకుండఁగా
వన్నెల చిన్నెలైన జడివానల దాడికి వీడకుండఁగా
మిన్నుల మ్రోఁతలైన మిడిమేలపు పిడ్గుల మాడకుండఁగా
సన్నుతసాహితీలత వసంతవికాసము చెందు నిత్యమున్ 3.

ప్రాకృతసంస్కృతాదిబహుభాషల భానుమయూఖమాలికల్
సోకినవైన వీ తెలుఁగు శారద శారదచంద్రచంద్రికల్
వాకున కందరాని వగు స్వాదురసామృతపూరసారశ
య్యాకమనీయముల్ సహృదయప్రకరానుభవైకవేద్యముల్ 4.

సాహిత్యార్ణవమంథనోత్థచరితాంశస్వచ్ఛకావ్యామృత
గ్రాహిగ్రంథము వాంఛనీయమని పూర్వగ్రంథసంధానముల్
సాహాయ్యమ్ముగ నూతనాంశముల తోడన్ తథ్యమిథ్యావివ
క్షాహృద్యమ్ముగ పంఘటింతును యథాశక్తిన్ సమగ్రమ్ముగన్. 5.

# స్వగతము

సరిగా పాతిక సంవ
త్సరములు ఎం. ఏ కు తెలుఁగు సాహిత్యచరి
త్ర రమణ పాఠము చెప్పిన
పరిపాటిమెయిన్ రచింతు పరమార్థముగా. 1.

ఆంధ్రవిశ్వకళాసంసదాంధ్రశాఖ
శిష్యమిత్రసహవ్రతుల్ చేసినట్టి
మామకపదవీవిరమణామంత్రణసభ
వ్రాసెదననిన ప్రకటన వాస్తవముగ. 2.

విశ్వవిద్యాలయసహాయవిత్తసంఘ
మున్నతతమవిద్యార్హత, ఉజ్జ్వలపరి
శోధనము, ప్రచురణములు చూచి యిడిన
సార్థగౌరవపదవియు సార్థకముగ. 3.

సంగ్రహములు సర్వస్వముల్ సకలవిషయ
కలితసిద్ధాంతగ్రంథముల్ కలవుగాని
స్నాతకోత్తరతరగతిస్థాయి పాఠ్య
గ్రంథమగు చరిత్రము లేని కారణమున 4.

సహజము ప్రమాదపతితము
ప్రహసనసదృశము ప్రమాణరహిత ముపేక్షా
సహము కువిమర్శ కావున
సహృదయసముచితసమీక్ష సాపేక్షముగా. 5.

# పీఠిక

స్నాతకోత్తరతరగతిస్థాయి సాహిత్యచరిత్ర వ్రాయవలయునని సంకల్పము. అందుకు స్నాతకోత్తరతరగతివిద్యార్థులకు సాహిత్యచరిత్ర పాతిక సంవత్సరములు నిరంతరముగ పాఠప్రవచనము చేసిన అనుభవము మూలధనము. ముప్పదినాలుగు సంవత్సరములు పరిశోధనము చేసిన, పాతిక సంవత్సరములు పైగా పరిశోధనము చేయించిన అనుభవము చక్రవృద్ధి.

ఆంధ్రవిశ్వకళాపరిషత్తులో తెలుగు శాఖ 1931 వ సంవత్సరమునందు తేజరిల్లినది. ఆనర్స్ తరగతులకు బోధన, పరిశోధన కార్యక్రమము ప్రారంభమైనది. అప్పటి తెలుగు శాఖ అధ్యక్షులు పింగళి లక్ష్మీకాంతముగారు సాహిత్యచరిత్రను, సాహిత్యవిమర్శను పాఠ్యప్రణాళికను ప్రవేశపెట్టి, వానికి రూపురేఖలు దిద్ది తీర్చిరి. 1931 వ సంవత్సరము నుండి 1949 వ సంవత్సరము వఱకు వారు పాఠప్రవచనము చేసిన సాహిత్యచరిత్ర, సాహిత్యవిమర్శ శిష్యప్రశిష్యుల ద్వారా దేశమంతట దీధితులు ప్రసరించినవి. లిఖితరూపము నందినవి. అవి రూపాంతరము చెంది అచ్చయినవి. ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారి ఆంధ్రసాహిత్యచరిత్ర అసమగ్రముగ 1974 వ సంవత్సరమునందు ముద్రితమైనది. లిఖితప్రతికి, ముద్రితగ్రంథమునకు చాల అంతరము కలదు. ఆంతర్యము దురవగాహము. లిఖితప్రతియందు అజ్ఞాతయుగము మొదలు ఆధునికయుగము వఱకు కలదు. అందు చక్కని ప్రణాళిక కలదు. సమగ్రమైన సమ్యగవగాహనము కలదు. స్పష్టమైన ప్రతిపాదనము కలదు. కమనీయమైన కవితాశైలి కలదు. అది సమగ్రసుందరమైన సాహిత్యచరిత్ర. ముద్రితగ్రంథము సమగ్రము కాదు. సుందరమును కాదు. ప్రణాళిక సడలినది. అవగాహనము మాఱినది. ప్రతిపాదనము పలచబడినది. శైలి శ్లథమైనది. ఉభయత్ర విషయమునకు కాలదోషము పట్టినది. కాబట్టి స్నాతకోత్తరతరగతిస్థాయి సాహిత్యచరిత్ర సాపేక్షము.

స్నాతకోత్తరతరగతిపరీక్షలందును, ఉద్యోగార్హతానిర్ణయపరీక్షలందును వ్యాసప్రశ్నలు, వామనప్రశ్నలు అడుగుట సర్వసాధారణము. అవి పాఠ్యప్రణాళికానుసారములు. వ్యాసప్రశ్నలకు సంబంధించిన విషయములు సవిస్తరముగను, వామనప్రశ్నలకు సంబంధించిన విషయములు సంగ్రహముగను ఉండవలయును. ప్రముఖకవుల గుఱించి ప్రత్యంశవివరణము, ఇతరకవుల గుఱించి ప్రత్యేకాంశవివరణము తదనుకూలము. అదియే ఈ గ్రంథరచనాప్రణాళికకు ప్రాతిపదిక. ఇది సాహిత్యచరిత్రగ్రంథరచనాప్రణాళికను సంపదించునదియే.

పూర్వాభిప్రాయములను పునఃపరిశీలనము చేయువేళ, ప్రతిపాదకుల పేరులు తెలుపలేదు. అందుకు రెండు హేతువులు కలవు. 1. విద్యార్థులు, ఉద్యోగార్థులు పరీక్షలందు విపర్యయములకు పాల్పడు ప్రమాదము కలదు. అది వారికి నష్టము

కలిగించును. 2.ప్రతిపాదనము ప్రధానముకావి, ప్రతిపాదకుడు ప్రధానము కాదు. అయిన రాగద్వేషములు అంకురించును. అవి కుశంకలకు, కువిమర్శలకు దారి తీయించును. ఉత్తమవిమర్శ వ్యక్తిపరము కాదు; వస్తునిష్ఠము. ప్రతిపాదకుల పేరులు వలయువారికి సంఖ్యాసూచికలోని ఆకరములు తెలుపును.

ఇతరత్ర విపులీకరించిన విషయములను ఇందు సూచనప్రాయముగను, సంక్షేపరూపమునను కలవు. అందుకు రెండు కారణములు కలవు. 1. గ్రంథరచనా ప్రణాళిక. 2.గ్రంథప్రయోజనము. జిజ్ఞాసువులకు విపులీకరించిన తావులను సంఖ్యా సూచికలోని ఆకరములు తెలుపును.

అముద్రితకావ్యములు కొన్ని అనుశీలింపలేదు. అందుకు రెండు నిమిత్తములు కలవు. 1. అసూర్యంపశ్యత. 2. పాఠ్యప్రణాళిక. అవి సూర్యరశ్మి సోకి, పాఠ్యప్రణాళికను తాకినపుడు అవశ్యానుశీలనీయములు.

అడిగిన పుస్తకములు అందజేసిన ఆచార్య కె. సర్వోత్తమరావు, ఆచార్య దేవళ్ల చిన్నికృష్ణయ్య, ఆచార్య కోలవెన్ను మలయవాసిని, శ్రీ టి. మురళీకృష్ణ (ఆఫీసర్, ఆంధ్రా బేంక్) శ్రీ నిడదవోలు శివసుందరేశ్వరరావు, శ్రీ ముదునూరి జగన్నాథరాజు, డాక్టర్ గుండవరపు లక్ష్మీనారాయణ, డాక్టర్ సజ్జా మోహనరావు, చి. యస్. మల్లేశ్వరరావు, చి. సౌ. ద్వివేది కృష్ణగాయత్రి ప్రభృతులకు ---

అమూల్యమైన అభిప్రాయములు తెలిపిన న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివ రావు, గురువర్యులు డాక్టర్ నండూరి రామకృష్ణమాచార్య, జాతీయపరిశోధనాచార్యులు ఆచార్య బిరుదరాజు రామరాజు, ఆచార్య కోలవెన్ను మలయవాసిని, ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మలకు ---

ముద్రణమును పరిచూచుటయందు సహకరించిన ఆచార్య కోలవెన్ను మలయవాసిని, డాక్టర్ సజ్జా మోహనరావులకు ---

**కృతజ్ఞతలు**

---ఆచార్య కొర్లపాటిశ్రీరామమూర్తి

# The Letter

**Justice Avula Sambasivarao**
(Former Vice-chancellor of A.U.)

Hyderabad
10 - 2 - 1995

Dear Acharya Sri Rama Murthy garu,

I have received the copy of "తెలుగు సాహిత్యచరిత్ర" third volume. I thank you very much for your friendly gesture.

As usual, as I read every work of yours, I have been reading this also with great interest. You have taken up a highly stupendous but very useful task of probing into the history of Telugu Literature. Very few people have reliable information and knowledge about the origin and development of Telugu Literature. The third volume deals with prabandha period, which is acclaimed as the golden era of Telugu literary growth, sponsored, encouraged and enriched by Krishnadevaraya. your analysis, your clarity of thought and conclusions are made in a scientific style, strongly supported by reasoning and illustrations. You have done a commendable Job. I am looking forward to the publication of the rest of the volumes also.

I heartily Congratulate you on this laudable work of yours and wish you the best of health so that you can continue to render your valuable services to the cause of knowledge and scholarship.

Yours Sincerely
(Sd) A. Sambasivarao

# లేఖాంశములు

డాక్టర్ వండూరి రామకృష్ణమాచార్య (అధికారభాషాసంఘం పూర్వాధ్యక్షులు) సికింద్రాబాద్ 500 003

**17 - 4 - 1993**

నీవు వ్రాసిన వాఙ్మయచరిత్ర రెండు సంపుటాలు (ప్రథమ, ద్వితీయ భాగములు) ప్రత్యక్షరం చదివి సంతోషించాను ............... పూజ్యపాదులు పింగళి వారి రచనలు మెరపుతీగలు. నీ రచన స్థిరవిద్యుత్కళిక ............. సర్వతోముఖసుందరము. నీ వచనరచన మల్లినాథసూరివ్యాఖ్యానసదృశం. కావలసినది వదల లేదు. అనవసరమైనది చేర్చలేదు.

**25 - 1 - 1995**

కవుల చరిత్రలు, కావ్యానుశీలనములు వాఙ్మయచరిత్రలు కావు. తెలుగులో నూరేండ్లపైబడి ఎందరో మహామభావులు ................................ . ఈ రంగంలో ఉగ్గడింపదగిన సేవ చేశారు. పలువురు మెచ్చదగిన కృషి చేశారు స్థూలదృష్టికి వాఙ్మయచరిత్ర అంటే కావ్యపరంపరానుశీలనమే కావచ్చు. సూక్ష్మదృష్టికి యుగయుగాంతరాల చరిత్ర. సామాజికరాజకీయచరిత్ర. అవగాహనతో కూడుకొనిన వివేకవిశ్లేషణ .............................................. లక్ష్మీకాంతంగారు వెలకొల్పినవి తొలి ఉమప్పులు. ఆచార్య శ్రీ కొర్లపాటి రచన మధ్యాహ్నచండమార్తాండవిక్రాంతి. నీ రచన "పట్టపగలింటి సూర్యుని పగిది" వెలుగొందగలదు. వివేకులు ఎవరైనా రథమును మరలించుకొని ప్రక్కకు తప్పుకోకలసిందే. నీ చేతిలో వాఙ్మయచరిత్ర పరాకాష్ఠ చెందింది.

**4 - 2 - 95**

పెక్కుమంది యేటి పిల్లకాల్వల బోలు<br>
వాఙ్మయకథలెన్నొ వ్రాసినారు<br>
కోనసీమ సప్తగోదావరిని బోలు<br>
గొప్పరచన గూర్చె "కొర్లపాటి"

సం॥ వండూరి రామకృష్ణమాచార్య

# అభినందనచందనం

డాక్టర్ బి. రామరాజు
జాతీయపరిశోధవాచార్యులు

హైదరాబాదు
500 020

ఈ తెలుగుసాహిత్యచరిత్రలో ప్రతియుగానికి అవసరమైనంత చారిత్రభూమిక, కాలక్రమాన్ని అనుసరించి ఆ యా కవుల చరిత్రలు, వారి కృతుల పౌర్వాపర్యం, వాటి సమీక్ష, వాటి వైశిష్ట్యం, మూల్యాంకనం, మహాకవుల ఆత్మీయత, యుగసమన్వయం మొదలైన అంశాలు చాలా సమగ్రంగా సాకల్యంగా నిర్దుష్టంగా నిష్పక్షపాతంగా ఉన్నవి. నేను బి.ఏ చదువుతున్న దినాల్లో (1947-49) కె. వెంకటనారాయణరావుగారి (కవిత్వవేది) ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహం బాగా ప్రచారంలో ఉండిన సాహిత్య చరిత్ర. అందులో ఏడు ఖండాలున్నవి. ప్రతిఖండానికి రాజకీయసామాజికచరిత్ర, వాఙ్మయచరిత్ర, కావ్యసమీక్ష హృదయాకర్షకంగా ఉంటుంది. అటువంటి సాహిత్యచరిత్ర తరువాతి కాలంలో రానేలేదు. ఇన్నాళ్లకు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారి తెలుగుసాహిత్యచరిత్ర దానితో సరితూగగల గ్రంథం వచ్చింది. అది సంగ్రహం. ఇది విపులం. అది అసమగ్రం. ఇది సమగ్రం. అది లలితమనోహరం. ఇది ప్రౌఢసుందరం. ఇందులో ఆ యా మహాకవుల ప్రశస్తికి, ప్రాముఖ్యానికి తగినంత స్థానం లభించింది. కృతుల సమీక్ష, అనువాదం, పోలికలు వైశిష్ట్యం ఉచితరీతిగా ఉన్నది. పెద్ద కవులకు పెద్ద పీటలు, చిన్న కవులకు చిన్న పీటలు లభించినవి. పూర్వసాహిత్యచరిత్రకారులు, విమర్శకులు, పండితపరిశోధకులు, ఆ యా కవుల కాలాల గురించి, కృతుల గురించి వాటి పౌర్వాపర్యం గురించి గుణదోషాల గురించి చేసిన సిద్ధాంతాలు, చెప్పిన అభిప్రాయాలు, ఇచ్చిన తీర్పులు ఈ సాహిత్యచరిత్రలో తారుమారైనవి. కొన్ని సరిక్రొత్తగా చెప్పినారు. ఏది చెప్పినా సప్రమాణంగా చెప్పినారు. ఆ యా కవుల కాలాలు, వారి కృతుల వైశిష్ట్యం వారికి ప్రేరకాలు, ఉద్బోధకాలు. పూర్వపూర్వకవుల ప్రభావాలు సోదాహరణంగా నిరూపించినారు.

ప్రథమభాగం ఉపోద్ఘాతంలో శునశ్శేపాఖ్యానం ప్రక్షిప్తం కావచ్చునన్నారు. తెలుగు బౌద్ధజైనకావ్యాలు మతప్రాతిపదికన నాశనం కాలేదన్నారు. పుట్టనివి గిట్టే అవకాశమే లేదన్నారు. నన్నెచోడుని కుమారసంభవం ప్రతి కూటసృష్టి అన్నారు. జినేంద్రపురాణం, కవిజనాశ్రయం, ఆదిపురాణం మొదలైనవి ప్రాఙ్నన్నయకృతులు కావన్నారు. నన్నయగారిది ప్రసన్నకథాకవితార్థయుక్తియేగాని కలితార్థయుక్తి కాదన్నారు. నన్నయభారతం రాజరాజనరేంద్రాంకిత మన్నారు. రంగనాథరామాయణరంగనాథుడు చక్రపాణి రంగనాథుడు కాదన్నారు. కాసె సర్వప్ప తిక్కనగారి కంటగట్టిన జైనబౌద్ధవిద్వేషకళంకం క్షాళన చేసినారు. మంత్రిభాస్కరుడు కవిపోషకుడు మాత్రమే

అన్నారు. తిక్కన ఉత్తరరామాయణం, భారతాల కంటె బుద్ధారెడ్డి పూర్వరామాయణం తరువాతి దన్నారు. తిక్కనగారి "ప్రబంధమండలి"లోని ప్రబంధశబ్దం ప్రక్రియాభేదం సూచించదన్నారు. రాయబారఘట్టంలోని ద్రౌపది మాట "అలుపాల" కాదనీ "అఱపాల" అనీ సిద్ధాంతం చేసినారు. నన్నయది శబ్దార్థసమప్రాధాన్యశైలి అనీ, తిక్కనది అర్థప్రాధాన్యశైలి అనీ తీర్మానించినారు. బుద్ధారెడ్డిది ద్రావిడదృష్టి అనే మతం నిరాకరించినారు. తిక్కన అరణ్యపర్వశేషరచన చేయకపోవటానికి అశుభదాయకం అనే నమ్మకం కారణం కాదనీ అంకితానికి సంబంధించిన సమస్య అనీ చిక్కు విడదీసినారు. పెంచుకలదిన్నె శాసనం కాలాంతరసంక్రాంతకూటసృష్టి అన్నారు. వేములవాడ భీమన 1327-1400 ప్రాంతం వాడన్నారు. సుమతిశతకం ఆయన రచనమన్నారు.

ద్వితీయభాగంలో శ్రీనాథుని కాల్పట్టణం ఇది - అది అని నిశ్చయించడం ఊహామాత్రశరణ్యం, పాకనాటిగృహస్థు అనుట నిశ్చయ మన్నారు. అనువాదవిధానం - కథానువాదం, భావానువాదం, పదానువాదం అనే వర్గీకరణం కంటె స్వతంత్రాంధ్రీకరణం, అస్వతంత్రాంధ్రీకరణం, స్వతంత్రాస్వతంత్రాంధ్రీకరణం అనే వర్గీకరణం సుసంగత మన్నారు. మురారికి పూర్వం సంస్కృతంలో, శ్రీనాథునికి పూర్వం తెలుగులో పాణింధమశబ్దప్రయోగం మృగ్యమన్నారు. అవచి తిప్పయశెట్టికి శ్రీనాథుడు బాల్యసఖుడు కాడనీ బాలుడైన సఖుడనీ "బాలసఖ" శబ్దాని కర్థం చెప్పినారు. హరవిలాసంలోని చిఱుతొండనంబి చరిత్రానికి పెరియపురాణబసవపురాణాలు మూలం కాదనీ అవచి తిప్పయ అందజేసిన జనశ్రుతి కావచ్చునన్నారు. శ్రీనాథుని భీమేశ్వరపురాణానికి సంస్కృత భీమఖండం మాతృక కాదన్నారు. అది శ్రీనాథుని తెలుగుకృతికి సంస్కృతీకరణమన్నారు. భీమేశ్వరపురాణం దక్షారామాయణ మన్నారు. శ్రీనాథుని కాశీఖండం అయఃపిండం కాదు పయఃపిచ్ఛిల మన్నారు. శ్రీనాథుని వీథినాటకం చాటుపద్యాల సంపుట మన్నారు. శ్రీనాథుని బావమఱిది దగ్గుపల్లి పోతన అనీ బమ్మెర పోతన కాదనీ చెప్పినారు. నారాయణశతకం పోతనకృతం కాదన్నారు. వీరభద్రవిజయంలోని "భాగవతప్రబంధ"మనే పద్యం ప్రక్షిప్తమన్నారు. అందులోని "యేషాగాథలు", ఎఱుకతపోదె యక్షగానప్రభావమన్నారు. అది పోతన రచనం అవటం సందిగ్ధవిషయమన్నారు. భాగవతభూస్థాపనకథ కూచిమంచి తిమ్మకవి సృష్టి అన్నారు. భాగవతావతరణానికి గొప్ప చారిత్రికనైపథ్యం సంతరించినారు. "కర్ణాటకిరాటకీచకు"ల్లోని కిరాటకీచకులు బహ్మనీసుల్తాను లన్నారు. భాగవతాంధ్రీకరణం మహాస్వతంత్రపద్ధతి అన్నారు. మడికి సింగన పద్మపురాణరచనం 8-1-1421 నాడన్నారు. గౌరన హరిశ్చంద్రోపాఖ్యానానికి మూలం మార్కండేయపురాణం కాదన్నారు. వేమన 17వ శతాబ్దం వాడు కాదనీ 15వ శతాబ్దం వాడనీ నాథయోగి అనీ నిరూపించినారు. క్రీడాభిరామం వల్లభామాత్యుని రచన మన్నారు. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు శ్రీనాథుని సమకాలీను డనేది కట్టుకథ అన్నారు. కవుల షష్ఠం నంది మల్లయ, ఘంట సింగనల రచన కాదన్నారు. సుభద్రాకల్యాణం తాళ్లపాక తిమ్మక్క రచన కాదు. అది తిమ్మప్ప

రచన మన్నారు. మొల్ల కాలం 1500 అన్నారు. ఈ ద్వితీయభాగానికి ఐదు అనుబంధాలున్నవి. మొదటిది వచనరచన గూర్చి. రెండవది దేవకీనందనశతకం గూర్చి - అది జిన్నమంత్రి కృతం కాదనీ 16 శతాబ్దం పూర్వార్ధం తరువాతి రచనమనీ అభిప్రాయపడ్డారు. ఈ రెండు అనుబంధాలకి మధ్య శ్రీనాథునికి మరో మూడు అనుబంధాలున్నాయి.

తృతీయభాగంలో శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలే కాదు; నవరత్నకవు లుండివా రన్నారు. భువనవిజయసభాభవననిర్మాణం 1515 లో జరిగినదన్నారు. పింగళి సూరన, ప్రబంధాంకం మూర్తిరాజు, తెనాలి రామకృష్ణుడు, కందుకూరి రుద్రయ, అయ్యలరాజు రామభద్రుడు అష్టదిగ్గజాలలోనివారు కారన్నారు. సకలకథాసారసంగ్రహం కూటసృష్టి అన్నారు. పైడిమఱ్ఱి వేంకటపతి ముత్తాత రామరాజు తండ్రి కృష్ణరాయభూషణుడు అష్టదిగ్గజాలలో ఒకడన్నారు. ఈ విధంగా నంది తిమ్మన, అల్లసాని పెద్దన, మాదయగారి మల్లన, ధూర్జటి, కృష్ణరాయభూషణుడు - ఈ ఐదుగురే అష్టదిగ్గజాల్లోని ఆంధ్రకవులు, కృష్ణావధానులు సంస్కృతకవి, తిమ్మణ్ణ, చాటువిఠలనాథుడు కన్నడకవులు, హరిదాసు తమిళకవి మొత్తం తొమ్మండుగురు నవరత్నకవులని తీర్మానించారు. తమిళకవి అభావంలో అష్టదిగ్గజము లన్నారు. అల్లసాని వాని అల్లిక జిగిబిగి కావ్యరచనాశిల్పం గాని ఏకవాక్యతాసంపాదనం గాని కాదన్నారు. అది పద్యరచనాశిల్పమే అన్నారు. ఆంధ్రకవితాపితామహబిరుదం పెద్దనగారికి హరికథాసారం రచన కంటె ముందున్నదే కాని, మనుచరిత్రరచన మూలంగా రాలేదన్నారు. అల్లసాని పెద్దన విష్ణుభక్తుడే కాని వైష్ణవుడు కాడన్నారు. శ్రీకృష్ణదేవరాయలు మధురమీనాక్షిని వర్ణించకపోవటం వీరవైష్ణవం అన్నారు. ధూర్జటి కుమారధూర్జటికి పితామహపరంపరలో ఒకడే గాని పెదతాత కాదన్నారు. ఒంటిమెట్ట రఘునాథశతకం అర్వాచీనరచన మన్నారు - మోహనాంగి మారీచీపరిణయం కూటసృష్టి అన్నారు. తాళ్లపాక నరసింహాచార్యులు సంకుసాల నృసింహకవి కాడన్నారు. ఈ విధంగా కొర్లపాటివారు పూర్వుల అభిప్రాయాలు కాదన్నవీ, తాము నూతనంగా ప్రతిపాదించినవీ నేను పేర్కొన్నవి కొలది మాత్రమే. ఇంకా చాలా చాలా ఉన్నవి. ఏది చెప్పినా తగిన ఉపపత్తులతో సాక్ష్యాధారాలతో చెప్పినారు. కొన్ని చోట్ల సూటిగా, గాటుగా చెప్పినారు.

ఈ సాహిత్యచరిత్ర ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారి 25 ఏండ్ల అధ్యయన అధ్యాపన పరిశోధన ఫలం. సర్వజనాస్వాదనీయంగా ఇది వెలువడటానికి ఆయన సమగ్రదర్శనం, సరియైన మూల్యాంకనం, సహృదయకావ్యవిమర్శ, దురభిమానరాహిత్యం కారణాలు. ఇది ముఖ్యంగా స్నాతకోత్తరవిద్యార్థుల దృష్టిలో పెట్టుకొని రచించిన సాహిత్యచరిత్రం. సర్వీసుకమీషన్ పోటీ పరీక్షలు వ్రాసేవారికి కొంగుబంగారం. సాహిత్యచరిత్రజిజ్ఞాసువులకు పరమోపాదేయమైన గ్రంథం. విద్యార్థులు కాని ఇతరజిజ్ఞాసువులకు ఇతోధికసాహిత్యాధ్యయనానికీ పరిశోధనకూ దోహదం చేసే

రచన యిది. ఇంతకు పూర్వం వెలువడిన సాహిత్యచరిత్ర ఏది చదివినా, విద్యార్థులు ఆ యా మహాకవుల పాఠ్యాంశాలు గూడ చదివితేనే సమాధానాలు వ్రాయగలరు. కొర్లపాటి వారి తెలుగుసాహిత్యచరిత్ర చదివితే పాఠ్యాంశాలు చదువనక్కరలేదు. ఆ యా మహాకవుల చరిత్రలతోపాటు వారి కావ్యాల సమీక్ష, పౌర్వాపర్యం, పూర్వకవుల ప్రభావం తగిన ఉదాహరణలతో ఉండటం చేత పెద్ద ప్రశ్నలకు చిన్న ప్రశ్నలకు సమాధానాలు సులువుగా వ్రాయవచ్చు. విద్యార్థుల కంటె, పోటీపరీక్షలు వ్రాసేవారి కంటె అధ్యాపకులు సమాధానపత్రాలు దిద్దేవారు ముందుగా చదువవలసిన గ్రంథమిది. ఇదమిత్థంగా చెప్పినవన్నీ అందరికీ ఆమోదయోగ్యం కాకపోవచ్చు. కొందరికి ఈ సాహిత్యచరిత్రలోని తీర్మానాలు రుచించకపోవచ్చు. అది ఇతోధిక పరిశీలనకు పరిశోధనకు తప్పక దోహదం చేస్తుందని నా అభిప్రాయం.

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి గారి శైలి చాలా విశిష్ట మైనది. ఆయన గొప్ప పరిశోధకుడే కాదు. గొప్ప రచయిత. పరిశోధన మెంతో పాండిత్యమంత. పాండిత్యమెంతో సృజనాత్మకత అంత. ఆయన అనేకకథలు, నవలలు, నాటకాలు, ఖండకావ్యాలు రచించి తెలుగు సరస్వతిని అలంకరించినారు. సృజనాత్మకశక్తి కలవారు పరిశోధనరంగంలోనికి దిగితే వారి పరిశోధనలకు కూడ సాహిత్యవువిలువ సమకూరుతుంది. సిద్ధాంతగ్రంథాలు కూడా సాహిత్యశైలిని సంతరించుకుంటాయి. "స్పర్ధయా వర్ధతే విద్యా" అన్నారు. దానికి పరమప్రమాణం కొర్లపాటివారు. ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ముగ్గురు సమకాలీనులు సమస్కంధులు. పాటివారు గజకచ్ఛపాల వలె అహమహమిక పడ్డారు. ముగ్గురూ మూడు శిఖరాలైనారు. అందులో కొర్లపాటి వారు పరిశోధనం తోపాటు సృజనాత్మకరచనలు కూడ చేయటంవలన వారి పరిశోధనకు విమర్శకు సృజనాత్మకశైలి అలవడింది. ఈ తెలుగుసాహిత్యచరిత్ర సమతలంలో గంభీరంగా పారే గంగానదీసదృశమైన గంభీరశైలిని సంతరించుకున్నది. కొర్లపాటివారికి శ్రీనాథు డభిమానకవి. శ్రీనాథుని పద్యశైలి కొర్లపాటివారి గద్యశైలిలో ప్రతిబింబిస్తున్నది. కావ్యవిమర్శలోనే కాదు చారిత్రకవిషయాలు చెప్పిన చోట కూడ ఆయనశైలి ఉదాత్తంగాను గంభీరంగాను ఉన్నది.

ఇంత గొప్ప తెలుగు సాహిత్యచరిత్ర తెలుగు సరస్వతికి కైసేసిన ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారిని ఆశ్లేషిస్తూ, అభినందనచందనం అందిస్తున్నాను.

- ఆచార్య బి.రామరాజు

# విషయసూచిక

# దక్షిణాంధ్రయుగము

## చారిత్రికనైపథ్యము

విజయనగరసామ్రాజ్యము విజయధ్వజమెత్తినది. తెలుగు సాహిత్యము తేజరిల్లినది. ఆ మహాసామ్రాజ్యము పతనావస్థకు పాల్పడినది. తెలుగు సాహిత్యము క్షీణదశకు రాసాగినది. ఆ కాలమెల్ల క్షీణయుగము. (1601-1875) అందు ఒక అవాంతరయుగము దక్షిణాంధ్రయుగము. (1601-1875) ఆంధ్రదేశమునకు ఆవల దక్షిణదేశమునందు తెలుగు సాహిత్యము వెలయుటవలన దక్షిణాంధ్రయుగము. ఇది స్థలపరమైన యుగవిభాగము. తమిళదేశములోని తంజావూరు, మధుర, చెంజి లేక జింజి, పుదుక్కోట; కన్నడదేశములోని మైసూరు దక్షిణాంధ్రయుగసాహిత్యమునకు ఆటపట్టులు. ఆయువుపట్టులును.

తంజావూరు రాజ్యము చోళరాజ్యము. అది విజయనగరసామ్రాజ్యమునందు విలీనమైనది. సదాశివదేవరాయల కాలమునందు 1550 ప్రాంతమున స్వతంత్రరాజ్యమైనది[1]. ప్రథమతః అచ్యుతదేవరాయల మఱదలు మూర్తమాంబ భర్త సెవ చెవ్వప్పనాయకుడు (1550-80), అనంతరము సెవ చెవ్వప్పనాయకుని కుమారుడు అచ్యుతప్పనాయకుడు (1580-1600), తదనంతరము అచ్యుతప్పనాయకుని కుమారుడు రఘునాథనాయకుడు (1600-31), తదుపరి రఘునాథనాయకుని కుమారుడు విజయరాఘవనాయకుడు (1633-73) తంజావూరు తెలుగు నాయకరాజులు[2]. వీరిలో రఘునాథనాయకుని, విజయరాఘవ నాయకుని కాలములందు తెలుగుసాహిత్యము వికసించినది.

విజయరాఘవనాయకుని అనంతరము, తంజావూరు రాజ్యము ఛత్రపతి శివాజీ సవతి సోదరుడు ఏకోజీ అధీనమైనది. అది మొదలు రాజ్యాంతము వఱకు తంజావూరు పాలకులు మహారాష్ట్రులు. వారిలో శహాజీ (1684-1712), తుక్కోజీ లేక తుళజాజీ (1728-36), రెండవ ఏకోజీ (1736-37), ప్రతాపసింహుడు (1739-63), అమరసింహుడు (1787-98) శివాజీ (1833-55) కాలములందు[3] తెలుగు సాహిత్యము విలసిల్లినది.

మధురరాజ్యము పాండ్యరాజ్యము. అది కూడ విజయనగరసామ్రాజ్యము నందు విలీనమైనది. సదాశివరాయల కాలమునందే స్వతంత్రరాజ్యమగుట సంభవము[4]. నాగమనాయకుని కుమారుడు విశ్వనాథనాయకుడు స్వతంత్రరాజ్యస్థాపకుడని తంజాపురాంధ్రరాజుల చరిత్రమునందు కలదుగాని, ఆధారము లేదు. అవకాశమును లేదు. విశ్వనాథనాయకుని కుమారుడు కృష్ణప్పనాయకుడు మధురనాయకరాజ్యస్థాపకుడు

కావచ్చును[5]. మధుర నాయకరాజులును తెలుగు వారు. వీరిలో తిరుమలరాయల (1623-29) చొక్కనాథుని, (1659-82) ముద్దళఘురి (1675-78), విజయరంగ చొక్కనాథుని (1706-32) కాలములందు[6]. తెలుగు సాహిత్యము వెలువడినది.

చెంజి లేక జింజి రాజ్యము తుండీరమండలము. అదియును విజయనగర సామ్రాజ్యము నందు విలీనమైనది. సదాశివరాయల కాలమునందే స్వతంత్రరాజ్య మగును. చెంజి పాలకులు కూడ తెలుగు నాయకరాజులు. వారిలో వరదప్పనాయకుని (1645-49) కాలమునందు[7] తెలుగు సాహిత్యము తళుక్కుమన్నది.

పుదుక్కోట సంస్థానాధిపతులు సహితము తెలుగు నాయకరాజులు. వారిలో తిరుమల రాయలు, విజయరఘునాథతొండమాన్ (1730-69) రాయరఘునాథ తొండమాన్ (1769-89.) ఆరవ రాయరఘునాథతొండమాన్ (1825-39) కాలములందు[8] తెలుగు సాహిత్యము వెలుగు చూచినది.

మైసూరు పాలకులు సైతము తెలుగు రాజులు. వారిలో పెద కంపరాయల (1658-78) చిక్కదేవరాయల (1678-1704) కంఠీరవరాజు (1704-13) కాలములందు[9] తెలుగు సాహిత్యము మెఱుపు మెఱిసినది.

మొత్తము మీద సుమారు మూడు శతాబ్దుల కాలము దక్షిణాంధ్రయుగము. ఈ కాలమునందు ఏ ఆస్థానమునకు చెందని కవులు ఆ యా ప్రాంతముఅందు కలరు. వారును దక్షిణాంధ్రయుగకవులే అగుదురు. వారి సాహిత్యామును దక్షిణాంధ్ర సాహిత్యమే. ఈ కాలమునకు పూర్వము భద్రకవి లింగన, పచ్చకప్పురపు తిరు వెంగళనాథుడు తమిళ దేశములోని తెలుగు కవులే. వారు రాయల యుగములోని కవులు. దక్షిణాంధ్రయుగము స్థలపరమైనను, కాలపరిమితము. 1601-1875.

# రఘునాథనాయకుడు

రఘునాథనాయకుడు నాయకరాజులందు నాయకమణి. అంతేకాదు. అపరశ్రీకృష్ణదేవరాయలు. అతడు సాహితీసమరాంగణ సార్వభౌముడు. ఇతడు సాహితీ సమరాంగణసార్వభౌముడు. అతడు సాధితయవనోత్కళదేశపరనృపాలుడు. ఇతడు సాధితసముద్రాంతరద్వీపపరనృపాలుడు. అతడు యవనరాజ్యస్థాపనాచార్యుడు. ఇతడు నేపాలభూపాల స్థాపనాచార్యుడు. అతడు అనేకాగ్రహారప్రదాత. ఇతడు బహుళాగ్రహార ప్రదాత. అతడు మహాదాత. ఇతడు నిరతాన్నదాత. అతడు విద్యాఖేలన భోజుడు. ఇతడు సరససాహిత్యకళాభోజుడు. అతడు సంస్కృతాంధ్రతమిళకర్ణాటకవిపండిత సనాథుడు. ఇతడు పోషితవిద్వత్కవియూథుడు. అతడు భువనవిజయసభాభవన సముజ్జ్వలుడు. ఇతడు ఇందిరామందిరసభాభవనసముజ్జ్వలుడు. అతడు సంగీతశాస్త్ర వేత్త. ఇతడు సంగీతశాస్త్రవేత్త. అంతేకాదు. సంగీతసుధ అను సంగీతశాస్త్ర గ్రంథకర్త. జయంతసేనాదిరాగ, రామానందాదితాళ, రఘునాథమేళనామకమేళాంతరసృష్టి కర్త. అతడు నాట్యకళాపోషకుడు. ఇతడు నాట్యకళాపోషకుడు. అంతేకాదు. భరతసుధ అను నాట్యశాస్త్రగ్రంథకర్త. అంతేకాదు. ఇతని కొలువుకూటము నందు "పదచాళి, పేరణి, కోపులు, జక్కిణి, దురుపద, కేళిక, కొరవంజి, దేశి" మొదలైన నృత్యవిశేషములు నిత్యనీరాజనములు. అతడు కృతిభర్త. ఇతడు కృతిభర్త. యజ్ఞనారాయణదీక్షితుని సంస్కృతకృతులు, కృష్ణాధ్వరి సంస్కృతాంధ్రకృతులు, చేమకూర వేంకటకవి తెలుగు కృతులు రఘునాథాంకితములు. అతడు సంస్కృతకవి. ఇతడు సంస్కృతకవి. భారతకథాసంగ్రహము, రామాయణకథాసారము, భరతసుధ, సంగీతసుధ, సాహిత్య సుధ రఘునాథనాయకుని సంస్కృతకృతులు. అతడు తెలుగు కవి. ఇతడు తెలుగు కవి. అతడు యుగకర్త. ఇతడు యుగకర్త.

రఘునాథనాయకుని తెలుగు కృతులు : 1. అచ్యుతాభ్యుదయము. 2. నలచరిత్రము. 3. పారిజాతాపహరణము. 4. జానకీకల్యాణము. 5. రుక్మిణీకల్యాణము. 6. గజేంద్రమోక్షము. 7. రామాయణము. 8. వాల్మీకిచరిత్రము. 9. శృంగారసావిత్రి (?)

రఘునాథనాయకుడు "అచ్యుతాభ్యుదయప్రబంధనిర్మాణము" కావించినట్లు నలచరిత్రమునందు (144-145వ.)" అచ్యుతాభ్యుదయాదిమహాప్రబంధములు రచించితవదబంధములు చెలంగ" రచించినట్లు రామాయణమునందు (25ప. 1ఆ.) కలదు. విజయరాఘవనాయకుని రఘునాథనాయకాభ్యుదయమునందు ఇట్లు కలదు.

"భువి మెచ్చ నచ్యుతాభ్యుదయకావ్యంబు
నవరసచిత్రంబు నలచరిత్రంబు
హరువైన పారిజాతాహరణంబు
మెఱపడఁ జావు వాల్మీకిచరిత్ర
జానకీకల్యాణచాటుకావ్యంబు" 516-20 పం. 1 ఆ.

"కమనీయరుక్మిణీకల్యాణముఖ్య
సమధికనాటకసంవిధాయకుఁడు
మహనీయపదపద్యమంజరీముఖ్య
బహుళప్రబంధనిబంధనశాలి" 669-72 పం. 1 ఆ.

గజేంద్రమోక్షము రచించినట్లు సాహిత్యసుధయందు కలదు[10]. రామాయణము రచించినట్లు వాల్మీకిచరిత్రమునందు కలదు. (21ప. 1 ఆ.) శృంగారసావిత్రి రచించినట్లు ఎక్కడను లేదు. తత్కర్తృత్వము సంశయగ్రస్తము.

అచ్యుతాభ్యుదయము దినచర్యాకావ్యము. అనుపలబ్ధము. పారిజాతాపహరణ మును అనుపలబ్ధము. అది ఒక్క రాత్రి ఆశువుగా ఆరుగంటలలో చెప్పగా, పండితులు కూడ ఎంతో ప్రయాసపడి లిఖించిరని యజ్ఞనారాయణదీక్షితుని సాహిత్య రత్నాకరము నందు కలదు[11].

"యామద్వయేన యదునేతరి పారిజాత
మాజీహర త్వరస మచ్యుతభూపసూను:
కావ్యం తదత్ర విబుధైస్తు కథం కథం చి
దాలేఖి చిత్ర మవధాయ ఫణీంద్రకల్పై:." 30 శ్లో. 5 ఆ.

జానకీకల్యాణము చాటుకావ్యము. అనుపలబ్ధము. రుక్మిణీకల్యాణము నాటకము. అనుపలబ్ధము. నాటకమన యక్షగానము. "శ్రీరుక్మిణీకృష్ణ వివాహయక్షగానం" అని సాహిత్యసుధయందు కలదు[12]. చాటు కావ్యమును యక్షగానము కావచ్చును. గజేంద్ర మోక్షము ద్విపదకావ్యము. అనుపలబ్ధము.

**నలచరిత్రము** : ఇది ద్విపదకావ్యము రామాంకితము. దైవాంకితము. అయినను రఘునాథనాయకుడు రచించినది కాదని ఒక అభిప్రాయము కలదు.[13] తదనుసరణమును కలదు.[14] అది ముద్రితగ్రంథమును[15] చూడకపోవుటవలని అనర్థకము. నలచరిత్రములోని అవతారికయందు ఇట్లు కలదు.

"భూషించి, యచ్యుతాభ్యుదయప్రబంధ
నిర్మాణమున మాకు నిఖిలదేశముల
నిర్మల సత్కీర్తి నెగడఁ గావ్యమన
నటువలె ద్విపదకావ్యము నేఁటి యొకటి
ఘటియించి సత్కీర్తి గైకొందు ననుచు" 144-148 పం. 1 ఆ

ఆశ్వాసాంతద్విపదలిట్లు కలవు.

"ఇది రామచంద్రమహితదయాసాంద్ర
విదితసాహిత్య నవీనసాహిత్య
చిన చెవ్వయాచ్యుతక్షితిపాలతనయ
వినయాదిశుభగుణవిభవనాథ
రఘునాథభూపాల రమ్యవాగ్జాల

సుఘటిత సరసస్ఫుటశబ్దమహిమ
తనరెడు నలచరిత్రమను ప్రబంధ
మునఁ బ్రథమాశ్వాసము దగు సుశ్రీల" 926-934 పం. 1 ఆ.

ఇందు రఘునాథభూపాలుడు తంజావూరు పాలకుడని లేదు. అంతేకాదు. రామాయణమునందు, వాల్మీకిచరిత్రమునందు వలె రఘునాథనాయకుని రాచకార్యములు, బిరుదావళి లేవు. కావున అచ్యుతాభ్యుదయము, నలచరిత్రము రఘునాథనాయకుడు తంజావూరు పాలకుడు కాక పూర్వము, అచ్యుతప్ప నాయకుడు తంజావూరు పాలకుడైన కాలమునందు రచించినవి కావలయును. ఆ కాలము 1580-1600 అని పూర్వోక్తము. కాఁబట్టి అచ్యుతాభ్యుదయము రచనాకాలము 1595 ప్రాంతము, నలచరిత్రము రచనాకాలము 1600 ప్రాంతము కావచ్చును.

నలచరిత్రము రచించుటకు రఘునాథనాయకుడు తెలిపిన కారణమిది:

"కలిదోషహరణము కలితపుణ్యైక
ఫలితమైనది నలోపాఖ్యానమనుచు
నరసి యా కథ తొల్లి వ్యాసమహర్షి
వరుఁడె యాద్యంతముల్ వ్యక్తంబు గాఁగఁ
బలికెను బిమ్మటఁ బల్కంగలేక
నలసులై యేమొ శ్రీహర్షాది కవులు
పూర్వభాగము చెప్పఁబూనిరి గాని
సర్వంబుఁ జెప్పంగఁ జాలరై రెందు
పూర్వోత్తరకథాంశములు, సకలంబు
నిర్వహించెద నంచు నెమ్మది నేను
తలఁచి......................................." 157-167 పం. 1 ఆ.

ఇందు శ్రీహర్షాదులన శ్రీహర్షుడు. శ్రీనాథుడు. శ్రీహర్షుని నైషధీయచరితము, తదాంధ్రీకరణమైన శ్రీనాథుని శృంగారనైషధము సకలనలోపాఖ్యానములు కావు. నలదమయంతుల పరిణయపర్యంతకథలు మాత్రమే. శ్రీహర్షాదులు సకలనలోపాఖ్యానము రచింపకపోవుటకు హేతువు అలసత్వము కాదు. అన్యలక్ష్యము. సంస్కృతమునందు శ్రీనాథుని సహ్రవతుడైన వామనభట్టబాణుని నలాభ్యుదయము సకలనలోపాఖ్యానమే. తెలుగునందు రఘునాథనాయకునికి పూర్వము సకలనలోపాఖ్యానము భట్టుమూర్తి హరిశ్చంద్రనలోపాఖ్యానములోని నలోపాఖ్యానమే కలదు. తతిమా నలచరిత్రములు తర్వాతివి. సంస్కృతాంధ్రభారతములలోని సకలనలోపాఖ్యానము మాత్రమేగాక, శ్రీహర్షుని నైషధీయచరితము, శ్రీనాథుని శృంగారనైషధము రఘునాథనాయకుని నలచరిత్రమునకు మార్గదర్శకములే. అయినను స్వతంత్ర కావ్యము.

"మదేకపుత్రా జననీ" అను శ్రీహర్షుని శ్లోకమునకు (135శ్లో. 1స.) శ్రీనాథుడు "రసంబు పోషించి" రచించిన "తల్లి మదేకపుత్త్రక పెద్ద కన్నులు గాన దిపుడు మూఁడు

కాళ్ల ముసలి" అను సీసపద్యమును (109ప. 1 ఆ.) రఘునాథనాయకుడు అనుసరించి, అతిశయించి రచించిన ద్విపదఘట్టమిది:

"ఒంటిగాఁడనె నాకు మూరంత బలగ
మింటికెల్లను గర్త నే నొక్కరుండ
నా తల్లి యెంతయైనను గలదయ్య
నా తల్లి కూటికి నవయ దెన్నఁడును
నూఱేండ్లపండు కన్నులు గాన దిపుడు
గారాబుపట్టి నొక్కరుఁడ నే నరయ
నన్నుఁ జూడకున్న కన్నరవొందు నిదియు
వినిన నేమగునొక్కొ వెతలచేఁ బొగిలి
యిల్లాలు కడు గోల యెండకన్నెఱుఁగఁ
దల్లిబిల్లిగ నుండునట్టిది యేను
నింటికి రాకున్న నేమేమొ దలఁచి
కంటికి నిద్దుర గానక బడలి
వనరుచునున్న నలువంకల నరసి
వనరు హా యని పుత్రవర్గంబుఁ దాను
కొడుకులు గ్రుడ్లలో కూనలు నన్నుఁ
బెడఁబాయ దెన్నఁడు పెంచిన మమత
బిసఖండములు తెచ్చిపెట్టునందాక
దెసలఁజూచుచు నోరు దెఱచియుండుదురు
కన్నవారికిఁ బోలెఁ గావ్పించుమయ్య
విన్నవారల కట్టి వేదనలెల్ల
దయఁ జూడుమయ్య సంస్తవనీయచరిత!
నయమెంచుమయ్య యో నవనీతభావ!
నిగ్రహింపకుమయ్య నిషధేశ! నన్న
నుగ్రహింపుము చాల నుతులు గాంచెదవు" 859-882 పం.1ఆ.

ఇందు "నూఱేండ్లపండు", "ఎండకన్నెఱుఁగదు", "కొడుకులు గ్రుడ్లలో కూనలు", "నోరు దెఱచియుండుదురు" అను తెనుగు నుడికారములు తేనె లొలుకుచున్నవి.

రఘునాథనాయకుని స్వతంత్ర కల్పనమైన దమయంతి వీణావాదనమునందు, అతని వీణావాదనప్రౌఢిమ పరిఢవిల్లినది.

"సారణ లొండొండ సరసత మెఱయ
సారించి, బిరడలు చక్కగా వొత్తి
తారకంకణఝణత్కారంబు మీఱ
సారణి యంటి వజ్రపుటుంగరముల
యంచువల మెఱుంగు లదర గోరంట
కెంజాయఁ దగు చిటికెన వ్రేలి గోర

ఘుమ్మాఱు తీవి సొంపులు గుల్క మీటి
ఘుమ్మ సునాదంబు ఘుమ్మరింపుచును
శ్రుతులు ప్రమాణంబుఁ జూప నన్నింట
ప్రతిఁ జూపి సరిగమపదని స్వరములు
సరవి తోఁబల్క త్రిస్థానంబు లంటి
స్వరసంభవము వళావళి మేలు మెఱిఁగి
శంఖంబు కరణి షడ్జమము పంచమము
పుంఖించి యాయితంబు ఘటిల్లఁజేసి
నాటరాగంబు చందంబెల్ల మదిని
బాటచ్చుకొని ఋషభన్యాస మొనర
తుదిని షడ్జంబు పొందుపడంగ మిగుల
పదిలముగ రిగమపదనిసక్రమముఁ
దనరంగఁ బలికించి స్థాయిమార్గమున
నొనరెడు తానంబు లొండొండ వరుస
దొలఁగక రంగు రక్తులు గల జీవ
కళ దొలంక నిషాదకంపిత మింపు
హవణింప షడ్జమధ్యమముల డాలు
నవనవగతుల నందము మీఱ నించి
నాదించు ఋషభగాంధారధైవతని
నాదంబు లొత్తుచు న్వరుస లన్నియును
నవగతి మించ గాంధారధైవతము
లవరోహమున వచ్చువపుడు వర్జించి
తేనియల్ చిందు పొందికల సంచారి
తానమానముల నందముగ వాయించి
యా రాగమై సిరి యంతయును మెఱయ
తీరుమానము వింత తీరుగా మీటి
యంతను గౌళకు నాయితం బలర
వింతగా స్వరపుష్టి వెలయ పుంఖంబు
గావించి యాలాపగతి మది నుంచి
జీవస్వరంబులై చెలఁగుచు రక్తిఁ
దనరెడు ఋషభగాంధారమధ్యముల
వమపమస్ఫురణ సేయఁగమండ సారె
సారెకు వంటుచు స్థాయితానంబు
ధోరణి మిగుల పొందుపడంగ రక్తి
గలుగంగను ఋషభగాంధార మింపు
గులుకంగ లాలించి కొమచు ధైవతము

కడకు వర్ణించి పొంకము గమనించి
విడి యందమునఁ బల్కు వివరంబు మెఱయ
నక్కడక్కడ. . నాందోళితములు
సొక్కుఁ జల్లుచునుండ సుసరంబు గాఁగ
చాలెల్ల ఋషభషడ్జంబులయందె
చాల మించగ రాగసర్వస్వమెల్ల
రాణించ షాడవరాగంబులందు
త్రాణ యెంతని వింత దనర వాయించి
స్ఫురితంబు హొంపితములు నపూర్వరస
భరితమై యింపు సంపాదింపుచుండ
నకలంకనాదంబు హారంబు గాఁగ
మకుటంబుఁ జూపి సొంపగు వరాళికిని
ఆయితం బొనరించి యంశస్వరంబు
లై యం దమఁగు రక్తి వలరెడు ఋషభ
గాంధారముల నంటి గైకొని తాన
బంధంబు వింతయై పరిపరిగతుల
దనరంగ హెచ్చు మధ్యమనిషాదంబు
లనువమగతి మీఱ నా రాగసరణి
పొందులుఁ జూపి యపూర్వరాగమున
నందంబు మీఱ జయంతసేవకుమ
జీవస్వరస్ఫూర్తి చెలఁగ వాయితము
గావించి రాగసంగతస్వరక్రమము
మైవడి తీగ పంచమం బొత్తి గౌళ
దైవత మంటి గాంధారంబు గూర్చు
కొని షడ్జమమునకు డిగ్గుచు నవరోహ
మున మధ్యమం బొత్తి మోహనలీల
సరసంబులగు మంచి స్థాయితానముల
వరుస లేర్పడుచుండ వాయించి మఱియు
భైరవి శంకరాభరణంబు పాడి
శ్రీరాగమును సముచితవాదనకుల
దక్షత మెఱయ నాదబ్రహ్మమెల్ల
సాక్షాత్కరించిన సరణి వాయించి
యందు లందుల గలయట్టి గీతముల
మందంబు మీఱ తాయములఁ బల్కించి
ధ్రువదంబుఁ బొదలంగ పంచదశవిధ
గమకంబులును కంఠగతి హవణించి

చొకదండి యొపంగి జంత్రగాత్రంబు
లేకమై మెఱయంగ వింపుగాఁ బాడి
యా విదర్భతనూజ యలరి వెండియును
శ్రీవర్తనంబును శ్రీవిలాసంబు
పంచతాళేశ్వర ప్రముఖంబు లగుచు
మించు ప్రబంధముల్ మీటు కులంబు
చెలువొంద వాయించి చెంత నున్నట్టి
వెంఁది వొక్కతెఁబిల్చి వీణియ యిచ్చి
చొక్కబంగరుజీనిసురటు చేఁబూని
యొక్క తొయ్యలి యొయ్యనొయ్యన విసర
వీణాప్రసంగంబు వేమలు మధుప
వేణులు గొనియాడి వినుచున్న వేళ" 49-138 పం. 4 ఆ.

నలచరిత్రమునందు నైషధములోని వర్ణనల తోపాటు సాంత్వన, విలాప, అరణ్య, తటాకాది వర్ణనలు కలవు. కరణముల లెక్కలు సమకాలికసమాచారము.

"మును పిన్న బండారమున నున్న రొక్క
మును పెద్ద బండారమున నున్నదియుఁ
గూడంగఁ బంద్రెండు కోట్ల నిర్వదియు
నేడు లక్షలు పదియేనువే లిందు
నీ నడుమనె యొక యేటిలోనైన
దానధర్మముల కంతయు నొక్క కోటి
యీవల నొక యేటి కెల్ల నగరి ను
వోవర్తి ధాన్యమును సరిగాఁ జూడ
నక్కడ యెనుబదియేఁబు లక్షలును
చొక్కబంగారంపు సొమ్ములు గాక
జాదంబు వెచ్చంబుఁ జూడంగ నొక్క
యైదుకోటులు పదియేఁబు లక్షలును
పదియేనువేలు వెప్పటి కిట మీఁద
నిదియును బోయిన వెట్లుండు నొక్కొ 247-260 పం. 6 ఆ.

రామాయణము : ఇది రామాంకితము. దైవాంకితము. ఇందు ఆశ్వాసాంతగద్యమ రఘునాథ నాయకునికి "కర్ణాటరాజపూజనీయధౌరంధర్య" అను విశేషణము కలదు. కర్ణాటరాజన విజయనగరరాజు. అతనికి పూజనీయులైన వారిలో ధురంధరుడగుటకు కారణము తోపూరు యుద్ధము. అది 1616వ సంవత్సరమునందు జరిగినది[16]. కాఁబట్టి రామాయణము రచనాకాలము 1620 ప్రాంతము కావచ్చును.

ఆశ్వాసాంతగద్యమ "రఘునాథనాయకప్రణీతంబైన శ్రీమద్రామాయణంబున" అని కలదు. అయినను రఘునాథనాయకుడు రచించిన రామాయణమగుటవలన

రఘునాథరామాయణమని ముద్రితము. బాలకాండలోని శ్వేతద్వీపవర్ణనపర్యంతము మాత్రమే లభించినది. లభించినంతవఱకు వాల్మీకిరామాయణమునకు ఛాయానువాదము కాదు. స్వతంత్రరచనము. నిషాదుని వర్ణనము (105ప. 1ఆ.) స్వభావోక్తి సుభగము. క్రౌంచమిథునశృంగారము తిర్యగ్గతమగుటవలన రసాభాసమైనను రసభాసమానము.

"ఒక్క మహీజశాఖపయినొక్కొట వేడుకఁ గూడియుండి యొం
డొక్కటి తెక్క విప్పుకొని యొప్పుగఁ గప్పుచు నొయ్యఁ బల్కుచు
న్మక్కుల మేను గీఱుచును మోమును మోమును జేర్చి మిక్కిలి
న్మక్కువ నుండఁ గ్రౌంచమిథునంబుఁ గనుంగొని సంభ్రమంబునన్."

107 ప. 1 ఆ.

ప్రసిద్ధమైన "మా నిషాద" శ్లోకము బహ్వర్థములు భాసిల్లునది. ఆ శ్లోకమునకు తెనుగుసేత:

"అక్కట! నిషాద! రతిచే
మిక్కిలిఁ దమి నెనయు క్రౌంచమిథునములో నీ
వొక్కటిఁ బడవైచితి నీ
కెక్కడ నిలుకడ ఘటిల్ల దిఁక నెన్నఁటికిన్." 115 ప. 1 ఆ .

ఇందు బహ్వర్థములు భాసిల్లవు. అందుకు భరద్వాజుడు ఏకసంధ గ్రహించినట్లు "మానిషాద" శ్లోకమునే ఉట్టంకించెను. (117వచ. 1ఆ.) అది శ్లోకమని భరద్వాజుడే భావించినట్లు, ఆతని సతీర్థులు ఆమోదించినట్లు అన్యాథాకల్పనము కావించెను. (118-124 ప. 1ఆ.)

అయోధ్యాపురవర్ణనము సుదీర్ఘము. ముప్పది మూడు పద్యములు కలవు. (3-36ప. 2ఆ.) అందు తంజావూరు అంతర్లీనము.

"వేదండంబుల హస్తకాండముల శీవిం బొల్చు బల్గంటలం
బ్రోది వ్రీమెడు రాజవంపు వరి గుంపు ల్నిండి యొక్కాలముం
గేదారంబులఁ బండి తట్టొరఁగి వీక్షింపంగ నావందమౌ
నాదేశంబున నేకదేశమును జేయంజాల దే దేశమున్. 5.

కీరము లుక్కుల గీఱ నివ్వక జాలు
చెలువంపు రసదాళి చెఱకుఁబాలుఁ
జెంత వంతటఁ బండి చిదివిన ముంతమా
మిడిపండ్ల రసములోఁ బడి పారలుచు
మఱుతలు గొఱకంగ నొండొండఁ దిరిగెడు
వారికెడంపు బొండ్లముల నీటఁ
గలసి చేరువ యేటి కాలువలను గూడి
ములు రాజవప్రుఁజేల వల దిరుగుచుఁ

దరులఁ బొదరులఁ బరువంపు విరుల వడియు
కమ్మఁదేనెలు పైఁగ్రమ్మి గమ్మనంగ
నమదినంబునుఁ బ్రవహించు నన్నియెడల
నేమి చెప్పంగవచ్చు నా భూమి మహిమ." 6.

xxx xxx xxx

పుష్పమంజరు లిప్పపువ్వు రాజనములు
కస్తూరి నిగరాలు గంధసరులు
గంగాజలంబులు బంగారు తీఁగియ
లేమంగుదంతముల్ దీనసరులు
సన్నవంకెలు ముత్తెసరులు ప్రాసంగులు
రాయమెచ్చులు నీశ్వరప్రియములు
నయములు రామబాణములు సీతాభోగ
ములు బాలకేసరుల్ మోసనములు
కఱియమేనులు సన్నబక్కండ (?) మఱియుఁ
గలుగు ధాన్యంబులెల్ల ముక్కాఱుఁ బండి
నిండి యెల్లెడఁ జాచిన నెగడుచుండు
క్షామమను పేరు నెఱుఁగ రా భూమిప్రజలు. 11.

కప్పురభోగి వంటకముఁ గమ్మగ నేవడియ న్సృజించి మే.
ల్దుప్పటు లట్లు మూర గల తోరపుఁబచ్చడము ల్బెలంగఁగా
గొప్పకడాని పైడి జిగి గుత్తపుటుంగరము ల్కరంబులం
ద్రిప్పుచు రచ్చ సేయుదురు రెడ్డిదొర ల్తమి హెచ్చ నచ్చటన్." 12. ప. 2 ఆ.

ఇందలి రాజనంపు వరిగుంపులు, రసదాళి చెఱుకు, ముంతమామిడిపండ్లు, నారికెడంపు బొండ్లములు, పుష్పమంజరులు మొదలైన వ్రీహిభేదములు, కప్పురభోగివంటకములు తంజావూరు ప్రాంతమునుండి కోసలదేశమునకు తరలించినవి. రెడ్డిదొరలును తంజావూరు ప్రాంతమునుండి కోసలదేశమునకు వలసపోయిరి. ఇంకను వెలవెలందులు (20ప. 2ఆ.) "కాముకేళి వేడుకలఁ జెందువారు" (36ప. 2ఆ.) అయోధ్యానగరవీటికి అరుదెంచినవారే!

దశరథుని మంత్రులు నీతినిష్ణాతమతులని రఘునాథనాయకుని నిర్దేశము.

"కలనైన నసృతంబు పలుకంగ నేరరు
నేర్తురు సత్యంబు నిలుపఁ బలుకఁ
బరధనంబుల కాసపడ రెట్టి పట్టుల
వాస సేయుదురు పుణ్యములకైన
వెఱవ రెంత కడింది వీరారులకునైన
వెఱతురు దురితంపుఁ దెఱుగులకును
గుటిల చిత్తులఁ జేర్చికొన రేమఱియు నకు

టిలచిత్తులనె చేర్పఁదలఁతు రెందు
నధిపు మాటలు మీఱక యర్థములను
గోశగృహముల నిండంగఁ గ్రుమ్మరింతు
రమ్మహామంత్రు లఖిలశాస్త్రావలోక
జాతపరిపాకనీతినిష్ణాతమతులు." 44 ప. 2 ఆ.

ఇది భంగ్యంతరముగ రఘునాథనాయకుని మంత్రులకు హితోపదేశము. అంతేకాదు ఎవరి మంత్రులకైన, ఎప్పటి మంత్రులకైన మార్గదర్శకము.

దశరథుడు పుత్రసంతానము లేమికి విచారించుట పాత్రోచితముగ అనగా రాజోచితముగ కలదు.

"బాలకు పాలకుటిలలం
బాలకుఁ బాలకును మణిమయంబగు గిన్నెం
గేలఁగొని దాది వెంటనె
బాళిం దిరుగంగఁ జూచు ఫల మబ్బునొకో. 50.
రంగు మెఱుంగుల బంగరు
ముంగిట నుంగుటము లూఁది ముద్దుగులుకు లీ
లం గలకల నవ్వుచు మెలఁ
గం గొమరుని జూచు కౌతుకము గలుగునొకో. 51.

కలుగునొకో చకోరహితుఁ గన్గొని తెమ్మని పోరు వెట్ట దా
దులు గికురించి యద్దమునఁ దోఁచిన చందురుఁ జూప రెండు చే
తులఁ గొనివట్టి సంతసముతోఁ దన చేతికిఁ జిక్కె నంచు న
గ్గలికఁ జెలంగు బాలకుని గన్నులఁ జూడఁగఁ గల్గు భాగ్యముల్. 52 ప. 2 ఆ.

దశరథుడు పుత్రాపేక్షను మంత్రులకు తెలుపుట కూడ సముచితముగ కలదు.

"సుతుల మను ముద్దుఁబలుకులు
శ్రుతులకుఁ జవియైన యట్లు చూడఁగఁ జవిగా
వితరులు వేడుక నెంతే
చతురతమైఁ బలుక నంత చవి భువిఁ గలదే. 55.
ముద్దు నగుమోము నందవు
బొద్దు మెఱుఁగు మేనుఁ జిన్ని బొజ్జయు నెంతేఁ
బ్రొద్దులు జరపెడి జిలిబిలి
మద్దులు గల బాలకులను జూడ వ్వలదా.
చప్పటులు చఱచి యిటు మా
యప్పలు రమ్మనుచుఁ బిలువ నలకలు నదుటం
గప్పఁగ నందెలు మొరయఁగఁ
దప్పటడుగు లిడుచు వచ్చు తనయుఁడు వలదా." 57 ప. 2 ఆ.

సుమంత్రుడు దశరథునికి సవిస్తరముగా వివరించిన ఋష్యశృంగచరిత్రము

నూట పదునాలుగు పద్యగద్యములందు కలదు. (76-189 వచ. 2 ఆ) అందొక ప్రమాదమును కలదు. ఋష్యశృంగుడు "స్త్రీపురుషవివేకము" లేనివాడు. కారణము స్త్రీలను చూడక పోవుటయే. అట్టిది ఋష్యశృంగుని ఆశ్రమమునందే స్త్రీలు ఉన్నట్లు కలదు.

"నకనకఁ గౌనులు బెళకఁగ
సికతాకలశములఁ జలువ చెలువొందఁగఁ జె
ట్లకు నీళ్లు వోయు మునిక
న్యకల ప్రభావంబు గంటె నలినదళాక్షీ." 138 ప. 2 ఆ.

మునికన్యకల ప్రభావము ఋష్యశృంగునికి స్త్రీపురుషవివేకము కలిగించునది. ఇది కాళిదాసు అభిజ్ఞానశాకుంతలము ప్రభావము వలని ప్రమాదము. ఋష్యశృంగుని కథకు రంజకము కాదు. భంజకము. "ప్రమాదో ధీమతా మపి".

ఆశ్రమవర్ణనము చర్వితచర్వణమైనను మనోజ్ఞము.

"ముది తాపసుల చేతి యుదకుండికలు తొండ
 ములఁ దెచ్చు గజపోతములను గంటె
వలచుట్టికొమచు వివ్వరియెండుగులకుఁ గా
 వలియుండు జింకపిల్లలను గంటె
వృక్షంబు కొమ్మల వ్రేలెడు జపమాలి
 కలు మౌనులకు నిచ్చు కపులఁ గంటె
రువ్విచ్చు మునికుమారుల వేదపాఠంబు
 లకుఁ దప్పు దిద్దు శారికలఁ గంటె
హోమవేళ లెఱుంగుచుఁ దామె వచ్చి
కుండ లటువెట్ట విండఁ బాల్గురిపి మగిడి
పాలములకుఁ బోవు గోగణంబులను గంటె
యిందు మహిమంబు లేమన నిందువదన." 141 ప. 2 ఆ.

వేశ్యలను చూచిన ఋష్యశృంగుని భావములు హాస్యజనకములు. ఒక మచ్చుతునక

"కులుకు గుబ్బెతల చూపులు గల్వవిరు లంచు
 దేవతార్చనకుఁగాఁ దివియఁ బూను
మగువ లందుకు వవ్వ వగవువెన్నెలలోన
 నిమవాఁక జలమంచు మునుఁగఁ బోవు
వలదని కేల్సాఁచు వారి పచ్చుల కడి
 యాల నిగ్గులు దర్భ లమచు దాయు
నది గని తెప్పు వేయక చూచు కొమ్మల
 ననిమిమలని మ్రొక్క నగ్గలించు
నవ్వుడు తన కొమ్ము కమ దాచు నంచు నెంచి
వెనుకకై పోవ వారలఁ గనుచుఁ జేరి

యకట నా మీఁద దయలేదె యనుచుఁ బలుకు
నౌర యీ రీతి నమ్ముగ్దపారికాంక్షి." 158 ప. 2 ఆ.

ఋష్యశృంగుడు దశరథుని మందిరమునందు వసించినపుడు వసంతము వచ్చినది. (21-23 ప. 3ఆ.) వసంతకాలమునందు వనభోజనములు కలవు.

"కలకంఠకలకలక్రమసమగ్రములైన
జొంపంపుఁ గ్రొమ్మావి గుంపులందు
భ్రమరఝంకారసంభ్రమరంజితములైన
గొజ్జంగి పొదరిండ్ల పజ్జలందు
మధువర్షికుసుమసంపత్సంభృతములైన
వకుళభూరుహముల వాడలందుఁ
బవనధూతపరాగభరితతీరములైన
తెలిదమ్మి కొలఁకుల కెలఁకు లందు
వేడ్క వనభోజనములు గావించి రపుడు
మావిపండ్ల రసంబుతోఁ బూవుఁదేనె
దొప్పలమ వించికొమచు సొంపొప్పుచుండ
నంగవలఁ దారు జములు నవాంగణముల." 24ప. 3ఆ.

వనభోజనములు శరత్కాలమునందు వ్యవహారప్రసిద్ధము. మఱి వసంతకాలము నందలి వనభోజనముల వ్యవహారము స్థానికవిశేషము, సమకాలికసమాచారమును అగును.

దశరథుని అశ్వమేధయాగము విధ్యుక్తముగ వివరముగ కలదు." శాంతిక విధులు శాస్త్రము దప్పకుండంగ వర్తిల్లఁ జేయుఁ"డని దశరథుని ఆనతి. (40ప. 3ఆ.) అందు బ్రాహ్మణుల ప్రతిదినషడ్రసోపేతభోజనములును కలవు. (64-70ప. 3ఆ.) అందు ఒక అంశము:

"అయ్యల కిచట గంగామృతంబులు దెండు
వేఁడి యన్నములు వేవేగ విడుఁడు
వడ్డింపుఁ డీ బంతి విడ్డెన కుడుములు
వేయి దొప్పల నిండఁ బోయుఁ డిందుఁ
గూర లన్నియు మాఱుగొంచు రం డందఱుఁ
దియ్యచారులు పోరె దెండు చాల
మజ్జిగ పడెదము ల్బజ్జిమ లడుగుండు
కుప్పలింపుడు చాయ పప్పులెల్లఁ
గ్రుమ్మరింపుఁ డిచ్చోటులఁ దిమ్మనంబు
లనెడు పల్కులె యజ్ఞశాలాంతరమునఁ
గూడి విననయ్యె మంథానకుధరమథిత
జలధిధావవివాదంబు నరణి నపుడు." 66 ప. 3 ఆ.

ఇందలి వేడియన్నములు, ఇడ్డెనకుడుములు, నేతిదోస్పెలు, తియ్యచారులు, మజ్జిగ పడెదములు, భజ్జిలు, చాయపప్పులు, తిమ్మనములు తెలుగు భోజనమును తెలుపును. అంతేకాదు. రఘునాథనాయకునికి "నిరతానారితాన్నసత్రసంతోషితపంచాశత్సహస్ర భూసుర" అను విశేషణము ఆశ్వాసాంతగద్యను కలదు. అందుకిది నిదర్శనము.

అశ్వమేధయాగము శాస్త్రోక్తముగ జరిగినను, అందు వేశ్యల నాట్యము కలదు.

"పరిగ చిత్రపుంగుట్ల పరిలేని ముత్యాల
బవిరి చౌకట్టులు పరిఢవిల్లఁ
గుఱుచ గేదంగిఱేకుల యల్లికల మించు
జడలు పిఱుందుల బెడఁగు చూప
జిగి పైఁడియంచుల వగల చందురకావి
వెలికకాసెల నిగనిగలు నిగుడ
పలినయంబుల వేర్పులలరించు కంకణ
కలితహస్తముల పింగార మమర
ఘనతరమృదంగధిందిమిద్ధ్వనులు పెలంగ
వింతకోపులు మెఱయంగ వేశ్యలపుడు
నాట్య మొనరించి రమ్మహీనాథమౌళి
యాగశాలాంతరద్వారభాగములను." 71 ప. 3 ఆ.

ఇది దశరథుని యాగశాలాంతరద్వారభాగములందలి వేశ్యల నాట్యము కాదు. రఘునాథనాయకుని ఇందిరామందిరద్వారభాగములందలి వేశ్యల నాట్యమే.

దశరథుడు పుత్రకామేష్టి సేయునెడ, దేవతలు బ్రహ్మను పురస్కరించుకొని, విష్ణుసందర్శనార్థము శ్వేతద్వీపమునకు బయలుదేరుదురు. శ్వేతద్వీపవర్ణనము సుదీర్ఘము. ఇరువదియొక్కపద్యములందు కలదు. (6-26ప. 4ఆ.) అవియెల్ల ఉత్ప్రేక్షావల్లరులు. అందు కొన్ని :

"ప్రతిమాసచంద్రనిర్మితి కల్పి యుంచిన
కారణద్రవ్యసంఘం బనంగ
గాలివెంబడి పొక కడఁ జేరు హరిమంచ
నిర్ముక్తకంచుకనిచయ మనఁగ
వజ్జగేహాకు వాసమైనట్లు హరికి ని
వాసమైన పీతాబ్దవన మనంగ
నక్షయచంద్రు నిమ్మని వారినిధి వేడ
వచ్చిన కైరవవార మనఁగ
నంబరంబున కెగసిన యపుడె మ్రింగు
నకట రాహుగ్రహం బన నాత్మఁగలఁగి
జనకుఁడగు సింధురాజు పక్కునను యున్న
విధుని బింబం బనఁగ మించు వెల్లదీవి." 14.

"నీరుపాపలు గుమిగూడి వింగి కెగయ
వీచికారజ్జువులఁ గట్టి విడిచినట్టి
కాగితపు గాలిపటము విష్కంపలీల
నున్నదో యనం దెలిదీవి చెన్ను మీఱు." 19.
"ఏల నే మండ గొల్లల యిండ్లు సొచ్చి
వెన్నదొంగిల నీ విద్య విడువు మనుచు
వారివిధి యల్లునికి నొక వంక నైనెఁ
దిన్నెగా వెన్నలనఁ దెల్లదీవి మెఱయు." 21 ప. 4 ఆ.

వాల్మీకిచరిత్రము : ఇది కూడ రామాంకితము. ఇందు రామాయణములోని ఆశ్వాసాంతగద్యయే కలదు. ఇతోధికవిశేషము లేదు. అవతారికయందు రామాయణము ప్రసక్తమగుట వలన (21ప. 1ఆ.) వాల్మీకిచరిత్రము తదనంతరకాలికమగుట తథ్యము. కాఁబట్టి వాల్మీకిచరిత్రము రచనాకాలము 1625 ప్రాంతము కావచ్చును.

వాల్మీకిచరిత్రము మూడాశ్వాసముల కావ్యము. కథాభాగము సుమారు అయిదు వందల (498) పద్యగద్యములందు కలదు. అందు వాల్మీకి వృత్తాంతము పరిగా తొంబది పద్యగద్యములందే కలదు. (91-151ప. 2ఆ; 2-10,146-167ప.3ఆ.) బదరీవనసమాచారము (31-40ప. 1ఆ.) నారదాగమనము (41-51ప. 1ఆ.) కథాప్రారంభము (52-60ప. 1ఆ.) క్షీరాబ్ధివర్ణనము (61-67ప. 1ఆ.) శ్వేతద్వీపవర్ణనము (68-71ప. 1ఆ.) వైకుంఠపురవర్ణనము (72-76ప. 1ఆ.) సప్తర్షుల వైకుంఠపురాగమనము (77-89ప. 1ఆ.) సప్తర్షుల తీర్థయాత్రలు (90-119ప. 1ఆ; 3-70,86-90ప. 2ఆ.) రంభోర్వశులప్రమేయము (11-102, 120-145ప. 3ఆ.) గ్రీష్మర్తువర్ణనము (71-85ప. 2ఆ.) సూర్యాస్తమయ, సూర్యోదయ వర్ణనము (103-110ప. 3ఆ.) వసంతర్తువర్ణనము (115-116ప.3ఆ.) వనవిహారవర్ణనము (117-119ప. 3ఆ.) మొదలైనవి కావ్యవిస్తరములు.

రామాయణములోని పూర్వోదాహృతమైన ఆశ్రమవర్ణనమును అనుసరించిన పద్యములు బదరీవనవర్ణనమునందు కలవు.

"గజము లుటజాంగణంబులఁ గరములఁ గొని
దినము నివ్వరియెన్నులు దెచ్చి నైన
నవి కపులు గోళ్ల నొలిచి బియ్యంబు పేయు
మునుల హవిరన్న వేళకు నమవు గాఁగ. 37.
గంభీరహ్రదములలో
నంభమ్ములు ముంచి యిచ్చు హస్తంబులచేఁ
గుంభీంద్రమ్ములు మునికుల
కుంభిగమన లోనగు నిముకకుండల నిండన్." 38 ప. 1ఆ.

రామాయణములోని శ్వేతద్వీపవర్ణనమును స్మరింపఁజేయు శ్వేతద్వీపవర్ణనము కలదు.

"జ్వాల వౌర్వానలశిఖలం
గలశపయోరాశి గ్రాఁగఁగా నట నడుమం
దలముగఁ గట్టిన పేఁగడ
వలెఁ దెల్లని దీవి తీవిఁ బరఁగుచునుండున్." 69 ప. 1 ఆ.

సప్తర్షుల తీర్థయాత్రలు తామ్రపర్ణీతటము, ధనుష్కోటి, మధుర, శ్రీరంగము, తంజావూరు, చంపకవనము (దక్షిణద్వారక), కమలాపురము, కుంభకోణము, శ్రీముష్ణము (చిదంబరము), తిరుపతి, అహోబలము, శ్రీశైలము, కాశీక్షేత్రములందు సాగినవి. క్షేత్రవర్ణనములు స్థానికప్రకృతి చిత్రణములు. అందు,

"ఏ వీట నిరవొందు నిందుశేఖరుఁ డెప్డు
బృహదీశ్వరుండను పెంపుఁ గాంచి
యే పట్టణమునకు నేలికయౌ నృసిం
హస్వామి జనకామితార్థభూమి
యే ప్రోలి కెలన నింపెసలారు నీలమే
ఘశ్యాముఁ డిందిరాకాముకుండు
నే నగరమున నిర్హేతుకదయఁ బ్రోచు
నతకల్పవల్లి యానందవల్లి
యెచట విలసిల్లుఁ దగ సుందరేశ్వరుండు
ప్రాంతకాంతకవేరకన్యాంబుధన్య
వివిధసస్యప్రశస్యమై వెలయుచుండు
నట్టి తంజాపురంబున కరిగి వేడ్క." 35 ప. 2 ఆ.

అను తంజావూరు వర్ణనము సముచితము. కాని సప్తర్షులు,

"అందలి సౌధయూధముల యందము నచ్చటి కేలికావనీ
బృందము చంద మా కెలన బింకపుఁ జాపుల కోపు లించఁగా
విందుముఖల్ నటించు వగలెల్లఁ గనుంగొని పొంగి యౌర! పౌ
రందరపట్టణంబె యదిరా! మది రాజిలె నంచు నెంచుచున్." 36 ప 2ఆ

అను వర్ణనము అనుచితము. తిరుపతిక్షేత్రమునందలి వేంకటేశ్వరుని వర్ణనము, (54ప. 2ఆ.) శ్రీశైలక్షేత్రమునందలి భ్రమరాంబికావర్ణనము, (63ప. 2ఆ.) కాశీక్షేత్ర వర్ణనము (70ప. 2ఆ.) శ్రీరంగక్షేత్రములోని రంగనాథుని వర్ణనము (26ప. 2ఆ.) శ్రీనాథుని క్షేత్రవర్ణనములకు శిష్యప్రాయములు.

వాల్మీకి వృత్తాంతమువందు బోయపల్లె వర్ణనము సహజత్వ ముట్టిపడునది.

"తోరణంబులుగ వీథుల నారఁగట్టిన
యుప్పుగండలకు నొండొండ దిరుగు
పులుఁగుల తెక్కగాడ్పులఁ జాల నెగిరెడు
పసరంపుఁ బొలకంపు ముసురుకొనఁగఁ
బసివట్టి వలుగడఁ బఱచిన మెకముల

పచ్చితోళ్లను బండ్లఁ గ్రుచ్చి పెటుకు
బలు జాగిలంబుల భౌభౌరవంబులఁ
గొంకి పంకములోన ఘుర్ఘురించి
పరువు లిడు సూరబందుల ముటికి గవులు
చేప తట్టల గదురుతోఁ బెనసి చుట్టఁ
గూఁత పెట్టిన జనుల వాకొలుపఁజేయ
భయము గొల్పెడు నొక బోయపల్లెఁ గాంచి." 91 ప. 2 ఆ.

బోయవాడు సప్తర్షులను బాధించిన తీరు దయనీయము.

"జడలు వట్టి కుదించి మెడలపై మోచేత
గుప్పు గుప్పున సారె గుమికి గుమికి
కక్షపాలలు చించి రక్ష కేలను ముంచి
జడియంగ మొగములఁ జల్లి చల్లి
సలిలంబు గళగళ తలల మీఁదటఁ బోసి
బుఱ్ఱకాయల వెత్తి పొడిచి పొడిచి
కడవసంబులు రెమ్మ పెడమర్లగాఁ జుట్టి
గూమవో వడిపీవుఁగొట్టి కొట్టి
యిట్లు బాధించి శోధించి యెందు నొక్క
పచ్చపైకంబు గావ క ప్పచ్చిబోయ
వేఁటి తెరవాటు పస లేక దాటిపోయె
వమచు వెప వారి పిసమాని యవలి కేఁగి" 102 ప. 2 ఆ.

"యుసురుమరటంచుఁ గలఁగుచున్న" సప్తర్షులు అనునయించి అడిగిన ప్రశ్నమిది:

"ఒరోరి నీవు చేసిన
గోరపుఁబాపములు నీవు కొడుకులు వాలుం
జేరఁబడి పంచుకొందురొ
వారికిఁ బవిలేక నీక వచ్చునొ చెపుమా." 110 ప. 2 ఆ.

ఆలు బిడ్డలను అడిగి వత్తునని బోయవాడు కొంపకు పోవుసరికి, అతని భార్య ఉన్న తీరు మఱల సహజత్వ ముట్టిపడునది.

"కుదురుగ జంగ సాఁచి చమగుబ్బలు మీటుగఁ బాటుటాకుఁబ
య్యెద పాదలంగ వెన్నుదు రొకింత చెమర్పఁగ మేచకాళి వే
ర్పు దొరలఁ బాడి చందనపు టోలువ వేమఁగు కొమ్ము రోఁకటన్
బ్రిదిలెడు కొప్పుతో వెదురుబియ్యము గుప్పు నిజప్రియాంగనన్. 115 ప. 2 ఆ.

ఇందు కల్లుటోలు కాక మంచిగంధపు టోలు, కట్టురోకలి కాక ఏనుగుదంతపు రోకలి కలవు. అవి బోయలకు మాత్రమే అతిసామాన్యములు," మలయే భిల్లపురంధ్రీ చందనతరుకాండ మింధనం కురుతే" అని ప్రసిద్ధము.

బోయవాడు అడిగిన ప్రశ్నకు అతని భార్య ఇచ్చిన సమాధానమిది:

"అవ విని యచ్చెలి వగుచు
న్వినుమ నాయక తలఁప నాకు నీదగు పాపం
బువకుఁ బనిలేదు నీ ప్రా
పున నెంతయుఁ గుడిచి కట్టి పొసఁగుట కన్నన్. 119.

తవులగువారి కెవ్వరి కతంబున సాఁకెద వప్పు దీసి తె
త్తువొ కొనితెత్తువో తెరువు దోఁచుచు తెత్తువొ జూదమాడి తె
త్తువొ చని తెత్తువో యదియు దోసమొ పున్నెమొ నాకు నేటి కా
రవరవ నీవు దెచ్చినవి దాఁచక వండఁగఁ బాడి నిచ్చలున్." 120 ప. 2 ఆ.

ఆలి సమాధానము వినగానే బోయవాని మనస్సు చివుక్కుమన్నది. కొడుకులను పిలిచి అడిగిన వారి సమాధానమును అదేయైనది. బోయవాడు ఆశ్చర్యము కలిగి, ఆలోచనలో పడి, సంసారమును రోసి, భవబంధములు కోసి, సప్తర్షుల కడకు పోయి "ఆజవంజవభంజనస్వతంత్రంబగు నొక్క మంత్రంబు నా కుపదేశింపుఁ డనుచు సంతసంబునం బునఃపునఃప్రణామంబు లాచరించు"చును. "వాచంయము లవ్వనేచరుని సమీచీనధీచాతుర్యంబునకు నాశ్చర్యంబు నొందుచు". రామమంత్రమును ప్రతి లోమముగా ఉపదేశింతురు.

"కిరాత! రా తలంపు హత్తి కేవలంబు భక్తిమై
మరా మరా యటంచుఁ బల్కు మా యనుగ్రహంబునన్
బరాకు రాదటంచు రామమంత్ర మిచ్చి యంతటన్
ధరాధరాదిభూవిభూతిదర్శనాభిలాషులై." 125 ప. 2 ఆ.

నిష్క్రమింతురు. బోయవాడు "సకలవ్యాసంగంబులను మాని" మంత్రపారాయణమగ్నమనస్కుఁడగును. సహవ్యాధులెల్ల "మహావ్యాధులుం బోలె" బాధించినను పరకు గొనడు.

"తండ్రి రాముఁడు జనకజ తల్లి యెల్ల
బంధులును నాకు నా స్వామిభక్తు లెన్న
నింతవాఁడను నా కెందు నెదురు గలదె?
సకలజనముల నేలుదు సుకరముగను" 146 ప. 2 ఆ.

అని విఱుగనాడి, అందఱిని విడనాడి, "అంతర్ఘనతరబోధానుధాన రంజితుఁడగుచు" మౌను లిచ్చిన జపమాల చేపట్టి జపము సేయును. క్రమముగ తపము సేయును.

"బాలుని లీలన్ మత్తుని
పోలిక నితరంబు బుద్ధిఁ బొడమక యతఁడు
న్వేలాత్మానందస్థిర
శీలుండై ఘోరతపము సేయుచునుండెన్." 16 ప. 3 ఆ.

ఇది "బాలోన్మత్త పిశాచవత్" అను అవధూత లక్షణము. బోయవానికి

తపోభంగము సేయుటకు ఇంద్రుడు రంభోర్వశులను నియోగించును. వా రెంత నాట్యము సేసినను, మతెంత వీణావాదనము సల్పినను బోయవానికి తపోభంగము కాదు. రంభోర్వశులు తిరోగమింతురు. బోయవాని తపస్సు పురోగమించును. సప్తర్షులు మఱల వత్తురు. అచటి ప్రశాంతప్రకృతిని పరికించి "శాంతిమంతుఁ డెవ్వఁడో యొక్క యోగి యీ యెడ వసించి తపము సలిపెడుఁ గాఁబోలు"నని, "బోయవాఁ డెక్కడఁ బోయెనొ యిపుడన"ఆకాశవాణి"ఈ వల్మీకంబున నదే శ్రీవల్లభు భక్తసులభు సీతారమణున్ భావింపుచునున్నాఁడనఁగా వారల రాక యెఱిఁగి గ్రక్కున నతఁడున్"

"ఆ వల్మీకముఁ జించుకొంచు నుదయాహార్మాంతరాళంబునం
దావిర్భావము నొందు భాస్కరుని ఛాయన్ శోణశోణప్రభా
వ్యావల్గత్కిరణంబులో యన జటావ్రాతంబు శోభిల్లఁగా
వేగన్ జనుదెంచి యమ్మునుల సేవించెన్ బ్రియం బించగన్." 155 ప. 3 ఆ.

సప్తర్షులు సంతసించి జగదొంగ మహాతపస్వి అగుటకు హేతువు "శ్రీజానిస్మరణ మహిమ" అని (158ప. 3ఆ.) పుణ్యతీర్థములైన, వేదోక్తవిధులైన, నానాదానములైన మహావ్రతములైన రామనామమునకు సరిరావని తీర్మానింతురు. (159ప. 3ఆ.) బదరీవనమునందు శౌనకాదిమహామునులు నారదుని చెప్పుమన్నది "శ్రీవిష్ణుస్మరణకథ"యే (47ప. 1ఆ.) నారదుని ఆదేశమున పర్వతుడు చెప్పిన (60వచ. 1ఆ.) శ్రీవిష్ణుస్మరణకథ వాల్మీకిచరిత్రము. బోయవాడు "వల్మీకంబునం బుట్టు కతన వాల్మీకి యను నామధేయంబు వహించెను." (160వచ. 3ఆ.) అనంతరము "భక్తివిశేషంబున నిరంతరజప శీలుండై"న వాల్మీకి "చిత్తశుద్ధికి నలరి రామభద్రుండు సాక్షాత్కరిం"చును. (161-162 ప. 3ఆ.) వాల్మీకి స్తుతించును. (164-166ప. 3ఆ.) "రామచంద్రుండు నిర్నిద్రతాత్పర్యం బున నమ్మునివర్యుని మస్తకంబున హస్తసంస్పర్శనంబు గావించి యో మునితిలక! నీ భక్తికి మెచ్చితి. మచ్చరితంబు కావ్యంబుగా నొనరింపు" మని యానతిచ్చి అంతర్ధాన మగును. (167వచ. 3ఆ.) ఇది వాల్మీకివృత్తాంతము. ప్రధానేతివృత్తము.

రంభోర్వశుల ప్రమేయమునందు రంభోర్వశుల సంవాదము కలదు. ఇంద్రుడు రంభకు ఇచ్చిన బిరుదు ఊర్వశికి ఈర్ష్య కలిగించును. రంభను అధిక్షేపించును. ఇంద్రుని సన్నిధిని ఇద్దఱు వాదులాడుదురు. రంభ నాట్యశాస్త్రపాండిత్యమును ప్రదర్శించును. (54,55ప. 3ఆ.) ఊర్వశి కూడ నాట్యశాస్త్రపాండిత్యమును ప్రదర్శించును. (58ప. 3ఆ.) రంభ మఱల నాట్యశాస్త్రపాండిత్యమును, సంగీతశాస్త్రపాండిత్యమును ప్రదర్శించును. (63-66,69ప. 3ఆ.) ఇంద్రుడు బోయవానికి తపోభంగము చేసిన ఇద్దఱి నిపుణత్వములు తెలియునని,

"ఇద్దఱిలోపల నెవ్వతె
దద్దఱిలక యతని ధైర్యధనముఁ గొనెడు నా
ముద్దియకే యీ బిరుదుల
పద్దులు దగు నిది నిజంబు భామినులారా!" 75 ప. 1 ఆ.

అని బోయవానికి తపోభంగము సేయుటకు ఇద్దతిని నియోగించును. ఇది తన్నిమిత్తము. ఇందు రంభోర్వశులు ప్రదర్శించిన నాట్య, సంగీతశాస్త్రపాండిత్యములు భరతసుధ, సంగీతసుధ రచించిన రఘునాథనాయకుని నాట్య, సంగీతశాస్త్రపాండిత్య ప్రదర్శనమే. రంభోర్వశీసంవాదము ఆనుషంగికేతివృత్తము.

**శృంగారసావిత్రి** : ఇది 'సావిత్రీకల్యాణము' అని గ్రంథపట్టికయందు కలదు. 'శృంగారసావిత్రి' అని ముద్రితగ్రంథమునందు కలదు. రెండు గ్రంథనామములును తాళపత్ర గ్రంథమునందు లేవు. సావిత్రీకళ్యాణముతో కావ్యము పూర్తి కాలేదు. మేనకాశ్వపతుల, సావిత్రీసత్యవంతుల శృంగారము శ్రుతి మించలేదు. మహాభారతములోని సావిత్ర్యుపాఖ్యానము సర్వము మార్పు చేర్పుల కావ్యమునందు కలదు. కావున సావిత్రీచరిత్రము కావలయును.

కావ్యమునందు అవతారిక, ఆశ్వాసాద్యంతపద్యగద్యములు లేవు. అందువలన కాలము, కర్తృవిషయము తెలియుటకు అవకాశము లేదు. కాని ముద్రితగ్రంథమునందు 'సావిత్రీచరిత్ర సమాప్తము' అను ముగింపు వాక్యము తదుపరి,

"తంజాపురి రఘునాథుని
లంజెయొ యతఁడో వచోవిలాసము మెఱయన్
రంజిల్ల బుధులు రచనా
మంజిమ సావిత్రీచరిత మహి రచియించెన్."

అను పద్యము కలదు. ఇది శృంగారసావిత్రి రఘునాథనాయకుని కృతి అనుటకు రాచబాట వైచినది. కాని ఈ పద్యము తాళపత్రగ్రంథమునందు లేదు. కవియైన ప్రతివిలేఖకుడు రచించినది కావచ్చును. కాఁబట్టి నిర్ధారకసాధనము కాదు.

"శ్రీరఘునాథరాయమహాకవి రచియించిన రామాయణమందలి
పద్యములు (ఋష్యశృంగతపోభంగఘట్టము పట్టున నున్నవి.) ఈ
గ్రంథమునందును మండుటచే తత్కర్తయే యేతత్కర్తయగునని
మే మూహించితిమి."

అని పీఠికయందు కలదు. (పుట8.) కాని రఘునాథరామాయణములోని ఏ పద్యములును శృంగారసావిత్రియందు లేవు. కాని రఘునాథనాయకుని వాల్మీకిచరిత్రము లోని ఒక పద్యము వంటి పద్యము శృంగారసావిత్రియందు కలదు.

"పెంజెమట లూర దోవతి
పింజెలు మాటికిని గ్రొల్లఁ బెనఁగొనఁ గడుపుల్
గుంజెలు వెట్టఁగ వేలుపు
లంజెలఁ గూడంగఁ జని హాళాహాళి మెఱయన్". 85 ప. 3 ఆ. వా. చ.

"తామను దవ చెలికత్తెలుఁ
బూనుకొని విమాన మెక్కఁబోవఁగ నిలు మో
మేనక యని కౌశికముని

తో నరిగెన్ బొజ్జ గదల దోవతి వదలన్. పుటలు 8-9. శృం. సా.

వాల్మీకి చరిత్రమునందు సోమయాజుల "దోవతిపింజెలు మాటికిని గాళ్ల బెనఁగొ" నుట, "కడుపులు గుంజెలు వె"ట్టుట వలె, విశ్వామిత్రుని "దోవతి వద"లుట, "బొజ్జ గద"లుట కలదు. ఇది వాల్మీకిచరిత్రమును రచించిన రఘునాథనాయకుడు శృంగారసావిత్రి రచించెననుటకు సాధకము. సావిత్ర్యుపాఖ్యానమునందు సావిత్రి మామ ద్యుమత్సేనునికి విగతచక్షుఃప్రాప్తి, అపహృతరాజ్యప్రాప్తి; తండ్రి అశ్వపతికి శతపుత్రలాభము; భర్త సత్యవంతునికి జీవితలబ్ధి యముని వలన పడసినట్లు కలదు. సావిత్రీచరిత్రమునందు సావిత్రి మామ ద్యుమత్సేనునికి విగతచక్షుఃప్రాప్తి, అపహృతరాజ్యప్రాప్తి; తండ్రి అశ్వపతికి శతపుత్రలాభము యమునివలన, భర్త సత్యవంతునికి జీవితలబ్ధి విష్ణువు ప్రమేయము వలన యముని వలన పడసినట్లు కలదు. విష్ణువు ప్రమేయము సావిత్ర్యుపాఖ్యానమునందు లేదు. సావిత్రీచరిత్రమునం దుండుటకు కారణము, కృతికర్త విష్ణుభక్తివిలసితు డగుట కావలయును. రఘునాథనాయకుడు విష్ణుభక్తి విలసితుడే. ఇది కూడ రఘునాథనాయకుడు శృంగారసావిత్రి రచించెననుటకు సాధకము.

రఘునాథనాయకుని తనయుడైన విజయరాఘవనాయకుని కృతులందు గాని, ఆస్థానకవిపండితుల కృతులందుగాని, అన్యత్ర గాని రఘునాథనాయకుడు సావిత్రీ చరిత్రము రచించి నట్లు లేదు. ఇది బాధకము.

శృంగారసావిత్రికి ఆధారమైన సావిత్రీకల్యాణము తాళపత్రగ్రంథమునందు ఆశ్వాసవిభాగము లేదు. శృంగారసావిత్రి రెండు ఆశ్వాసములుగ ముద్రితమైనది. కాని నాలు గాశ్వాసములు కలవు. ముద్రితగ్రంథములోని ప్రథమాశ్వాసమునకు ముందు అవతారిక, కథాప్రారంభము కల ఒక ఆశ్వాసము లభింపలేదు. అది ప్రథమాశ్వాసము. ఇది ద్వితీయా శ్వాసము. ముద్రితగ్రంథములోని ద్వితీయాశ్వాసము తృతీయాశ్వాసము. అందు గ్రంథపాతము తదుపరి, ఆశ్వాసారంభమునందలి "అవధరింపుము" అను పద్యము కలదు. (87పుట.) అంతవఱకు తృతీయాశ్వాసము. అది మొదలు చతుర్థాశ్వాసము. సత్యవంతుని పట్టాభిషేకముతో సావిత్రీచరిత్రము సమాప్తము. పంచమాశ్వాసము నిరవకాశము.

ద్వితీయాశ్వాసమునందు అశ్వపతి తపోభంగము, మేనకాశ్వపతుల శృంగారము, మఱల అశ్వపతి తపస్సు, సావిత్రి (సరస్వతి) సాక్షాత్కారము, పుత్రీవరప్రసాదము, సావిత్రి (అశ్వపతి తనయ) జననము, విద్యాభ్యాసము కలవు. ఇందు అశ్వపతి తపోభంగమునకు ఫలసిద్ధి మేనకాశ్వపతుల శృంగారము మాత్రమే. మేనక విశ్వామిత్రుని తపోభంగమునకు వాట్యమాడినది. అశ్వపతి తపోభంగమునకు కట్టుకథ అల్లినది. అది తుంబురునితోడి తన సమాగమమును సహింపలేని విశ్వామిత్రుని వేధింపు తప్పించుకొనుటకు, తుంబురుని ఉపదేశమున మేనక అశ్వపతి ఆశ్రమమునకు వచ్చుట.

మేవకను చూడగానే తపోభంగమైన అశ్వపతి,

"పాయని కౌఁగిటన్ రవిక పక్కున విచ్చినఁ జన్నుదోయి కే
ల్దోయి గదించి చొక్కి యటు తోఁచక తూఁగెను మోహవార్ధి నా
చాయ మునుంగకుండిన వెసం దరిఁజేరు నుపాయ మించి సం
దీయని కుండ లానుకొన యీఁదుచు తేలుచునున్న పోలికన్." పుట 32.

తృతీయాశ్వాసమునందు సావిత్రి వనవిహారము, నారదాగమనము, సత్యవంతుని పరిచయము, సావిత్రి వినుకలిప్రేమ, విరహము, సత్యవంతుని విరహము, అశ్వపతి గృహమునకు నారదాగమనము, వివాహసంధానము, దేవరహస్యవివరణము, గ్రంథపాతము కలవు. సత్యవంతునిగుఱించి నారదుడు సావిత్రికి తెలుపునెడ సంగీత విషయము, అశ్వపతికి తెలుపునెడ సాహిత్యవిషయము కలవు. అందు,

"అవుర, నా స్వామి కవిరాజ వవుదు వయ్య
బట్టబయట రసస్థితుల్ పరగఁజేసి
మెఱుఁగు గల్పించగల ఘనుల్ మీరె కారె
కాకయుండిన నారదఖ్యాతి గలదె." పుట 83.

అను పెద్దల ప్రశంస శ్లిష్టము. స్పష్టము.

చతుర్థాశ్వాసమునందు సావిత్రీసత్యవంతుల అరణ్యాగమనము, సత్యవంతుని మరణము, యమాగమనము, సావిత్రి యమానుసరణము, యముడు సత్యవంతుని ప్రాణములు తీసికొని పోవుట, సావిత్రి సత్యలోకమున కేగుట, సరస్వతి వైకుంఠమున కేగి విష్ణువును ప్రార్థించుట, విష్ణుదూత వచ్చి విష్ణుభక్తుడైన సత్యవంతుని యముడు తోడ్కొని పోవుటను తెలుపుట, విష్ణువు సావిత్రికి ప్రత్యక్షమగుట, యముని మందలించుట, యముడు సత్యవంతుని ప్రాణము లిచ్చుట, పునర్జీవితుడైన సత్యవంతుడు, సావిత్రి గృహోన్ముఖులగుట మొదలైన విషయములు కలవు. ఇందు సత్యవంతుడు మరణించుటకు పూర్వము సావిత్రి సత్యవంతునితో,

"ఆ మైఁ జూచితె ప్రాణనాయక గజం బా పెంటియేనుంగుతోఁ
గామక్రీడకుఁ బాటెడిం గలపి సింగం బుండుటల్ కానలే
దేమో యువ వేమి గాదు శరభం బెంతే ద్విధారంభమై
యా మూలం గని పొంచియున్నయది సింహంబున్ గ్రహియం దమిన్" పుట 99

అనుట పంకేతితార్థవిలపితము. ఇందు ఏనుగులు సావిత్రీసత్యవంతులు. సింహము యముడు. శరభము విష్ణువు.

పునర్జీవితుడైన సత్యవంతుడు సావిత్రికి తెల్పిన స్వప్నవృత్తాంతమును పంకేతితార్థ విలపితమే.

"కలకంఠీ కల గంటి నే నొకటి యింకం దెల్పి రాలేదు వ
న్నెలు గొక్కండు గ్రహింప వెంటఁబడ నే నెందేని వేగంగ వ
చ్చల వేటొక్క పడంతి యొక్కరువిఁ దే వాఁడా మృగంబున్ శరం
బుల వేయన్ విడిపించుకొంటి నది యేమో చూచినట్లుయ్యెడిన్." పుట 121

ఇందు కల మరణము. తెలివి పునర్జీవనము. ఎలుగు యముడు. ఎందేని ఏగుట మరణించుట. వేఱొక పడతి సరస్వతి. ఆమె తెచ్చిన వాడు విష్ణువు. ఆతడు వేసిన శరములు యముని మందలించుట. సత్యవంతుడు విడిపించుకొనుట పునర్జీవితుడగుట.

ఇట్టి సంకేతితార్థవిలసితమైన రచన ఇతరత్ర అరుదు.

శృంగారసావిత్రియందు వర్ణనావ్యామోహము లేదు. కథానుగతములైన కతిపయ వర్ణనలు కలవు. అందు విరహవర్ణనమే అధికము. చంద్రాస్తమయసూర్యోదయవర్ణనము నందు ఇంద్రజాలము కలదు.

"సకియరొ చూడు మా చరమశైలమునన్ నెల గ్రుంక నీడఁ జం
డకరుఁడు తూర్పుకొండను గనంబడెఁ గాలము పేరి యైంద్రజా
లికుఁ డొక చిప్పలోపల తెలిం గల బంతి నడంచి యొక్క చి
ప్పకుఁ బయి చూపెనో యెఱుపు బంతి యనం జెలువొందె వింతగన్" పుట 75

ఒక చిప్పలో తెల్లబంతిని దాచి ఒక్క చిప్పకు పైన ఎఱ్ఱబంతిని చూపుట ఇంద్రజాలము.

శృంగారసావిత్రియందు సమకాలికసమాచారము సకృత్తుగ కలదు.

"పేయుంగన్నుల వేలుపు
పేయు పిఖా చూచి ముద్దుచేతులచే వౌ
రా యిది దేవశిఖామణి
చేయు పిఖా యనుచు మెప్పు పేయుచుఁ జదివెన్." పుట 35.

పిఖా అన సీలు. ఇది రాయలయుగములోని తరిగొప్పుల మల్లన చంద్రభాను చరిత్రమునందు ముందే కలదు.

"పారెకు పారెకున్ గనని పందుల పప్పురి పొచ్చి యేగువాఁ
డై రజనీకళత్రుఁడు తదగ్రతలస్థితరక్షివర్గముం
జేరి మెయిన్ పికా గురుతు చేకొనఁ బోలును గాక యున్నచోఁ
బేరిన మెప్న వంటి శశిబింబమున న్నెఱకందు దోఁచునే" 63ప. 1 ఆ.

పిఖాగురుతు అన సీలు గుర్తు. శృంగారసావిత్రిలోని ఇంద్రుడు పిఖా వేసిన లేఖ (పుటలు 35-36) రఘునాథనాయకుని నాటి కమ్మవక్కణ కావచ్చును.

శృంగారసావిత్రియందు రెండు సుదీర్ఘవచనములు మాత్రమే కలవు. (పుటలు 41-46; 130-135.) నాగబంధము కలదు. (పుట 156) చిన్న యమకరగడ (పుటలు 55-56) కలదు.

"కంటిలోను బడగా బల మూనకు
గంటి లోను బడగా బల మూనకు
xxx xxx xxx
కలికి తామరలఁ గైకొన కొల్లను.
కలికి తా మరలఁ గైకొన కొల్లను."

ఇట్లు పాదముల శబ్దపునరావృత్తి, అర్థభేదము కలదు గావున యమకరగడ అని ప్రకాశకవాణి.

ఇది రఘునాథనాయకుని కృతి అని ఇదమిత్థముగ నిర్ణయించుట దుర్ఘటము., "శృంగారసావిత్రి" అను గ్రంథనామము ప్రకాశకప్రకల్పితము. గ్రంథకర్త పెట్టిన గ్రంథ నామము సావిత్రీచరిత్రమగును. కుమారధూర్జటి రచించిన సావిత్రీచరిత్రము ఉపలబ్ధము కాలేదు. ఇది కుమారధూర్జటి కృతి కాఁజాలదు. కారణము వైష్ణవసంబంధమే. అది రఘునాథనాయకుని కృతి అగుటకే సాధకము.

## జాతివార్తాచమత్కారములు

కవిత్వము గుఱించి రఘునాథనాయకునికి కొన్ని అభిప్రాయములు కలవు. అవి రామాయణమునందు, వాల్మీకిచరిత్రమునందు తెలిపినవి.

"పలుకఁగవలె నవరసములు
గులుకం బద్యములు చెవులకున్ హృద్యముగా
వలుకక యటుగాకున్నం
బలుకకయుండుటయె మేలు బహుమానముగన్. 16.
సందర్భము నవరసని
ష్యంది యగుచుఁ గవుల చెవులఁ జవులు దవుల నిం
పొందివఁ దగుఁ గా కూరక
యందదుకులు గూర్చు కవిత యందం బగునే. 17.
మాటికి రసపరిపాటికి
మేటికవులు మెచ్చి మేలుమేలనఁ గూర్తుం
దేటగ రామాయణకథ
మాటల పొందికలు గుమగుమఁ బిసాళింపన్." 18 ప. 1 ఆ. రామా.
"చెప్పఁగవలెఁ గప్పురములు
కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపైఁ
గుప్పిన క్రియ విరిపొట్లము
విప్పిన గతి ఘుమ్మనం గవిత్వము సభలన్. 15.
చెవులకుఁ జవులై చల్లఁగఁ
గవులకుఁ దవులై సమస్తకావ్యకళాబం
ధువులై రసపిందువులై
యవుర యవఁ గవిత లవవి వలరన్ వలదా" 16 ప. 1 ఆ. వా. చ.

కవిత్వమునకు రసము, తేట మాటల పొందికల కర్ణరసాయనశైలి; వ్యంగ్యవాసన, శిల్పము ఆవశ్యకములవి అంతర్యము. ఇందుకు పూర్వోదాహృతపద్యము లెల్ల పురస్కారములే. అంతేకాదు. "మేటికవులు మెచ్చి మేలు మేలు" అన్నవే. చేమకూర వేంకటకవి కతపత్రమిది:

"తా రసపుష్టిమై ప్రతిపదంబున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేకకృతుల్ ప్రసన్నగం
భీరగతిన్ రచించి మహి మించినచో నిఁక శక్యు లెవ్వ ర
య్యా రఘునాథభూపరసికాగ్రణికిన్ జెవి సోఁక జెప్పఁగన్." 31 ప. 1 ఆ. వి. వి.

ఇందు రఘునాథనాయకుని కృతులందు ప్రతి పదమున జాతి, వార్త, చమత్కారము, అర్థగౌరవము, ప్రసన్నత, గంభీరత కలవని ప్రశంస. ప్రతిపదమున అనగా ప్రచురముగ అని తాత్పర్యము.

అసలు జాతి అను పదమునకు కవితాపరముగ ప్రయోగము ప్రథమత: శ్రీకృష్ణ దేవరాయల ఆముక్తమాల్యదయందు కలదు.

"పలికి తుత్ప్రేక్షోపమల జాతిఁ బెంపెక్క
రసికు లౌనన మదాలసచరిత్ర" 13ప. 1 ఆ.

ఇట "జాతిన్ = స్వభావోక్తిచేతను" అని వ్యాఖ్యానములోని అర్థము. మదాలసచరిత్రమునందు మాత్రమేగాక, ఆముక్త మాల్యదయందును ఉత్ప్రేక్షోపమలు జాతిచేత పెంపెక్కినవియే. రాయల ఉత్ప్రేక్షలకు, అతిశయోక్తులకు, అత్యుక్తులకును ఆధారము సహజాంశము. ఉపమ లెట్లును సహజాంశములే. కావున జాతి అనగా సహజత్వము కావలయును. తదుపరి జాతి అను పదము కవితాపరముగానే భట్టుమూర్తి కావ్యాలంకారసంగ్రహమునందు కలదు.

"సహృదయహృదయంగమమై
మహి నున్నది యున్నయట్ల మాటల తేటల్
బహుళంబులుగాఁ జెప్పిన
మహితోక్తియె జాతి యయ్యె మహినెట్లన్నన్." 112 ప. 5 ఆ.

ఇందు సహృదయహృదయంగమమై ఉన్నది యున్నయట్లు చెప్పినది జాతి అని ఇదమిత్థముగ కలదు. అట్లు చెప్పినది స్వభావోక్తి అలంకారము.

వార్త అను పదమునకు కవితాపరముగ పూర్వకవి ప్రయోగము మృగ్యము. అలంకారశాస్త్రములందును అభావమే. "వార్తయున్ = కౌశిక్యాదివృత్తియు"; "కథను నడిపించు నేర్పును = కథాకథననైపుణ్యమనవచ్చును" అను వ్యాఖ్యానములలోని అర్థము, విశేషార్థము కల్పనాగౌరవమునకు తావలములు. వార్త అను పదమునకు కవితాపరముగ కలపివచ్చు చేమకూర వేంకటకవి ప్రయోగాంతరము కలదు.

"మోక్షమునకుఁ బోవ మొసలెత్తుకొనిపోయె"
ననెడు వార్త నిక్కమగు నటంచు
గ్రుంక వెఱతు రెవ్వరును; మీర లటు పోకుఁ
డనిన నవ్వుకొనుచు నర్థమండు." 43 ప. 2 ఆ.

ఇట "వార్త = లోకోక్తి అని వ్యాఖ్యావార్థములు. "మోక్షానికి పోతే మొసలెత్తుకొని పోయింది" అను మాట సామెత. లోకోక్తి అనగా సామెతయే. కావున వార్త అనగా సామెత కావలయును.

ఇక చమత్కారము[17]. రసమే చమత్కారమని అభినవగుప్తుడు. చమత్కారము శబ్దగతము, అర్థగతము, శబ్దార్థోభయగతము, వృత్తిగతము, అలంకారగతము అని, అది అవిచారితరమణీయము, విచారితరమణీయము, సమస్తసూక్తవ్యాపి, సూక్త్యైకదేశ దృశ్యము అని క్షేమేంద్రుడు. చమత్కారము చిత్తవిస్తారరూపము, విస్మయాపర పర్యాయము అని విశ్వనాథుడు. చమత్కారము విద్వాంసులకు ఆనందపరీవాహము కలిగించునది, గుణరీతిరసవృత్తిపాకశయ్యాలంకారములు చమత్కారకారణములు, శబ్దార్థముల చమత్కారమే కావ్యము అని విశ్వేశ్వరుడు. అంతేకాదు. కావ్యములు చమత్కారి, చమత్కారితరము, చమత్కారితమము అని త్రివిధము, శబ్దచారుత్వము కలది చమత్కారి, వాచ్యార్థచారుత్వము కలది చమత్కారితరము, వ్యంగ్యార్థచారుత్వము కలది చమత్కారితమము అని కూడ విశ్వేశ్వరుని వివరణము. (36, 37, 40 శ్లో. 3 వి.) మొత్తము మీద చమత్కారము స్థూలముగ ద్వివిధము. 1. శబ్దచమత్కారము. 2. అర్థ చమత్కారము.

ఇదే కాలములోని (1630) సవరము చిన నారాయణనాయకునికి "జాతివార్తాకవి జనామోదసంధాయక" అను విశేషణము, అతని కువలయాశ్వచరిత్రమునందు కలదు. స్వభావోక్తులు సంతరించు, సామెతలు సంఘటించు కవులకు ఆమోదము కలిగించు వాడని అర్థము. అతని ప్రయోగాంతరమైన జాతిశబ్దమునకు (4ప. 4ఆ.) అర్థము స్వభావోక్తి కాదు. చమత్కారము. కాని జాతివార్తాచమత్కారములలోని జాతి చమత్కారము కాదు. కవితాపరమైన జాతి స్వభావోక్తి. వార్త సామెత. చమత్కారము చారుత్వము. జాతివార్తాచమత్కారములు స్వభావోక్తులు. సామెతలు చారుత్వములు.

## రఘునాథనాయకుని ఆస్థానకవులు

రఘునాథనాయకుని ఆస్థానమునందు సంస్కృతాంధ్రకవులు కలరు. యజ్ఞనారాయణదీక్షితుడు సంస్కృతకవి. రామభద్రాంబ, మధురవాణి సంస్కృతకవయిత్రులు. కృష్ణాధ్వరి ఉభయకవి. చేమకూర వేంకటకవి తెలుగు కవి. రఘునాథనాయకుని ఆస్థానమునందు కవి చౌడప్ప కాలు పెట్టినట్లు కవి చౌడప్ప పద్యము కలదు.

"వేరుతువని మాటాడఁగ
వారిజభవునంతవాని వశమా? తంజా
వూరి రఘునాథనాయని
గారిసభన్ గుందవరపు కవి చౌడప్పా"

రఘునాథనాయకుని శిష్యుడైన యజ్ఞనారాయణదీక్షితుడు రఘునాథభూప విజయము, రఘునాథవిలాసనాటకము రచించెను. రామభద్రాంబ రఘునాథాభ్యుదయము రచించెను. మధురవాణి రామాయణమును రచించెను. అది రఘునాథనాయకుని రామాయణమునకు సంస్కృతీకరణమని ఒక అభిప్రాయము కలదు.

కాని యథార్థము కాదు. మధురవాణి రామాయణము మఱొకటి. రామభద్రాంబ, మధురవాణి ఆశుకవితాప్రవీణలు, సమస్యాపూరణసమర్థలు అని విజయరాఘవ నాయకుని రఘునాథాభ్యుదయమును బట్టి విశదమగును.

కృష్ణాధ్వరి : ఈతని సంస్కృతకృతులు 1. రఘునాథభూపాలీయము. 2. పారిజాతాపహరణము 3. కౌముదీకందర్పనాటకము. 4. శృంగారసంజీవిని, 5. తాళసంజీవిని, ఐదవది సంగీతశాస్త్రగ్రంథమగును ఇతని తెలుగుకృతి. 6. నైషధపారిజాతీయము. ఆరు కృతులును రఘునాథనాయకునికి అంకితములు.

"నవరసశ్రీ రఘునాథభూపాలీయ
నామభామాభీష్టనాయకుండు
పారిజాతకథావతారికాహృదయకా
వ్యస్వయంవరవరవల్లభుండు
కల్యాణకౌముదీకందర్పనాటక
కన్యోద్వహావబద్ధకంకణుండు
అమరుకాహంకారహారిభంగీకశృం
గారసంజీవినీకాముకుండు
తాళచింతామణీవధూతత్పరుండు
మంచి జామాత రఘునాథమహిపునేత
తెలియ నైషధపారిజాతీయకృతియు
నేవురక్కల చెల్లెలై హెచ్చుననుచు"

అంకితమిచ్చుటయేగాక, నైషధపారిజాతీయద్వ్యర్థికావ్యమునకు రఘునాథనాయకుడు సంతోషము పొందునని కూడ కృష్ణాధ్వరి సంకల్పము.

"నైషధపారిజాతహరణద్వికథార్థసమర్థన (క్రియా)
శ్లేషగతిప్రబంధము ఫలించిన మా రఘునాథశౌరి సం
తోషముఁ బొందువన్ గడకతో దశదిగ్జయశోభితద్యశో
భూషణమైన యీ కృతికిఁ బూనితిఁ బ్రౌఢి విరూఢి చెందఁగన్."

పరిణయపర్యంతనలకథ, పారిజాతాపహరణకథ ద్వికథలు. నలకథ మహాభారతములోని నలోపాఖ్యానమునకు గాక, శ్రీనాథుని శృంగారనైషధమునకు సన్నిహితము. అది హర్షనైషధమునకు ఆంధ్రీకరణము. అయినను స్వయంవరసమాగత రాజకుమారులను దమయంతికి పరిచయము చేయుటకు భీమరాజు సరస్వతిని ప్రార్థింప సరస్వతి సాక్షాత్కరించినట్లు శృంగారనైషధమునందు కలదు. ఇట్లు నైషధపారిజాతీయమునందు కలదు. పారిజాతాపహరణకథలోని షోడశరాజపుత్రికల ప్రేమ, కవీంద్రుని (వయోధికుడు) పాత్ర కల్పితములు. నంది తిమ్మన పారిజాతాపహరణమునందు లేవు. అంతేకాదు. నంది తిమ్మన పారిజాతాపహరణమునందు పారిజాతాపహరణకథ నరకాసురవృత్తాంతము జరిగిన తర్వాత జరిగినట్లు కలదు. ఇందు శ్రీకృష్ణుడు

పారిజాతవృక్షమును తెచ్చెదనని సత్యభామను ఓదార్చిన తర్వాత బలరామాదులతో గూడి నరకాసురునిపై దండయాత్ర సాగించినట్లు కలదు. ద్వికథాసంధానమునకు ఇట్టి మార్పులు తప్పనిసరి.

హంసపరముగను, కవిపరముగను అర్థద్వయము కల అందమైన పద్యము :

"సరసులలోననే మెలఁగు జాణకవుల్ మది మెచ్చ పెద్దయౌ
నురుతరబుద్ధిజృంభణవయోగణనం బృథుకాంతిమత్త్వసం
భరణుఁడు రక్తి రంగెనయు పాటలవర్ణమృదుప్రచారణం
బరఁగు పదక్రమంబులను బ్రహ్మరథోచితుఁ డెంచి చూచినన్.

**చేమకూర వేంకటకవి :** ఈతని కృతులు 1. సారంగధరచరిత్రము. 2. విజయవిలాసము. విజయవిలాసము రఘునాథనాయకునికి అంకితము.

సారంగధరచరిత్రమునందు అవతారిక, ఆశ్వాసాద్యంతపద్యములు లేవు. మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు పది ప్రతులు కలవు. అందు కొన్నిట ఆశ్వాసాద్యంతపద్యములు కలవు[18]. అవి విజయవిలాసములోని ఆశ్వాసాద్యంతపద్యములే. రెండు ప్రతులందు కృత్యాదిపద్యములు కలవు[19]. అవి ఇష్టదేవతాస్తుతి, పూర్వకవిస్తుతి పద్యములు. ఇష్టదేవతాస్తుతిలోని తొలి పద్యము "సదానతరుద్రుఁడు భద్రు"ని పరముగ కలదు. ఇట్టి పద్యము విజయవిలాసమునందు లేదు. పూర్వకవిస్తుతి వాల్మీకి, వ్యాస, భారవి, కాళిదాస, దండి, నన్నయ, భీమన, తిక్కన, పోతనల పరము. విజయవిలాసము నందు పూర్వకవిస్తుతిపద్యములు లేఖకుల విపర్యయము కావలయును. మఱొక ప్రతియందు వేఱే అయిదు పద్యములు కలవు[20]. అవి కృత్యాదిపద్యములు కావు. విజయవిలాసము కృతిలోని పద్యములు. (1-23, 2-30, 3-90, 3-126.) ఇది లేఖకుని వినోదమే. ఇంకొక ప్రతియందు సారంగధరచరిత్రము నాలు గాశ్వాసములుగ కలదు. నాలు గాశ్వాసముల ఆద్యంతములందు అయిదు పద్యములు కలవు[21]. ఆదిపద్యము శ్రీకంఠస్తుతి. ఆశ్వాసాంతపద్యములును శ్రీకంఠపరము. అందు ద్వితీయాశ్వాసాంత పద్యములును శ్రీకంఠపరము. అందు ద్వితీయాశ్వాసాంతపద్యము శ్రీశైలబిలాధివాసుని పరము. విజయవిలాసములోని ఇష్టదేవతాస్తుతి రామ, రంగనాథ, వేంకటేశ్వర, బ్రహ్మ, శివ, సూర్యపరము. శివపరముగ ప్రత్యేకపద్యము లేదు. కనుక శివపరమైన ఆశ్వాసాద్యంతపద్యము లివికూడ లేఖకుని విలాసమే. బాణాల శంభుదాసుని సారంగధరచరిత్ర ద్విపదకావ్యమునందు ఇట్లు కలదు.

"భువిలోన సారంగభూవరు చరిత
కవితామహత్త్వంబు గల చేమకూర
అప్పన చెప్పిన యా ప్రకారముఁ
జెప్పితి .......... .......... .........."

ఇది నిమిత్తముగ చేమకూర వేంకటకవికి అప్పన నామాంతరమని ఒక అభిప్రాయము కలదు[22]. సారంగధరచరిత్రము చేమకూర వేంకటకవికృతము కాదు;

చేమకూర అప్పన కృతమని మఱొక అభిప్రాయము కలుగవచ్చును. కాని చేమకూర అప్పనకృతమైన సారంగధరచరిత్రము మఱొకటి మద్రాసు అడయారు గ్రంథాలయమునందు కలదు[23]. అముద్రితము. అతిశిథిలము. అది బాణాల శంభుదాసుని సారంగధరచరిత్రమునకు ఆధారమగును. కనుక చేమకూర వేంకటకవికి అప్పన నామాంతరము కాదు. వ్యక్త్యంతరమే.

చేమకూర వేంకటకవి సారంగధరచరిత్రమునందు అవతారిక, ఆశ్వాసాద్యంత పద్యములు లేకపోయినను ఆశ్వాసాంతగద్య కలదు. అందు "చేమకూర లక్ష్మణామాత్య కుమార సమారాధితబుధసమాజ వేంకటరాజప్రణీతం" బని కలదు. ఇది "చేమకూర లక్ష్మణామాత్యతనయవినయధురీణసకలకళాప్రవీణాచ్యుతేంద్రరఘునాథభూపాలదత్త హస్తముక్తాకటకవిరాజమానవేంకటకవిరాజప్రణీతం"బని విజయవిలాసమునందు కలదు. అనగా చేమకూర వేంకటరాజు చేమకూర వేంకటకవిరాజు, సకలకళాప్రవీణుడు, రఘునాథభూపాలదత్తహస్తముక్తా కటకవిరాజితుడు కాకపూర్వము సారంగధరచరిత్ర రచించినట్లు, అయిన తర్వాత విజయవిలాసము రచించినట్లు అవగాహనమగును. కనుక సారంగధరచరిత్రము తొలి కృతి. విజయవిలాసము మలి కృతి.

> "ఈ కవి మొట్టమొదట సారంగధరచరిత్రమును రచియించి రఘునాథ
> రాయలకుఁ జదివి వినిపించెననియు నందుపై నతఁడు 'చేమకూర'మంచి
> పాకమునఁ బడలేదని యాక్షేపించెననియుఁ బిదప విజయవిలాసమును రచించి
> తెచ్చి వినిపింపఁగా నాతఁడు మిగుల సంతసించెననియుఁ జెప్పుదురు"

అని ఒక అభిప్రాయము కలదు[24]. ఇది జనశ్రుతి. ఇంచుకైన యథార్థము కావచ్చుననుటకు విజయవిలాసములోని చంద్రోదయ వర్ణన పద్యము సాధకము.

> "క్షితిసయి పట్టి ప్రాకులుఁ జిగిర్చ వసంతుఁడు తా రసోపగుం
> భితపదవాసనల్ నెఱప మెచ్చక చంద్రుఁడు మిన్నునం బ్రస
> న్నతయును పాకమార్యముఁ గనంబడ ఆాల్ గరగంగఁజేసె నే
> గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా!"210ప. 1 ఆ.

ఇందు రసోపగుంభితపదవాసనలు వెదజల్ల రచించినను; ప్రసన్నత, పాకు మార్యము పరిఢవిల్ల రచించినను సమకాలము వారు మెచ్చరని కలదు. సారంగధర చరిత్రము రసోపగుంభితపదవాసనలు వెదజల్లునదియే. ప్రసన్నత, పాకుమార్యము పరిఢవిల్లునదియే. అయినను, సమకాలము వారలు మెచ్చలేదను చేమకూర వేంకటకవి అంతర్మథనము పద్యమునందు ప్రతిఫలించినది.

సారంగధరచరిత్రము కథాభాగములోని పద్యము, విజయవిలాసము కథాభాగము నందు కలదు. అలంతి మార్పుల యథాతథము.

> "జోహారు మీకుఁ జిల్లగాఁగఁ జాడుఁడో సమీరకం
> జహారులార మంటమారి తంబరారిఁ గూడినన్
> గోహారు సేయనేల సారెకున్ జిలంబునన్ భుజం

గహారు పాదమూన మీరు కాఁక లింక రేఁచినన్." 181 ప. 2 ఆ. సా. చ.
జొహారు మీకుఁ జల్లఁగాఁగ జూడుఁడో సమీరకం
జహారులార! మంటమారి శంబరారిఁ గూడి యీ
గొహారు సేయనేల? యీ చకోరలోచనన్ భుజం
గహారు పాదమూన మీకుఁ గాఁక లింక రేఁచినన్." 49 ప. 3 ఆ. వి. వి.

ఆవృత్తశిల్పమిది సారంగధరచరిత్రము చేమకూర వేంకటకవికృతమగుటకు సాధకము. ఇది శ్రీనాథుని హరవిలాసములోని "గరళమగు" పద్యము భీమేశ్వరపురాణమునందు, కాశీఖండములోని "అరుణగభస్తి" పద్యము శివరాత్రి మాహాత్మ్యమునందు ఆవృత్తమైనట్లు ఆవృత్తమైనది.

సారంగధరచరిత్రమునందు అవతారికాశ్వాసాద్యంతపద్యముల అభావము ప్రాగభావమో, ప్రధ్వంసాభావమో నిర్ధరించుట దుర్ఘటము. అయినను రఘునాథ నాయకుని ఆస్థానకవులు -యజ్ఞనారాయణదీక్షితుడు, కృష్ణాధ్వరి- తమ కృతు లెల్ల రఘునాథనాయకునికే అంకితమిచ్చినట్లు చేమకూర వేంకటకవి కూడ అట్లు చేయుట అత్యంతసంభవము. సారంగధరచరిత్రము రఘునాథాంకితమగుట మిక్కిలి సంగతము.

"కల నయిన మిమ్ముఁగా కన్యుఁ గొలువనంటి
కృతు లొకరి కీను మీకె యంకితములంటి
పలికిన ప్రతిజ్ఞ చెల్లింపవలదె యిట్లు
వాఙ్నియమరూఢి నీయంతవాఁ డిఁకేఁడి" 48 ప. 1 ఆ. వి. వి.

అని రఘునాథనాయకుడు విజయవిలాసకృతిసమర్పణసందర్భమునందు అన్నట్లు చేమకూర వేంకటకవి చెప్పిన సంగతియే. "కృతులొకరి కీను మీకె యంకితము లంటి" ననుట వలన, విజయవిలాసము వలె సారంగధరచరిత్రమును రఘునాథనాయకునికే అంకితము.

రఘునాథనాయకుడు "కర్ణాటసింహాసనాధిరాజ్యభరణనిపుణగుణోద్దండబాహు దండజనితసాపత్న్యసంవాదజయరమామహీలలితకేళి" (21ప. 1ఆ.) "నేపాళనృపాల స్థాపనచణు"డు (62ప. 1ఆ.) "చోలగమానభంజ"నుడు (238ప. 3ఆ.) అని విజయ విలాసమునందు కలదు. ఈ విశేషణములు రఘునాథనాయకునికి 1616 వ సంవత్సరము నాటి తోపూరుయుద్ధము తర్వాత లభించునవి. కనుక విజయవిలాసము తదనంతరకాలికమగుట తథ్యము. సారంగధరచరిత్రము తత్పూర్వకాలికమగుట సంభావ్యము. కాఁబట్టి సారంగధరచరిత్రము రచనాకాలము 1615 ప్రాంతము, విజయవిలాసము రచనాకాలము 1618 ప్రాంతము, కావచ్చును.

సారంగధరచరిత్రము : ఇది ప్రథమతః గౌరన నవనాథచరిత్రమునందు కలదు. అది చేమకూర వేంకటకవి సారంగధరచరిత్రమునకు ఆధారము. అదిలోనే హంసపాదు అన్నట్లు అపశ్రుతి పడినది. నవనాథచరిత్రమునందు కథారంగము మాళవ దేశములోని మాంధాతృపురము. మాళవదేశాధిపతి రాజమహేంద్రనరేంద్రుడు. అతని

పట్టపుదేవి రత్నాంగి. భోగవతి చిత్రాంగి. రత్నాంగీరాజమహేంద్రుల కుమారుడు సారంగధరుడు. సారంగధరచరిత్రమునందు కథారంగము మాళవదేశములోని రాజమహేంద్రము. మాళవదేశాధిపతి రాజనరేంద్రుడు. అతనికి రాజరాజనరేంద్రుడు, రాజరాజు అని నామాంతరములు. అతని కులసతి రత్నాంగి. భోగస్త్రీ చిత్రాంగి. రత్నాంగీరాజరాజనరేంద్రుల కుమారుడు సారంగధరుడు. ఇందు మాళవదేశము మాఱలేదు. మాంధాతృపురము రాజమహేంద్రముగ మాఱినది. రాజమహేంద్రుడు రాజరాజనరేంద్రునిగ మాఱెను. ఇది మాళవదేశములోని మాంధాతృపురమునందు జరిగిన కథ, ఆంధ్రదేశములోని రాజమహేంద్రవరమునందు జరిగినదను జనశ్రుతి ప్రభావము. కాకనూరి అప్పకవి (1656) ఆంధ్రదేశములోని రాజమహేంద్రవరమునకు, రాజరాజనరేంద్రునికి ముడిపెట్టి ఆంధ్రశబ్దచింతామణికొఱకు అభూతకల్పనచేసెను. అది మొదలు మాళవదేశములోని మాంధాతృపురము మఱుగువడి, ఆంధ్రదేశములోని రాజమహేంద్రవరము రచ్చ కెక్కినది. సారంగధరమెట్ట వెలసినది. సారంగధరచరిత్ర సాహిత్యము బలిసినది. ఆంధ్రమహాభారతావతరణమునకు మాత్రమేగాక, ఆంధ్రసాహిత్యావతరణమునకే కారకుడైన, అమ్మంగదేవీభర్తయైన, అఖిలజగజ్జేగీయ మానవనానాగుణరత్నరత్నాకరుడైన, రాజమహేంద్రకవీంద్రసమాజకల్పతరువైన, రాజరాజ నరేంద్రుని శుభ్రకీర్తిచంద్రికలకు మషీరసకళంకాపాదనమను స్పృహ లేకపోవుట శోచనీయము.

చేమకూర వేంకటకవి సారంగధరచరిత్రము కథాప్రారంభమునందు రత్నాంగి, చిత్రాంగి "ఎలజవ్వను"లని కలదు.(6ప. 1ఆ.) అప్పటికి సారంగధరుడు జన్మింపలేదు. రత్నాంగీరాజనరేంద్రుల శైవవ్రతాచరణమున సారంగధరుడు జన్మించును. అతడు "యౌవనప్రాదుర్భావంబునఁ దేజరిల్లి", "సకలవిద్యాపారీణుండయ్యెను." (53వచ. 1ఆ) రాజనరేంద్రుడు సారంగధరుని "యౌవరాజ్యాభిషిక్తుని గావించి" (58ప. 1ఆ.) "పరిణయ మొనర్చెను. (61ప. 1ఆ.) అనంతరము వేటకు వేంచేయును. వేట చాలించి వనవిహారము సేయునెడ "సరసి చెంత బిసాగ్రంబు నరసి కొంత మగని కందిచ్చు కేకి ప్రేమఁ గని" (154ప. 2ఆ.) "చిత్రాంగిన్ లేజవ్వని మదిలోనిడి" విరాళి చెందెను. (159ప. 2ఆ.) అని చేమకూర వేంకటకవి చిత్రణము. చిత్రము. చిత్రాంగి సారంగధరుడు పుట్టకముందు ఎలజవ్వని. సారంగధరుడు యౌవరాజ్యపట్టాభిషిక్తుడైన తదుపరి కూడ ఎలజవ్వనియే! ఎలజవ్వని అన లేజవ్వనియే. త్రిదశత్వమునకైన చిత్రాంగి దేవవేశ్య కాదు. మానవవేశ్యయే. ఇది పూర్వోత్తరవిరోధము. ప్రామాదికము.

సారంగధరచరిత్రమునందు చిత్రాంగీసారంగధరుల సంవాదమునందు శ్లేషచమత్కారము కలదు. ఉక్తిప్రత్యుక్తి చాతుర్యము కలదు.

"ఈ విటు లెన్న చూచితె మహిన్నెఱజాణవు పల్లవీకుచే
ష్టానిరతానురాగయుతుండై తగ నెయ్యపు టాలమందలో

నా వగలెల్ల నగ్గలిక నారసి గైకొని యున్కి నో వయో
హావకళాభిరామజలజాంబకకేళివినోదవైఖరుల్." 76 ప. 1 ఆ.

ఇది చిత్రాంగి ఒక చిత్రపటమును చూపుచు వివరించినది. ఇందు "ఈవిటు" అను నెడ "ఈవు + ఇటు" అని, "ఈ+విటు" అని పదచ్ఛేదభేదములు. ఆలమందలోని గోపికల వగలెల్ల ఆరసి గైకొన్న కృష్ణుడు విటుడని, అతని, వలె నెఱజాణవు కావున తన వగలెల్ల గైకొని విటుడవు కమ్మని చిత్రాంగి ఆశయము.

"అల్లనగాధిరాజసుతుఁ డర్మిలి మేనక ముద్దొనర్ప రా
గిల్లి కుచంబు లానఁ దమకించుట గంటివె రాకుమార? యా
నల్ల నగాధిరాజసుతుఁడర్మిలి మేనక ముద్దొనర్ప రా
గిల్లి కుచంబు లానఁ దమకించుట బాల్యము గాదె మానినీ!" 79 ప. 2 ఆ.

ఇది చిత్రాంగి మఱొక చిత్రపటమును చూపుచు వివరించినది. ఇందు చిత్రాంగి ఉద్దేశించినది మేనకావిశ్వామిత్రుల శృంగారము. సారంగధరుడు ఉపలక్షించినది మేనకా మైనాకుల మమకారము. అల్లన + గాధిరాజసుతుడు అనగా విశ్వామిత్రుడు. మేనక దేవవేశ్య. ఆమె ముద్దొనర్ప = ముద్దుపెట్టగా విశ్వామిత్రుడు "రాగిల్లి కుచంబు లానఁ దమకించుట శృంగారచేష్ట. అల్ల + నగాధిరాజసుతుడు అనగా హిమవంతుని సుతుడైన మైనాకుడు. మేనక మైనాకుని తల్లి. ఆమె ముద్దొనర్ప = ముద్దుపెట్టగా మైనాకుడు "రాగిల్లి కుచంబులానఁ దమకించుట" బాల్యవిచేష్ట. అల్లన + గాధిరాజసుతుడు, అల్ల + నగాధిరాజసుతుడు అను పదచ్ఛేదముల వలని అర్థభేదము శ్లేషచమత్కారము.

"అతిమోహంబున మించు తల్లి నిట నీ కాసించియున్నా; నవా
రతసౌఖ్యోన్నతి చెందఁగోరి సుకుమారా, రాసుతా, యాత్మజా
కృతి న న్వేడుకఁ దేల్చుమీ తలఁపఁగా నేణీకిశోరాక్షి స
మ్మతి సారంగధరుండవయ్యు నలయింపన్ జెల్లునే?" నావుడున్. 92.
"అతిమోహంబున మించు తల్లి నిట నీ కాసించియున్నా వనా
రతసౌఖ్యోన్నతి చెందఁగోరి సుకుమారా, రా, సుతా, యాత్మజా
కృతి నన్ వేడుకఁ దేల్చుమంటివి; ధరిత్రిన్ "సత్యవాణీ సర
స్వతి "యన్ వాక్య మదేల తప్పు; నిజమే వాక్రుచ్చినా వియ్యెడన్." 93 ప. 2 ఆ.

చిత్రాంగి సారంగధరుని సుకుమారా! రాసుతా! అని సంబోధించినది. సుకుమారుడన అందగాడు. రాసుతుడన రాజుకుమారుడు. అందగాడని సంబోధించుటకు హేతువైన ఆమె అతిమోహము రతిమోహము. అనారతసౌఖ్యోన్నతి నిత్యరతిసౌఖ్యాతిశయము. సారంగధరుని మాట విఱుపున చిత్రాంగి సారంగధరుని సుకుమారా! రా! సుతా! అని సంబోధించినట్లయినది. సుకుమారుడన మంచికుమారుడని అర్థము. సుతుడన పుత్త్రుడని అర్థము. రా అనగా దగ్గఱకు రమ్మని అర్థము. ఈ అర్థముల చిత్రాంగి అతిమోహము పుత్త్రవ్యామోహము. అనారతసౌఖ్యోన్నతి నిత్యపుత్త్రసౌఖ్యాతిశయము. చిత్రాంగికి సారంగధరుడు పుత్త్రుడే. అందువలవ ఆమె నిజమే చెప్పినదని, "సత్యవాణీ

సరస్వతీ" అను వాక్యము తప్పదని సారంగధరుని సమర్థనము. "రాసుతా" అను సంబుద్ధిని "రా+సుతా" అను పదచ్ఛేదము వలన చిత్రాంగి ఆశయము చిత్తైనది. సారంగధరుని దారికి అడ్డమై నిలిచి పట్టుకొనబోయినది. సారంగధరుడు వారించిన మీదపడినది. అతని పట్టుదుప్పటి చేఁజట్టి పట్టుకొని, కూర్చుండఁబెట్టి, పకపక నగి, మన్మథునికి అప్పగించి ఎందు కదలెదవని హేతువాదము చేసినది. (99ప. 2ఆ.) సారంగధరుడు తల్లి దైవమని, పరభామలు తోఁబుట్టువులని బ్రతిమాలును.

"వలదమ్మా యిటువంటి కానిపని యో వామాక్షి, యీ వెఱ్ఱిబు
ద్ధులు నీ కేల ఘటిల్లెనమ్మ! తెగువన్ దుర్భాష లిట్లాడి యీ
కొల నా కేటికిఁ గట్టెదమ్మ; మఱి లోకుల్ విన్న నేమందు ర
మ్మ? లఘుత్వంబుగఁ జాతురమ్మ; తగదమ్మా ధర్మ మూహింపుమా"
103ప. 2 ఆ.

అయినను చిత్రాంగి పినతల్లిని కావని, భోగస్త్రీనని, "నే విడ నా కన్నులాన నినుఁ గూడకిఁకన్ అని తలుపు మూయఁబోయినది. సారంగధరుడు తల్లివని, అకృత్యము సేయబూనెదవని ఒక ప్రశ్న వేయును.

"ఇపుడు ధైర్యమూని యిసుమంత పుష్పకో
దండధరుని బాధ తాళ లేవు;
పాప మెంచి మీఁదఁ బటుకార్లఁ బట్టించు
దండధరుని బాధ తాళఁ గలవె?" ॥2 ప. 2 ఆ

ఇట్టి సుద్దులు చాలించుమని చిత్రాంగి వరూథినిని మించి వాదించినది.

"దారువవస్త్రీలఁ దగిలెఁ గాని యదేమొ
నీవలె ముక్కంటి నేరఁడయ్యె
గారాబుఁగూతురిఁ గవిసెఁ గాని యదేమొ
నీవలెఁ బరమేష్ఠి నేరఁడయ్యె;
అల యహల్యాకాంత వంటెఁ గాని యదేమొ
నీవలె జంభారి నేరఁడయ్యె
గురువి యిల్లాలితోఁగూడెఁ గాని యదేమొ
నీవలె మదురాజు నేరఁడయ్యె
వారికంటెను హెచ్చైనవాఁడ వౌర!
నీకుఁ గల బుద్ధి వారికి లేకపోయె
నీవు నాఁటికి లేకపోయితివి గాక
చేరి వారల యొజలు చెలుపలేవె?" 120 ప. 2ఆ

ఇందు స్వపక్షానుకూలసాక్ష్యమే కాదు; విపక్షప్రతికూలసోల్లుంఠనము కలదు. సారంగధరుని సమాధానము తదభ్యధికము.

"వావుడు నిట్లనున్ సుజనవాయకుఁ డీ వెడమాట లేల త
ల్లీ వినుమమ్మ యీ జగములెల్ల సృజింప భరింప నొంపఁ జా

దేవత లెట్లు వర్తిలిన చెప్పగా కని చెల్లె నొడ్లకున్
నీ విపుడెన్న రంభ, రతి, నీ గతిఁ బాత్రుల బల్మిఁ బట్టిరో?" 121 ప. 2 ఆ.

అనినను చిత్రాంగి ఆశ వదలక బ్రతిమాలి అతనికి,

"పరిరంభం బొనరింపురా, కరుణ నాపై నింపరా, యాలకిం
పర, యేరా యధరామృతం బొసఁగి నన్ మన్నింపరా యంచు దై
న్యరసం బుట్టిపడ న్నెలంత పలవంతం గొల్చెలం జిల్కి సొం
దరగంధమ్మతఁబాష్పధార కొనగోటన్ మీటుచున్ బల్కఁగన్. 130 ప. 2 ఆ.

సారంగధరుడు చిత్రాంగికి పట్టిన "వలరాచ గబ్బి బలుభూతము"ను వదలగొట్ట లేమని, ఆమె పట్టుకొన్న పైకోక విడిచిపెట్టి పోవునెడ, "ఆరోపింతును నాపై నేరము విపరీతముగను నీపై" అని,

ఔనా, పోయెదవా నమం గడచి? యేలా యింక నీతోడ నెం
తే నే మించఁగవాఁడ దక్కనిదిగో నీ యంగమచ్ఛాంబు నా
చే, నీ లోనని రాజ రానలెగదా! చెక్కింతు నీ కీలుఁ కీల్;
కానీ, యిందులకేమి తారునని కేలన్ జొమ్ము తాటింపుచున్" 139 ప. 2 ఆ.

పగ చాటి పలికినది. సారంగధరుడు ధారుణి మీద, ఆకాశాని మీద భారమునైని తన నగరున కేగును. ఇది చిత్రాంగీసారంగధరసంవాదము. మనుచరిత్రములోని వరూథినీప్రవరవృత్తాంతము వలె మనోజ్ఞము. రసాభాసమైనను రసవత్తరము.

చిత్రాంగి సారంగధరునిపై నిందారోపణము చేసి, ప్రాణత్యాగము చేయుదునని బెదరించి, మంత్రిమండలి ప్రతిఘటించినను, సారంగధరుని పట్టి చేలము చూపించి, రాజనరేంద్రుడు సారంగధరునికి కరచరణఖండన విధించునట్లు చేసెను. రత్నాంగి ఎంత మొఱపెట్టుకొన్నను, మఱెంత దుఃఖించినను కరచరణఖండనశిక్ష కార్యరూపము ధరించినది. కరచరణఖండితుడైన సారంగధరుని విలాపము కరుణరసనిర్భరము. అతడు పడు దురవస్థకు ఆత్మ సొగిలి తలవరులు కూడ సొరల మాటునకు పోయిరి.

"తలవరు లేగ లేగ పులితండము వెత్తత్తి గొలుకై హాహా
హాళి రాఁగ, లాఁగలయివట్టి వృకంబులు కోల్వాలుల్ రొదల్
చిలుకుచు నీఁగ, నీఁగలును జీములు దొంతర గాఁగఁ జైదుంబున్
బిలపిల మూఁగ, మూఁగ వలె బెగ్గిలి, నల్కఁగలేక నేడ్చున్. 117
సొమ్మసిలి, కొంతతడవునకుఁ
గ్రమ్మఱఁ దెలివొంది చూచి, కన్దెఱచి నమః
నమ్మిన వెవ్వరిఁ గానక
యుమ్మలిక మెసఁగ నను వాలాడంగన్. 118.

"అలఁత సహింపరాదు తెగటార్తురు రండిప్పు డెందుఁ బోతిరో
తలవరులార, మీరయిన దగ్గఱ వచ్చి వధించిపోవరో!
యలమట కోప నో మృగములార, యయో దుకీలలార! నన్
బొలియఁగ జేయరే నెతలఁ బొందఁగలేని కూయు నేమటున్. 119.

కుపితమానసుఁడై వృథా కోయఁ బనిచె
నకట! యిటువంటి కువిభుఁ డెందైనఁ గలఁడె?
కాలుచేఁ గోఁత పడలేక కడకుఁ దొలఁగఁ
గాలు చేఁ గోఁత పడఁజేసెగా లతాంగి! 120
దొరల చిత్తంబు లే కరణిఁ బాటిల్లుగా
యని తండ్రి యవివేకమునకు నడలుఁ
దరళలోచనల నే తటి నమ్మరాదుగా
యని పినతల్లి మాయలకుఁ దలఁకు
నేమిసేసితి నేర మిటు సేయ దేవుని
కిని బాడి లేదుగా యని గలంగుఁ
దొలిమేన నెవరి బాములను బెట్టితినొకో
యనుభవింపకపోనె యనుచు వగచు
సచివసుతు మాట నిజమౌట సారెఁ బొగడుఁ
గొంత సే పేడ్చుఁ జింతించుఁ గొంత ప్రొద్దు
శర్వ! శంకర! శశిధర! శరణు నాకు
నీవె యనుచును వాడుపు నొకింత తడవు." 121 ప. 3 ఆ.

సచివసుతుడన చిత్రాంగి మేడకు వెళ్ళుట ప్రమాదకరమని హితబోధ చేసిన సుబుద్ధి.

సారంగధరుడు విలపించునెడ, ఆకాశవాణి ఆతని పూర్వజన్మవృత్తాంతమును పూసగ్రుచ్చినట్లు చెప్పును. అది పూర్వజన్మదుష్కర్మవలన దురవస్థ వాటిల్లెననుటకు మాత్రమేగాక, పౌరుల మాటునకు పోయిన తలవరులు విని, రాజనరేంద్రునికి సారంగధరుడు నిర్దోషి అని తెలుపుటకును వేంకటకవి కూర్చు. తలవరుల మాట విని రాజనరేంద్రుడు చిత్రాంగిని నిజము చెప్పుమని బెదరించుట, రత్నాంగి తలవరులకు లంచమిచ్చి అట్లు చెప్పించినదని చిత్రాంగి ఆకాశవాణిని అధిక్షేపించుట, ఆకాశవాణి చిత్రాంగి కపటత్వము, సారంగధరుని నిర్దోషిత్వము ప్రకటించుట, రాజనరేంద్రుడు చిత్రాంగిని కూపమునందు పడవేయించుట, రత్నాంగీరాజనరేంద్రులు సారంగధరుని వెదుకఁబోవుట, ఆకాశవాణి సారంగధరుని క్షేమవార్తను తెలుపుట నవనాథచరిత్రమునందు లేదు. చేమకూర చేర్చు. మత్స్యేంద్రనాథుడు కరచరణఖండితుడైన సారంగధరుని యొద్దకు వచ్చుట, యోగాభ్యాసము ద్వారా సారంగధరునికి కరచరణములు వచ్చునట్లు చేయుట, కరచరణమండితుడైన సారంగధరుడు చౌరంగినాథుడగుట మాత్రమే నవనాథచరిత్రమునందు కలదు. నవనాథులలో ఒకడైన సారంగధరుడు తల్లిదండ్రుల యొద్దకు వచ్చుట వారికి జ్ఞానమార్గమును తెలుపుట, మత్స్యేంద్రనాథుని సన్నిధికి మరల పోవుట నవనాథచరిత్రమునందు లేదు. చేమకూర వేంకటకవి కల్పనమే.

సారంగధరచరిత్రలోని వేటవర్ణనము (77-167ప. ఆ.) సూర్యోదయ, చంద్రోదయ వర్ణనములు (160-165ప. 2ఆ.) విరహవర్ణనము (166-186పచ. 2ఆ)

సూర్యాస్తమయ, చంద్రాస్తమయ, సూర్యోదయ వర్ణనములు (187-190ప. 2ఆ.) అరణ్య వర్ణనము (107పద. 3ఆ.) చేమకూర వేంకటకవి స్వీయకవితలే.

"ద్రోహమె నీతిగాఁ దలఁచి దుర్మదుఁడై కనుగాన కాత్మస
త్రీహరణం బొనర్చినని దేవగురుండు శపింపగాఁ జామీ
యా హరిణాంకుఁ డిట్లు తునురాయెనటంచన, జారచోరు లా
త్సాహము పీఁకగా వ్యుడు తారకముల్ వెసెన్ వనంబునన్" 16ప. 2 ఆ.

ఇందు చంద్రుని దుర్నీతి, దుర్మదము నిరసింపబడుట గమనార్హము.

సారంగధరచరిత్రము సత్కావ్యము మాత్రమే కాదు; రసవత్కావ్యము కూడ. విజయవిలాసముతో పోల్చినపుడు మాత్రమే చేమకూర పాకమున పడలేదను మాట చెల్లును.

విజయవిలాసము : ఇది చేమకూర వేంకటకవి మహాకావ్యము. దక్షిణాంధ్రయుగము లోని మహాకావ్యము. పిల్ల వసుచరిత్రముగ వ్యవహృతము. కాని, పిల్ల వసుచరిత్రములందు పెద్ద పిల్ల వసుచరిత్రము. చేమకూర పాకమున పడిన, చేవ కల, జీవకళ ఉట్టిపడు కావ్యకళాఖండము. కవిత వెలుగురేఖలు వెల్లివిరిసిన కమనీయ కావ్యము. తెనుగుమడికారము తేనెసోనలు కురిసిన మధురకావ్యము. సామెతలు ఆమెతలైన అమృతకావ్యము. శ్లేషాలంకారము భాషాలంకారమైన సరళకావ్యము. ప్రతిపద్యచమత్కృతి అతిప్రాధాన్యపురస్కృతి అయిన ప్రౌఢకావ్యము. శృంగారరసము గంగాలహరి అయిన సరసకావ్యము.

విజయుడన అర్జునుడు. ఉలూచిని, చిత్రాంగదను, సుభద్రను వివాహమాడుట అతని విలాసము. అందువలన విజయవిలాసము. ఇతివృత్తమిది నన్నయ భారతమునందు కలదు. అది నిమిత్తమాత్రముగ గైకొని స్వకపోలకల్పనమున ప్రపంచీకరించుట మాత్రమే గాక, ఒక ప్రత్యేకసరణిని చేమకూర వేంకటకవి రచించుట విశేషము. నన్నయ భారతము నందు అర్జునుడు తీర్థయాత్రలకు బయలుదేరుటకు హేతువు. కేవలము సమయభంగదోషనివారణార్థమైన ద్వాదశమాసికవ్రతము మాత్రమే. అనేక తీర్థయాత్రలు చేసి, ఆఖరికి ద్వారకను సమీపించి, శ్రీకృష్ణుని సందర్శించి "జన్మంబు సఫలంబు సేయుదు" నని తలంచి, "అదియునుంగాక మున్ గదుఁడనువానిచే వింటిఁ దిలోత్తమ కంటె రూపవతియట్టి సద్గుణాన్వితయట్టి నా కట్టి భద్రేభగమన సుభద్రఁ జూచు వేడుకయును గలదు, విఘ్నభట్టారకు దయ నభీష్టసిద్ధి దనరు" నని భావించినట్లు కలదు. (164ప. 8ఆ. ఆ. స.) విజయవిలాసమునందు ముందే ధర్మరాజునకు గదుడు ద్వారకలోని వార్తలు చెప్పుచు, కన్నెల చక్కదనము లెన్నుచు, సుభద్రను లోకోత్తరసుందరిగా పొగడుట (32-41ప. 1ఆ.) విని, అర్జునుడు "డెందమునందుఁ బట్టజాలని యనురక్తి నవ్వరవిలాసిని నెన్నఁడు చూడఁగల్గునో యని తమకించు సమయంబున ....దైవికంబుగ" సమయభంగము వాటిల్లిన తీర్థము స్వార్థము కలసి

వచ్చునట్లు తీర్థయాత్రలకు పరిణయమౌట కేఁగు గతి" బయలుదేరినట్లు (43-46ప. 1ఆ.) కలదు. ఇది కావ్యోచితము. భారతము నందు అర్జునుడు నాగలోకమున ఒక్క రాత్రి గడిపినట్లు (134వచ.8ఆ.ఆ.ప.) మాత్రమే కలదు. ఉలూచిని వివాహ మాడినట్లు లేదు. విజయవిలాసమునందు వివాహమాడినట్లు కలదు. (105ప.1ఆ.) ఇది కథోచితము.

ఉలూచీపరిణయము ప్రథమాశ్వాసమునందు ఏబదియేడు పద్యములందు కలదు. (58-114) అర్జునుని ఉలూచీపరిణయస్మరణము పంద్రెండు పద్యములందు కలదు. (116-127) మొత్తము అరువది పద్యములు. చిత్రాంగదాపరిణయము ప్రథమాశ్వాసమునందు ముప్పది యొక్కపద్యములందు కలదు. (3-41) మొత్తము డెబ్బది పద్యములు. సుభద్రాపరిణయము ప్రథమాశ్వాసమునందు నలుబది పద్యములందు (3-42) ద్వితీయాశ్వాసమునందు నూటయిరువదియేడు పద్యములందు (77-203) తృతీయాశ్వాసమునందు రెండువందల ముప్పదియైదు పద్యములందు కలదు. మొత్తము నాలుగువందలరెండు పద్యములు. కారణము సుభద్రాపరిణయము ప్రధానేతివృత్తము. ఉలూచీపరిణయము, చిత్రాంగదాపరిణయమును అనుషంగికేతి వృత్తములు. నంద వృత్తాంతమును అనుషంగికేతివృత్తమే. కాఁబట్టి అప్పకవి విజయ విలాసమునందు (25ప. 3ఆ.) అనియేగాక, సుభద్రాపరిణయమునందు (20ప. 1ఆ.) అని కూడ పేర్కొనుట సుసంగతమే.

ఉలూచీపరిణయమునందు ఉలూచియే సవ్యసాచిని వలచినది. అతని శిరోజములు, వదనము, కనుబొమలు, కన్నులు, చేతులు, బాహువులు, ఱొమ్ము, దరహాసములు, చూపులు, గళరేఖలు వర్ణించుకొని,

"ముద్దాడవలదె యీ మోహనాంగుని మోము
గండచక్కెరమోవి గల ఫలంబు?
రమియింపవలదె యీ రమణు పేరురముపై
వలిగుబ్బపాలిండ్లు గల ఫలంబు?
శయనింపవలదె యీ ప్రియుని సందిటిలోనఁ
గప్పు పెన్నెఱికొప్పు గల ఫలంబు?
పసియింపవలదె యీ రసికు నంకమునందుఁ
జెలువంపు జఘనంబు గల ఫలంబు?
రాజసము తేజరిల్లు నీ రాజుగూడి
యింపు పొంపులు వెలయఁ గ్రీడింపవలదె
నాకలోకంబు వారలకైన లేని
యలఘుతరభోగభాగ్యముల్ గల ఫలంబు ! 136 ప. 1ఆ.

అని ఉవ్విళ్లూరి, గంగాతటమున జపతత్పరుడైన అర్జునుని తన భోగవతీ పురమునకు తీసికొనిపోయినది. జపము చాలించి, కన్నులు విచ్చి చూచిన అర్జునుడు నివ్వెఱపడి, ఉలూచిని చూచి, "వధూమణి యెవ్వరిదానవీవు? పేరెయ్యది నీకు? వొంటి

వసియింపఁగఁ గారణమేమి?" అని ప్రశ్నలు వేయును. అన్ని ప్రశ్నలకు సమాధానము లిచ్చి, ఉలూచి "సరిలేని విలాసముఁ గని వరియించిటఁ దోడుకొని వచ్చితి"నని తన వాంఛను వాచ్యముగ తెలుపును. అర్జునుడు ఉలూచి అందచందములు వర్ణించుకొని, కాముకుడను కాను, వ్రతిని, తగవా?" అని పలుకును. ఉలూచి,

"నిను గీతిసాహితీమో
హనవాణులు సెవులు పట్టి యాడింపంగాఁ
గనియుండి "కాముకుఁడఁగా
నని" పల్కిన నాకు నచ్చికొనె నృపాలా!" 155 ప. 1 ఆ.

అని, నాతి నలంచుట న్యాయము కాదని, ద్వితీయగ ఏలుకొమ్మని అద్వితీయముగ పలుకును. అర్జునుడు "అనుచితము తగునె? పరసతి నెనయుట రాజులకు ధర్మమే?" అనిన, ఉలూచి తన వినుకలిప్రేమను, కనుకలి ప్రేమను వివరించి పెండ్లి చేసికొమ్మని ప్రాధేయపడును. ఉలూచి విన్నఁబాటుదనము, కన్నుఁగవఁ గ్రమ్ము బాష్పములు, గళమున గనిపించు గద్గదిక ముప్పిరిగొన్న వలవంతను దెలుప కరగిపోవును. వివాహమాడును. ఉలూచీవిజయులకు ఇలావంతుడు జన్మించును.

చిత్రాంగదావరిణయమునందు అర్జునుడే చిత్రాంగదను వలచును. అనేకతీర్థయాత్రలు చేసి, మలయధ్వజుని పురము సమీపించునెడ అర్జునుడు సఖీసమేతముగ జలకేళి సల్పి వనవిహారము సేయు చిత్రాంగదను చూచి, ఆమె సౌందర్యమునకు, ముగ్ధుడగును.

"ఈ వెలంది యొడల్ పైఁడిలో వెలంది,
యీ నెలంత లలాటంబు లేనెలంత
యీ సుపాణి రదశ్రేణియే సుపాణి,
ఈ బిడారు మృగీమదశ్రీ బిడారు" 195 ప. 1 ఆ.

ఇత్యాదిగా వర్ణించుకొని, "కన్గొంటె విశారదా" అనిన, నర్మసఖుడైన విశారదుడు, ఆమె మలయధ్వజుని గారాబుపట్టి చిత్రాంగద అని తెలుపును. అర్జునుడు వలపు మీఱి విశారదుని మలయధ్వజుని కడకు తన రాక తెలుపుమని పంపును. మలయధ్వజుడు అర్జునుని రాక విని స్వాగతసత్కారములు సమాచరించును. అంతేకాదు. అర్జునుని చూచి, "ఈఁడు లేని నా కూఁతునుం దొఱయఁజాలిన వాఁ డితఁడల్లుఁడైనఁగా, మిక్కలి కీర్తి గల్గునని" మనసులో తలపోయును. ప్రసంగవశమున విశారదుడు "అర్ణవపతితోడ బాంధవమొనర్చిన మాధవు లీల బాంధవమొనరింపఁ జిత్తమిడినారు" అని తెల్పగా, చిత్రాంగదార్జునులకు పుట్టిన పుత్త్రుని తనకిచ్చు నిబంధన సమ్మతించిన, వివాహము సేయును. చిత్రాంగదార్జునులకు బభ్రువాహనుడు జన్మించును.

సుభద్రావరిణయమునందు సుభద్రార్జునులు వరస్పరము వలతురు. ప్రభాసతీర్థమున క్రీడించు క్రీడి,

"ద్వారకాపుర మచటికిఁ జేరువమచుఁ
జెప్పఁగా విని కడు సంతసిల్లి, కలదు
గా యిఁక సుభద్రరూపరేఖావిలాస
విభ్రమంబులు గనఁ జాడ్కి విందు కాఁగ" 77 ప. 2 ఆ.

అని తలంచును. యాదవులు యతులకు విధేయు లగుదురని యతివేషము ధరించును. బలరాముడు అనుకూలుడు కాడని, అఘటనఘటనాచతురుడు హరి కలడని స్మరించును. కృష్ణుడు ప్రత్యక్షమగును. రైవతకాద్రికి తీసికొనిపోయి నిలుపును. ద్వారక చేరి, రైవతకాద్రిమహోత్సవమును ప్రకటించును. అచటికి సుభద్ర వచ్చును. అర్జుని పతిగా కోరి, రైవతకాద్రిదేవతకు పూజసేయును. సుభద్రను చూచి అర్జునుడు సుభద్ర సౌందర్యమును వర్ణించుకొనును. కృష్ణుడు బలరాముని ఒప్పించి, సుభద్రను యతిసేవకు నియోగించును. కపటయతిని కన్యాంతఃపురవనములోని భవంతియందు విడిదిచేయించును. సుభద్ర శుశ్రూష సేయును. అర్జునుడు శృంగారచేష్టలు సేయును. అవి నిగూఢమార్మికతానిపుణములు.

"కరము సాఁచి నవాంబుకలశ మీ విడివడ్డ
కుంకుమాంకపు ముద్దుఁజంక మెఱపు
నవలుదేఁ బోఁగాల్గఁ బెనఁగు నంచ నదల్పఁ
జూచు జంకెన వాడిచూపు బెళుకు
పూరెమ్మ వంచుచోఁ జాఱు పయ్యంటఁ దాఁ
గిలిమూఁత లాడు గుబ్బల బెడంగు
'పొలఁతి కాయో, పండొ, పోయిన పని'యన్న
చిలుక మాటకు నవ్వు పొలపుఁ దేట
మఱియు మఱియును జూడనే మనసు వాఱి,
వారి కుసుమఫలంబులు దేరఁ బనుచుఁ
దొలుతటివి చాలవని యా వధూలలామ
వేమవఁగవచ్చు వివ్వచ్చు నేమ మింక!" 141 ప. 2 ఆ.

అర్జునుడు జలము, పుష్పములు, ఫలములు మఱల మఱల తీసికొని రమ్మనుటకు హేతువు అవసరము కాదు. మఱల మఱల తెచ్చి జలము పోయునపుడు దోర్మూలరుచి, పువ్వులు తేఁబోవునపుడు తీక్ష్ణదృగ్విలాసము, పూరెమ్మ వంచునపుడు స్తన సౌందర్యము, చిలుక కాయో! పండో అన్నప్పుడు ప్రసరించు దరహాసచంద్రిక మఱల మఱల చూడవలయునను తమకము మాత్రమే. అది సుభద్రకు తెలియదు. అట్లే చేయును. అర్జునుడు లొట్టలు వేయును. ఇట్టి చేష్ట లింకను కలవు. (142-143ప. 2ఆ.) అర్జునుడు మోహాతురుడై మఱికొన్ని వికారములు సేయును. (145-149ప. 152-156ప. 2ఆ.)

"చెలువ, నిను రాజకీరంబు చెట్ట పట్టెఁ
గలికి, నిను రాజహంసంబు కాలు ద్రొక్కె

మంచి శకునంబు లివి; నాదు మాటఁ జూడు
కన్నె, యాలోనఁ బెండ్లి కాఁగలదు నీకు" 158 ప. 1 ఆ.

అని శకునశాస్త్రఫలితమును కూడ చెప్పును. రాజకీరము, రాజహంసము తానే. చెట్టు పట్టుట, కాలు ద్రొక్కుట పెండ్లియే. ఇది కూడ సుభద్రకు తెలియదు. "వీరు నాఁగ మహాత్ముల్, తన చేసిన సేవకుఁగా మన మలరి వచింపి" రని తలంచినది. ఇంతవఱకు మాటాడని సుభద్ర పాండవుల క్షేమసమాచారమును అడుగును. అందు,

"ఎగుబుజంబుల వాఁడు మృగరాజమధ్యంబుఁ
బిడికి పుచ్చుకొను నెన్నడుము వాఁడు,
నెఱి వెండ్రుకల వాఁడు, నీలంపు నికరంపు
మెఱుఁగుఁ జామనచాయ మేని వాఁడు
గొప్పకన్నుల వాఁడు, కోదండగుణకిణాం
కములైన ముంజేతు లమరు వాఁడు
బవిరిగడ్డము వాఁడు పన్నిదం బిడి డాఁగ
వచ్చు నందపు వెన్నుమచ్చ వాఁడు
గరగరని వాఁడు నవ్వుమొగంబు వాఁడు
చూడఁగలవాఁడు మేలైన సొబగువాఁడు
వాని మేనత్తకొడుకు కావలయు నాకు
నర్జునుండు పరాక్రమోపార్జునుండు." 164 ప. 2 ఆ.

అని వర్ణించును. సుభద్ర ఆంతర్యము గ్రహించిన యతివేషధారి అర్జునుని చూచితినని చెప్పును. సుభద్ర ప్రశ్నోపప్రశ్నలు వేయును.

"నీకై తపంబుఁ జేసెద
నీ కైవడి; దాచనేల? యే నర్జునుఁడన్
లోకోత్తరశుభలగ్నం
బో కోమలి నేఁడు కోర్కు లొడఁ గూర్చగదే." 175 ప. 2 ఆ.

అని యతివేషధారి అనగానే, సుభద్ర సిగ్గున దిగ్గున లేచి పోఁబోవును. సవ్యసాచి చేసాచి ఆమె చేయి పట్టుకొనును. "పెద్దలున్నా రెఱిఁగి వారె పెండ్లి సేయఁగలరని" చెప్పినను వేగిరపడు అర్జునుని విడిపించుకొని సుభద్ర అంతఃపురమునకు వెడలిపోవును.

అర్జునుని విరహతాపము విజృంభించును. సుభద్ర విరహవేదన అతిశయించును. అష్టమహిషులు పరిహాసము చేయుదురు. చెలికత్తెలు శీతలోపచారములు సేయుదురు. మన్మథ, మారుత, చంద్ర, కోకిలాదులను ఉపాలంభింతురు. కృష్ణుడు బలరామునికి తెలియకుండ వివాహప్రయత్నము సేయును. కారణము "తన శిష్యుండని దుర్యోధనునకు నీఁ దలఁచి పమ్మితపడడు." అందుకు పశుపతి పూజ చేయించును. వివాహసన్నాహము సాగును. వివాహము జరుగును. సుభద్రార్జునులు ఇంద్రప్రస్థమునకు బయలుదేరుదురు. 'పృథుశ్రవసుఁ డేలికగా కల ప్రోలికాపరులు' బలరామకృష్ణులచేత

మాటవచ్చునని అడ్డగింతురు. సుభద్ర తేరు నడప అర్జునుడు యుద్ధము సేయును. విజేతలై సుభద్రార్జునులు ఇంద్రప్రస్థమున ప్రవేశింతురు. అది తెలిసి బలరాముడు "ఉదగ్రమహోగ్రహవ్యగ్రు"డగును. శ్రీ కృష్ణుడు శాంతింపజేయును. బలరామాదులు సమస్తవస్తుధనసందోహముతో ఇంద్రప్రస్థమునకు వత్తురు. సుభద్రార్జునుల వైవాహికోత్సవము జరుగును. శృంగారము పొంగారును. సుభద్రార్జునులకు అభిమన్యుడు జన్మించును.

సుభద్ర నాయిక. ఉలూచి, చిత్రాంగద ఉపనాయికలు. సుభద్ర శ్రీకృష్ణుని సోదరి. సాత్త్వికప్రవృత్తి సమకూరినది. మేనత్తకొడుకును ప్రేమించి మూగనోము పాటించినది. ఉలూచి నాగకన్య. రాజసప్రవృత్తి సంక్రమించినది. స్వయముగ వలచి సాధించినది. చిత్రాంగద రాకుమారి. తామసప్రవృత్తి తటస్థించినది. తండ్రి మాటకు తల ఆడించినది. ముగ్గురు మూడు విధములు. మూసకట్టు పాత్రలు కావు. వైవిధ్యము కలదు. ముగ్గురి వర్ణనలు మూడు విధములు. అచ్చుకట్టు వర్ణనలు కావు. సుభద్రవర్ణన తారతమ్యానుసారము. ఉలూచి వర్ణన కవిసమయానుసారము. చిత్రాంగదవర్ణన యమకానుసారము. ఇది ప్రాధాన్యవివక్ష. సుభద్ర అర్జునుని సూత్రప్రాయముగ వర్ణించును. ఒక్క పద్యము. ఉలూచి భాష్యప్రాయముగ వర్ణించును. ఏడు పద్యములు. చిత్రాంగద వర్ణించదు. ఇది కూడ వారి ప్రవృత్తులకు అనుగుణమే.

**కవితారీతులు** : రఘునాథనాయకుని కృతుల గుఱించి చేమకూర వేంకటకవి కతపత్రము కలదు. పూర్వోదాహృతము. మఱి చేమకూర వేంకటకవి కృతుల గుఱించి రఘునాథనాయకుని కతపత్రములు కలవు.

"వాసించుఁ గవిత చెప్పిన
వీసరవోదొకట- " 49 ప. 1 ఆ.
ప్రతిపద్యమునందుఁ జమ
త్కృతి గలుగం జెప్పనేర్తు; వెల్లెడఁ బెళుకొ
కృతి వింటి మపారముగా
క్షితిలో నీ మార్గమెవరికిన్ రాదు సుమీ" 50ప. 1 ఆ.

చేమకూర కవిత చెప్పిన వీసరపోకుండ వాసించును. వ్యంగ్యవాసన వ్యాపించును. ప్రతిపద్యమునందు చమత్కారము పరిఢవిల్లును. కృతి అంతట, అన్నిట ప్రకాశించును. అన్యకృతులు ఏకదేశఫలసిద్ధులు. చేమకూరకృతులు సార్వత్రికఫలసిద్ధులు. అంతట అనుటలోని ఆంతర్యమిది. అన్నిట అనగా శబ్ద, అర్థ, భావ, రస, అలంకార, శయ్యాదు లన్నిట అని అర్థము. కాఁబట్టి చేమకూర మార్గము అనితరసాధ్యము. ఇది సారంగధర చరిత్రమునందు ప్రయాణపతాక. విజయవిలాసమునందు విజయపతాక.

ప్రతిభాషకు ప్రత్యేకమైన పలుకుబడు లుండును. అవే జాతీయములు. అవి కవితారసప్రవాహమునందు కలువపువ్వులు. అట్టి కలువపువ్వులు చేమకూర కృతులందు అనేకము.

సా.చ: మాడెత్తుమాట (1-56) డేగపదును (1-77) పటుకార్లం బట్టించు (2-124) ఏటావలి గిలిగింతలు (2-164) మూసిన ముత్తెము (3-53) ఎండకన్ను, వానకన్ను (3-87)

వి.వి: ఏనుగుపాడి (1-54) త్రోసిరాజా (1-102) రాకొట్టు (1-130) పూసఁగ్రుచ్చిన (2-79) నూట వేయింట నొకటి (2-109) వలపు వడ్డికిఁ బాఱ (2-171) మీసాలలో నవ్వులు (3-85) తొట్టెడు బాష్పములు (3-135) చేతికిఁ గన్నులు (3-154)

ప్రతిభాషలోను సామెతలుండును. అవే వార్తలు. అవి కవితారస ప్రవాహము నందు తామరపువ్వులు. అట్టి తామరపువ్వులు చేమకూర కృతులందు అనేకము.

సా.చ: కుత్తుకన్ విషము నాలుక బెల్లము వెట్టి యాడుటల్ (1-23) ఏనుఁగు పోవు వీధి సింహము మెడగంట యెవ్వరొరయంగలరు. (1-100) వంగడమున కెల్ల సొడ్డనినఁ గాదటు చిన్నవాఁడ వేర్పడితి నటన్న (2-109) గాలి గల యప్పుడె తూరుపు పాఱఁబట్టు మన్నట్టి ప్రకారము (2-169) ఘుటిక మ్రింగిన సిద్ధుని యటుల (3-164) పిచ్చుకుంటు మీఁద భాగీరథి వచ్చె" (3-176)

వి.వి: వంటయింటి కుందే లిది యెందుఁబోఁగలదు (1-71) ఏటికి వచ్చెనమ్మ యీ పిలువని పేరటంబు (1-78) ఈఁతకు మిక్కిలి లోఁతు గల్గునే (1-167) మోక్షము నకుఁబోవ మొసలెత్తుకొనిపోయెడు నను వార్త (2-43) చేసినయది జపమున్ వేసినయది గాలము (2-135) ఈఁదాడన్నను (మదనుఁడు) కోఁదాడనువాఁడు (2-192) మనమున నున్నది మొగమునఁ గనిపించును (3-27) విండ్లమ్ములు గలవారికిఁ దోడు చల్లకడవల వారే. (3-44) దొరకు సన్యాసి యను మాట (3-162.)

తెనుగు నుడుల తీరుతీయములు తెనుగు నుడికారము. అదే మృదుమధురశైలి. అది కవితారసప్రవాహమునందు ఆంతరాళికధార. అట్టి ధారాశుద్ధి చేమకూరకృతులందు ధారాళము. సారంగధరచరిత్రమునందు కంటె విజయవిలాసము నందు విశిష్టము.

సా.చ: "బిసబిస వాలుకీలుజడ పిక్కలుఁ ద్రొక్కుచు వెన్నడింపఁగా
మిసిమిపిసాళిగుబ్బచమమిట్టలు పయ్యెద నుబ్బ నెత్తఁగా
నసురుసురై యలంతినడు మల్లలనాడఁగ ముందుముందుగా
నొసపరి బాగులాడి యపుడొక్కతె వచ్చి నృపాలు తోడుతన్." 38ప. 1 ఆ.
"కలికి పిసాళి వాలుఁదెలిగన్నులపై నిడ నేల కెంపు? నా
పలుచని మోవికెంజిగురుపై విడరా నెఱజాణ, నాయెదన్
నిలువఁగ నేల గోళ్లు? బలు నిబ్బరపుబ్బురపుబ్బు గబ్బి గు
బ్బలపయి విల్తురా మగుణ పైపయి రేపకు కోపతాపముల్." 125ప. 2 ఆ
"ఆడలకుమమ్మ, నీవు కలవైవమ రాజాను దూఱకమ్మ, యే
యెడల సపత్నిలోఁ జెలిమి యుంచుక దప్పకుమమ్మ నాదు పం
గడిఁ జరియించు నాదు చెలికాంద్రను నావలెఁ జూడవమ్మ, యిం
పడరఁగ నన్నిఁకన్ మఱవవమ్మ విచారము మాని మానినీ" 96 ప. 3.ఆ.

వి.వి: "ఆణిమెఱుంగుముత్తెపుటొయారపు మ్రుగ్గులు, రత్నదీపికా

శ్రేణులు, ధూపవాసనలు, హృద్యనిరంతరవాద్యఘోషముల్
రాణఁ బొసంగఁ బ్రోలు మిగులం గమనిందొనరించు, నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణమునై జమలెల్లరు నుల్లసిల్లఁగన్." 83 ప. 1 ఆ.
"చందురుకావిపావడపిపాళిరుచుల్ పరిగంచు చీరపైఁ
జిందులు ద్రొక్క, వేణి కటిసీమపయిన్ వటియింప, జాళువా
యందెలు మ్రోయ, జంటిజవికంటి చమంగవ పిక్కటిల్లగా
జందవగంధి వచ్చె రభసమ్మున నమ్మవిరాజు సేవకున్." 130 ప. 2 ఆ.
"చెల్లెల, లెస్సలా? పెరటి చెట్టుగ నాటిన పారిజాత ము
త్పుల్లనవీనసూనములతో విలసిల్లుచునున్నదా? సదా
యుల్లము దాని మీఁదటనె యుండును నా కది ప్రాపుఁ బ్రోపుఁ బు
ట్టిల్లును జొచ్చినిల్లునయి వృద్ధి యొసంగెడు నీకు నెంతయున్." 128 ప. 3 ఆ.

ఇట్లు పలుకునుడికారము కులుకుసింగారము కోటికి పడగలెత్తించునవి చేమకూర కృతులు. అంతేకాదు. చేమకూరకృతులందు ప్రధానమైనది ప్రతిపద్యచమత్కారము. అది శబ్దాలంకారములను, అర్థాలంకారములను ఆశ్రయించినది. "సవ్యసాచి వింద్రోపలరోచిఁ జూచి తలయూచి యులూచి రసోచితంబుగన్" (128ప. 1ఆ.) వంటి వృత్త్యనుప్రాస కంటె యమకముల గమకములు సమధికము. యమకము ఆదిమధ్యాంతభేదమున త్రివిధమని చమత్కారచంద్రికయందు కలదు. (13శ్లో. 6వి.) చేమకూరకృతులందు ఆదియమకము విరళము. మధ్యయమకము బహుళము. అంత్యయమకము క్వాచిత్కము.

పా.చ: "రాజశిఖామణి పూజలు
రాజశిఖామణి యొనర్చి రమ్యదళాళిన్
రాజీవకుముదచంపక
రాజీ వకుళాదికుసుమరాశుల వేడ్కన్." 18 ప. 1 ఆ.
"సారంగనయన తన మన
సారంగను గౌఁగిలించి యలరఁగ విభు డీ
సారంగధరునిఁ గూర్పఁడె
సారంగధరుం డటంచు సారెం గలఁగున్." 40 ప. 2 ఆ.
"తన యాత్మకు వేఁగాయెనె
తనయా యిపు డెంతసేసె దైవమయో నీ
తనయా యిఁక నెటులఁ దరిం
తనయాప్తిని నే నభాగ్యనగు జింతనయా." 101 ప. 3 ఆ.

వి.వి. "రాకొమరు నెలలు వీలపు
రాకొమరు నిరాకరించు రాకాచంద్రున్
రాకొట్టు మొగము, కెంజిగు
రాకుఁగవి సరాకు సేయు నౌర! పదంబుల్." 130 ప. 1 ఆ.

"సైకము నడుము, విలాసర
సైకము నెమ్మొగము, దీవి మృదుమధురోక్తుల్
సైకముఁ దెగడు న్ననలా
సైకములో నెల్ల మేలు బంతిది బళిరా". 107 ప. 2 ఆ.
"మంచి మగఁడు నలయు నంచుఁ గోరుచుమండ
మంచి మగఁడు గల్గె మఘవసుతుఁడు
మన సుభద్ర సుకృతమహిమ యేమనవచ్చు
మనసు భద్రమయ్యె మనకు నెల్ల" 88 ప. 3 ఆ.

ఇవి ఆదియమకములు. ఇక మధ్యయమకములు:

| | | |
|---|---|---|
| సా. చ: | చూడు మెలనాఁగ యల చంద్రచూడుఁ డరయ | 14 ప. 1 ఆ. |
| | ఉ1 య్యాలో జంపాలో యనుచు నాలోలాక్షుల్. | 48 ప. 1 ఆ. |
| | తే1 రేపు మాపు బాపు రేపు మాపు | 41 ప. 2 ఆ. |
| | ఈ1 కటికి మనము పులినకటికి మనము | 69 ప. 2 ఆ. |
| | నూనమైనట్టి మైల మైనూన నేల? | 200 ప. 2 ఆ. |
| | గజ1 గామిని యలుకార్పఁ దరము గామిని నృపతి | 215 ప. 2 ఆ. |
| | వేఁడి? వేఁడి? యనుచు వేఁడి వేఁడి | 79ప. 3 ఆ. |
| | కోదండధరుం డదేమొకో దండమనియెన్. | 145 ప. 3 ఆ. |
| | కలకల వగి దిశలు పక్షికలకల మెసఁగెన్. | 196 ప. 3 ఆ. |
| | కానరే యని వెదకి రక్కానలోన | 236 ప. 3 ఆ. |

వి. వి: నలినలీల పంచు నలినలి గావించు
నించు మించులాడు వించు మించు
లేమ నగవు జూపు లేమన నగు బాపు
జగ మెఱుంగు దాని జగ మెఱుంగు 101 ప. 1 ఆ.
అమ్మకచెల్ల! నా హృదయ మమ్మకచెల్లదు నీని కియ్యెడన్ 135 ప. 1 ఆ.
ఏ1 మందము మందయానముఖ మందము మీఱు నవారవిందమున్
214 ప. 1 ఆ
మంగళసూత్రంబు చతురిమం గళసీమన్. 22 ప. 2 ఆ.
గరగరి కల లోఁ గొనివారో చంద్రకలలో వీరల్. 70 ప. 2 ఆ.
మున్నతిభక్తిఁ బూజలు సమున్నతిఁ దా మొనరించి 97 ప. 2 ఆ.
పట్టి కరాబ్జము లలాటపట్టిక చెమటల్ 178 ప. 2 ఆ.
కమ్మని విలుకాని దొరవు కమ్మని నెలఁ బై 48 ప. 3 ఆ.
అందయుండంగ నందియమందనేల 139 ప. 3 ఆ.
అ1త్యంతరుషాకషాయితహృదంతరుఁడై చలపించె 160 ప. 3 ఆ.
మూడులు మూఁడగున్ రిపుచమూపులఁ గప్పు డక్కిరీటికిన్. 170 ప. 3 ఆ.

మఱి అంతయమకములు

| | |
|---|---|
| ధరణి గ్రక్కదలఁ గదల | 83ప. 1ఆ. |
| ఏలరా రాకొమరా | 129ప. 2ఆ. |
| లతాకుడుంగముల గముల | 231ప. 3ఆ. |
| కల్లోలవతీమతల్లి గంగమతల్లీ | 115ప. 1ఆ. |
| పైఁదలిపైఁ దలిరాకుగ్రైదువుల్ | 167ప. 2ఆ. |
| తవరఁ! కలకంతవరా! | 56ప. 3ఆ |

ఇవి శబ్దచమత్కారములు. ఇక అర్థచమత్కారములు బహువిధభాసమానములు. అందు సభంగ, అభంగశ్లేషలను ఆశ్రయించిన అర్థచమత్కారములు అసంఖ్యాకము.

సారంగధరచరిత్రమునందలి చిత్రాంగీసారంగధరసంవాదములోని శ్లేషమూలకార్థ చమత్కారములు పూర్వోదాహృతము. అనుసంధించునది.

విజయవిలాసములోని శ్లేషానుప్రాణితార్థచమత్కారములు:

"జలరుహగంధి వీనుల పసల్ నవసంఖ్య నదేమి లెక్కనున్
జెలువ నఖాంకురాళి నెఱచేడియ సైకముఁ దానుచుక్కనున్
బొలఁతుక గబ్బిచన్నుఁగవ పువ్వుల చెండ్లను లేదు బంతమున్
గలికి ముఖారవింద మల కల్వలరాయని త్రోసిరాజనున్." 102 ప. 1 ఆ.

ఇది సుభద్రవర్ణన. ఇందు "వీనుల పసల్ = చెవుల అందము, నవసంఖ్యన్= తొమ్మిది అన్న అంకెను, అది ఏమి లెక్క = అదొక లెక్కా? - ఏపాటిది? అనున్ = అని తిరస్కరించును." అని ఒక అర్థము. "అది ఏమి? = అదేమిటి? లెక్క = ఒక అంకెయే కదా, అనున్" అని మఱొక అర్థము. ఇవి హృదయోల్లాసవ్యాఖ్యలోని అర్థములు.

చెవులను తొమ్మిది సంఖ్య ఆకృతితో పోల్చుట కవిసమయము. అది తెలుగు లిపిలోని ఆకృతి కాదు. నాగరలిపిలోని ఆకృతి. అది కూడ రేఖాచిత్రమునందు అనుకూలము. కవి సమయములు తెలుగు కవి సమయములు కావు. సంస్కృతకవి సమయములే. దమయంతి సౌందర్యవర్ణనములోని "అదిగదా వీనులందుఁ దొమ్మిదవ లెక్క' అను శ్రీనాథుని కవిసమయము (184ప. 3ఆ.శృం.నై.) "తస్య సంఖ్యైవ నవా నవాఙ్కః' అను శ్రీహర్షుని కవిసమయమునకు (63శ్లో. 7స. నై.చ.) తెనుగుపేత.

"నఖ అంకుర ఆళి = గోరుమొలకల వరుస-లేక లేతగోరుల వరుస, నెల=చంద్రుని చేడియ = భార్య అయిన తార యొక్క, సైకమున్ = అందమును, తాను ఉచుక్ అనును = తిరస్కరించును." అని ఒక అర్థము. తాను చుక్క అనున్= తార ఒక చుక్కే కదా అనును" అని మఱొక అర్థము. ఇవి హృదయోల్లాసవ్యాఖ్యలోని అర్థములు.

తాను చుక్క అనున్ = సిరి, చుక్క అను వాడుకలోని చుక్క అని వేఱొక అర్థము[25]. బడికి మొదట వచ్చిన బాలుని లేదా బాలికను సిరి అనుట, తర్వాత వచ్చిన బాలుని లేదా బాలికను చుక్క అనుట ప్రాథమికపాఠశాలావ్యవహారము. ప్రసిద్ధము. సుభద్ర నఖాంకురాళి తారను చుక్క అనిన సుభద్ర సిరి. ప్రథమగణ్య. తార చుక్క.

ద్వితీయగణ్య. తార కంటె సుభద్ర అందగత్తె అని తాత్పర్యము.

ఉచుక్కు తిరస్కారసూచకధ్వన్యనుకరణముగ ప్రయోగాంతరములు కలవు. "తానుచుక్కనున్" అను చోట తాను + చుక్క అను పదచ్ఛేదమునకు "తాను జుక్కనున్' అను పాఠముండవలయును. అది కవిపాఠమైన ఉచుక్కు ఉండదు. ఉక్కు లేదు. వ్యాకరణమునకు స్వస్తి చెప్పిన పై మూడర్థములును ప్రాప్తించును. చేమకూర వేంకటకవి వ్యాకరణవిరుద్ధప్రయోగములకు అతీతుడు కాడు.

"గబ్బి చన్ను కవ = (నిక్కిన) బిగువైన చనుదోయి, పూవుల చెండ్లను = పూబంతులను లేదు బంతి అనున్ = తిరస్కరించును." అని ఒక అర్థము. "లేదు బంతి అంటే అబద్ధము-వట్టి బూటకము అని అర్థము. "పూవుల చెండును విశేషము లేదు. అవి ఒక బంతియే" అనును. అని మఱొక అర్థము. ఇవి హృదయోల్లాసవ్యాఖ్యలోని అర్థములు.

బంతి అనగా పంక్తి అని ఒక అర్థము. అర్థమే కాదు; పంక్తిశబ్దభవమే బంతి. సహపంక్తి భోజనములకు బంతిభోజనములను వ్యవహారము ప్రసిద్ధము. లేదు బంతి అనగా బంతి యందు స్థానము లేదని ఇంకొక అర్థము. సహపంక్తి లేదని తాత్పర్యము. సమానము కాదని సారాంశము.

"ముఖ అరవిందము = పద్మము వంటి ముఖము, అల = ప్రసిద్ధుడయిన, కల్వలరాయని = కలువలరాజును - చంద్రుని, త్రోసిరాజనున్ = మిక్కిలి అవమానపరుచును - తిరస్కరించును అని ఒక అర్థము. "త్రోసి వేసి, అతడు రాజా (=చంద్రుడే) కదా అనును" అని మఱొక అర్థము. ఇవి హృదయోల్లాసవ్యాఖ్యలోని అర్థములు. త్రోసి రాన్ చనున్ త్రోసి వచ్చుటకు వెళ్లునని వేఱొక అర్థము[25].

త్రోసిరాజా అను మాట చదరంగమునందు ప్రసిద్ధము. అందు ఉయ్యాల త్రోసిరాజా అను మాట కూడ ప్రసిద్ధము. తెఱచి రాజు అను మాట కూడ ప్రసిద్ధము. త్రోసిరాజా, తెఱచి రాజా (114 ప. 3 ఆ.) అని ప్రయోగించిన చేమకూర దృష్టిలో చదరంగము పరిభాష ప్రధానము. రాజా ఉన్న గడికి, రెండు గడులు ముందున్న భటుని-రాజ భటుని చంపుటకు వీలు లేకుండ, ఏనుగును గాని గుఱ్ఱమును గాని కాపు పెట్టి - ముందుకు త్రోసి, రాజా అనుట త్రోసిరాజా. అది రాజునకు ప్రమాదసంకేతము. కలికి ముఖారవిందము చదరంగమాడు వ్యక్తి. కల్వలరాయడు చదరంగములోని రాజు. అతనిని త్రోసిరాజా అనును అనగా ప్రమాదసంకేతము ప్రకటించునని అర్థము. కలికి ముఖాబ్జము ముందు కల్వలరాయని స్థితి ప్రమాదములో పడినదని తాత్పర్యము. కల్వల రాయని కంటె కలికి ముఖారవిందము మెఱుగని భావము.

"అపుడు వృపుడు ప్రఫుల్లనవాంబుజప్ర
పన్నముఖుఁడయి మలయధ్వజక్షితీశ
కమలహితునకు మామకాగమనవార్తఁ
దెలుపుమనుచు విశారదుఁ బిలిచి పనిచె." 217 ప. 1 ఆ.

అర్జునుడు చిత్రాంగదను వివాహమాడువఱకు నిద్ర పట్టదని, మంత్రి విశారదుని చిత్రాంగద తండ్రి మలయధ్వజునియొద్దకు రాయబారము పంపును. అప్పుడు అర్జునుడు కమలముఖుడు. మలయధ్వజుడు కమలహితుడు. కనుక రాయబారము సఫలమగునని కవి సూచనము. ఇది నాటకీయధ్వని వంటిది. అదొక అర్థచమత్కారము. అంతేకాదు. రాయబారమునకు విషయము "మామకాగమనవార్తc దెలుపుమను"ట. మామక + ఆగమనవార్త = నాయొక్క రాక అను వృత్తాంతము తెలుపుమనుట అని ఒక అర్థము. మామ + కాcగ + మన వార్త = మామ అగునట్లు మన వృత్తాంతము తెలుపుమనుట మఱొక అర్థము. ఇవి హృదయోల్లాసవ్యాఖ్యాలోని అర్థములు. ఇట మామకు + ఆగమనవార్త, మామకున్ + ఆగమనవార్త అను పూర్వవ్యాఖ్యలలోని పదచ్ఛేదములు పరిగణనార్హములు కావు. అర్జునుడు చిత్రాంగదను వివాహమాడకముందే మలయధ్వజుని మామ అనుట ఉచితము కాదు. మామక + ఆగమనవార్త అను పదచ్ఛేదమునందు అరసున్న లేదు. మామ + కాcగ + మనవార్త అను పదచ్ఛేదమునందు అరసున్న కలదు. సబిందునిర్బిందుశ్లేష లాక్షణికసమ్మతము. "మన" అనుట రాజోచితము. విశారదుడు అర్జుననికి మలయధ్వజుడు మామ అగునట్లు రాయబారము నిర్వహించుట అనంతరకథ. (218ప. 1ఆ; 4ప. 2ఆ.) మామ + కాcగ + మన వార్త అను పదచ్ఛేదము కథానుగతము. ఇది సభంగ శ్లేషమూలకమైన అర్థచమత్కారము.

"భామ మోమున వ్రేలు రూపంబుc జూచి
ముదిత యెదc బాయకుండెడు మూర్తిc దలcచి
రమణి మై సగమైన విగ్రహము నెంచి
ప్రోవుమని వేడుకొను దేవపూజవేళ." 136 ప. 2 ఆ.

ఇది యతివేషధారి అర్జునుని ప్రార్థన. ఇందు యతిపరమైన ప్రార్థన,అర్జున పరమైన ప్రార్థన రెండును కలవు.

భామ = సరస్వతి, మోమున వ్రేలు = ముఖము నందుండు, రూపము = బ్రహ్మరూపమును చూచి; ముదిత = లక్ష్మి, ఎదcబాయకుండెడు = హృదయమును విడిచిపెట్టకుండెడు మూర్తిన్ = విష్ణువు మూర్తిని తలచి; రమణి = పార్వతి, మై సగమైన = శరీరమందు సగమైన, విగ్రహమును = పరమేశ్వరుని విగ్రహమును - అర్ధనారీశ్వరవిగ్రహమును ఎంచి, దేవపూజాసమయమునందు రక్షింపుమని ప్రార్థించును. ఇది యతిపరము.

భామ = సుభద్రయొక్క, మోమున వ్రేలు = ముఖము ముందు కనిపించు, రూపము = ఆకృతిని చూచి, ముదిత = సుభద్రయొక్క, ఎదcబాయకుండెడు = హృదయమును వీడకుండెడు మూర్తి = స్వరూపమును తలచి, రమణి = సుభద్రయొక్క మై సగమైన = శరీర మందు సగమైన, విగ్రహమును = ఆకారమును ఎంచి, దేవపూజాసమయమువందు కూడ సుభద్రను రక్షింపుమని - ప్రేమను ఫలింపజేయుమని ప్రార్థించును ఇది అర్జునపరము.

యతి దేవపూజాసమయమునందు త్రిమూర్తులను ప్రార్థించును. అర్జునుడు దేవపూజాసమయమునందు కూడ సుభద్రను, నిత్యము కనిపించునట్లు, హృదయము నందు ఉండునట్లు, అర్ధాంగి అగునట్లు ప్రార్థించును. అంతేకాదు. సరస్వతీ చతుర్ముఖుల, లక్ష్మీనారాయణుల, పార్వతీపరమేశ్వరుల దాంపత్యముల వలె సుభద్రార్జు నుల దాంపత్యమును ఉండవలయునని ధ్వన్యర్థము. ఇది అభంగశ్లేషమూలక మైన అర్థచమత్కారము.

"తెమ్ము బంగారుకుండ జలమ్ము లనుచుఁ
దెమ్ము లతకూన మంచి సుమమ్ము లనుచుఁ
దెమ్ము బాగైన కొమ్మ ఫలమ్ము లనుచు
మించుబోఁడిని నేరుపు మించఁ బలుకు." 142 ప. 2 ఆ.

ఇది శుశ్రూష సేయు సుభద్రకు అర్జునుడు పనులు చెప్పు విధానము. బంగారు కుండతో జలములు తెమ్ము, లతకూన నుండి మంచి సుమములు తెమ్ము, బాగైన కొమ్మయొక్క ఫలములు తెమ్ము అని అర్థము. ఈ అర్థమున బంగారుకుండ పాత్రవిశేషము. లతకూన లతావిశేషము. బాగైన కొమ్మ శాఖావిశేషము. బంగారుకుండ జలములు తెమ్ము. లత కూన! మంచి సుమములు తెమ్ము, బాగైన కొమ్మ! ఫలములు తెమ్ము అని మఱొక అర్థము. ఈ అర్థమున బంగారుకుండ, లతకూన, బాగైనకొమ్మ సుభద్రకు విశేషణములు. బంగారు కొండ వలె బంగారు కుండ. లతకూన వంటిది. బాగైన కొమ్మ = అందమైన స్త్రీ. అన్వయభేదమూలకమైన అర్థచమత్కారము.

చమత్కారము తోపాటు స్వభావోక్తి కూడ చేమకూరకృతులందు కలదు. అదే జాతి. స్వభావోక్తి జాతి అని చమత్కారచంద్రికయందును కలదు. (4శ్లో. 7వి.)

సా.చ : "పా లడలోఁ బోసి చమఁబాలు నెయిం గిలకొట్టి కాళ్లపై
బాలకు నుంచి వ్రేల్ సెలవిపై నెడగా నిడి యుగ్గువెట్టి యా
కేలటు బొజ్జపై నిమిరి కెంజిఱు చేతుల నెత్తి గట్టురా
చూలి యమంగు సామికిని జోతలు జోత లటంచుఁ బల్కుచున్." 44 ప. 1 ఆ.

"జట్టువ్రేళ్లను రెండుఁ బట్టించి నడిపింపఁ
దలఁకుచు రాలేమి బలిమిఁ దిగుచుఁ
దన చేతి నిడుదలాతపుఁగోల యందిచ్చి
మెల్ల మెల్లనె కొంత మెలఁగఁ జేయు
నవలంబముడిగి రమ్మన వాల్గడుగు లేఁగి
పడఁబోవ గ్రక్కునఁ బట్టి నిలుపు
జనుదెంచి బిసబిస దను నంటుకొమ్మని
వచ్చిన వగుచు నవ్వలని కరుగు
నాఁడు నాఁటికి నీరీతి నడవనేర్పఁ
గొన్నినాళ్లకు నలవడి కొంకు దీఱి

లెస్సలై కరపదములు లీలఁ దనరఁ
ప్రేమఁ జౌరంగి యనియెడి పేరొసంగి." 258 ప. 3 ఆ.

వి. వి. "శయ్యకుఁ దార్చఁగాఁ దుఱుము జాఱె; నదంతట చక్కదిద్దఁబోఁ
బయ్యెద జాఱె నయ్యదిరిపాటున గ్రక్కున నీవి జాఱె; రా
జయ్యెడ నవ్విలాసిని యొయారముఁ జూచి కవుంగిలించె; నౌ
నెయ్యెడ మేలె చూతురు గణింపరు జాణలు జాఱుపాటులన్." 172 ప. 1 ఆ.

"కంగుల్ దీర్చిన పైఠిణీఱవిక చన్కట్టంటి రాణింపఁగా
జెంగల్వల్ నెఱికొప్పునందు నొఱపై చెంతన్ గుబాళింపఁగా
బంగారందియ ముక్కునం గమిచి పైపై నంచ యెల్గింపఁగా
సింగారంబగు ముద్దుఁ జిల్క తనకుం జేదోడు వాదోడుగాన్." 157 ప. 2 ఆ.

పలుకునుడికారము, జాతివార్తలు, ప్రతిపద్యచమత్కారము పరాకాష్ఠదశనందిన చేమకూర వేంకటకవి కవితామార్గము, రఘునాథనాయకుడు కతపత్ర మిచ్చినట్లు అనితర సాధారణము.

రఘునాథనాయకుని ఆస్థానమునకు క్షేత్రయ్య అరుదెంచినట్లు మంద్ర నరసింహ కవి ఆంధ్రకౌముదియందు కలదు.

"మువ్వగోపాలభక్తేన క్షేత్రజ్ఞకవినా ఉక్తత్వాచ్చ
తము దామె వత్తు రర్థులు
క్రమ మెఱిఁగిన దాత కడకు రమ్మన్నారా
కమలంబులున్న చోటికి
భ్రమరంబుల యచ్యుతేంద్రరఘునాథనృపా."

ఇది నిజము కావచ్చును. కాకపోవచ్చును. కాని క్షేత్రయ్య రఘునాథనాయకుని మీద చెప్పిన పదములు కానరావు.

# విజయరాఘవనాయకుడు

విజయరాఘవనాయకుడు రఘునాథనాయకుని కుమారుడు. తండ్రి అనంతరము తంజావూరు నాయకరాజా. (1633-73) తండ్రి వలె కృతికర్త, కృతిభర్త. సంగీతసాహిత్య సమారాధనమునందు తండ్రిని మించిన తనయుడు. విజయరాఘవ నాయకుని గుఱించి, అతని ఆస్థానకవి చెంగల్వకాళయ రాజగోపాల విలాసమునందు వివరముగ కలదు.

విజయరాఘవనాయకుని సభాభవనము విజయరాఘవవిలాసము.(13) అందు ఒక అపూర్వవిశేషము శారదాధ్వజము.

ఒక్కొక్కయెడఁ జీనిచక్కెరపానకం
బాని వ ట్లాహ్లాద మావహిల్ల
నొక్కొక్కయెడఁ దావి నెక్కొన విరజాది
సరములెత్తివ రీతి పరిమళింప
నొక్కొక్కయెడఁ జల్వ లుప్పతిల్లఁగ మంద
మారుతంబులు మించు మహిమ చెలఁగ
నొక్కొక్క యెడ మేనఁ జొక్కు సంపాదించు
వెలఁది వెన్నెల తేట విధము మించ
కవిత రచియింప విజయరాఘవవిభుండె
నేర్చువని వాణి నర్తించు నేర్పు మీఱ
చామరానిలకందళచలితమగుచుఁ
దవరు సభయందు వల శారదాధ్వజంబు." 18 ప. 1 ఆ.

విజయరాఘవనాయకుని కవితారచనము గుఱించి వాణి నర్తించు నేర్పు మీఱునట్లు విజయరాఘవవిలాసమునందు శారదాధ్వజము తనరునట. అంతేకాదు.

"నవనవోల్లేఖనసవనయోగ్యముగాని
పద్యంబు జమలకు హృద్యమగునె?
ఘనతరాలంకారకారణంబులు గాని
వాక్యవైఖరుల నెవ్వారు వినరు
శేముషీతవాగ్విశేషాన్వితము గాని
పదము విద్వచ్ఛ్రేమపదము గాదు
ఘనసారసారంబు గాని సందర్భంబు
లర్భకులైనను నాదరింప
రంచు వివరించు చలచామరాంచదనిల
చలిత చేలాంచలాగ్రహస్తంబుచేత
విజయరాఘవమేదినీవిభుని సభను
తవరు మహిమంబుచే శారదాధ్వజంబు." 19 ప. 1 ఆ.

"క్రొంగ్రొత్తదనము లేని పద్యము హృద్యము కాదు, అలంకారములు లేని

వాక్యవైఖరులను ఆలకింపరు, మహాభాష్యసమ్మతము కాని పదము విద్వాంసులకు ప్రేమపదము కాదు, కర్పూరసారము కాని సందర్భముమ అర్భకులు కూడ ఆదరింపరు" అని వింజామరల గాలికి కదలియాడు చేలాంచల మనెడు ముందుకు సాచిన హస్తముచేత శారదాధ్వజము హెచ్చరించునట. క్రొంగ్రొత్తదనము కల పద్యము, అలంకారములు కల వాక్యవైఖరులు శ్రవణప్రవణములు, సాధుపదప్రయోగము విద్వత్సమ్మతము, సందర్భము సారవంతము కావలయును అని కవి ఆశయము.

విజయరాఘవనాయకుని విజయరాఘవవిలాసభయందు విజయనగరరాజు వీరవేంకటపతిరాయలచేత బహువిధబిరుదములందిన ముద్దు చంద్రరేఖ వివిధవిద్యలు వినిపించును. (22) ఈమె విజయరాఘవనాయకుని భోగిని. (1-129; 2-83; 3-88; 4-83) రూపవతి చౌపదకేలిక, చంపక శబ్దచూడామణి, మూర్తి జక్కణి, కోమలవల్లి కొరవు, లోకనాయిక నవపదములు, శశిరేఖ దేశి, రత్నగిరి దరుపదములు, భాగీరథి పేరణి అభినయింతురు. (23) ఒకతె వీణ వాయించును. ఇంకొకతె కిన్నెర పలికించును. మతొకతె ద్విపదలు చదువును. వేతొకతె తత్త్వసంగము పేయును. కొండొకతె ముఖవీణచే రాగము చేయును. ఒక్కర్తె తంబురా మొరయించును. ఒకర్తు స్వరమండలము మీటును. కొందఱు వనితలు యక్షగానము, రావణహస్తము, ఉడుకు, దండెమీటలు, చెంగులు, తాళములు, జోలలు, సువ్వాలలు, ధవళములు, ఏలలు వినిపింతురు. (24) ఒకతె దండె మీటుచు రాగప్రబంధములు, ఠాయములు, గీతములు పాడును. (26ప. 1ఆ.) మొత్తము మీద విజయరాఘవవిలాసము పదకవితారసోల్లాసము.

విజయరాఘవనాయకుని అంఘ్రిని వివిధరాజన్యకోటీరవివిధరత్నఖచితమైన సువర్ణ "సాహిత్యరాయపెండార"మమరును. ఇది ఏడు సీసపద్యములందు కలదు. (72-78ప. 1ఆ.) అందొకటి:

"ఫణిరాజబహుముఖఫణితభాణితముల
మర్మంబు లాత్మీయమహిమఁ బొగడ
తర్కకర్కశవాగ్వితర్కప్రభావంబు
విజశక్తియుక్తి వర్ణింపుచుండ
నవ్యకావ్యవిశేషవాటిలోన్మేషంబు
స్వకవైభవంబుల పన్నుతింప
లక్షితాలంకారలక్షణస్ఫురణంబు
లాత్మచాతుర్యధుర్యత మతింప
మధురమధురవశింజితమంజిమములఁ
దత్తదుచితోపచారముల్ తా నొవర్చి
విజయరాఘవమేదినీవిభుని యంఘ్రి
నౌర! సాహిత్యరాయపెండారమమరు. 74 ప. 1 ఆ.

సాహిత్యరాయపెండారము కేవలరాజలాంఛనము కాదు. సాహిత్యరాజ

లాంఛనము. విజయరాఘవనాయకుని తర్క వ్యాకరణాలంకారశాస్త్ర వైదుష్యమునకు, నవ్యకావ్యరచనావైభవమునకు జయపతాక.

విజయరాఘవనాయకుని కృతులు లభించినవి ఆరు. రచించినవి అర్ధశతాధికము.

తెనుగుసేతలు : 1. గోపికాగీతలు 2. భ్రమరగీతలు.

ద్విపదకావ్యములు : 1. రఘునాథనాయకాభ్యుదయము. 2, మోహినీవిలాసము. 3. పాదుకాసహస్రము

యక్షగానములు : 1. రఘునాథాభ్యుదయనాటకము. 2. రాజగోపాలవిలాస నాటకము. 3. ఉషాపరిణయనాటకము. 4. పూతనాహరణనాటకము 5. మంజరీద్విపద ప్రబంధనాటకము. 6. సముద్రమథననాటకము. 7. కృష్ణవిలాసనాటకము. 8. జానకీ కల్యాణనాటకము. 9. పుణ్యకవ్రతనాటకము. 10. చెంగమలవల్లీపరిణయము. 11. గోవర్ధనోద్ధరణము. 12. మన్మథవిలాసము. 13. రాసక్రీడ. 14. నవనీతచోరము. 15. పారిజాతాపహరణము. 16. రుక్మిణీకల్యాణము. 17. రాధామాధవవిలాసము. 18. ధనాభిరామము. 19. సత్యభామావివాహము. 20 కాళియమర్దనము. 21. ప్రహ్లాద చరిత్రము. 22. విప్రనారాయణచరిత్రము. 23. ప్రణయకలహము. 24. కంపవిజయము. 25. దక్షిణద్వారకాస్థలము.

పదములు = 1. శృంగారసాంగత్యము. 2. మన్నారుసాంగత్యము. 3. అధ్యాత్మసంకీర్తనలు.

విన్నపములు : గోపాలవిన్నపములు

దండకము : రాజగోపాలదండకము

ఏలలు : ? దరువులు : ?

ఇవి గాక ఇంకను 1. వాల్పిచి 2. గుజ్జరివిన్నెడు 3. దండలాస్యము. 4. కందుకక్రీడ 5. కొరవంజి 6. గుజరాతి 7. దేశి 8. చౌపదము 9. జక్కిణి. 10. దురుపదము 11. మదనబలదూత్యము 12. జోగి 13. పదచాళి 14. శారదాసామ్రాజ్యము 15. చిందు 16. నవతి మచ్చరము 17. నాట్యకదంబము మొదలైన నాట్యప్రభేదములకు సాహిత్యరచనలు.

మొత్తము 2+3+25+3+1+1+1+1+17=54. ఇవియెల్ల ప్రహ్లాద చరిత్రమునందు ప్రసక్తమైనవి. అది తుదిరచనమగును. ఇందు 1. రఘునాథనాయకాభ్యుదయము 2. రఘునాథాభ్యుదయము 3. విప్రనారాయణచరిత్రము 4. పూతనాహరణము 5. కాళియమర్దనము 6. కృష్ణవిలాసము 7. ప్రహ్లాదచరిత్రము మాత్రమే ఉపలబ్ధములు. ఇందు మొదటిది ద్విపదకావ్యము. తక్కినవి యక్షగానములు.

రఘునాథనాయకాభ్యుదయము : ఇది కులదైవమైన దక్షిణద్వార కాస్థలి మందిరుడు రాజగోపాలస్వామికి అంకితము. ఇందు గురువు తాతాచార్యులు, "పట్టాభిషేకవైభవముఁ గైకొన్న

యట్టి సంవత్సర మందొకనాఁడు
నవలీలగాఁ బదియాఱు దానములు
నవరించి ద్విజుల కొసంగితి వీవు
వీరుఁడౌ నవరము వేంకటపతిని
పాఱఁదోలించి నీ పనుపుల చేతఁ
బట్టిన సీమలోఁ బందనెల్లూరు
కట్టించితివి ఘటికామాత్రముననె
శ్రీరంగరాయలఁ జేపట్టి నిల్పి
యా రాయకార్యంబు లొఁగాదటంచు
దుండగించిన పాండ్యతుండీరపతుల
ఖండించి వాకిలిఁ గావఁజేసితివి" 278-289 పం. 1 ఆ.

అని విజయరాఘవుని చరిత్రమ తెలిపెను. విజయరాఘవనాయకుడు పట్టాభిషేకము గైకొన్న కాలము 1555+78=1633వ సంవత్సరము. విజయనగరరాజా శ్రీరంగరాయలను చేపట్టి నిలిచి, శ్రీరంగరాయల రాచకార్యములు అవును కాదు అనుచు దుండగించిన పాండ్య తుండీరపతులను ఖండించి, వాకిలిఁగావఁజేసిన కాలము 1643-44 ప్రాంతము[26]. కాఁబట్టి రఘునాథనాయకాభ్యుదయము రచనా కాలము 1645 ప్రాంతము కావచ్చును.

రఘునాథనాయకాభ్యుదయము మూడాశ్వాసముల ద్విపదకావ్యము. తృతీయాశ్వాసము అసంపూర్ణము. రఘునాథనాయకుని దినచర్య - ఏకదివసప్రవృత్తము- ఇతివృత్తము. ఒక నాటి వేకువను మేలుకొన్నది మొదలు, మఱునాటి వేకువకు ముందు నగరు ప్రవేశించువఱకు రఘునాథనాయకుని దినచర్య కలదు. అంతేకాదు. ఆనాటి తంజావూరు కోట కన్నులకు కట్టినట్లు కలదు.

చుట్టువీథుల నడుమ ప్రహరి లోపల బంగారు కలశములు పైన మిటారించు హజారము, దాని పజ్జ గజఘటల నెమలాగడపుఁబవి పెద్దబవంతి, దాని ప్రక్కహురుమంజి తేజీల పటాణి బవంతి, దాని చెంత నగరి సంప్రతికరణములు జతగూడి వ్రాయు విశాలశాల, దాని పొంత శ్రీరాముని చిత్రపటము నిల్పిన రామభద్రశాల, దాని దగ్గఱ గుఱిగొల్ల లున్న కోణెవాకిలి, దాని సన్నిధిని రాజులు, దొరలు శ్రేణులై యున్న లక్ష్మీవిలాసము, చల్వరాతి సింగంపుఁబవి కనిపించు వాకిలి, దాని చెంగట అచ్యుత రంగకూటము, దాని కడ నాకపురీవిలాసగేహము, బాగుల చప్పరము, గరిడికూటము, నవరత్నమయమైన నాటకశాల, మదనగోపవిలాసమందిరాంగణము, పట్టాభిరాముని చిత్రపటము కల-బంగారు చెక్కడపుఁజప్పరము, నీలంపు చాయలు నీడలు దేర. నిలసిల్లు చల్వరాజగతి కలిగి, రెండవ పుష్పకవిమానమో అనిపించు -శ్రీరామసౌధము, కాంచనోరుకవాటఘటితమార్గము కల విజయభువనరాజము; చంద్రకాంతపు వింత సంతనమలు, పగడాల కంబములు, మగఱాల మదహస్తులు, దంతపుఁ జేరుల్ల,

మలచిన చీవనక్షులు, కెంపుజాపనుల బోదియలు, వచ్చజాపలక పైకప్పు, ఇంద్రనీలవుటోవరి, చలువగోడలు, రావిరేకుల తోరణములు, సోగముత్తెముల చికిలికుచ్చులు, వైడూర్యపుద్వారబంధములు, మగజాల సంతన మడతతల్పులు, జాళువాపని సజ్జల గములు, పటికంపు మెటికలు కలిగి - చోళగుని గెల్చిన పాదలికలు, వేపాల భూపాలునికి దొరతనమిచ్చిన దోర్విలాసములు, పాండ్యతుండీరపతుల గెల్చిన పరాక్రమము, విజయనగరరాజు రామదేవరాయలను సింహాసనము మీద నిల్పుట మొదలైన విజయముల భావచిత్రములు భాసించు ఇందిరామందిరము, విజయరాఘవ విలాసము మొదలైన గృహరాజముల రాజసదనము రాజిల్లును. ఇది కోట లోపలి రాజభవనసముదాయము. (392-459పం. 1ఆ.)

రఘునాథనాయకుని దినచర్య: నిద్ర లేవగానే నిలువుటద్దమును, ఇద్దఱయగార్లను, బంగారు బిందెల పాలను, గరుత్మంతుని చూచును. నారీమణులు చేదండ లొసగ, కుంచె కాళంజి చేకొని సేవింప, మెఱుపుల మంచము మీద కూర్చుండును. పుత్రపౌత్రకళత్రములు చేరి కొలుతురు. రూపవతి పదచాళి, చంద్రలేఖ పేరణి, శశిరేఖ జక్కిణి, లోకనాయకి దురుపదకేళిక నటింతురు. కొందఱు విరిబోండ్లు కొరవంజి, శివలీల, గుజరాతిదేశి వినిపింతురు. ఒకతె వీణ వాయించును. కొందఱు వెలదులు వీణ, మురళి, రబాబు, తంబుర, దండె, చెంగు, స్వరముండలము, రావణహస్తము మొదలైన జంత్రములు వినిపింతురు. మఱికొందఱు స్త్రీలు రఘునాథనాయకుడు రచించిన అచ్యుతాభ్యుదయము, నలచరిత్రము, పారిజాతాహరణము, వాల్మీకిచరిత్రము, జానకీకల్యాణము మొదలైన కావ్యములు వినిపింతురు. కొందఱు వనితలు సమస్యలు పూరింతురు. అందఱికి రఘునాథనాయకుడు కనకాంబరము లొసగును, అనంతరము చలువపన్నీట మజ్జన మాచరించును. ఆ స్నానఘట్టమిది:

"అత్తరి మత్తేభయానలు చేరి
జంతాయితంబుగా జలకంబునకును
పసనైన బంగారు పలకపీటయును
వెలితావి చలువ పన్నీటికొప్పెరలు
తళుకుజీనికడాని తంబుగల్ నిలిపి
జలకంబునకును హెచ్చరికఁ గావింప
గద్దియ డిగ్గి చెంగట నున్న చెలువ
లిద్దఱు కైదండ నిరుగడ లొసఁగ
వే దండమున్నట్టి వేదండగమన
పాదాబ్జముల రత్నపాదుకల్ చేర్ప
రాజసంబున రతిరాజసన్నిభుఁడు
రాజదేవేంద్రుఁడౌ రఘునాథవిభుఁడు
పల్లవపాణు లిర్వంకలఁ గొల్వ

మెల్లమెల్లన వచ్చి మెట్టియున్నట్టి
పాదుకల్ సడలించి బంగారు పీట
మీఁదఁ గూర్చుండి క్రొమ్మించు తంబుగల
జలజాక్షు లందించు జలముఁ గైకొనుచుఁ
జలువ పన్నీట మజ్జన మాచరించి-" 527-545 పం. 1 ఆ.

చలువపంచె ధరించి, సన్నజాదుల సరులు చుట్టి, రంగురుమాలు వైచి, ముద్రికా భరణము ముత్యాలయొంట్లు శ్రీరామభద్రతాళి ధరించి రఘునాథనాయకుడు నామ తీర్థమునకు వచ్చును. అచట ఇద్దఱయగార్లను దర్శించి లక్ష్మీవిలాసమునకు వచ్చును. గురువును సేవించును. కపిలధేనువునకు గ్రాసము వేయును. జముకాణము మీద పద్మాసనాసీనుడై తిరుచూర్ణరేఖతో నుదట తిరుమణి ధరించును. మేన ద్వాదశపుండ్రములు సవరించును. ముత్యాల జపమాల పూని అష్టాక్షరీమంత్రజపము సేయును. రాజగోపాలునకు తిరువారాధనము సేయును. పరమభాగవతులు భాగవతరామాయణములు చదువ వారికి చందన తాంబూలములు సమర్పించును. పెద్దలకు నిత్యదానములు సేయును. ఆచార్యుల మంత్రాక్షతములు మస్తకమున ధరించి, ఆయనకు పాదాభివందనము సేయును. దేశికోత్తములను తిరుమాళిగకు పంపును. తాను కొలువు సింగారమగును. ఆ ఘట్టమిది :

"నిలువుటద్దం బొక నెలఁతుక దాల్ప
నిలువుటద్దము చెంత నీటుగా నిల్వఁ
దలఁపెఱింగి కడాని తట్టల సొమ్ము
కందళించిన వేడ్కఁ గరములఁ బూని
ముందఱ బొక్కసంబులవారు నిల్వ
సంపంగి పువ్వుల సరములు చుట్టి
సొంపు రాణింపఁగా మస్సాణి గొప్ప
ముత్యాల కుళ్లాయి మోహనలీల
ముత్యపురావులు మురువుగాఁ బూని
నిద్దంపుఁ జెక్కుల నీటులు తేర
పెద్ద చౌకట్టులు ప్రియముతోఁ బూని
యవిరళనవకుంకుమాంగరాగంబు
సవరించి వీమల జవ్వాది నించి
సరిగ ముత్తెపుఁగుట్టు జంటిపై మెఱయ
హరువైన సైఠిణీయఱచట్టఁ దొడిగి
బంగారు చుంగులు పై మిటారింప
రంగారు పీతాంబరము కటిఁ గట్టి
కంఠికింపై మించు కంఠమాలికలు
కంటసరంబుమఁ గడువేడ్కఁ బూని

పచ్చల పదకంబు బవిరి చెక్కడపు
హెచ్చు ముత్తెపుఁ దాళి యెదపై నమర్చి
మొలక కెంపుల పిడి మొలవంకిఁ జెక్కి
తళుకు వజ్రముల యుత్తరిగలఁ బూని
చెలువైన వజ్రాల చేసరుల్ దాల్చి
సరిలేని నవరత్నసంఘసంఘటనఁ
బురుణింపఁగా బాహుపురులు ధరించి
అకలంకనూత్నరత్నాంగుళీయములు
చికిలి వైడూర్యంపుఁ జేయంబు పూని
సరఁగఁ బాండ్యనృపాలఫాలపట్టమున
మురువైన నవరత్నములఁ దీర్చినట్టి
బిరుదు పెండేరంబు పెరిమ దీపింపఁ
జరణాంబుజంబున సవరించి యిట్లు
కొలువుపింగారమై ............... " 584-617 పం. 1 ఆ.

రఘునాథనాయకుడు కొలువున్న, అవసరముల వారు తెలుప అన్యరాజాలను ఆహ్వానించి నవవులు ఆలకించును. అనంతరము ఐరావతమను భద్రగజము నెక్కి బయలుదేరి శ్రీరామభద్రుని సేవించును. ముత్యాల గొడుగు మెఱయ, రత్నాల చామరములు వెలయ, చెంగావి పావడలు చెలగ, బహువాద్యములు మ్రోగ, సంగీతమేళము తవర, వందిమాగధులు కైవారము పేయ, అచ్యుతనాయకుడు అచ్యుతరామభద్ర నాయకుడు మొదలైన తనయులు ఉభయపార్శ్వముల కొలువ, బిరుదాంకములు పలుక రారాజా వలె స్వారి వెడలును. గొప్ప యుప్పరిగల గోపురములందు పైడిపజ్జ పజ్జలందు, వీథుల, వేదుల నిలిచి జవ్వనులు కన్నుల పండువుగా కాంతురు. సేసలు చల్లుదురు. రఘునాథనాయకుడు హజారమునకు వచ్చి, రామభద్రశాలలోని శ్రీరామభద్రుని సేవించును. లక్ష్మీవిలాసమునకు వచ్చి రంగనాయకులను సేవించును శ్రీరామసౌధము చెంతనున్న రాజగోపాలుని సేవించును. చల్వాఱాపలక మీది కెంబట్టు గద్దిగపై ఆసీనుడై, సరసవిద్వత్కవిసార్వభౌములను రప్పించి కవితాగోష్ఠి సాగించును. వేగుల వారి దినసరులు, రాయసము వారి దినసరులు, కరణికుల మనువర్తి లెక్క మణియంపు లెక్క విని, మంత్రులతో ఏకాంతగోష్ఠి సలిపి అంతఃపురమున కేగును.

పరిచారికలు పరిచర్యలు సేయుదురు. పట్టపుదేవులు కళావతి, విశ్వనాథుని పుత్త్రి, లక్ష్మాంబ నవరత్ననీరాజనము లిత్తురు. రఘునాథనాయకుడు కొలువు సింగారము తీసివేయును. సరిగంచు చలువలు కట్టి చిన్నారియొంట్లు శ్రీరామభద్రతాళి నవ్నవజ్రాల చేసరులు మాత్రమే ధరించును. పంచమహాయజ్ఞములు సేయును. ధవళశంఖములు తాళములు మ్రోగ పువుబోణులు బోనపుటికలు తెత్తురు. సరిగబంగరుతెర చాటుగ నిల్పుదురు. రాజునకు కుందనపు పీఠమున పురతకాళ్ళఆపు ఘటింతురు. ఫలకములు

రత్నకంబళములు తివాసులు చక్కళములు నిల్పుదురు. బంగారు సింగపుగోళ్లను మించు అడ్డిగ మీద పేరోదనపు పెద్దపళ్లెము పెట్టి, కనకకదళీదళములు పఱిచి, బంగారు గిన్నెలుంచి, పైడిగిండ్ల చలువనీరు తెచ్చి, హరివాణములు కంచములు పళ్లెరములు గంగాళములు ఉదిరిగిన్నెలు కోరలు రెండు బంతులకు అమర్తురు. పళ్లెముంచితి మని ప్రకటింతురు. రఘునాథనాయకుడు పట్టపుదేవులతో బంతిని కూర్చుండి ఆరగించును. ఆ భోజనపదార్థము లివి:

పచ్చడులు, శాలితండులపు ప్రసాదము, బంగారు చాయల పప్పులు, సద్యోఘృతము, శాకపు(గూరలు; అప్పడాలు నువ్వుపొడి హత్తించిన కప్పురకోడి, తెంకాయతునియలు కూర్చి కరివేపపొడి చల్లి కమ్మని నేతితో తాలింపు పెట్టిన కుంకుమకోడి, సెనగపొడి మిరపపొడి చెఱిసగము మేదించి కమ్మగా వండిన కస్తూరికోడి, చక్కెర చల్లి వెన్నముద్దలు కూర్చి మృదుపాకమున వండిన పాలకోడి, ఉల్లి ముక్కలు వెల్లుల్లి ముక్కలు కూర్చి వేపుడు పొళ్లు చల్లిన కోడి, ఉలువ కోడి, పన్నీరు పాయసము, కలకుట్లు వెన్న చక్కెర చిలికించి వండిన చేపల ఊర్పు, జాపత్రి గురసాని యోమము వేపుళ్ల కొలనురివిత్తులు కూర్చిన బిరంజి, వప గూర్చి వండిన పొడికూరవరలు, చలువయానము, క్రొవ్విన వేట క్రొందునుకలు చేసి కందనకాయ తక్రమున కడిగి జంబీరసారపేచనము కావించి కంబూరకస్తూరి కదంబించి వసతోడ నానగూర్చిన ఉప్పురసము, అప్పడములు వడలు కూర్చిన చిక్కుడుకాయ రొయ్యల ఊర్పు; పేణీలు, మండెగలు, లడ్వములు, పూర్ణకలశములు, వెన్న కజ్జాయములు, మణుగుపువ్వులు, అతిరసాలు, సారసత్తులు, కరివడలు, దధివడలు, ఆమ్రపు వడలు, పప్పు కుడుములు, తెలికుక్కురొట్టె, తెంకాయరొట్టె, సంబారురొట్టె, తెంకాయపాలు, జీలకరపాయసము, కమ్మని శిఖరిణులు కల వంటకములు; రసదాడిపండ్లు, పనసతొనలు, తేనెలో నైచిన తియ్యమామిడిపండ్లు, ద్వీపాంతరపు ద్రాక్షపండ్లు, ఖర్జూరఫలములు, నేరెడుపండ్లు, రేగుపండ్లు, కిత్తడిపండ్లు, పాలపండ్లు, దోసపండ్లు, వెలగపండ్లు, దాడిమపండ్ల గింజలు. అన్నిటి కంటె అగ్రేసరమైనది నీరుమజ్జిగ.

> "చొక్కమౌ వెన్నరుచుల్ బిపాలింప
> మిక్కిలి వపమించు మీఁగడ చట్లు
> సారమౌ జంబీరసారంపురుచులు
> మీఱంగ లవణంబు మితముగాఁ గూర్చి
> మేలైన సొంటితో మిళితమైనట్టి
> యేలకిపొడి పైచి యింపు దీపింపఁ
> దగు వట్టివేళ్ల చేతాపులు గట్టి
> మగువ యొక్కతె నీరుమజ్జిగఁ దెచ్చె. 240-247 పం. 2 ఆ.

ఇంతవఱకు రఘునాథనాయకుని దినచర్య యథార్థము. అది విజయరాఘవ నాయకుడు వివరించిన తీరు జాతిరచనము.

చిత్రరేఖ మోహము, విరహము; చిలుక రాయబారము, చిత్రరేఖారఘునాథ నాయకుల చిత్తజకేళి కథార్థము. అది ఉలాప్రబంధమునకు అనుసరణము[27].

"ఉలాప్రబంధము తమిళదేశమున నతిపురాతనమైనది. తమిళభాషకుఁ గల మొట్టమొదటి సంపూర్ణవ్యాకరణము "తొల్కాప్పియమ్". ఈ వ్యాకరణములో 'పురత్తినై ఇయల్' అను సూత్రమునఁ బ్రత్యేకముగా ప్రబంధములను గుఱించి చెప్పఁబడినది. ఇవి దేవతల రథోత్సవములకు ప్రసిద్ధపురుషుల గజోత్సవములకు సంబంధించిన వర్ణనలతోఁ గూడినవి, ఇందలి యితివృత్తము ఇటువంటి యుత్సవము తమ వీథిని సాగుచున్నప్పుడు దానిని జూచిన సప్తవిధగణికలలో నొక విధమునకుఁ జెందిన కన్యక ప్రేమప్రకటనగాథకు సంబంధించినది. (రఘునాథనాయకాభ్యుదయము లోని నాయిక గూడ గణికయై యుండవచ్చునని తోఁచుచున్నది.)"

చిత్రరేఖ మేడపై గవాక్షమునుండి స్వారివెడలు రఘునాథనాయకుని చూచి మోహము చెందును. విరహమునందును. చెలికత్తెలు శీతలోపచారములు సేయుదురు. అయినను,

"మీరొక చెలులంటే మేదినీవిభుని
కడకు మిమ్మంపితేఁ గార్య మీడేర్చి
నడుతురో యేలాగు నడుతురో కాని" 356-358 పం. 2 ఆ.

అని ఏ చెలికత్తెను పంపదు.

"ఈ వనంబున నున్న యిందిందిరంబు
నా విభుఁ దోడితేఁ బంపితినేని
అక్కడి చెలుల ముఖాబ్జవాసనకుఁ
దక్కక సొక్కక తానేల వచ్చు" 363-366 పం. 2 ఆ.

అని తుమ్మెదను పంపదు.

"హంసను దూతిగా నంపిన వారి
హంసకధ్వని విని యచటనేయుండు" 367-368 పం. 2 ఆ.

అని హంసను పంపదు.

"ఆ గండుగోయిల నంపిన వారి
రాగంబు విని యనురాగంబు నొందు" 369-370 పం. 2 ఆ.

అని కోయిలను పంపదు.

చిలుకను రాయబారిగ పంపును. అది రఘునాథనాయకుడు ఆరామమునందు విహరించునెడ హస్తాబ్జమున వ్రాలి, పొగడి, వచ్చిన పని చెప్పును. రఘునాథనాయకుడు "రక్షించుటే మాకు రాజధర్మంబు" అని, "చంద్రికాసమయమునందు నెలత యింటికి మేము నేఁడె విచ్చేసి, అంగజరాజ్య మేలింతు" మని సందేశము నంపును. ఆ ప్రకారము చేయును.

"వచనవైఖరుల నో వాల్గంటి! నీదు
కచభార మంజనాకారంబుఁ దాల్చెఁ
బూర్ణేందువదన! నీ పొంకమౌ మదురు
వర్ణింప శశిరేఖవైఖరిఁ జూపెఁ
దరుణీలలామ! నీ తళుకు వాల్చూపు
హరిణీవిలాసంబు లంగీకరించెఁ
గంజదళాక్షి! నీ కంబుకంఠంబు
మంజుఘోష విశేషమహిమ వహించెఁ
బంచాస్యమధ్య! నీ బాహువల్లికలు
కాంచవమాలిక గరిమఁ బాటించెఁ
గోమలి! నీదైన కోమలాంగంబు
హేమవర్ణంబుచే నెన్నికఁ గాంచెఁ
గుంభికుంభస్తవకుంభ! నీ తొడలు
రంభావిలాససంరంభంబు దాల్చె
నీరజలోచవ! నీ నఖరేఖ
తారావికాసంబుఁ దక్కఁ బెవంగె" 787-802 పం. 3 ఆ.

అని ప్రశంపించిన, చిత్రరేఖ "నాయకుం డన్యకాంతల పేరుఁ దలఁచె" నని అలుక వహించుచు. అది గ్రహించి అతడు "చిత్రవటాకారమొకటి గనుఁగొని చిత్రరేఖావిలాసంబు బాగాయె" నని పలుకుచు. తన్ను పిలిచెనని చిత్రరేఖ అలుక చాలించుచు.

ఇది చమత్కారావహమే కావి, విజయరాఘవనాయకుడు చిత్రరేఖారఘునాథ నాయకుల సంభోగశృంగారముచు వర్ణించుట విపరీతము. మాతాపితృశృంగారస్మరణమే లోకవిరుద్ధము. కావ్యనిషిద్ధము. అనౌచిత్యనిబద్ధము. అది వినా రఘునాథనాయకాభ్యు దయము కావ్యముగ దివ్యరచనము.

రఘునాథాభ్యుదయము : ఇది కూడ రాజగోపాలస్వామికి అంకితము. ఇందు "రఘునాథాభ్యుదయ" మని, "రఘునాథనాయకాభ్యుదయనాటక" మని కలదు. నాటకమవ యక్షగానము. రఘునాథనాయకాభ్యుదయద్విపదకావ్యమునకు యక్షగాన రూపము ద్విపదకావ్యములోని ద్విపద లిందు కలవు. అంతేకాదు. తాతాచార్యుల సమాధానమునందు "ఆరూఢి ద్విపదకావ్యము పేయవయ్య" అని కూడ కలదు. ద్విపద కావ్యములోవి ద్విపదలచు అట్లే గ్రహించుటవలని ప్రమాదము. కనుక ద్విపదకావ్యము తరువాత యక్షగానరూపకల్పనము. కాఁబట్టి రఘునాథాభ్యుదయము రచనాకాలము **1648** ప్రాంతము కావచ్చును.

రఘునాథనాయకాభ్యుదయద్విపదకావ్యము సవివరము. రఘునాథాభ్యుదయ యక్షగానము సంగ్రహము.

రఘునాథాభ్యుదయము కృత్యాదిని రాజగోపాలస్తుతి కలదు.

"భోజకన్యాముఖాంభోజరాజమరాళ
సత్యాఘనస్తనస్తబకభృంగ
జాంబవతీవిలోచనచకోరశశాంక
మిత్రవిందాతటిన్మేఘరూప
భద్రావశావశాభద్రదంతావళ
వరసుదంతామహోవమృగేంద్ర
లక్షణారూపకలాపినీపర్జన్య
భానుసుతాలతాపారిజాత
షోడశస్త్రీసహస్రచక్షుఃప్రసార
హారసారమపారమోహనశరీర
విజయరాఘవభూపాలభజనలోల
కేలు మోడ్చెద రాజగోపాల నీకు"

ఇది విజయరాఘవనాయకుని పూతనాహరణమునందు ఇట్లే కలదు. కాళియ మర్దనమునందు, ప్రహ్లాదచరిత్రమునందు లేదు.

ఇష్టదేవతాస్తుతి తర్వాత విజయరాఘవుని కైవారగద్య కలదు.

"శ్రీరాజగోపాల చరణారవింద భజనానంద సాంద్ర, రఘునాథనాయకరత్న రత్నా కరావతీర్ణసంపూర్ణ, పాండ్యతుండీరాది వైరివీరగజకంఠీరవకిశోర, కళావత్యంబికాకుమార, చంద్రోపేంద్ర సురేంద్రనందనకందర్పకోటిసౌందర్యధుర్య, జీర్ణకర్ణాటక సామ్రాజ్య సంస్థాపనా చార్య, సమసమయసమాచరితసమస్తనిస్తులతులాపురుషాది మహాదానాపదానప్రవర్తితకీర్తి ధౌరేయ, సంగరరంగ గాంగేయ, (ద్విజ) సహస్రాభీష్టమృష్టాన్నదానదీక్షాధురీణ, మానినీ నూతనపంచబాణ, విశ్వవిశ్వంభరాభారభరణవిచక్షణభుజాదండ, శాశ్వతైశ్వర్య ధౌరంధర్య మేరుకోదండ, దక్షిణ సింహాసనపట్టభద్ర, కలియుగరామభద్ర, [చతుర్విధకవితానిర్వాహ సార్వభౌమబిరు దాంగద విరాజమాన చరణాంభోజ] కవిసమాజభోజ, జవకచరణ (సమవిధాయుక్త?) రాజీవసేవావిధాయక, విజయరాఘవనాయక, పరాకు స్వామి"

రఘునాథాభ్యుదయము తుదిని రఘునాథనాయకుడు "నిజలీలావిలాసశృంగాట కంబుగా నాటకంబు హవణించిన తన ముద్దుపట్టి యగు విజయరాఘవపట్టభద్రునకుఁ బట్టంబు గట్టి యతఁడు కావించు వివిధోపచారంబులకు హర్షించుచు నమరులు పుష్పవర్షంబు వర్షింప శుభోదర్కంబుగా నటియించె" నని కలదు. ఇది చారిత్రికసత్యము కాదు. నటించినది. నాటకసత్యము.

ద్విపదకావ్యమునందు లేని, యక్షగానమునందు కల విశేషములు :

1. ఆస్థానకవయిత్రి రామభద్రాంబ ఆంధ్రసంస్కృతప్రాకృతసమస్యాపూరణము:

"రారాజని యచ్యుతేంద్రు రఘునాథనృపా"

ఏరీ నీ సరిరాజులు
భూరమణులు నిన్నుఁ జాలఁ బొగడుదురు భళీ!
స్వారాజని రేరాజని
రారాజని యచ్యుతేంద్రరఘునాథనృపా."
"కిం తే సంతానపాదపాయంతే"
కతికతి వక్షితిపతయః
కిం తే రఘునాథనాయకాయంతే
భువి బహవః కిల తరవః
కిం తే సంతానపాదపాయంతే.
"రహుణాహక్కితి చందిరో విహాఇ"
పరిపుణ్ణ కళాహి సోహమాణో
అహియం పక్కుళణిచ్చ సెవ్వమాణో
పహిఎ (వ?) చెంది ఆఃు.
రహుణాహక్కితిచందిరో విహాఇ
సంస్కృతచ్ఛాయః[28]
పరిపూర్ణకలాభిశోభమానః
అధితః (?) పత్కులవిత్యసేవ్యమానః
పథి య(శ) . చంద్రికాఢ్యో
రఘునాథక్షితిచంద్రో విభాతి.
2. ఆస్థానకవయిత్రి మధురవాణి ప్రాకృతసమస్యాపూరణము.
"వడ్డఇ రహుణాయరాయపాహోహి"
తెల్లోక్కెక్క సుహావహా
సుహయర విజయరాహవం పఇణం
దెట్ఠూణ ణియతణాయం
వడ్డఇ రహుణాయరాయపాహోహి.
సంస్కృతచ్ఛాయ[29]:-
త్రైలోక్యైకసుఖావహా
శుభకరవిజయరాఘవం శశినం
దృష్ట్వా విజతమాబం
వర్ధతే రఘునాథరాజపాథోధిః

3. అట్టవణ రంగయ లెక్క: "చిదంబరనాథమొదలారి మీఁద ధర్మాసనం మూడు లక్షల మాళ్లకు చెల్లు. రెండు లక్షలున్ను ముప్పై అయిదువేలు కాక పార్వ (ర్వ) విల్వ పదిహేను వేలున్ను శుద్ధవిల్వ యాభైవేలున్ను అంతవిల్వ అఱువైఅయిదువేలు. కుబుసం లక్ష్మయ మీఁద మఱియుం మనోహర్తి రెండు లక్షలున్ను యాభైవేలకు రొఖ్కం చెల్లు లక్షాయాభైవేలు ధాన్యాన చెల్లు. యాభైవేలు, అంతు రెండు లక్షలు కాక

నిల్వ యాభైవేలు. వాచ మాటి మీద కరతొరలు లక్షవరహాలకు రొఖ్ఖం చెల్లు యెనభైవేలు కాక నిల్వ యిరవైవేలు. కోనేరి పిళ్ల మీద సుంకం పద్దెనిమిదివేలకు చెల్లు పండ్రెండువేలు కాక నిల్వ ఆఱువేల మాళ్లు. అంతు నిల్వ లక్షా నలభైయొకవేల మాళ్లు."

ఇట కస్తూరి మాట, అట్టవణరంగయ ప్రత్యుత్తరము, చిదంబరనాథమొదలారి మందలింపు తమిళభాషయందు కలవు. ముగ్గురును తమిళు లగుదురు.

**4.** కమ్మవక్కణ:- "శ్రీమన్మహాచోళసింహాసనేంది
రామనోహరులైన రఘునాథనాయ
నయ్యవారికి మత్తరాది గుంటూరి
యయ్యపరసుని వారప్ప విన్నపములు ....."

విజయరాఘవనాయకుని రఘునాథనాయకాభ్యుదయము, రఘునాథాభ్యుదయము దినచర్యాకావ్యములు. కాఁబట్టి రఘునాథనాయకుని అచ్యుతాభ్యుదయమును దినచర్యాకావ్యమగును. ఇట్టి కావ్యములు ఇతఃపూర్వము మృగ్యము సాళువాభ్యుదయాది సంస్కృతకావ్యములు దినచర్యాకావ్యములు కావు. అభ్యుదయనామమే సమానము.

విప్రనారాయణచరిత్రము : ఇది అంకిత మిచ్చినట్లు లేదు. అయినను ఇష్టదైవము రాజగోపాలస్వామికి అంకిత మిచ్చినట్లు భావింపవచ్చును. ఇందు రాజగోపాల తిరువారాధన సంకల్పమునందు "అస్మిన్ వర్తమానే వ్యావహారికే చాంద్రమానేన నందన నామసంవత్సరే అయనే శుభమాసే శుభనక్షత్రే .... " అని కలదు. నందననామసంవత్సరము 1652 వ సంవత్సరము. కాఁబట్టి విప్రనారాయణచరిత్ర యక్షగానము రచనా కాలము 1652 వ సంవత్సరము కావచ్చును.

విప్రనారాయణుని చరిత్రము పన్నిద్దఱాళ్వారులలోని విప్రనారాయణుని చరిత్రమే. కాని, విప్రనారాయణుని చరిత్రమెల్ల విప్రనారాయణుని కాలమునందు గాక, విజయరాఘవనాయకుని కాలమునందు, శ్రీరంగమునందు గాక దక్షిణద్వారకాస్థలిని, విజయరాఘవనాయకుని సమక్షమునందు జరిగినట్లు కలదు. విజయరాఘవనాయకుడు యక్షగానకర్తయే గాక, యక్షగానపాత్ర కూడ విప్రనారాయణుడు

"ధరణిపైఁ దీర్థయాత్రాపరుం డగుచుఁ
జరియించి దివ్యదేశములెల్లఁ జూచి
మోక్షలక్ష్మీమహామోహనంబైన
దక్షిణద్వారకాస్థలిఁ జేరవచ్చె"

అని కలదు. అంతేకాదు. "విజయరాఘవభూపాలకల్పితంబులై యుప్పరం బంటిన గొప్ప గోపురప్రాకారంబుల దాటి పక్షిరాజలక్షణలక్షితంబైన ధ్వజస్తంభంబు చెంగట సాష్టాంగంబుగా దండప్రణామంబు లాచరించి .... హేమారవిందేంది రామందిరంబుఁ బ్రవేశించి యా దేవిని సేవించి " నట్లు కలదు. " విజయరాఘవ భూపాలుం డర్పించిన కిరీటి పచ్చల కిరీటంబు మొదలైన పెద్ద పెద్ద సొమ్ములుఁ జెక్కి'

న "మన్నారు దేవునిఁ గన్నార సేవించి "నట్లు కలదు. మన్నారుదేవుని గుడికి ఉత్తర భాగమున, హరిద్రానదీతీరచంపకారామసమీపమున ఒక విశాలప్రదేశమున ఆరామ కైంకర్యము చేసినట్లు కలదు. మన్నారుదేవుడే "అతని పట్లఁ గొంత వినోదంబు నడిపింపఁగోరి గుడిసేవ సేయు సాని కూఁతుల వంగడంబునం దిద్దఱ దివ్యాంగనలఁ బుట్టించె"ను. వారేదేవదేవీసోదరీమణులు. ఇద్దఱు విజయరాఘవుని కొలువునందు పదకేళి వినిపింతురు. విజయరాఘవుడు ఇద్దఱికి బురుసాచీరలు, సొమ్ములు ఇచ్చును. కొలువునుండి తిరిగివెళ్లునపుడు ఇద్దఱు విప్రనారాయణుని తోట చాయకు వత్తురు. దేవదేవి పందెము కట్టును. పణము లేదు.

దేవదేవి, విప్రనారాయణుల తొలి సంభాషణ సంస్కృతమునందు జరుగును.

విప్రనారాయణుడు :- "హేరమణి! కిమేతదత్రాగమనం? కిమావాసస్థానం?
కిం భవదీయనామధేయం? కాషాయాంశుకాదివిశేషవేషధారణం కిం కారణం?
కి మేతాదృశదీనతయా? మయా యాదవశశాంకకింకరేణ తవ కిం కరణీయం?
తావకీనం కథయ వృత్తాంత మఖిలం."

దేవదేవి:- "ఆకర్ణయ మౌనిజనవరేణ్య! దేవదేవీనామ్న్యహం దేవదాసీలోభాది
దుర్గుణసమేతాం మాతరం విహాయ వైరాగ్యేణ సమాగత్య భవద్దివ్యసం
దర్శనం (లబ్ధ్వా) స్వామినాం చరణారవిందసేవాం కరోమి, కరుణాకటాక్ష
వీక్షణేన పరిరక్షణం కర్తవ్యమ్."

ఈ రెండు సంభాషణలును చూర్ణికలు.

పెనువానకు తడిసిపోయి, నడురేయి దేవదేవి గోలపెట్టిన, విప్రనారాయణుడు శిష్యునిచేత తలుపు తెఱిపించి, వస్త్ర మిప్పించి, లోనికి రావద్దనుట పాత్రోచితమే. కాని దేవదేవి నిష్ఠురోక్తు లాడిన, విప్రనారాయణుడు శిష్యుని అడిగిన, ఆ ధూర్తశిష్యుడు ఆడిన వార్తలు అనుచితములు. దేవదేవి తల్లి విషకంటకి దూషించిన, విప్రనారాయణుడు "నీ కాళ్లకు మ్రొక్కేనే ఓ యత్త నాపైఁ గోపము మానవు" అనుట పాత్రోచితము కాదు. పంచమపద్ద విప్రనారాయణుడు, విషకంటకి లేని సమయమున దేవదేవి పడకయింటి వాకిలి చేరి తలుపు గడియ తీయుమని బ్రతిమాలుట కూడ పాత్రోచితముగ లేదు. కాని, దేవదేవీవిప్రనారాయణుల సంభాషణ సరసముగానే సాగినది.

విప్ర:- ద్రావిడవేదము చదివినవాఁడనే
ధవళాక్షి నీవు వన్నెలనే.
దేవ:- ద్రావిడవేదము చదివిన వారు కం
దర్పుని వేదము విందురా
విప్ర:- అంగన మన్నారు తళిగప్రసాదమైన
పొంగలి చవిగొన్నవాఁడనే
దేవ:- పొంగలి చవిగొన్నవారికి నతివల
యెంగిలి దిన మనసాయెనా

విప్ర:- ఆరామకైంకర్యమాచరించి, మ
న్నారుని గొలిచినవాఁడవే
దేవ:- ఆరామకైంకర్యమాచరించినవాని
కీ రామ కైంకర్య మేలయా?
xxx xxx xxx
విప్ర:- మన్నారు పాదములు మౌళిపై సోఁకఁగ
మాటికి మ్రొక్కేవాఁడవే
దేవ:- మన్నారు పాదముల మాటికి మ్రొక్కేవాఁడవు
మా కాళ్లకు మ్రొక్కవేలయా"

ఇది మొత్తము పలుబదియొనిమిది పంక్తుల సంవాదము.

విప్రనారాయణుని దయనీయస్థితికి "దయాంతరంగితాంగుఁడైన రాజగోపాల స్వామి వటురూపంబు ధరియించి" వేశ్యకంటికి ఇచ్చిన మించుబంగరుగిన్నె, "విజయ రాఘవభూపాలుం దర్పించిన పంచపాత్రలలో" ఒకటి.

బంగారుగిన్నె లభించగానే వేశ్యకంటికి పరిచారకులను పంపించి,విప్రనారాయణుని రప్పించును. "అపచారంబులు సహింపుమని ఉపచారంబులు" చేయును. అయినను విప్రనారాయణుడు మోసము చేసితివని దేవదేవిని హెచ్చరించును. దేవదేవి కన్నీరు గోట మీటుచు దబ్బర వగపుమాట లాడును. ఇట విప్రనారాయణుని పాత్రచిత్రణము విశిష్టము.

రాజగోపాలస్వామి ఆలయమునకు సంబంధించిన పూజారి, కూరత్తాళ్వారు, ఎంబెరుమాన్, పరాంకుశన్, పిళ్లాయి, నంబులు, తలార్లు, రామాయణదీక్షితులు, నందున రాయన్, శంబువరాయర్, శండబంగారునంబి, దాసి, నంబి తమిళులు. వారి భాష తమిళము. అధికారి, ఆంధ్రభటుడు తెలుగు వారు. వీరి భాష తెలుగు. ఆంధ్రభటుడైన తలారి అడుగుల జాడ చెప్పుటవలన, బంగారుగిన్నె జాడ తెలియును. విప్రనారాయణ సహితమైన దేవదేవిని విజయరాఘవనాయకుని కొలువునకు తీసికొనివత్తురు. విజయ రాఘవనాయకుడు దేవదేవిని "వెఱవకుమని భయంబు వారించి, కల తెఱంగెఱింగించిన మఱలఁ బంపించెదనని బిరుసంబుగాఁ బలు" కును. దేవదేవి

" - నా తగులఁ బాయఁజాలక నాటిరేయి
నాతఁ డీ గిన్నె శిష్యుని చేతనంపె
నెందు లాగించి తెచ్చెనో యే నెఱుంగ
సిరె తెల్పుడు నేర మెవ్వారిదయ్య"

అని కాటుకకన్నీరు గోట మీటుచు గతచరిత్ర విన్నవించును. అయినను విజయ రాఘవనాయకుడు "ఔఁగాదనలేక యమ్మహాభాగవతునిపైఁ దెంపుగా పారుపత్యంబు నడిపింపఁగూడక యే యర్థం బిదమిత్థంబని నిర్ణయింప సమర్థుండు గాక అందోళితహృదయుం " డగును. అప్పుడు రాజగోపాలస్వామి సాక్షాత్కరించును.

విప్రనారాయణుడు పాదారవిందములకు ప్రణమిల్లి ప్రార్థించును. రాజగోపాలస్వామి విప్రనారాయణునికి త్రైలోక్యసామ్రాజ్యమును ఒసగుటయేగాక, విజయరాఘవనాయకునికి ఉపచారయోగ్యుని పట్ల అపచారము చేయనందుకు "హెచ్చుగనుండు"మని ఆశీర్వదించును.

విజయరాఘవనాయకుని వర్ణన పదునెన్మిది ద్విపదలందు కలదు.

"జగదుపకారి వైష్ణవమతోద్ధారి
తగవుల వీడు చింతామణి జోడు
నీతికి మాంధాత నియమసంధాత
జాతివార్తల మేటి శౌర్యకిరీటి
సరమఁడు నెఱజాణ చక్కనివాఁడు
పరమవైష్ణవుల చేపట్టు కూచంబు
పలికి బొంకని వాఁడు పరమవివేకి
నిలుకడ గలవాడు నిత్యాన్నదాత"
"కోరిన వారికిఁ గొంగు బంగారు
చేరువ మేరు వాశ్రితవర్గమునకు
పేదల పాలిట పెన్నిధానంబు
వేదకోవిదులకు వెలలేని సొమ్ము"
"పెరిగినయన్న గోభిలమౌనికన్న
పరతత్త్వరుచిఁ గన్న పాయంపు మిన్న"

అను ద్విపదలందు అతిశయోక్తి పాలు కలదు. విజయరాఘవనాయకుడు వైష్ణవ మతోద్ధారకుడు. వైష్ణవమతోద్ధరణకే చారిత్రకేతివృత్తమును సమకాలికేతివృత్తము చేసెనేమో? ఏమైనను చిత్రమే.

పూతనాహరణము : ఇది అంకిత మిచ్చినట్లు లేదు. అయినను రాజగోపాలస్వామికే అంకితమని భావింపవచ్చును. ఇందు పురోహితుల సంకల్పము నందు "అస్మిన్ వర్తమానే వ్యావహారికే చాంద్రమానఖరనామసంవత్సరే .... చైత్రమాసే శుక్లపక్షే అద్య పంచమ్యాం తిథౌ గురువాసరసంయుక్తాం" అని కలదు. అది 1651 వ సంవత్సరము. కాఁబట్టి పూతనాహరణము రచనాకాలము 1651 వ సంవత్సరమగును.

ఇందు చిన్నికృష్ణుడు పూతనను సంహరించిన పురాణకథ కంటె, గోపకులు పూతన కళేబరమును ఆహరించు కల్పితకథ అధికము. యశోద చెలుల జోలపాటలోని చిన్నికృష్ణుని వర్ణన అపూర్వము. చిన్నికృష్ణునికి అష్టాక్షరి చౌకట్లు, ద్వాదశాక్షరి కంటసరి, షడక్షరి తురుముత్తెపుగుచ్చు, ప్రణవము కౌస్తుభరత్నము, ద్వ్యక్షరి మురువుపూసలు, శతాక్షరి ఉత్తరిగె, సహస్రాక్షరి రత్నహారము, ఏకాక్షరి వాసామణి, బీజాక్షరములెల్ల బిరుదు పెండెము అను విజయరాఘవనాయకుని కల్పన అమోఘము. అంతేకాదు. చిన్ని కృష్ణుడు,

"ప్రాఁజదువుల కోళ్లతోఁ బ్రణవము మంచమై మించఁ
బ్రాఁజిలువ మన్నీఁడు పానుపై రాణింప
చేరిన పాంచరాత్రాదులు జీవిబటువు దిండ్లు గాఁగ
భారతరామాయణాదులు బంగారు గొలుసులు గాఁగ
పావనవేదాంగములు పగడపుఁగంబాలు గాఁగ
దావుకొన్న పురాణములు దంతపుఁజప్పరములు గాఁగ
చిరతరేతిహాసములు సింగంపుఁబ్రతిమలు గాఁగ
పరఁగ షడ్దర్శనములు పట్టు కురాళంబు గాఁగ
వలువచేఁ బొగడొందు నాలాయిరప్రబంధంబు
చలువలు వెదచల్లుచు పైమన్న కండువా గాఁగ
ఆదికావ్యనాటకంబు లపరంజిరేకలు గాఁగ
దేదీప్యమానమై మించు దివ్యశయ్యపై నుండి."

అను విజయరాఘవనాయకుని అభివర్ణన అత్యంతమనోజ్ఞము. అంతేకాదు. విజయరాఘవనాయకుని దృష్టిలో చిన్నికృష్ణుడు రాజగోపాలుడే.

"శ్రీరక్తాబ్జనాయికా చిత్తము కరఁగింపుచు
నారజపు పొగను మీటిన శ్రీరాజగోపాల లాలి.

పూతన "ఆదిరాజులయిండ్ల దాసి"నని, తనకు "బాలవర్ధిని యను ప్రఖ్యాతి' కలదని చెప్పును.

"పుడమిపైఁ బుట్టకుఁ బుట్టి నాతనికిఁ
గడవలోఁ బొడమిన కతల పారునికిఁ
బురుమని కడుపునఁ బొడమిన దొరకు
విరిబోణి, యేటిలో వెడలినాతనికిఁ
గనుదజోంపములోనఁ గలిగినాతనికిఁ
జనుఁబా లొసంగి నే పాఁకితివమ్మ"

అని కూడ తెలుపును. వాల్మీకి, ద్రోణుడు, నారదుడు, వ్యాసుడు, కుమారస్వామి పూతన చనుఁబాలు త్రావిరట! అంతటి పూతన చిన్నికృష్ణుడు "చన్నంటితే యుసురు మిన్నంటెఁ గదరా" అనుచు "వసవల్చు విసువుచే" అసువులు బాయును.

పూతన కళేబరమును తొలగించుటకు నందుడు గోపకులను పిలువనంపును. వారు కోలలు చేఁబూని, గొంగళ్లు కప్పుకొని, పాలకుండలు మూపుల పెట్టుకొని చేలలో నుండి వత్తురు. వచ్చునపుడు పాడు పదాలు, వచ్చిన తర్వాత ఆడు మాటలు, పూతన కళేబరము పగ్గముల బంధించి లాగునపుడు పాడు దరువులు మొదలైనవి మొత్తము హాస్యఘట్టము. ఇందు గొల్లపదాలు, తుమ్మెగి పదాలు, వెన్నెలపదాలు, వన్నెలపదాలు మొదలైన జానపదగేయాలు జాలువాఱినవి.

"గొల్లపదాలు : ఓటికిన్నెర మీటుకొంట గొల్లలారో- ఆ
యేటిసాయవె నేటిమావు గొల్లలారో ॥౧॥
తందనాలు పాడుకొంట మనము రాఁగా
మందలో నొక్క సద్దు రేగె గొల్లలారో ॥౨॥
నందయ్య పిలిచెనఁట గొల్లలారో - మన
మందఱముఁ బోదము రారో గొల్లలారో " ॥౩॥

తుమ్మెగిపదాలు: "రెండు రెండు యిప్పగింజలే తుమ్మెగిలో
రెండు వేల మా యావుల మందలే తుమ్మెగిలో
మూడు మూడు యిప్పగింజలే తుమ్మెగిలో
మూడు వేల మా యావుల మందలె తుమ్మెగిలో "

వెన్నెలపదాలు: కుడుములు పిండికూర వెన్నెలాహే
కూకుండి తివగను వెన్నెలాహే
వల్లేరు దురదంట వెన్నెలాహే
వమల వెలుచువె మా గంగ వెన్నెలాహే
లేరు ముండ్లంట వెన్నెలాహే
పాలవెలుచువె మా గంగ వెన్నెలాహే

వన్నెలపదాలు: "కరకరకర పొద్దు పొడిచి కొరెండలు గాసి
బిరాన్న బీరెండ బిరుదు గొట్టంగ వన్నెలాహే
తూర్పువ మీ యావులు తుంగలు మేసి
పడమట మా యావులు పచ్చికలు మేసి వన్నెలాహే

ఇందు గోపకులు ఇతరగ్రామదేవతలను మాత్రమేగాక; అక్కలమ్మను, ఎల్లమ్మను, ఏకవీరను మ్రొక్కుకొనుట ఇతోధికవిశేషము- కాకతీయుల నాటి ఏకశిలా నగరదేవతలు నాయకరాజుల నాటి తంజావూరు దేవతలగుటకు హేతువు గోపకులే. గోపకులకు కాకతీయులకు ఏమైన సంబంధము కలదేమో పరిశోధనీయము.

పూతనాహరణములోని పురోహితుల సంభాషణము పౌరోహిత్యపతనావస్థను ప్రకటించును.

"సింగావ:- ఓయి రంగావధానులు?
రంగావ:- ఏమయ్యా సింగావధానులు?
సింగావ:- నేడు నందుడుగారు మనలను పిలువనంపిన ప్రయోజనమేదో?
ఏమైనా పెండ్లి పేరంటాలు సాగేనో?
రంగావ:- సాగితేనో?
సింగావ:- కొన్ని తప్పుమంత్రాలు చెప్పి దబ్బర హోమాలు చేసి నాలుగు
పాడియావులు గ్రహించుకోవచ్చునే.
రంగావ:- అనుచున్నాడవో? నీ మార్గమల్లా నే బయలు చేస్తేనో?
సింగావ:- అనకురా వెఱ్ఱి, నే నీకు సగం పంచియిచ్చేనుగాయూరకుండరా

రంగావ:- అప్పో నాకు సగం చాలదు. మూడు పాళ్లు ఇచ్చేవు నే వూరుకుండేగాని
సింగావ:- అదేంపిరా అయిదుతరాలకు వురోహితుండను నే నమండగా
నీకు మూడు పాళ్లు అనగా నేంపిరా?
రంగావ:- ఓరీ వజ్రకుంత, నీకు వకపాలు చాలదపరా?
సింగావ:- ఓరీ యిమవలె పెద్దపిన్నంతరువు విచారించుకోక యెదురుమాట్లాడ
కురా నీ వడిగినట్లల్లా యిచ్చేము గాన వూరకుండరా.
రంగావ:- అపయితే నాకు వుత్తరువులందుకోనే కాదంచున్నావా?
గొల్లమాట:- ఒరే ఒరే బాపనకేసుగాండ్లాల, మీరేల కొట్లాడేరు? ఇద్దరు రండంండ్రా.

పూతనాహరణములోని పురోహితుల సంభాషణలు, గోపకుల మాటలు వ్యావహారికభాషలోనేగాక పాత్రోచితభాషలోను కలవు. ఇది విశేషము.

పూతనాహరణము శృంగారనాటకమని కథాప్రారంభమునందు కలదు. "పూతనామథనకథాసంవిధానచాటుధారాధాటికి శృంగాటకంబగు శృంగారనాటకంబునకు-" కాని పూతనాహరణము శృంగారరసప్రధానము కాదు. శృంగారరసప్రసక్తి లేదు. అయినను శృంగారనాటకమనుటలోని ఆంతర్యము దురవగాహము.

కాళియమర్దనము : ఇది రాజగోపాలస్వామికి అంకితము. కాళియమర్దనము తుదిని "రాజగోపాలస్వామి తనకు నాటకచాటుకవితాకన్యక నొసంగిన విజయరాఘవునకు" అని కలదు. కవితాకన్యక నొసగుట అనగా అంకితమిచ్చుటయే. ఆ కవితాకన్యక కాళియమర్దననాటకమే. అదివి,

"విజయరాఘవదత్తవిత్తనిర్వృత్త
రజితకాంచనదివ్యరత్నసంఘటిత
రమణీయగోపురప్రాకారమధ్య
సమధికమణిమయస్తంభసహస్ర
పటుశిలామంటపపశ్చిమభాగ
ఘటితగర్భగృహోపకంఠదేశమువ
xxx xxx xxx
రాజగోపాలుండు రంజిల్లుచుండు"

అని కలదు. ఇందు రాజగోపాలస్వామి ఆలయమునకు విజయరాఘవ నాయకుడు ఇచ్చిన ధనముతో గోపురప్రాకారము నిర్మించినట్లు కలదు. ఇట్లు రఘునాథ నాయకాభ్యుదయాదిపూర్వకృతులందు లేదు. కావున గోపురప్రాకారనిర్మాణము తదనంతరకాలికము కావలయును. అది ప్రసక్తమైన కాళియమర్దనము తదనంతర కాలికమగుట తథ్యము. కాబట్టి కాళియమర్దనము రచనాకాలము 1655 ప్రాంతమగును.

ఇదొక విలక్షణమైన యక్షగానము. ఇందు దక్షిణద్వారకాస్థలమువందలి రాజగోపాలస్వామియే గోపికలతో యమునావదీతీరము చేరి, బాలకృష్ణుడై కాళియమర్దనము కావించును. కారణము రాజగోపాలస్వామి కొలువుకూటమునకు వచ్చి,

గోభిలగోప్రళయులు కొనియాడి, "మా పాలఁ బ్రసన్నులై మున్ను మీరు నటించిన బాలలీలలు చూపితిరికద. కాళియభుజంగభంగనాట్యప్రసంగం బింకొకసారి చూడ వేడుకగుచున్నది. మమ్మనుగ్రహింపరయ్యా" అని ప్రార్థించుటయే.

మన్నారుదేవుడు అనగా రాజగోపాలస్వామి "రారే గోపికలార సారంబగు యమునా నదీపూరంబులో విహారంబు సల్పుదమా" అనిన, గోపికలు "యమునాజీవనంబు పరమ పావనం బగును. అయిన నిది కాళియుండను పెనుచిలువ నెలవు గనుక మనకు పనికిరాకున్నది. వాని నెడలించి మా భయంబు సడలింపవయ్యా" అని విన్నవింతురు. మన్నారుదేవుడు పన్నగేంద్రుఫణామండలంబుపైఁ గుప్పించి, తజ్జలంబులఁ గలంచి యాడినఁ గాళియుండు శౌరిపై నిగుడును. బాలకృష్ణుడైన మన్నారుదేవుడు కాళియఫణి ఫణాగ్రంబునఁ బదాగ్రంబు హత్తించి తద్వాలంబు కేలఁ గీలించి నటించును. కాళియాంతఃపురకాంతలు పతిభిక్ష వేడుదురు.

"మమ్ముఁ బెండ్లి సేయు మా ప్రాణనాథుని
ప్రాణమిచ్చి నేడు భక్తవరద
నీవు సేయు పెండ్లి విక్కంబు భద్రంబు
నివ్వనాటి పెండ్లి పెండ్లి గాదు."

మన్నారుసామి కాళియుని ప్రాణము కాచును. మడుగు వెడలించును. గోపికలతో జలక్రీడ లాడి దక్షిణద్వారకానగరమునకు వచ్చును. నిజరాజధాని చేరిన రాజగోపాలస్వామికి నీరజముఖులు నీరాజనమిత్తురు. రాజగోపాలస్వామి హేమాబ్జ నాయికాసమేతుడై శుభోదర్కంబుగా నటియించును.

కాళియమర్దనము, గోపికారాజగోపాలుర జలక్రీడ, హేమాబ్జనాయికాసమేతుడైన రాజగోపాలస్వామి ఎట్లు నటింతురోగాని, యక్షగానము సంపూర్ణమగును.

ఇందొక విన్నపము కలదు.

"రుక్మిణీప్రాణవల్లభా, ద్రౌపద్యభిమానరక్షక, గజేంద్రవరద,అహల్యా శాపవిమోచన, కాళియఫణిఫణారంగనాట్యలీలావినోద, విశాలవక్షస్థలకౌస్తుభా భరణ, నీలమేఘశ్యామ, పద్మాక్ష, నీ దయ మా యందుంచి మమ్ము రక్షింపవే సహజగుణసంపన్న సంపంగి మన్న".

కృష్ణవిలాపము : ఇది అరుణాబ్జనాయికారాజగోపాలస్వాములకు అంకితము. ఇందు రచనా కాలమును అందిచ్చు సమాచారము లేదు. 1658 ప్రాంతము కావచ్చును.

ఇది రాజ[illegible]లస్వామి కైవారముమండి కలదు. మన్నారుదేవుని కొలువు కూటము నాయకరాజుల కొలువుకూటము వలె కలదు. (పుటలు 4-5). రాజగోపాలస్వామి కొలువు తీర్చిన వెంటనే బరాబరి వచ్చి పల్లాము చేసి సదకేళిక వినిపించును. రాజగోపాలస్వామి బరాబరికి తాంబూలజాంబూనదాంబరకదంబములు బహూకరించునెడ రుక్మిణి సఖీమణి వచ్చును. ఆమెను రాజగోపాలస్వామి అనగా

కృష్ణుడు రుక్మిణిని హరిద్రానదీసమీపమునందలి కాంచనవనమునకు తోడ్కొనిరమ్మని నియోగించును. కాంచనవనమునందు కృష్ణుడు రుక్మిణితో "జోడుగూడి సొక్కి సొక్కించి సొలసి సొలయించి వలచి వలసించి దక్కితివి చిక్కితివని మైమఱపించి దయబలియించి పెనంగి యనంగసామ్రాజ్యం బేలించి లాలిం"చును. అదియెల్ల "శకునపరంపరల వలన ... నిర్ణయించి విత్రస్తచిత్తయై సత్రాజిత్తనూజ చిరసమయవిరహజనితవేదనాదోదూయ మానమానస" అగును. రాజగోపాలస్వామిని రమ్మని వేడుకొని, అచ్యుతుని చెంతనుండి వచ్చిన చెలికత్తెను అడిగి తెలిసికొని "కోపాటోపంబున మాట లేక యేధమానసయై క్రోధాగారంబుఁ జేరి తలఁపు దాఁచి తలుపు పైచి చలపట్టినట్టులున్న" మురవైరి "ముచ్చు వలె వచ్చును." హరి ఎంత బ్రతిమాలినను హెగ్గడికత్తెలు తలుపు తీయరు. సత్యభామాకృష్ణుల సంవాదమిట్లు సాగును. (పూట 12.)

"పదం.

(శ్రీకృష్ణు) : ఆదిరూపుఁడనే యతివరో! నేను వాదులేటికి నన్నాదరించవే

(సత్య) : ఆదిరూపుఁడవు గనుక యా యింతి దృష్టివలల- మోదమున తగిలితివౌర1

(శ్రీకృష్ణు) : తామేలు వాఁడని దయసేతు నిప్పుడు కోమలి! నేఁడింత కోపమేలే?

(సత్య) : తామేలు వాఁడవు గనుక తరుణి పాదములు వేమాఱు గొలిచితివో మన్న!

(శ్రీకృష్ణు) : వరసింహుఁ డందురు నాతిరో! వన్నెలు
విరసమేలే? నిన్ను వేడెదను సత్య! విరసమేలే? నిన్ను వేడెదను.

(సత్య) : వరసింహుఁడవు గనుక వడమంతరము చెలిమి
మెరయించితి వా తరుణికిని.

(శ్రీకృష్ణు) : అభిరామమూర్తివి యందు రాదరమ్మువ నీ
విభుఁడైన మన్నఁడనే వెలఁది! నేను

(సత్య) : అభిరామమూర్తివి గనుక అతివలు గోరుదురా! ఒక్క
ఇభరాజగమనకు హితవైతివి

(శ్రీకృష్ణు) : మన్నారుదాసుని మానవపూజలను చెన్నొందువాఁడవే చెలియ!

(సత్య) : మన్నారుదాసుని మానసాంబుజమున వెన్నుఁడ! ఉందాము వేడుకను"

ఇందు కృష్ణునికి ఇంచుక అవకాశము లభించి సత్యభామను ఇంకను వేడుకొనును. అంతేకాదు. కైసేయును. సల్లాము సేయును. (పుటలు13-14)

"మధ్యమాది - ఝంప
కురు లమర దిద్దు మది - కొదవెల్ల దిద్దున్
అరవిరులు జాట్టు రతి - వలయించఁ జాట్టున్
మేనికాకలు దీర్చు - మెరమెరలు దీర్చున్
చాన మైఁ గైసేయు - సల్లాము సేయున్."

అయినను సత్యభామ అపహసించును. (పుట 14)

"దరువు - రేవగుప్తి - ఆది
"రసికుఁడవౌదువులేర రాజమన్నారు!
పసులగాపరికిఁ దెలుసునా పడఁతుల మేర"

అపహసించిన, సత్యభామ "కొంతదారికి వచ్చెనని" కృష్ణుడు ఆ మిటారికి మ్రొక్కును. (పుట 15)

"దరువు - కేదారగౌళ - జంపతాళం
మొక్కేను మొక్కేనే నీ పాదములకు మొక్కేను మొక్కేను
జక్కవగుబ్బెత! సత్యభామ! నీకు మొక్కేను (మొక్కేనే)."

ఇట్లు మ్రొక్కిన సత్యభామ "అంతరంగంబున నెంతయు సంతసిల్లి సంతంబు చెల్లెనని కంతుజనకునిఁ గౌఁగిటనుంచి గారవిం " చును. సత్యారాజగోపాలస్వాములు అత్యంతశృంగారమును అత్యంతమోదమున అభినయింతురు. అత్తరి ఒక బిత్తరి "అలుక దీరెనటే! మీ యిద్దఱి - యలుక దీరెనటే! కులుకుగుబ్బల గురుతులున్నవి" అని అభివర్ణించును. ఇద్దఱు మంగళము పాడుదురు. ఇది కృష్ణవిలాసము.

ప్రహ్లాదచరిత్రము : ఇది కూడ అంకితమిచ్చినట్లు లేదు. ఇందు "భోజకన్యాముఖాంభోజ" అను సీసపద్యము లేదు. "శ్రీరాజగోపాల" అను సీసపద్యము కలదు. కనుక రాజగోపాలస్వామికి అంకితమిచ్చినట్లు భావింపవచ్చును. కృత్యాదిని కృతుల వివరమును తెలుపు సీసమాలికను బట్టి తుది రచనమని నిర్ణయింపవచ్చును. కాఁబట్టి ప్రహ్లాదచరిత్రము రచనాకాలము 1660 ప్రాంతము కావచ్చును.

ప్రహ్లాదచరిత్రము ప్రసిద్ధమైన ప్రహ్లాదచరిత్రమే. కాని పౌరాణికప్రతిపత్తి క్వాచిత్కము. సమకాలికసమాచారము సమధికము. కవి కూడ ఒక పాత్ర.

"విజయరాఘవస్వామి తెల్పే మాట :- మదీయజననీజనకులైన ప్రధానవధూ వరులారా! హేమారవిందేందిరారాజగోపాలకస్వాములారా! నారదపరాశరపుండరీక వ్యాసాదిభూసురోయదాసుల కగ్రేసరుండైన ప్రహ్లాదుని చరిత్రంబు పరమపవిత్రంబనియు నెంచి, మీరు నాకుఁ బాలించిన సారసార్వభౌమంబు సఫలంబుగా నాటకనాటుకావ్యరీతి వర్ణించెద నాకర్ణింపరయ్యా."

హిరణ్యకశిపుడు కొలువై వేత్రపాణికి ఆనతీయ, అతడు పిలువ ఆ యా పాత్రలు ప్రవేశించును. అట్లు ప్రవేశించిన మొదటి పాత్ర విదూషకుడు. అతడు ఆస్థానసంతోషి, సభారంజకుడు అని కూడ వ్యవహృతుడు. "ముంత మొగము దొంతర పండ్లును కంతిగొంతును గలిగి వింతవింతగ గంతులు వైచుచు వచ్చును. సంభాషణ లేదు. "ఇక్కడ విదూషకుడు హాస్యపుమాట లాడేది" అని ప్రయోగసూచన కలదు. పాత్రధారి ఇష్టమున్నమాట.

ప్రహ్లాదుని గురువు శుక్రాచార్యుల తనయుడు. అతడు నీరుకావి దోవతి కట్టుకొని, విలువుమగ్గువు దువ్వటి కప్పుకొని మాత్రమేగాక "కవకవుఁగల్లజోడు" పెట్టుకొనును.

ప్రహ్లాదునికి విద్యారంభము "భారతీభవనము" నందు జరుగును. అది తంజావూరు కోటలోని భవనమే అగును. గురుశిష్యుల ప్రథమపాఠము రక్తి కట్టును.

"గురువాక్యం :- 'నమో హిరణ్యాయ' అనవోయి.
ప్రహ్లాదవాక్యం:- నమో హిరణ్యాంబరాయ
గురువాక్యం :- ఓయి అటువలె గాదు. అంబరశబ్దమేల చెప్పేవు? నమో హిరణ్యాయ అనవోయి.
ప్రహ్లాదవాక్యం:- నమో హిరణ్యగర్భజనకాయ.
గురువాక్యం :- అయితే నీకీ శబ్దము రాదు. గంటిమి. నమో దైత్యవరాయ అనవోయి.
ప్రహ్లాదవాక్యం:- నమో దైత్యహారాయ.
గురు (తనయుని?) వాక్యం:- ఓయి బాలకా! యీ ప్రతికూలవచనంబు లేల? నమో దేవ భయంకరాయ అనవోయి.
ప్రహ్లాదవాక్యం:- నమో దేవాభయంకరాయ."

హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని శిక్షించుటకు రప్పించిన వ్యాళగ్రాహి, జగజెట్లు, పురోహితులు విజయరాఘవనాయకుని సమకాలికులే.

"పాములవాఁడు:- మ్రొక్కేను మ్రొక్కేనయా రక్కసిరాయా! పాలసంద్రాన పవళించిన రాజగోపాలస్వామికి పానుపైన యో నాగుమయ్య! త్రిపురాలు సాధించిన జంగమయ్యకు బంగరు వింటివారియైన యో కోరజీవాల దునేదార! నాకుఁ బ్రసన్నుండవు గావయ్యా."

"జెట్ల భాష :- సలాము సలామయ్యా దానవలలామ! కత్తి రంగాజెట్టి, అడ్డతల హనుమా జెట్టి, నిమాజెట్టి, బవనాజెట్టి వీరు మొదలైన వారిలో మా చేతిపెట్టు తినవివారు. లేరు. దూరదేశానమండి స్వామివారి కీర్తిప్రతాపాలు విని వస్తిమి. మీ వేడుక చెల్లించేము చూడ నవధరించుడ."

"పురోహితుల మాటలు :- ఎజ్జావధాని :- పర్వావధానిగారు, నగరివారు మనలఁ బిలిపించిన కార్యమేదో
పర్వావధాని ప్రత్యుత్తరం :- ఎజ్జావధానులుగారు! మీ రమండుండ. నేను నగరి లోనికిఁ బోయి విచారించి వచ్చేగాని.
(ఎజ్జావధాని:- ?)
పర్వావధాని :- అదేందిరా పడుచుముడియ! పెద్ద పిన్నయంతరువు లేక యెదురు మాటలాడుచున్నావు. నీవు రాజాస్థానానకు యోగ్యుండవవురా!
ఎజ్జావధాని :- ఓరీ వజ్రకుంఠ! వయసు చెల్లితేనే నీ వాక పెద్దవవురా? నా వలె వేదశాస్త్రాలు పరీక్ష యిచ్చేవు?
పర్వావధాని :- ఓహోహో పడుచువరకా! నిన్ను నేను పరిచేసుకొని వేదశాస్త్రాలు పరీక్ష యిస్తేగాని మాకు ప్రతిష్ఠ గాదేమో! ఇటువలె యద్వా తద్వా లాడక యూరకే యుండఁగదరా."

పురోహితులు అభిచారహోమము చేసిన పుట్టిన మహాశక్తి చక్రప్రహారమున ధరాస్థలిఁ దై ళ్లి, త్రుళ్లిపడి లేచి గర్జిల్లుచు, పరువులెత్తు పురోహితులను హత్తుకొన్నప్పటి వారి మాటలు ఇంతకంటె హాస్యాస్పదము.

"ఎజ్ఞావధాని మాట:- ఓయి సర్వావధాని, నా కుళ్లాయి యేదోయి!
సర్వావధాని మాట :- ఓయి యెజ్ఞావధాని, నీ కుళ్లాయికి మండాడుచున్నావు నా శిరస్సేదోయి!
ఎజ్ఞావధాని :- నీ శిరస్సెటుబోతేనేంది. నేనేదోయి?
సర్వావధాని :- ఓయి నీవే నేను గాదషహోయి?
ఎజ్ఞా :- నీవే నేనైతే నేనేదోయి?
సర్వా :- ఓయి! అమగాదోయి, శక్తి కన్నువేసి ఎన్నెత్తుకపోయేనో.
ఎజ్ఞా :- ఓయి, వన్నెవ్వరెత్తుకపోయిరోయి!
సర్వా :- నిన్నెవ్వరైనా యెత్తుకపోతే మాట్లాడేవారెవ్వరోయి.
ఎజ్ఞావ :- అయితే నేమన్నాఁడవంచున్నాఁడవు. వన్ను జూపుమా నీకు దర్భపవిత్ర మిచ్చేగాని
సర్వావ :- నేనుండి గదనోయి విన్ను జూవవలెను. నన్ను జూపుమా నీకు దర్భచక్కిలమిచ్చేగాని
ఎజ్ఞావ :- ఆదిగో నీవు. ఇదిగో నేను. ఇదిగో నీవు. ఆదిగో నేను. నీవుఁ బదిలం. నేఁ బదిలం- నేఁ బదిలం. నీవుఁ బదిలం."

ప్రహ్లాదహిరణ్యకశిపుల సంవాదము, ఉగ్రనృసింహస్వామి ఆవిర్భావము, హిరణ్యకశివు సంహారము, బ్రహ్మాదిదేవతలు, లక్ష్మీదేవి ఉగ్రనరసింహస్వామిని శాంతింపజేయలేక పోవుట, ప్రహ్లాదుడు శాంతింపజేయుట భాగవతకథానుసారమే కాని రేఖాచిత్రము. ప్రహ్లాదుని స్తుతియందు రాజగోపాలస్మరణము స్థానికవిశేషము

"జయ రాజగోపాల జయ దయాశీల
xxx xxx xxx
రక్షింపు మముఁ జాల రాజగోపాల"

నృసింహస్వామి ప్రహ్లాదుని ఆదరించునెడ, లక్ష్మీదేవి ఇంద్రాదులను రక్షింపుమనుట, బ్రహ్మరుద్రాదులు ప్రశంసించుట స్వతంత్రకల్పనము. బ్రహ్మరుద్రాదుల ప్రశంస విన్నపము.

"సత్యభామామనోహరా! మీరు పదారువేల గోపికాస్త్రీలతోఁ గూడి జలక్రీడ లాడిన మహిమవలన 'కృతఘ్నేనాస్తిమర్యాదా' అన్న వచన మున్నప్పటికిని, ఆ కృతఘ్నత్వంబు పోగొట్టిన హరిద్రానదిని ఒకపారి స్నానంబు చేసినంతనే సకలతీర్థంబుల నాడిన ఫలస్వారస్యంబు కలుగుంగానున, మీ మహత్వంబు వర్ణింపనెంతటివారము అయినను నాయందు దయయుంచి రక్షింపవే సహజగుణసంపన్న, సంపంగిమన్న"

ఇది కృష్ణమాచార్యుల సింహగిరి నరహరివచనములను జ్ఞప్తికి తెచ్చునది.

అంతేకాదు. ఇందలి హరిద్రానదీమాహాత్మ్యము, సంపంగిమన్నస్మరణము స్థానిక విశేషము. హరిద్రానదీతీరస్థమే దక్షిణద్వారకాస్థలి. అందలి దైవమే రాజగోపాలస్వామి, మన్నారుదేవుడు, సంపంగిమన్న.

నృసింహస్వామి ప్రహ్లాదుని రాజ్యాభిషిక్తుని చేయుట, బ్రహ్మాదిదేవతలు పుష్పవృష్టి కురిపించుట, రంభోర్వశులు "మన్నారుదేవికి మంగళం" అని నటించుట కొసమెఱుపు.

ప్రహ్లాదచరిత్రమునందు పద్యములు, ద్విపదలు దరువులు కలవుగాని వచనము ప్రధానము. నాటకసరణి అధికము.

కవితారీతులు: పూర్వోదాహృతములైన రఘునాథనాయకాభ్యుదయము లోని స్థానికప్రకృతిచిత్రణము, సమకాలికసమాచారము; రఘునాథాభ్యుదయములోని సమకాలికసమాచారము; విప్రనారాయణచరిత్రములోని అన్యథాకల్పనము, పాత్రచిత్రణము, సమకాలికసమాచారము; పూతనాహరణములోని వర్ణనాకౌశలము, జానపదగేయామసరణము, హాస్యరసపోషణము, పాత్రోచితభాష, కాళియమర్దనములోని విలక్షణత, ప్రహ్లాదచరిత్రములోని పాత్రప్రవేశవిధానము, హాస్యరసపోషణము, సమకాలిక సమాచారము, స్థానికప్రకృతిచిత్రణము మొదలైనవి విజయరాఘవనాయకుని. కవితారీతులకు కరదీపికలు.

## విజయరాఘవనాయకుని ఆస్థానకవులు

చెంగల్వ కాళయ: ఇతని కృతి రాజగోపాలవిలాసము. అది విజయరాఘవ నాయకునికి అంకితము. ఇందు విజయరాఘవనాయకుని పట్టాభిషేకసంవత్సరము 1633వ సంవత్సరమని కలదు. (79ప.1ఆ.) ఆ సంవత్సరమే రాజగోపాలవిలాసము రచనాకాలమని ఒక అభిప్రాయము కలదు[30]. కాని రాజగోపాలవిలాసమునందు విజయరాఘవనాయకుడు పరరాజధామలను వశపఱచికొన్నట్లు, వైరిరాజుల వనదుర్గము లెల్ల స్వాధీనము చేసికొన్నట్లు, శత్రురాజులను సంహరించినట్లును కలదు. (70ప. 1ఆ.) విజయరాఘవసభావిషయము కలదు. (13ప. 1ఆ.) శారదాధ్వజము సంగతి కలదు (18,19ప. 1ఆ.) సాహిత్యరాయపెండేరము గుఱించి కలదు. (72-78ప. 1ఆ.) అంతేకాదు. "వీరవెంకటరాయపృథ్వీమహేంద్ర దత్తబహువిధబిరుదముల్ దనరుచుండ నమ్ముఖమునందు ముద్దు చంద్రరేఖ" కలదు. (22ప. 1ఆ.) వీరవేంకటరాయలన విజయనగరరాజా మూడవ వేంకటపతిరాయలు. అతని రాజ్యకాలము[31] 1630-42. ఆ కాలమునందు వీరవేంకటపతిరాయల కొలువునందుండు ముద్దుచంద్రరేఖ,తదనంతర కాలమునందు విజయరాఘవనాయకుని కొలువునందుండుట సంభవము. కావున రాజ గోపాలవిలాసము రచనాకాలము 1643-44 ప్రాంతము కావలయును.

రఘునాథనాయకుని ఆస్థానకవయిత్రి రామభద్రాంబ, విజయరాఘవనాయకుని ఆస్థానకవయిత్రి కృష్ణమాంబ చెంగల్వకాళయ శిష్యురాండ్రు.

"ఘటికాశతగ్రంథఘటవోత్కటవవీన
పాండిత్యగరిమలు భళి యవంగ
సోష్ఠ్యనిరోష్ఠ్యాదికోద్దామరసగర్భ
సందర్భమౌనని సమ్మతింప
మాకందమంజరీమధురఝరీమాధుర్య
రచనావిశేష మౌరా యవంగ
పరిహృతేతరయుక్తిభాగమాతవకథా
చాతుర్యధుర్యత సంస్తుతింప
అయ్యదినముల రామభద్రామ్మవారు
నేడు కృష్ణాజి కవితల నేర్పు మెఱపి
వినికి సేయుట లెల్ల మీ ఘనత గాదె
కవివిమతచర్య! చెంగల్వకాళవార్య!" 30 ప. 1 ఆ.

అని విజయరాఘవనాయకుని అభిప్రాయము. అంతేకాదు.

"ప్రస్తారసంఖ్యను పదమూఁడు కోటులు
నలువదిరెండు లక్షలు పదేడు
వేలు నేళ్నూఱును వింశతియును నాలు
వృత్తంబులందు నీ వృత్తమునకు
నీ వర్ణవసమస్య నీవు గూర్పుమటన్న
నా వృత్తమున సమస్యమ రచించి
యందుమ శ్లోకంబు లాశువుగాఁ జెప్పి
యవి తెమంగునను పద్యములు చేసి
ఇరువదాఱును చందంబు లెచెఁగి యిట్లు
కవితఁ జెప్పిన వార లీ భువినిఁ గలరె?
యనుచు వందఱు వినిపింప ఘనతఁ గాంచె
కీర్తనీయగుణాలంబ కృష్ణమాంబ." 27 ప. 1 ఆ.

అని కాళయ అభిప్రాయము. రామభద్రాంబ, కృష్ణమాంబ అంతటి కవయిత్రు లగుట కాళయ ఘనత. కారణము గురుత్వము. గురువును శిష్యురాండ్రు మించిరో, శిష్యురాండ్రును మించిన గురువో, ఏమైనను అది కాళయ ఘనతయే. రామభద్రాంబ గురువు రఘునాథనాయకుని కాలము నందుండుట సహజము. అయినను రఘునాథ నాయకుని ఆస్థానకవి అయినట్లు లేదు. కారణము అనూహ్యము. విజయరాఘవ నాయకునికి ఆస్థానకవి మాత్రమేగాక, కాళయ ఆత్యంతాప్తుడు. విజయరాఘవ నాయకుడు కాళయకు అగ్రహారములు, రాజలాంఛనములు (33ప. 1ఆ.) గృహరాజమునకు వచ్చి, విందారగించి, కాళయ ఆత్మజాలకును రాజలాంఛనము లొసగుట అపూర్వవిశేషము.

"విందునకుఁ దాము గటితలు వేడ్క వచ్చి

వరుస సొమ్ములు తమయింటివారి కొసఁగి
యాత్మజాల కెల్ల చతురంతయానములను
మహితభూషణములు బహుమతులు సేయు." 35 ప. 1 ఆ.

ఇంత రాజగౌరవము పొందిన తెలుగు కవి ఇంకొకడు లేడు.

రాజగోపాలవిలాసము అయిదాశ్వాసముల కావ్యము. మొదటి నాలుగాశ్వాసములు కాళయ వరపకవితానిధానము. స్వీయకవితానిధానము. అయిదవ ఆశ్వాసము మాహాత్మ్యప్రధానము. శ్రీకృష్ణుని అష్టమహిషులను అష్టవిధశృంగారనాయి కలుగ మలచినది మొదటి నాలుగాశ్వాసముల మొత్తము. పంచమాశ్వాసము చంపకారణ్య మాహాత్మ్యమునకు తెనుగు సేత. స్వాధీనపతిక, వాసకసజ్జ, విరహోత్కంఠిత, విప్రలబ్ధ, ఖండిత, కలహాంతరిత, ప్రోషితభర్తృక, అభిసారిక అష్టవిధశృంగారనాయికలు.

కావ్యమునందు స్వీయ - రుక్మిణి, జారిణి - భద్ర. జారిణి - లక్షణ, విప్రలబ్ధ - జాంబవతి, ఖండిత - మిత్రవింద, విరహోత్కంఠిత - సుదంత, ప్రోషితభర్తృక - సత్యభామ అను శీర్షికలు కలవు. పీఠికయందు రుక్మిణి స్వీయ, భద్ర కలహాంతరిత, లక్షణ వాసకసజ్జిక, జాంబవతి విప్రలబ్ధ, మిత్రవింద ఖండిత, సుదంత విరహోత్కంఠిత, కాళింది ప్రోషితభర్తృక, సత్యభామ స్వాధీనపతిక అను పట్టికలు కలవు. రెండును దోషజుష్టములు. రుక్మిణి స్వీయ అనుట ఘోరమైన ప్రమాదము. రుక్మిణి స్వీయ అయిన తక్కినవారు పరకీయలగుదురు. కాని అష్టవిధనాయికలందఱును స్వీయలే. పరకీయలు కారు. భద్ర జారిణి, లక్షణ జారిణి అనుట మహాఘోరమైన ప్రమాదము. శ్రీకృష్ణుని భార్య లెవ్వరును జారిణులు కారు. అందఱును పతివ్రతలే. లక్షణ వాసకసజ్జిక. వాసవసజ్జిక కాదు. ఇది ముద్రణదోషము కావచ్చును. ఇంతకు అష్టమహిషులు అష్టవిధశృంగార నాయికలుగ కవి మలచిన విధమిది :

రుక్మిణి కలహాంతరిత. భద్ర అభిసారిక. లక్షణ వాసకసజ్జిక. జాంబవతి విప్రలబ్ధ. మిత్రవింద ఖండిత. సుదంత విరహోత్కంఠిత. కాళింది ప్రోషితభర్తృక. సత్యభామ స్వాధీనపతిక.

అష్టవిధనాయికల లక్షణములివి:

"వరుఁడు కైవసమైన వనిత స్వాధీనభ
ర్తృక; ప్రియాగమవేళ గృహముఁ దమవు
నవరించు వింతి వాసకసజ్జ; పతిరాక
తడవుండ నుత్కంఠఁ దాల్చు వింతి
విరహోత్క; సంకేత మునసి నాథుఁడు లేమి
నెన వార్తయొ కాంత విప్రలబ్ధ;
విభుఁ డన్యపతిఁ బొంది వేకువ రాఁ గుందు
నబల ఖండిత; యల్క నదివుఁ దెగడి
అనుశయముఁ జెందు పతి కలహాంతరిత; వి

జేతుఁడు విదేశగతుడైనఁ గృశతఁ దాల్చు
నతివ ప్రోషితపతిక; కాంతాభిసరణ
శీల యభిసారికాఖ్యయై చెలువు మెఱయు." 40 ప. 2 ఆ. కా. ఆ. సం.

రుక్మిణి కృష్ణుని నేరము లెన్ని కినుక వహించును. కృష్ణుడు రుక్మిణి మేడకు వెళ్లి చేరువను పొంచియుండును. (95) రుక్మిణి పశ్చాత్తాపమునంది కృష్ణుని వేడుకొనును. (97) అది పండ్రెండు పద్యములందు కలదు. (99-110) చెలికత్తె వచ్చి పరాచికమాడును. (112) రుక్మిణి "కినుక దొఱంగ వల్లభునిఁ గీర్తన సేయఁగ నీవు వింటివా?" అని ప్రశ్నించును. (114) అది విన్న కృష్ణుడు సమీపించును. చెలికత్తె నిష్క్రమించును. కృష్ణుడు రుక్మిణిని ఓదార్చును. (117-119) కౌఁగిట చేర్చును. (120-1ఆ.) ఇందు రుక్మిణి కినుక, పశ్చాత్తాపము, చింత కలహాంతరిత లక్షణము. కనుక రుక్మిణి కలహాంతరిత.

భద్ర కృష్ణుడు తెలియఁజేసిన సంకేతస్థలమునకు బయలుదేరును. (16) దారి పొడవున విరహవేదన అనుభవించును. (17) ఎలదోట చేరును. (17) ఎదురు తెన్నులు చూచు కృష్ణుడు పొదరిల్లు చేరును. (19-26) భద్రను అనునయించును. (28-36) భద్రకొఱకు ఉవ్విళ్లూరును. (34-35) భద్రను కౌగిట చేర్చును. (37-2ఆ.) ఇందు భద్ర, కృష్ణుడు తెలియఁజేసిన సంకేతస్థలమునకు అభిసరించినది. కనుక భద్ర అభిసారిక. సన్నజాజిసరులు, ముత్యాలహారములు, గందవుఁబూత, కర్పూరతిలకము, తెలిసాలియ ముసుగు ధరించి, వెలినిగ్గు తీవెల ప్రోది గనుటవలన (33ప. 2ఆ.) జ్యోత్స్నాభిసారిక.

లక్షణ కృష్ణుని రాక గోరి కేళీసౌధమును అలంకరించును. (42) కృష్ణునియొద్దకు చెలికత్తెను పంపును. (45) ఆమె కృష్ణునికి లక్షణ కేళీసౌధమును అలంకరించిన విధానమును వివరించును. (47-54) "రాను నేలర యేలరా రాజసములు" అని నివేదించును. (55) కృష్ణుడు లక్షణ మేడకు వచ్చును. (57) ఎదురు చూచు లక్షణను సమీపించి, ఆమె భవనాలంకరణమును ప్రశంసించును. (61-63) సరససల్లాపముల అనంతరము విందు కౌగిట తేల్చును. (79-2) ఇందు లక్షణ కృష్ణుని రాక గోరి కేళీసౌధమును అలంకరించినది. కనుక లక్షణ వాసకసజ్జిక.

జాంబవతి దూతికామణికి, కృష్ణుడు వంచన చేసెనని వలవంత ప్రకటించును. (6-14) దూతికామణి ఓదార్చును. (16-19) కృష్ణుడు తన రాకలు మదిగోరు జాంబవతి హృదయమెఱిగి వచ్చును. (20-22) అనురక్తుడగును. (23-27ప. 3ఆ.) ఇందు జాంబవతి కృష్ణుడు రాకపోవుటవలన ఆర్తి చెందినది. కనుక జాంబవతి విప్రలబ్ధ.

మిత్రవింద కృష్ణుని చెక్కిటి గోరులు, నిదురచిన్నెలు, వాలుజావులు, వుక్కిటివిడెము, మేని జవాదివసలు గమనించి (29) హేతుగర్భముగా (30) చెణకును. (31-43) కృష్ణుడు మిత్రవిందను ప్రసన్నురాలిని చేసికొనును (45-51ప. 3ఆ.) ఇందు మిత్రవింద కృష్ణుడు అన్యసతిని పొంది వచ్చుటవలన కుందినది. కనుక మిత్రవింద ఖండిత.

సుదంత "విరహదురంతయైన"దని కవివచనము. (56) అంతేకాదు. సుదంతకు చెలికత్తెలు శీతలోపచారములు సేయుదురు (58) సానుభూతి ప్రకటింతురు (59-62) సుదంత కృష్ణుడు రాడని స్రుక్కును. (65-69) మన్మథమారుతచంద్రో పాలంభములు సేయును. (71-78) ఒక చెలికత్తె కృష్ణుని రప్పించును. (81) కృష్ణుడు సుదంతను నిండు కౌగిట చేర్చును. (83-84ప. 3ఆ.) ఇందు సుదంత విరహావస్థను అనుభవించినది. కనుక సుదంత విరహోత్కంఠిత.

కాళింది ప్రోషితభర్తృక అని కృష్ణుని వచనము- (4) "నన్ను ప్రోషితభర్తృకగా నొనర్చి" అని కాళింది వచనము కూడ. (6) అంతేకాదు. కాళింది ప్రాణసఖిని దూతిగా పంపబోయి "చెలువుఁడు దేశాంతరమున నిలిచెను నెచ్చెలులు పోననేర్తురె" అని (14) ముద్దుచిలుకను పంపబోవును (15-17) ఇంతలో కృష్ణుడు వచ్చును. "ప్రోషిత పతీధర్మంబు వాటించి లోఁదలఁకంగా నేటి" కని (23) "నెనరులు చిలుకుచు" (24) కౌగిట చేర్చును. (25, 26ప. 4ఆ.) ఇందు కాళింది కృష్ణుడు దేశాంతరమేగిన కృశించినది. కనుక కాళింది ప్రోషితభర్తృక.

సత్యభామ తొల్లింటి మచ్చికలు చెప్పిన (33-36) కృష్ణుడు ఆంతర్యము గ్రహించి ఆమెకు "సేవ సేయుటకునై వేమాఱు నేఁ గోరుదున్" అని చెప్పును. (37,38) అట్లు సేయును. (47-50 ప. 4ఆ.) ఇందు శ్రీకృష్ణుడు సత్యభామకు కైవసము. కనుక సత్య భామ స్వాధీనపతిక.

ఇట్లు అష్టమహిషులు అష్టవిధశృంగారనాయికలుగ కాళయ అపూర్వకల్పనము. శ్రీకృష్ణుడు రాజగోపాలుడు. రాజగోపాలుని అష్టవిధశృంగారనాయికలైన అష్టమహిషుల తోడి శృంగారము రాజగోపాలవిలాసము. ఇది ప్రధానమైన ఇతివృత్తము. ద్వారకానగర వర్ణనము దక్షిణద్వారకాస్థలమాహాత్మ్యము అనుబంధప్రాయములు.

కాళయ రచనము మృదుమధురము. కుసుమకోమలము. లలితలలితము. తేటతెనుగు తేనెసోన. సంస్కృతపుంద్రేక్షుఘటలు సకృన్మాత్రము.

రుక్మిణి :- "కలలో నైనను నీదుమాటలకు నౌఁగాదంచు మాఱాడుటల్
గలవో? వాడల వాడలం దిరిగి రాఁగా నీకు మెండొడ్డుటల్
గలవో? చూచినవారలందఱు నగంగా విన్న విన్నాణముల్
గలవో? మానవతీవిలాసమకరాంకా! యింక నేమందురా" 99ప. 1ఆ.

భద్ర సఖి :- "వెన్నెలల వాతఁడేలు నటి వేలకొలందుల వారిలోన నన్
దలఁచును విల్తునాయుని వితావిత యీ నెతఁ జింతసేయఁగా
వలదు; నీ పయిన్ వలపువాఁడని నమ్మిక పుట్ట గట్టిగాఁ
బలికెదనమ్మ యీ కనకపంజరకీరము సాక్షిగాఁ జెలీ!" 12ప. 2ఆ.

లక్షణ నెచ్చెలి:- "తలిరులు వాతెఱన్ విరులదండలు చూపుల వాణిముత్తెముల్
పలువరుసన్ సరోజములు పాదయుగంబున మించుటద్దముల్
తఱుకు మెఱుంగుఁజెక్కులమఁ దా సవరింపును నీదు రాక్కై

కలికి ప్రసాధికామణులకన్న నలంకృతిఁ గూర్చె మేడకున్." 54ప. 2ఆ.

జాంబవతి:- "ఎన్నఁడు సమ్మతించు నీకనెన్నఁడు నన్ దయమీఱఁ జూచు నిం
కెన్నఁడు మాటలాడు నీకనెన్నఁడు కౌఁగిట గారవించు నిం
కెన్నఁడు పుణ్యమెల్ల ఫలియించునొ? యంచుఁ దలంచు నాథుఁడే
నన్నిటు చౌక చేసినను నాతిరొ! యేగతి నోర్వవచ్చునే." 9ప. 3ఆ.

మిత్రవింద:- "కలయన్ జాగరరాగరంజితకటాక్షశ్రీలు పాంథ్యప్రభ
న్నెలకొల్పన్ సమయానుకూలముగ నీ విద్దంపు లేఁజెక్కునం
దలచూపెన్ నెలవంక దానిఁ గని యానందంబు సందిల్లఁగా
బలుమాఱుం గరపద్మముల్ మొగుడ సంభావించెదన్ వల్లభా!" 31ప. 3ఆ.

సుదంత:- "నవ్వుల్ శారదచంద్రచంద్రికలుగా నమ్మించి యా చంద్రికల్
పువ్వుల్గా నవరించి వాని వెస నమ్ముల్ సేసి యా యమ్ములన్
మవ్వంబుల్ జతఁగూర్చునంచుఁ దుద నామర్మంబు నాఁటింపుచున్
చివ్వల్ సేసెద నింద్రజాలములెకా! చింతింప నీ నైఖరుల్." 71ప. 3ఆ.

కాళింది:- "వెక్కసమైన మోహమున వేమఱు నాతని దూఱవేలనో
చక్కెరబొమ్మ! యింకిట విచారము లేటికి? నొంటిపాటుగా
నక్కట! యెవ్వతైన మనసారఁగ నవ్విభు నిండుఁగౌఁగిటన్
జొక్కఁగఁజేసి వేతొకతెఁ జూడఁగవిచ్చునె? వాఁడు వచ్చునే?" 10ప. 4ఆ.

సత్యభామ:- "కలకంఠీమణు లొక్కనాఁడు నను శృంగారింపఁగాఁ జూచి వా
రల వారింపుచు నేర్పు మీఱ కొనగోరన్ పెన్నెరుల్ దువ్వి నీ
వలరుందండలు గొప్పునం దుఱుము నొయ్యారంబు లే మెచ్చవా?
తలిరున్ వాతెఱ మెచ్చుగా నడుగు చందం బందమై యుండెగా." 36ప.4ఆ

ద్వారకానగరవర్ణనము (51-79ప. 4ఆ.) ప్రతిపురసాధారణమే కాని, ఒక పద్యము నందు విజయరాఘవనాయకుని అన్నదానపద్ధతి అంతర్లీనముగ కలదు.

"వెంటం జాఱులు కూర లన్నమున నేర్వేఱం దగంబూని తత్
ఘంటామార్గమునందు జాగటుల చేతన్ బెట్టు చాటించి యిం
టింటం బాంధకులంబు వారయుచు వెంతే తృప్తి గానింతు రా
కంటం జెందొకయుండ రేయపగ లుత్కంఠన్ వృపాజ్ఞాపరుల్." 77ప. 4ఆ.

దక్షిణద్వారకాస్థలమాహాత్మ్యము బ్రహ్మాండపురాణములోని విష్ణుక్షేత్రఖండము నందలి చంపకారణ్యమాహాత్మ్యమునకు అనుసరణము. చంపకాటవి దక్షిణద్వారక అగుటకు గోప్రళయుని కథ, హరిద్రానది కృతఘ్నతాదోషనివారిణి అగుటకు రాజశేఖరుని కథ కలవు. కృత మెఱుఁగని పాతకముచేత ఉన్మత్తుడైన సౌరాష్ట్రరాజైన రాజశేఖరుని వర్ణనమిది:

"మ్రొక్కి ముందట నిల్చి మోడ్పు చేతులచేత
వేఁడుకో వచ్చిన వెక్కిరించు
వాడిన మాటలే యాడును దన మాట

లాదరింపని వారి నదలనైమ
వటులు చూపిన విద్య వటులఁ గాదంచుఁ దా
వడ్డమై కోణంగియాట లాడు
వలెవాటు వైచిన వలిపెపాలున చించి
పెనచి పగ్గాలుగాఁ బేనుచుండు
మేర మీఱిన మన్మథభారమొంది
యలంత యాకలి దప్పియు ననక వెనుక
వచ్చువారలఁ గనక భూవల్లభుండు
ఘోరకాంతారవీథులఁ గ్రుమ్మరిలుచు." 45ప. 5ఆ.

విజయరాఘవనాయకుని ఇలవేలుపైన రాజగోపాలస్వామి క్షేత్రమాహాత్మ్యము, తీర్థమాహాత్మ్యము; విజయరాఘవనాయకునికి అంకితమైన రాజగోపాలవిలాసమునకు రత్నమకుటము.

**పసుపులేటి రంగాజమ్మ :** ఈమె కృతులు 1. శృంగారపదములు. 2. మన్నారుదాసవిలాసము. 3.రామాయణసంగ్రహము. 4. భారతసంగ్రహము. 5. భాగవతసంగ్రహము. 6. ఉషాపరిణయము. కావ్యము. 7. మన్నారుదాసవిలాసనాటకము. యక్షగానము. ఇందు శృంగారపదములు, భారతభాగవతరామాయణసంగ్రహములు లభింపలేదు. శృంగారపదములు రచించినట్లు మన్నారుదాసవిలాసమునందు, భారతభాగవతరామాయణసంగ్రహములు రచించినట్లు ఉషాపరిణయమునందు కలదు.

రంగాజమ్మ విజయరాఘవనాయకుని ఆస్థానకవయిత్రి మాత్రమే కాదు. భార్య కూడ. "మద్భర్తవు, మహీభర్తవు" అని విజయరాఘవనాయకుని స్మరించినది. (20వచ. 1ఆ.మ.దా.వి.) "విజయరాఘవమహీపాలవిత్యసంభావిత" అని ఆశ్వాసాంతగద్యము కలదు. (మ.దా.వి.) అంతేకాదు. పారసార్వభౌతధురీణ, విచిత్రతరపత్రికాశత లిఖితవాచికార్థావగాహనప్రవీణ, తత్ప్రతిపత్రికాశతస్వహస్తలేఖనప్రశస్తకీర్తి, శృంగారరసతరంగితపదకవిత్వ మహనీయమతిస్ఫూర్తి, అతులితాష్టభాషాకవితాసర్వంకషమనీషావిశేషశారద, రాజనీతి విశారద అనికూడ ఆశ్వాసాంతగద్యమ కలదు. అవగాహన చేసికొను పత్రికలు, స్వహస్త లేఖనము చేయు ప్రతిపత్రికలు రాయసములు. రాజనీతి విద్యావిశారద కద.

విజయరాఘవనాయకుని వివరణమిది:

"కుందముల్ వికసించు వందముల్ మీరంగఁ
గందముల్ రచియించు కౌశలంబు
ప్రాసముల్ బహుయతివ్యాసముల్ వెలయంగ
సీసముల్ హవణించు చిత్రమహిమ
జాతు లలంకారరీతులు దనరంగ
గీతులు రచియించు చాతురియును
పదములు మృదురసాస్పదము లౌర యనంగఁ
బదములఁ జెప్పెడు ప్రౌఢిమంబు

నుచితవైఖరి ద్విపదలు రచన సేయ
ననిశమును రాయసములు వ్రాయంగఁ జదువ
సమయ (మెఱుఁ)గుచుఁ గార్యభారములు దెలుప
నిపుణభావంబు జగతిలో నీక చెల్లు." 17ప.1ఆ.మ.దా.వి.

మన్నారుదాసవిలాసము: ఇది రాజగోపాలస్వామికి అంకితము. విజయరాఘవనాయకుడు

"శృంగారైకరసంబు (లోఁ) బదములన్ జెల్వొంద మెప్పించితౌ
సంగీతజ్ఞుల మేలునా నుభయభాషాచాతురి స్నీ విఁకన్
రంగ(త్ప్రౌ)ఢిఁ బ్రబంధమొక్కటి యొనర్పంగావలె న్మత్కథన్
రంగాజీ! భవదీయవాగమృతధారావైఖరుల్ మీఱఁగన్." 19ప. 1ఆ.

అనగా రంగాజమ్మ మన్నారుదాసవిలాసము రచించినది. విజయరాఘవనాయకుని వైభవ వర్ణనమునందు పాండ్యతుండీరాదిపాలకుల ప్రసక్తి లేదుగాని, విజయరాఘవనాయకుడు,

"రాయలు సాహిత్యరాయపెండేరము
శారదాధ్వజము నొసంగ నెగడె" 65ప. 1ఆ

నని కలదు. రాయలు విజయనగరరాజు. మూడవశ్రీరంగదేవరాయలు. అతడు విజయరాఘవ నాయకునికి సాహిత్యరాయపెండేరము, శారదాధ్వజము ఇచ్చుట, విజయరాఘవనాయకుడు తన పక్షమున చేరి, పాండ్యతుండీరాదిపాలకులను జయించి, కర్ణాటసామ్రాజ్యసింహాసనమును స్థాపించునప్పుడే సంభవము. అది 1643-44 ప్రాంతమున జరిగినది. ఇది పూర్వోక్తము. కనుక మన్నారుదాసవిలాసము తదనంతరకాలికమగును. కాఁబట్టి మన్నారుదాసవిలాసము రచనాకాలము 1645 ప్రాంతము కావచ్చును.

కాంతిమతీవిజయరాఘవనాయకుల వివాహము కావ్యేతివృత్తము. కథాసంగ్రహ మిది: విజయరాఘవనాయకుడు రాజగోపాలస్వామి ఫాల్గుణోత్సవమునకు దక్షిణద్వారకా పురమునకు వచ్చును. చెంగమలవల్లీసమేతుడైన రాజగోపాలస్వామి రాజవీధిని ఏగునెడ ముందు నడచును. కాంతిమతి అను రాకుమారి రాజగోపాలస్వామి (మన్నారుదేవుడు) తోపాటు విజయరాఘవనాయకుని (మన్నారుదాసు) చూచి మోహించును. కలలో విజయ రాఘవనాయకునితో కలసి మోహపరవశురాలగును. విరహావస్థ నందును. మన్మథ ప్రలాపములు సేయును. విలాసవతి అను చెలి విషయము తెలిసికొని, విజయ రాఘవనాయకుని సందర్శించి, కాంతిమతి సంగతి, సౌందర్యము వివరించును. విజయ రాఘవనాయకుడు కాంతిమతిని చూచితినని, వలచితినని "రేపే పెండ్లి" అని వర్తమానము పంపును. విరహావస్థ నందును. అది విన్న శతక్రతుశ్రీనివాసతాతాచార్యులు సమాశ్వసించును. సంబంధము నిశ్చయించును. వివాహము జరుగును. కాంతిమతీ విజయరాఘవనాయకుల సంయోగవియోగశృంగారములు సాగును. అనంతరము కాంతి మతీసమేతముగ విజయరాఘవనాయకుడు రాజగోపాలస్వామిని సందర్శించి రాజధానికి వచ్చును.

రాజగోపాలస్వామి రాజవీధీయాత్ర (27వచ. 1ఆ.) అలంకరణాదికము (67వచ. 4ఆ.) విజయరాఘవనాయకుని దక్షిణద్వారకాపురప్రయాణము (13వచ.2ఆ.) శతక్రతు శ్రీనివాసతాతాచార్యుల ప్రయాణము (37వచ. 4ఆ.) మొదలైనవి సహజచిత్రణములు. సమకాలికసమాచారములు. తంజాపురవర్ణనమునందు కొబ్బరి బొండముల వర్ణన క్రొత్తవిషయము. స్థానికవిశేషము.

"చవి గనినారుగా యమృతసారము నిర్జరులార! మీర లా
దివి నికఁ జూడుఁ డీయెడ మదీయనవామృతమంచు న
య్యవనికరాగ్రసీమ దగునట్టి ఘనామృతకుంభరాజినా
నవిరళనారికేళనివహంబుల బొండ్లము లొప్పు నప్పురిన్." 92ప. 1ఆ.

వసంతశబ్దపర్యాయపదముల మీద చమత్కారకల్పనము చారుతరము.

"ఆ రాధామాధవులు వి
హారవనం బలరఁజేయు నల యామునికిన్
పేరొసఁగిరి కాకుండిన
నౌరా! రాధాఖ్య మాధవాభిధ గలదే!" 5ప.2ఆ.

అవసరముల వారు విజయరాఘవనాయకుని అలంకరించిన తీరు అతి సహజము. సమకాలికసమాచారము.

"నెలఁత యొక్కతె చేరి నిల్వుటద్దముఁ బట్టెఁ
జెలువ యొక్కతె యోరసిగ యమర్చెఁ
జంద్రాస్య యొక్కతె జాజిసరుల్ చుట్టెఁ
జాన యొక్కతె చేరుమాల్ జాఱఁ గట్టెఁ
గలికి యొక్కతి దిద్దెఁ గస్తూరితిలకంబు
కవకాంగి యొకతె చౌకట్లు వెట్టె
జాణ యొక్కతె బురుసాహిజారును బూన్చె
సకియ యొక్కతె యరచట్టఁ దొడిగెఁ
దరుణి యొక్కతె హరువుగా దట్టి గట్టె
వనిత యొకతె దుప్పటి వలెవాటు వైచెఁ
బడఁతి యొక్కతె చెవుల జవ్వాది యుంచెఁ
గొమ్మ యొక్కతె కుంకుమ నెమ్మి నలఁదె." 16ప. 2ఆ.

కాంతిమతి విన్న విజయరాఘవనాయకుని గుణములు చరిత్రకు సంపదించునవి.

"చిన్ననాఁడే రత్నసింహాసనం బెక్కి
మన్నారు కృపచేత మనిన ఘనుఁడు
కురులు గూడని నాఁడె కుతుకంబు మీరఁగాఁ
బిరుల గెల్చిన పటుబాహుబలుఁడు
ప్రతిదినం బాచార్యపదములు భక్తిచేఁ
బూజసేయుచునుండు పుణ్యశాలి

సరసుఁడై సంగీతసాహిత్యవిద్యల
రసికతఁ గాంచిన రాజరాజు
విజయరాఘవుఁడని చెలుల్ వినుతిసేయ
వేడ్క వినియుందు వీమల విందు గాఁగ
నల్ల గోపాలు నాత్మజుం డౌట నితని
కతని గుణములు భాసిల్లె నందముగను." 44ప. 2ఆ.

కాంతిమతి మన్మథప్రలాపములందు ముక్తపదగ్రస్తసింహావలోకనకందపద్యము శబ్దచమత్కారము

"ధీ రాజిలఁ జనవీరా
వీరాయితకేళి నిన్ను వెలకుఁ గొనేరా
నేరాల కేమి రారా
రారాపులు మాని విజయరాఘవధీరా! 16ప. 3ఆ.

విలాసవతి కావించిన కాంతిమతివర్ణనమునందు వైదగ్ధ్యము కలదు.

"ఆతివ పాదంబుల యందంబునకు వోడి
నీళ్లలోపల డాఁగె నీరజములు
వనిత యూరువులకు వెవగామి వనఁటులు
పలుమారు పిగ్గుచేఁ దలలు వంచెఁ
జావ జంఘలతోడ పరిఁబోలఁగా లేమి
దొవలెల్ల పొదుల వెనుక నొదిగె
భామ పిఱుందులఁ బ్రతిరాక చక్రముల్
దేశంబులందెల్లఁ దిరుగసాగె
జలజలోచన నాభికి వలికి మిగులఁ
దెలియ నదులందు నావర్తములు గరంగె
సుదతి మధ్యంబునకు మొనచూప వెఱచి
కోరి సింహంబు పర్వతగుహలఁ జేరె. 57ప. 3ఆ.

కాంతిమతీవిజయరాఘవనాయకుల వివాహభోజనమునందు శాకాహారమే గాక మాంసాహారమును కలదు. కోడి గ్రుడ్లు, పాలకోడి, కుంకుమకోడి, కట్టుకోడి, పాడపిట్ట, పాడగువ్వ, తీతువు, బాతువు, సంబారంపుకోడి, పొదుగుడుకోడి, నేలవెమలి, గండెమీలు, మలువకోడి, వాలుగలు, కారిజంబులు, రొయ్యలు మలుగుమీలు, జెల్లలు, బొమ్మడాయలు మొదలైనవి కూరలు. (48వచ. 5ఆ.)

విజయరాఘవనాయకుని రాజగోపాలస్వామిస్తుతి విన్నపము.

"శ్రీరాజగోపాల! త్రిభువనముజనసంరక్షణలోల! సంక్రందనాదిసురబృంద వందితచరణారవింద! అడియని విన్నపము. వడిగ వినుము; మహామభావులయిన యట్టి బ్రహ్మాదులు నీ మహిమఁ దెలియనేర రనిన నే మిమ్ము వినుతింప నెంతటి వాఁడను?మిమ్మే శరణుఁజొచ్చి నమ్మితి, సతతంబు మీ దివ్యశ్రీపాదంబుజంబుల

మీఁది భక్తి గలుగఁజేసి యాదరించి నన్ను రక్షింపవే. కరుణారసమహిమ, సహజ గుణసంపన్న! సంపంగిమన్న!"

ఇది సీసపద్యము కూడ.

"శ్రీరాజగోపాల త్రిభువనసుజనసం
రక్షణలోల! సంక్రందనాది
సురబృందవందితచరణారవింద! య
డియని విన్నపము వడిగ వినుము మ
హామభావులయినయట్టి బ్రహ్మాదులు
నీ మహిమఁ దెలియనేర రనిన
నే మిమ్ము వినుతింప నెంతటి వాఁడను
మిమ్మే శరణుఁజొచ్చి నమ్మితి సత
తంబు మీ దివ్యశ్రీకృత్పదంబుజముల
మీఁద భక్తి గలుగఁజేసి యాదరించి
నన్ను రక్షింపవే కరుణారసమహి
మ సహజగుణసంపన్న! సంపంగిమన్న!"

ఇది ఒకానొక ఆధునికప్రయోగమునకు ఆద్యప్రకృతి.

మన్నారుదాసవిలాసమునకు మాఱురూపమైన మఱొక అముద్రితగ్రంథము కలదు[32]. అది సౌందరీదేవి రచించిన అల్లాడ విజయభూపతిసింహవిలాసము. అందు కథానాయకుని పేరు మాఱినది. కడమ సమానము.

"శ్రీవిజయరాఘవాధిప
భూవలయప్రాజ్యరాజ్యపోషణదక్షా!
శ్రీవత్సకలితవక్షా!
శ్రీవిజితమనప్రకాశ! చెంగమలేశా!" మ.దా.వి.

"శ్రీవిజయభూపతినృప
భూవలయప్రాజ్యరాజ్యపోషణదక్షా!
శ్రీవత్సకలితవక్షా!
శ్రీవరమహేంద్రపురీశ! శ్రీలక్ష్మీశా!" అ.వి.భూ.సిం.వి.

ఇందు చతుర్థపాదమున గణభంగము కలదు.

"ధీ రాజిలఁ జనవీరా
సీరాయితకేళి నన్ను నెలకుఁ గొనేరా
నేరాలకేమి రారా
రారావులు మాని విజయరాఘవధీరా!" మ.దా.వి.

"ధీ రాజిలఁ జనవీరా
సీరాయితకేళి నన్ను నెలకుఁ గొనేరా
నేరాలకేమి రారా

రారాపులు మాని విజయభూపతిధీరా!" అ.వి.భూ.సిం.వి.

ఇందు చతుర్థపాదమున యతిమైత్రిభంగము కలదు.

గణభంగము, యతిమైత్రిభంగము గమనించిన, మన్నారుదాసవిలాసమునకు అల్లాడవిజయభూపతిసింహవిలాసము మాఱురూపమని స్వయంవేద్యమగును. ఇది భంగ్యంతరముగ మన్నారుదాసవిలాసము ప్రాచుర్యమునకు నిదర్శనము.

మన్నారుదాసవిలాసనాటకము:- ఇది మన్నారుదాసవిలాసము కావ్యమునకు నాటకరూపానుసరణము. ఇందు అర్చకులు విజయరాఘవనాయకునికి ఇచ్చిన శ్రీముఖమునందు, "శుభకృత్సంవత్సరఫాల్గుణబహుళపంచమీగురువాసరంబున స్వాతీనక్షత్రంబున బ్రహ్మతిరునాళ్లకు " అని కలదు. ఆ బ్రహ్మతిరునాళ్లే నాటకేతివృత్తమునకు కారణము. కాఁబట్టి నాటకము తదనంతరకాలికమగుట తథ్యము. శ్రీముఖములోని కాలమానము 1663 వ సంవత్సరము. కావున మన్నారు దాసవిలాస నాటకరచనాకాలము 1664వ సంవత్సరము కావచ్చును.

మన్నారుదాసవిలాసనాటకమునకు సదృశమైన కామరుసు వేంకటపతిసోమయాజి విజయరాఘవచంద్రికావిహారనాటకము 1645 నాటిది. కోనేటి దీక్షితచంద్రుని విజయ రాఘవకల్యాణనాటకము 1669 నాటిది. ఇది ముందు వివరింతును. విహారనాటక ప్రభావము విలాసనాటకమునందు, తదుభయనాటకముల ప్రభావము కల్యాణ నాటకమునందు ప్రసరించుట సహజము.

మన్నారుదాసవిలాసనాటకములోని ఇతివృత్తము, మన్నారుదాసవిలాసకావ్యము లోని ఇతివృత్తమే. అంతేకాదు. కావ్యములోని పద్యములు చాలవఱకు నాటకమునందు కలవు. సీసపద్యములు కొన్ని దరువులు, ద్విపదలు అయినవి. అందు లేనివి, ఇందు కలవి విద్వాంసుల విద్యాప్రసంగములు, జోస్యుల యేషాగాథలు, పురోహితుల యద్వా తద్వాలు, ఎఱుకత సోదె, గొల్లల సుద్దులు, ముత్తైదువల ముచ్చటలు మాత్రమే. అవే మన్నారుదాసవిలాసనాటకము ప్రాచుర్యమునకు కారణములు. తమిళసంభాషణ లొకడు అభ్యధికము.

విద్వాంసుల విద్యాప్రసంగములు:

"మాట :- అవునోయి యెమవంట్టి భ్రాంత్తుండయినా యిషువలె భ్రమసు కొనునా. భుజిధాతువుకు అనుభవమర్థమని యెషువలె చెప్పుచున్నావోయి.

వజ్రకుంత మల్లుభట్టిగాండు:- యేమోయి అనే అట్టు ఆయనా నా బ్రదుకు యిమ వంటి బ్రహ్మిష్టో బ్రహ్మకొడుకుమ యేమోయి అనవచ్చువా

:- వోరి నీ వలె వుభయతో బట్టి ప్రాయశ్చిత్తం చేసుకోకవుంటినవరా.

:- వోరి నీవు పుట్టి మూండాయిత్తారాలులే. విన్నటి సుదువదవు. నా వంటి యోగ్యుణ్ణి జూచి యేమి పదరేవురా. శువకం వలె పాదరక్షలు తీసి రెండు ప్రహరింత్తుమో.

:- వోరి వృద్ధగార్దభమా. వోరు గలదంచుమ్ము వెత్తి వోరు బెట్టుక

కూయవచ్చినాండవు. కపోలతాడనం శేతునో. " పుట30.

జోస్యుల యేషాగాథలు:

"భైరవజోస్యులు:- మంచనభట్లుగారూ. పంచాంగం విప్రుడా.

మంచనభట్టు :- భైరవజోస్యులు నేరని మాటలె ఆడుదువు. చక్కంగా అశ్విని భరణి కృత్తికలు గురుతెరుంగవు. నీకు పంచాంగం విప్రేదిన్నా నీ భవిష్తికి.

భైరవ:- మంచనభట్లుగారికి మూలానక్షత్రమో మాటాడకమునుపే మూలం రేగుచున్నది.

మంచన:- వోరి భైరవజోశ్శిగా తిథివారనక్షత్రయోగకరణాలలో వొకటి గురుతెరుంగవు. పంచాంగ మనంగ యేందిరా.

భైరవ:- మంచనకు ముక్కుమీదనె వుండును కోపం. సూర్యసిద్ధాంతం యెరింగినవాడి కొడకవు. మొన్నటి అమావాస్యానాడు ముప్పాతికాపరక గ్రహణమవిన్ని ఆగ్నేయస్పర్శ అనిన్ని దబ్బరలే వ్రాస్తివే. మేము ఆర్యభట వాక్యపరిహితాల గ్రహస్ఫుటం చేశి గ్రహణం లేదంటిమే.

మంచన:- నీవు పోచనసోమయాదుల వారింట మొగవాండు బుట్టునని ప్రశ్న జెప్పి యేకాక్షరప్రయోగం చేయించుక వస్తివె." పుట 6.

పురోహితుల యద్వాతద్వాలు:

కొండుభట్లు :- అవునోయి యల్లుసోమయాదులు, నూరుతరాల నుంచి యీ యింటికి తగువైన పురోహితుండ నేనుండగా నీ వెవ్వండి కొడుకవు వా స్వాతంత్ర్యం కొంగుముడి రూక తీసుకపొయ్యేటట్టుగా.

యల్లుసోమయాజులు:- యేమోయి కొండుభట్లు, మా తాతకు చవ్వప్ప వాయనివారు పాంకెన సంభావన కట్టడ చేసి వుండంగా నీ వెవ్వండవు అపహరించుకపొయ్యేటట్టుగా మాయన్న కొడకవా." పుట47

ఎఱుకత సోదె:

"యెరుఖాడు గెరుఖాడు గెరుఖాడుగే దుండి, నీవు తలంశిన తలంపు నీవు తలంశివ తలంపు నిజముగా శెప్పేనే నిజముగా శెప్పేనే నిక్కముగా శెప్పేనే, తార్కాణగా శెప్పేనే, తార్కాణగా శెప్పేనే దుండి. అమ్మాయమ్మ అమ్మా యమ్మ యీ బురుకవికి బువ్వదేవే బువ్వదేవే. అవ్వ గురిసూడ మొరంటెలో ముత్యాలు దేవే ముత్యాలు దేవే. దుండి." పుట 36.

గొల్లల సుద్దులు:

"అదొంగ్రా వాకిట సంద్దడి, మణమణాయెంద్ది మిణమిణాయెంద్ది మరమురాయెంద్ది, మిరమిరాయెంద్ది, వెయివెయిరా వోరి, వొరె వొరె చివ మల్లిగ, వొరె వొరె పాప, వొరె వొరె చినమాక, వొరె వొరె పెద బొమ్మ, వొరె వొరె చివ బొమ్మ యీడ కూశికాడే వాండు తవుడొ అంట్టావుంట్టే మువ్వా. వొరె వొరె కూడు దివవస్తివంటిరా, కూరాకేమిరా." పుట 26.

ముత్తైదువల ముచ్చట్లు:

"రంగావొఝుల తిమ్మక్క:- యేమో ప్రోలుభట్ల యల్లమ్మ. వగరింట పెండ్లి

నాండయినా వొక వ్రక్కబ్రద్ద వేసుకొని నమలరాదషవో.

యల్లమ్మ:- అవునషే రంగావొఝుల తిమ్మక్క! నాకు వ్రక్కబ్రద్దా వొకటి కొదవా, చాలుచాలు, నిన్న మావారు సుక్కరారం సంతలో పిండికూర కంచున్ను గానుగబిండి తెచ్చిరి. పెండ్లి పందిట్లో నోరు మెదలించవలె నంచున్ను యింత దెచ్చుక తించునా. యింతే.

తిమ్మక్క:- ఔ పొరుగింటి తిమ్మావధాని పెండ్లా వీరమ్మ పాటలు బాడుచున్నది. అంటుకొని నీవున్ను పాడ్రాదషవో.

యల్లమ్మ:- యిదేందో నీవు నాగపసానివై పెద్దతనం చేసుకవుండేదానవున్ను కడమవారు పాటలు పాడేవారున్నా.

తిమ్మక్క:- వోశమ్మా మా యింటి ఆయన యెందుకో యెపషో పోయే వేళా. రమ్మంచున్నారు. నాకు పాటలు పాడేటందుకున్ను ప్రొద్దు వున్నదషే మా పుట్టింటిలో వుండేటప్పుడు కొండవీటి సర్వమచేత పది నుడుగులు నేర్చుకొంటిని. పాడుదునో అంటే శిగ్గువుచున్నది. యిక్కడంతా మొగవారే వున్నారు. నీవు ధవళమెత్తు వేమం గూడా పాడేగాని" పుట37.

ఇవి వ్యావహారికభాషలోని సంభాషణలు. అంతేకాదు. పాత్రోచితభాషలోని సంభాషణలు. నాటకమునకు పాత్రోచితభాష జీవనాడి. మన్నారుదాసవిలాసనాటకము మంచి యక్షగానము.

**ఉషాపరిణయము:-** అసమగ్రముగ లభించినది. వైష్ణవజ్వరము శాంకరజ్వరమును అణచునటకు (70వ.) చతుర్థాశ్వాసము కలదు. అనంతరకథ కల పంచమాశ్వాసము లేదు. ఇది విజయరాఘవనాయకునికి అంకితము. ఇందు మన్నారుదాసవిలాసప్రబంధము, శృంగారపదములు, భారతభాగవతరామాయణసంగ్రహములు రచించినట్లు కలదు. (6వ. 1ఆ.) మన్నారుదాసవిలాసనాటకము రచించినట్లు లేదు. కావున ఉషాపరిణయము మన్నారుదాసవిలాసనాటకము కంటె పూర్వకృతి కావలయును. మన్నారుదాసవిలాసప్రబంధరచనాకాలము 1645 ప్రాంతమని, మన్నారుదాసవిలాస నాటకరచనాకాలము 1664 వ సంవత్సరమని పూర్వోక్తము. కాఁబట్టి ఉషాపరిణయము రచనాకాలము 1660 ప్రాంతము కావచ్చును.

ఉషాపరిణయకథ సుప్రసిద్ధము. హరివంశప్రోక్తము.

"పరగ హరివంశమున నుషాపరిణయకథఁ
తెనుఁగు గావింపుమింక నీవు తేట గాఁగ" ఆ వ. 1 ఆ.

అని విజయరాఘవనాయకుడు ఆనతిచ్చినట్లు, రంగాజమ్మ హరివంశము లోని ఉషాపరిణయకథను "తేట గాఁగ" తెనుగు కావించినది. "తేటగాఁగ తెనుఁగు గావింపుమనుటకు హేతువు, దామరల అంకభూపాలుని ఉషాపరిణయము కావచ్చును. అది తేట తెనుగు కాదు. ఇది తేట తెనుగే. అంతేకాదు. వర్ణనాభూయిష్ఠము కాదు. కథాప్రధానము. కథాప్రారంభమునందు పురవర్ణనము లేదు. కథాప్రారంభమే కలదు.

ఉష సౌందర్యవర్ణన ఒక్క పద్యమునందే కలదు.

"మోముఁదామర మీఁద ముద్దు గుల్కుచు వ్రాలు
 గండుమీ లవగమ గమ్ము లమరె
సౌందర్యనదిలోనఁ జిక్కఁగా విహరించు
 చక్రవాకము లనఁ జన్ను లమరెఁ
దళుకొత్తు బాహులతాయుగ్మమున నొప్పు
 చిగురుటాకు లనంగఁ జేతు లమరె
నాభివల్మీకంబునను వెలువడి వచ్చు
 చిలువ నా నూఁగారు చెలువ మమరె
మెఱసి తొలఁగని తొలకరి మెఱ పనంగ
మిగుల సొబగైన కాంతిచే మేనుఁదీవ
కలితలావణ్యశృంగారగరిమ (?)
గలిగి చెలువొందు నల యుషాకన్య కపుడు. 25 ప. 1 ఆ.

ఉష కలలో సాక్షాత్కరించిన అనిరుద్ధుని వర్ణన రెండు పద్యములందు కలదు. అందొక పద్యము:

"సంపంగి పువ్వులు సరసత సిగఁజుట్టి
 బురుసారుమాల్గట్టి సొంక మమర
నర్ధచంద్రుని సొంపు నదలించు నదుటను
 దీరుగాఁ దిలకంబు దిద్ది పేర్మి
శ్రీకారముల మించు చెలువంబుఁ గల్గిన
 మీసలఁ జొకట్లు మెలయ మంచి
బటువు ముత్తియముల బాగుగాఁ గూర్చిన
 కంటసరుల్ దాల్చి ఘనత మీరఁ
దనర మరమున వజ్రాల తాళి వైచి
హస్తములఁ గెంపుల కడియా లలరఁ బూని
నడుమఁ జీరాడు చుంగుల నన్నె గాంచు
మేటి కనకాంబరము వలెవాటుఁ దనర." 33 ప. 1 ఆ.

ఇది విజయరాఘవనాయకుని వేషధారణమును గుర్తునకు తెచ్చునది.

ఉషానిరుద్ధుల సంభోగశృంగారమునందు విప్రలంభశృంగారమును కల్పించుట విశేషము.

"మనసిజకేళిఁ దాను పతి మక్కువ మీఱఁగ గూడియుండుటల్
ఘనమగువల్లి మానికపుఁగంబమునన్ గనుపట్టుచుండఁగాఁ
దన చెలువొందు వేఱె యొక తామరసాక్షినిఁ గూడెనంచు వే
కనుఁగొనుచున్ బరాబ్జముఖతఁ గాంచెను ముగ్గలు గారె మానినుల్. 40 ప. 3ఆ.

ఉష పరాబ్జముఖతకు అనిరుద్ధుడు "నిన్నొఱ గందుచు మదిలో, నన్నలిమోమయ్యె"

(41ప.3ఆ.) ఉషానిరుద్ధులు విరహము చెందుదురు. (43-49ప. 3ఆ.)

కృష్ణుడు కొలువున్న తీరు, విజయరాఘవనాయకుడు కొలువున్న తీరే.

"హరి యెప్డు మేల్కాంచి యద్దంబుఁ బువ్వులు
కపిలధేనువు క్షీరకలశములను
విప్రయుగ్మంబును వేడుక వీక్షించి
నిత్యకృత్యముఁ దీర్చి నేమ మమరఁ
బసిఁడి కంబంబుల భాసిల్లు చున్నట్టి
కొలువు కూటంబునఁ గొమరు మీఱఁ
జెలఁగెడు నవరత్నసింహాసనంబునఁ
గొలువున్న సమయంబుఁ జెలులు దెలిపి
విన్నవింపఁగఁ బదియాఱువేలు సతులు
నల్ల రుక్మిణి మొదలైన యష్టమహిషు
లెలమి మీఱఁగ శ్రీకృష్ణుఁ గొలువ నపుడు
వచ్చి రచటికిఁ దమతమ వైభవముల. " 112ప. 3ఆ.

మేల్కాంచిన వెంటనే అద్దమును, పువ్వులను, కపిలధేనువును, క్షీరకలశములను, విప్రద్వయమును వీక్షించుట, రఘునాథనాయకుని దినచర్యలోని భాగములుగ, రఘునాథాభ్యుదయమునందు, రఘునాథనాయకాభ్యుదయమునందును కలవు. అవి విజయరాఘవనాయకుని దినచర్యలోని భాగము లగును.

ఉష విరహతాపము (54-67ప. 1ఆ.) వనవిహారము (2-8ప.2ఆ.) జలకేళి (10-18ప. 2ఆ.) మన్మథారాధనము (16-21ప.2ఆ.) మాన్మథవికారము (25-35ప.2ఆ.) శైత్యోపచారములు (37-39ప. 2ఆ.) మాన్మథప్రలాపములు (40-46ప.2ఆ.) మన్మథాద్యుపాలంభములు (47-50ప. 2ఆ.) ఉషానిరుద్ధుల సంభోగశృంగారము (33-39ప.3ఆ.) విప్రలంభశృంగారము (41-46ప. 3 ఆ.) కథానుగతమైన సూర్యాస్తమయ, చంద్రోదయ, సూర్యోదయములు (22-24, 53-55ప. 2ఆ.) కథాబద్ధమైన యుద్ధములు (69-72ప.3ఆ; 28-70ప. 4ఆ.) మాత్రమే ఇందు వర్ణితములు.

మొదటి మూడు ఆశ్వాసములందును సీసపద్యములు అధికము. కథాభాగములోని 50+101+129=280 పద్యములందు, 24+46+57=127 పద్యములు సీసపద్యములే. ఉపలబ్ధమైనంతవఱకు చిత్ర, గర్భ, బంధకవిత్వములు లేవు.

**కామరుసు వేంకటపతిసోమయాజి :** ఇతని కృతి విజయరాఘవ చంద్రికావిహారము. యక్షగానము. కృత్యాదిని విజయరాఘవనాయకునికి కైవారగద్య కలదు. అందు అతడు "పాండ్యతుండీరాదినమదవిరోధియూథభీకరు"డని కలదు. ఇది పూర్వోక్తమైన, 1643-44 ప్రాంతమునందు విజయరాఘవనాయకుడు పాండ్యతుండీరాది పాలకులను జయించుటను సూచించును. కాఁబట్టి విజయరాఘవ చంద్రికావిహారము రచనాకాలము 1645 ప్రాంతము కావచ్చును.

కథోపక్రమమునందు, నాటకాంతమునందు, కథామధ్యమునందు కామరుసు వేంకటపతిసోమయాజి "విజయరాఘవపట్టభద్రుని పట్టంపుఁగవి" అని కలదు. కైవారగద్య తర్వాత విజయరాఘవనాయకుడు పద్యగద్యవిద్యాభిరాముడు, అభినవనాటకచాటు కావ్యకల్పనాచణుడు, అశేషభాషామనీషావిశేషగుణగ్రాహి, బహువిధప్రబంధనిబంధ లీలాధురంధరుడు అని కలదు. అంతేకాదు. అట్టివానికి "ప్రబంధం బొసంగి మెప్పించెద నని యెంచినవాఁడఁ గాను" అని కామరుసు వేంకటపతిసోమయాజి విన్నవించినట్లు కలదు. మెప్పించుటకు కాకపోయినను, ఒప్పించుటకునైన ప్రబంధ మొసగుట సంభవము అది విజయరాఘవచంద్రికావిహారమే అగును. కనుక విజయరాఘవచంద్రికా విహారము విజయరాఘవనాయకునికి అంకితముగ భావింపవచ్చును. పట్టపు కవి తన ఇష్టదేవత రాఘవస్వాములను, విజయరాఘవనాయకుని స్తుతించుట కూడ గమనార్హము.

విజయరాఘవనాయకుడు ఒక నాటి రేయి, కొందఱు నారీమణులు కొలువ, పాదచారియై చంద్రికావిహారము (వెన్నెలషికారు) సేయును. లీలావతి అను బాలికారత్నము విజయరాఘవనాయకుని చూచి వివశురాలగును. మదనవేదనాదోదూయ మానమానస అగును. చకోరిక అను సఖికి తెలుపును అంతేకాదు. విజయరాఘవ నాయకుడు స్వప్నములో కనిపించి, "జన్మాంతరమునందు నేను విజయుడను. నీవు ఊర్వశివి. నాడు నీ కోరిక నేను తీర్పలేదు. నీవు కలియుగమునందు నన్ను కలసెదవని ఇంద్రుడు వరమొసగెను. కావున నిన్ను బొట్టుగట్టి చేపట్టెదను." అని చెప్పినట్లు వివరించును. విరహావస్థ నందును. వలపు కమ్మవక్కణ వ్రాసి చకోరికను విజయరాఘవునికి ఇమ్మని పంపించును. ఊర్వశి పూర్వసఖి రంభ ఎఱుకతగా వచ్చి లీలావతికి సోదె చెప్పును. చకోరిక తెచ్చిన కమ్మవక్కణ చదివి విజయరాఘవనాయకుడు ఆమోదమును తెలిపి ముద్రిక ఇచ్చును. అది చూచి, శుభవార్త విని లీలావతి మురిపి పోవును. తెలిపిన ప్రకారము విజయరాఘవనాయకుడు విచ్చేయును. లీలావతి నివ్వాళి పట్టును. విజయరాఘవనాయకుడు లీలావతి పాణిగ్రహణము సేయును. భూసురపుంగవులు మంగళాశాసనశ్లోకములు చదువుదురు. లీలావతి నెచ్చెలులు సువాల పాడుదురు. శోభనాంగులు శోభనములు పాడుదురు. ఇది కామరుసు వేంకటపతి సోమయాజి హవణించిన విజయరాఘవచంద్రికావిహారము.

ఇందు కథారంగము తంజావూరును వర్ణించిన "పదము" వాస్తవికచిత్రణము.

"కవులెంతురు చోళదేశము కావేరివారిప్రకాశము ।
నవరత్నము లున్న కోశము సురనాయకరాజ్యసంకాశము ॥౧॥
చెఱకు రాజనంపుఁ బైరులు కాదు పేమము గలిగిన యూరులు ।
తిరముగా ప్రవహించు నేరులు చోళదేశము వెయ్యారులు ॥౨॥
ఆ రాజ్యరమకు మంజీరము ఆ యమరావతి కన్న పారము ।
భూరమణీమణిహారము తంజపురము పంచదల కొటారము ॥౩॥
నవరత్నంబుల పేటలు దివ్యనారికేళంబుల తోటలు ।

సవరణ చేసిన కోటలు విటసరసులు నూటారు కోటులు ॥౪॥
వలరాయని మీఁద నేలలు చాల వర్ణింపనేర్చిన బాలలు ।
విలసిల్ల నాటకశాలలు నందు వింత వింతలు కృష్ణలీలలు ॥౫॥
పరులగెల్చిన పౌఁజులు మెచ్చఁ బాలింతురు దినరోజులు ।
సరిలేని విద్యాభోజులు వీట సడిసన్న రాజాధిరాజులు" ॥౬॥

లీలావతీచకోరికల సంవాదమిది చమత్కారావహము. పదము:

"చిగురాకుఁబోడి, యీ పొగడ చూచితివె
మగని గుణంబులు పొగడఁ జూచితివె ॥౧॥
శుకవాణి, మారేడు చూచితివేమె
సకి, యిందు మా రేఁడు చనుదెంచినాఁడు ॥౨॥
మగువ, కేసరమైతే మనసు రాదఁటవె ।
మగని చేసరమైతే మనసాయెనమ్మ ॥౩॥
సతి, మోవికే యింత సన్నాహమేలె ।
పతి మోవికే యింత బ్రతిమాలితినే ॥౪॥
ఎలఁదోఁట మాధవుం డేలీవమ్మ ।
ఎలఁదోఁట మాధవుండేలీది హెచ్చా ॥౫॥
పున్నాగసేవకుఁ బోదము రావే ।
పున్నాగసేవకే గాద విమ్ము వేడేది ॥౬॥
కలియుగపారిజాతముఁ గమఁగొంటివేమె ।
కలియుగపారిజాతముఁ గమఁగొంటినమ్మ ॥౭॥
కళావతి, సంతాపముఁ గదియ రావమ్మ ।
కళావతి సంతాపమె గదియ వచ్చేది ॥౮॥

ఇందు చకోరిక సందేహములు - పొగడ, మారేడు, కేసరము, మోవి, వసంతుడు, పున్నాగము, పారిజాతము, సంతాపము- ఉద్యానవనపరము. లీలావతి సమాధానములు విజయరాఘవనాయకపరము. పొగడ క్రియ. చేసరము పర్యాయపదము. మా+రేడు, మా+ధవుడు, పుం+నాగ పదచ్ఛేదభేదమున సభంగశ్లేషలు. మోవి, పారిజాతము అర్థ భేదమున, సంతానము అన్వయభేదమున అభంగశ్లేషలు. అర్థచమత్కారము.

ఎఱుకత సోదె సుదీర్ఘము. సహజసుందరము. కతిపయపంక్తులు :

"అమ్మాయమ్మ
మ్రొక్కి యడుగవమ్మ పేయెత్తి
మ్రొక్కి యడుగవమ్మ
మ్రొక్కి యడుగకుంటే మూకాంబిక వచ్చి
ముందర నిలువదమ్మ ।
యో యమ్మ మ్రొక్కి యడుగవమ్మా ॥౧॥
తలఁడుకోవమ్మ నీ మనసులో తలఁడుకోవమ్మ ।

తలసిన తలఁపెల్లఁ దార్కాణగాఁ జెప్పెనే। యో దుండి
తెలుసుకోవమ్మ ॥౨॥
ముత్యాలు దెప్పించవే యో దుండి ముత్యాలు దెప్పించవే.
ముత్యాలు దెప్పించి మొరిఁటెలో నించు నీ
ముచ్చట చెప్పెదనే యో దుండి" ॥౩॥

కమ్మవక్కణ :

సీ. "శ్రీరాజగోపకుమారులౌ విజయరా
ఘవనాయనయ్యవా రవధరింపఁ
గదరయ్య దేవర పదపద్మములకు మీ
బైట నాటకశాల పడుచనైన
లీలావతిని పదివేల దండంబులు
వెట్టి సేయంగల విన్నపంబు
కలలోన నను మీరుఁ గలిసినదాదిగాఁ
గనుఁగొని పారిగాఁ గదలిరాఁగ
ఆసపడి చూచి నగరిపొమ్మైనదాన
మా చకోరిక నంపితి మనవి దెల్ప
గట్టిగా మీరు నన్ను చేపట్టకున్న
వించువిల్కాఁడు మఱి నిర్వహింపనీఁడు"

శోభనము :

శోభనమె శోభనమె, ప్రాభవయుతునకు
రఘునాథసుతునకు శోభనమె శోభనమె ॥౧॥
పరరాజుల గెల్చి పాళెముల చెరఁబట్టించిన
శ్రీరఘునాథవరపుత్త్రుఁడై మించి వర్ణన గాంచిన
వెఱిదొరయైనట్టినృపమణికి శోభనమె ॥౨॥
మనవులకై గడిమన్నెరాజులు
గొనివచ్చి యిచ్చిన కొమ్మలచే
దినదినము విద్యలు విని మెచ్చి వారికిఁ
జనవులు పాలించు సరసునకు శోభనమె ॥౩॥
తుండీరదేశంబు దొరకూఁతురు
పాండీని పట్టియైన పద్మలోచన
కొండొక పాయంపుఁ బెండ్లికూఁతులై సేవసేయ
నిండు వేడుక నుండు నెఱజాణకు శోభనమె." ॥౪॥

పురుషోత్తమదీక్షితుడు : ఇతని కృతి తంజాపురాన్నదానమహా నాటకము. సత్రమరులు అని దానికి నామాంతరము. ఇందు "కీలకవర్ష అవంగువిమానం పవిరేండాం తేదీ......." అని కలదు. కీలకవర్షము 1668 వ సంవత్సరము- కాఁబట్టి

తంజాపురాన్నదానమహానాటకము రచనాకాలము 1668 వ సంవత్సరము కావచ్చును.

ఇది "శృంగారహాస్యాద్భుతరసప్రధానంబుగా హవణించిన తంజాపురాన్నదాన మహానాటక" మని కవి వాక్కు. శృంగారము మోట సరసము. హాస్యము వెఱ్ఱి వికారము. అద్భుతము కృతకము. మహానాటకమన గొప్ప నాటకము కాదు. పెద్ద నాటకమును కాదు. సత్రమరులు అను నామాంతరము సార్థకము. పప్పు తిప్పాభట్లను బ్రాహ్మణ బ్రువుడు ఉత్తరాది వెంగసానితోను, జక్కుల రంగసానితోను జరిపిన విరసమైన సరస మిందలి ఇతివృత్తము. అరవము, తెలుగు తిలతండులన్యాయమైన భాష. సత్రమధికారి, కరణాలు, అప్పం హాత్యారి, పెన్నాట్టం మాణిక్యం, అంబిరాయడు మొదలైన పాత్రల భాష అరవము. ఎల్లమ్మ, పప్పు తిప్పాభట్లు, వెంగసాని, రంగసాని, పలకసాని ముద్దు, మంచిగాడు, హాస్యగాడు, వినోది మొదలైన పాత్రల భాష తెలుగు. వ్యావహారికము. యక్షగానమిది వచనప్రధానము. ఉభయభాషావిదులకు మాత్రమే ఉద్దిష్టము కాంబోలు!

విజయరాఘవనాయకుడు "అనవరతశతలక్షవిప్రాభీష్టమృష్టాన్నప్రదాత." "తంతు మాత్రపువాడైనా తంజావూర ఉపవాసం ఉండరాదు." అందుకు రామానుజకూటము, మధ్వకూటము, పెద్ద సత్రము తంజావూరునందు కలవు. పెద్ద సత్రమునకు అధికారులు తమిళులు. అతిథులు ఆంధ్రులు. పెద్ద సత్రమునందు ఊరగాయలు, ఊరుబిండ్లు, పచ్చళ్లు, వేపుడుగూరలు, తాళదాలు, పిండి మిరియాలు, పుల్లగూరలు, పప్పు, పాయసము, కజ్జాయములు సమృద్ధి. ఇవి గ్రంథస్థమగుటయే ఈ నాటకము చరితార్థత.

పప్పు తిప్పాభట్లు పద్యములు వ్యావహారికభాషలోను, వ్యాకరణభాషలోను ఉండుట విశేషము.

"క్రూస్తున్నవి కోకిలంబు లవిగో కోలాహలప్రక్రియన్
వేస్తున్నాడు మనోభవుం డమిమిగా వేమారు నీవు న్నమన్
చూస్తుందావవు నీకు ధర్మమవే శుద్ధాత్ముఁడన్ బ్రాహ్మఁడన్
త్రెస్తున్నానిదె గూర్త మొక్కటి రతిం దేలింపవే లంఝమా."

"ఏషాగాథము లేలే
భాషింప వదేమి మిట్టిపడెద వదేలే
కాషాయవస్త్ర మిచ్చెద
రోమంబులు మాను మేము ఋగ్వేదులమే."

కోనేటి దీక్షితచంద్రుడు : ఇతని కృతి విజయరాఘవకల్యాణము. యక్షగానము. ఇందు భరతవాక్యమునందు "విజయరాఘవకల్యాణంబను మహా నాటకంబునకుఁ గథానాయకుండును నిజనాయకుండును నైన యచ్యుత విజయరాఘవునకు" అని కలదు. నిజనాయకుడు కవినాయకుడు కృతినాయకుడు కావచ్చును. అయిన విజయరాఘవకల్యాణము విజయరాఘవనాయకునికి అంకిత మగును. వివాహసంకల్పమునందు "అస్మిన్ వర్తమానే వ్యావహారికచంద్రమానే సౌమ్యనామ సంవత్సరే ..... వైశాఖమాసే శుక్లపక్షే శుభనక్షత్రశుభయోగశుభ

కరణయుక్తాంఅస్యాం శుభతిథౌ" అని కలదు. సౌమ్యనామసంవత్సరము 1669. అప్పటికి విజయరాఘవనాయకుని వయస్సు 69 సంవత్సరము లుండుట సంభవము. కనుక 1669 వ సంవత్సరము విజయరాఘవనాయకుని వివాహకాలము కాఁజాలదు. కథావివాహకాలము కాఁగలదు. కాఁబట్టి విజయరాఘవ కల్యాణము రచనాకాలము 1669 వ సంవత్సరము కావచ్చును.

కోనేటి దీక్షితచంద్రుడు రామాయణోపదేశికుడు. భారతభాగవతాద్యుపదేశికుడు. సంగీతసాహిత్యవిద్యాధురీణుడు. శతక్రతుశ్రీనివాసతాతాచార్యప్రతిష్ఠాపితోపాధ్యాయుడు. విజయరాఘవనాయకుని వలన అగ్రహారము, తారహారము, రత్నకంకణము, ముక్తా కలాపము, బిరుదవాద్యము, వాహనము పడసిన సంపన్నుడు. అని; విజయరాఘవ కల్యాణము నాటకరాజము, మహానాటకము అని కృతి ఆద్యంతములందు కలదు. మహానాటకమన గొప్ప నాటకమని కాదు. పెద్ద నాటకమని అప్పటి అర్థము. విజయ రాఘవచంద్రికావిహారమునకు (66పుటలు) విజయరాఘవకల్యాణము (120 పుటలు) సుమారు రెండింతలు కలదు.

విజయరాఘవనాయకుడు అడవికి వేటకు వేంచేయును. అచటికి మదనమంజరి అను రాజకుమారి సఖీసమేతముగ వనవిహారమునకు వచ్చును. పరస్పరము చూపులు ప్రసరించును. తలపులు వలపులు కలుగును. విజయరాఘవనాయకుడు నిజరాజధానికి, మదనమంజరి నిజాంతఃపురమునకు నిష్క్రమింతురు. మదనమంజరి మదనవేదన అతిశయించును. ఆమె నెచ్చెలి కనకాంగి విజయరాఘవనాయకుని సందర్శించి, మదనమంజరిని మన్నింపుమని విన్నవించును. విజయరాఘవనాయకుడు సమ్మతించును. శతక్రతుశ్రీనివాసతాతాచార్యులు సంబంధము నిశ్చయించును. వివాహము జరుగును. ఇది కోనేటి దీక్షితచంద్రుడు హవణించిన విజయరాఘవ కల్యాణములోని ఇతివృత్తము.

కథాసూత్రము మృణాళసూత్రము. నాటకపరిమాణము హిమాలయపరిణాహము. విజయరాఘవనాయకుని కొలువుకూటము, నాటకశాల వర్తకీమణుల సలాము, కేళిక, చెంచుదొరల రాక, వారి మాటలు మొఱలు, కవివచనములు, విజయరాఘవనాయకుని ప్రయాణమువందు వారీతిలకముల నాడీవేగములు, వేటలు, చెంచుల వేట హెచ్చరికలు, వినోదములు- పదాలు, దరమరాజా శివము- మదనమంజరి రాక, ఆమె నెచ్చెలుల హెచ్చరికలు, వనవిహారము, వారివిహారము, పచ్చవింటిదొర పూజ, మదనవేదనలు, అనునయములు, ఉపాలంభములు, శీతలోపచారములు, సాముభూతులు, నివేదనలు, కనకాంగి పరామరికలు, విజయరాఘవనాయకుని పూజాపురస్కారములు, కొలువు శృంగారము, విద్వాంసుల ఆశీర్వాదములు, అయ్యగార్ల మాటలు, తెలుగు విద్వాంసుల మాటలు, విద్వత్ప్రసంగములు, సంస్కృతప్రాకృతశౌరసేనీమాగధీపైశాచీచూళికాపైశాచీ-అపభ్రంశభాండీరభాషలలో సముస్యాపూరణములు, తర్కవితర్కములు, పండితుల పరస్పరదూషణలు, తెలుగు కవుల పద్యములు, చూర్ణిక, కోపులు, పరాకులు, ఎటుకత

సోదె, విజయరాఘవనాయకుని విరహపదాలు, ముత్తైదువల ముచ్చటలు, వివాహవిధానము మొదలైనవి పరిణాహాసంధానములు.

చెంచుల మాటలు

(చెంచు) మాట :- వొరె వొరె నాకు సుమాళం వస్తావుండది కాటమరాజు పదాలు పాడెద యినరా.

మతొకఁడు :- అయితే పాడుకోరా.

చెంచుమాట :- వొరె వొరె నాకు కంబమురాయని మీఁది పదాలు వప్పిరా.

మతొకఁడు :- అయితే అరిచందకత చదుచ్చుకున్నావో, ఇంత అల్లికోరా

(చెంచు)మాట :- వొరే నాకు కూవలమ్మ మీది పదాలు వప్పిరా

మతొకఁడు :- అయితే పాడుకోరా.

(చెంచు)మాట :- వొరే యిదేవిరా కూవలమ్మ మీది పదాలు పాడుమంటే పోలేరమ్మ మీద వనేవు.

మతొకఁడు :- వొరే నీవు కుసలవపురాండం పసికివావో?

మునుపటివాఁడు:- పసికితే వెద్ది సవక్కుంటే వెద్ది

ప్రత్యుత్తరం- అయితే సవకటించరా."

ఇందు నాటి జానపదగేయముల వివరములు కలవు.

తర్కప్రసంగములు:

"చిట్టెబళ్లసోమయాజులు :- అహో సభ్యాః! అలమేతైః కవిత్వప్రసంగైః, శాస్త్రప్రసంగః కవే రుచ్చాటనమంత్రః. రే గోవిందభట్ట, శ్రూయతాం మయా తర్కే ప్రసంగః క్రియతే. త్వయాక్షిప్యతాం.

అవన్యథా సిద్ధత వియతే పూర్వభావిత్వం కారణత్వం.

గోవిందభట్టు :- అవన్యథాసిద్ధవియతపూర్వభావిత్వం కారణత్వ మితి కిమర్థముచ్యతే? పూర్వభావిత్వ కారణత్వ మిత్యేవాలం.

చిట్టెబళ్లసోమయాజులు:- హే శ్రూయతాం ఘటాదికార్యం ప్రతి దైవాదాగతస్య రాసభస్య పూర్వభావిత్వమస్త్యేవ. రాసభః కారణం వా?

గోవిందభట్టు :- గర్దభః కిముదాహరణ ముచ్యతే?

సోమయాజులు :-ఏవం వృథా కత్థనేవ త్వమేవ గర్దభః.

గోవిందభట్టు :-ఏవం వృథా కత్థనేవ త్వం శునకః

సోమయాజులు :-త్వం శూకరః.

గోవిందభట్టు :-ఈ మాటలు మధ్యస్థులు వింటిరా?"

ఇందు నాటి పండితుల పరస్పరదూషణలు స్పష్టముగ కలవు.

ముత్తైదువుల ముచ్చటలు:

తిప్పావఝుల మల్లమ్మ మాట:- ఏమమ్మ ముత్తైదువలు ఇంతసేపు రాకుండవలె.

ఎల్లమ్మ మాట :- ఏమి సేతుమమ్మ పురోహితులు మమ్ము విడివిన కద మేము రావలె

మల్లమ్మ:- ఏమమ్మ మీకున్ను అనువలేవా?

ఎల్లమ్మ మాట :- మా మాత్రమేందమ్మ, యీ ముత్తైదువ లందఱికిన్ని అమవలెనే.

మల్లమ్మ మాట:- ఔనా నాగావధానుల యెల్లమ్మ. పెండ్లి పందిట్లోకి వచ్చి యొక పాటనుడుగు పాత్రాదు. ఎన్ని మాట్లు పిలిపించుకున్నావె!

ఎల్లమ్మ:- అవునషె తిప్పావఝుల యెల్లమ్మ! నేను అమవలె పలుమారున్ను పిలిపించు కొనే దాననమ్మ. మా యింటియాయన ఉదయాన కదలి ఊరల్లా తిరిగి పురోహితాలు చేసి ఆకలిగొని అసురుసురై వచ్చేవేళ నే యింట్లో వుండకుంటే మా వారే మందురు! భళా! లెస్సాయె!

నాగావధానుల యెల్లమ్మ :- మీ వారు కోపనగించుకొంటే మీ వారికి నేను ఉత్తరువు చెప్పుకొనేగాని లేచి యిఘరావమ్మా.

ఎల్లమ్మ మాట:- అవునమ్మా మల్లమ్మ! అవును. నీవు మీ వారికిన్ని ఉత్తరువు చెప్పనేర్తువు మరిన్నమవలె పదిమంది మనుషులకున్ను ఉత్తరవు చెప్పనేర్తువు. నీ త్రాణ నేనెరుగ. అవునషే రంగుభట్ల నాగమ్మ! నీకు ఇచ్చిన వక్కలాకు లల్లా యెషు దాచుకొంటివి! ఆరికె బియ్యం తవుడు బుక్కివదాని వలె నోరు తెల్లంగా బెట్టుకొన్నావు.

రంగుభట్ల నాగమ్మ :- అవునషో వదినగారు! మీ రిమవలె పరియాచికాలు సేయవలె నాకు ఇంట్లో పనిపాటులతో తీరగను వీడెలు వేసుకోను ప్రొద్దు వున్నదషమ్మ. వీడె మనే వికారమేగాని గానిగపిండికి గలిగినంత కుమ్మదనం వున్నాదషమ్మ."

ఇవి ముత్తైదువుల మాటలు. ఇక మదనమంజరి మన్మథపూజ ఇతోధికపోసజనకము.

"చిత్తసంభవం ధ్యాయామి, రతిరాజమావాహయామి, శీతలానిలస్యందనాయ నమః, సింహాసనం సమర్పయామి. అనర్ఘశీలాయ నమః అర్ఘ్యపాద్యాదీని సమర్పయామి. కుసుమాయుధాయ నమః, నానావిధకుసుమాని సమర్పయామి. అప్రతిమప్రతాపదీపాయ నమః ధూపదీపాని సమర్పయామి. ఇక్షుకోదండధరాయ నమః, హృద్యతర నైవేద్యాని సమర్పయామి. నీరజాస్త్రధరాయ నమః నీరాజనం సమర్పయామి."

విజయరాఘవనాయకుని విరహపదములకు పాముల నాగస్వరము వినిపించ వలెనని ప్రయోగమాచన. అట్టి పదమొకటి:

"బాలరో నీసై బాలమేలు వాఁడనె
యీ వేళ నీ కౌఁగిలిఁ బాలింపవే ॥౧॥
నీ దాపుఁడనుచును మెమ్మె మీఁటుఁగ నన్ను
ఆదరించి నీ కెమ్మోవి ఆననియ్యవె ॥౨॥
వలపు దాఁచనేరనె వనితరో యిపుడు
ఎలమి మీఱ రతుల నన్నేలు కోనె" ॥ 3 ॥

ఇందలి విజయరాఘవనాయకుని ఆస్థానప్రాకృతకవులు సకలవిద్యాసార్వభౌముడు. అభినవమధురకవి. భాండీరభాష ఆనగా కాంభోజమాగధీగౌడీమహారాష్ట్ర

కళింగజాగైర్వాణీమిశ్రభాష.

"శ్రీకృష్ణానందకరు తుహమన్నారుదాసురె ।
తుహమానందకరు హే రాయగొపాళు చెపయా ॥ "

మన్నారుదేవుడు: ఇతని కృతులు 1. విజయరాఘవాభ్యుదయము. 2. హేమాబ్జనాయికాస్వయంవరము. మొదటిది అనుపలబ్ధము. అచ్యుతాభ్యుదయము, రఘునాథాభ్యుదయము వలె దినచర్యాకావ్యమగును. రెండవది సముపలబ్ధము. యక్షగానము. ఇందు అంకితప్రసక్తి లేదు. కమ్మవక్కణయందు "సౌమ్యసంవత్సరచైత్ర శుద్ధాష్టమి" అని కలదు. సంకల్పమునందును "సౌమ్యనామసంవత్సరే .... చైత్రమాసే శుక్లపక్షే .... శుభతిథే" అని కలదు. సౌమ్యనామసంవత్సరము 1669 వ సంవత్సరమని పూర్వోక్తము. కాఁబట్టి హేమాబ్జనాయికాస్వయంవరము రచనాకాలము 1669 వ సంవత్సరము కావచ్చును.

మన్నారుదేవుడు ఆస్థానకవి కాడు. అంతకంటె అధికుడు. యువరాజు. విజయరాఘవనాయకుని కుమారుడు. తండ్రి అనంతరము తంజావూరు పాలకుడు కాడు. తండ్రి తోపాటు తానును వీరస్వర్గ మలంకరించెను. అప్పుడే (1673) తంజావూరు నాయకరాజ్యమును అంతరించినది. మన్నారుదేవుడు "అతులకనకతులాప్రముఖనిఖిల మహాదానదీక్షాధురీణుడు, అనేకాగ్రహారప్రతిష్ఠాపనప్రవీణుడు, విజయరాఘవాభ్యుదయాది ప్రబంధనిబంధనచాతురీధౌరేయుడు " అని కృతి ఆద్యంతములందు కలదు. ఆ విశేషణములు యువరాజుగ పొందిన విభూషణములే. అందు ఆదిప్రబంధములు అవిజ్ఞాతములు. హేమాబ్జనాయికాస్వయంవరము గుఱించి, "తండ్రి శృంగారమును విజయ రాఘవుఁ డొకరీతిని వర్ణింపఁగాఁ గుమారుఁ డాతని ననుకరించి మార్గాంతరమున నిందు వర్ణించినాఁడు" అని ఒక అభిప్రాయము[33] కలదు. కాని విజయరాఘవనాయకుని రఘునాథనాయకాభ్యుదయ, రఘునాథాభ్యుదయములందు రఘునాథనాయకుని శృంగారము వలె, మన్నారుదేవుని హేమాబ్జనాయికాస్వయంవరమునందు విజయరాఘవనాయకుని శృంగారము లేదు. మన్నారుదాసవిలాసనాటకాదులందు శతక్రతుశ్రీనివాస తాతాచార్యుల వలె, హేమాబ్జనాయికాస్వయంవరమునందు విజయరాఘవనాయకుడు పెండ్లిపెద్ద మాత్రమే.

హేమాబ్జనాయిక లక్ష్మి. దక్షిణద్వారకలోని దేవి. చెంగమలవల్లి, చెంగమ్మ, రక్తాబ్జనాయిక, కనకాబ్జనాయిక మొదలైనవి నామాంతరములు. దక్షిణద్వారకలోని దేవుడు రాజగోపాలస్వామి సముద్రమథనము సాగించి, సముద్రతనయ హేమాబ్జనాయికను స్వయంవరవివాహము చేసికొనుట ఇతివృత్తము. కథాసంగ్రహమిది: రాజగోపాలస్వామిని దేవతలు సముద్రమును మథింప వేడుదురు. స్వామి దేవదానవులను వాసుకిని పిలిపించి సముద్రమథనము సాగించును. అందు హేమాబ్జనాయిక అవతరించును. రాజగోపాల స్వామిని మోహించును. సముద్రుడు తనయను ఇంటికి తీసికొనిపోవును. అమృతము

కొలకు దేవదానవుల వివాదము జరుగును. మోహిని అమృతమును పంచును. రాజగోపాలస్వామి రాక్షసులను సంహరించి దక్షిణద్వారక చేరును. హేమాబ్జనాయిక విరహావస్థనందును. రూపవతి అను సఖి కానుకలు పట్టించుకొని దక్షిణద్వారక వచ్చును. విజయరాఘవనాయకుడు కట్టించిన గోపురప్రాకారములు, శ్రీవైష్ణవగృహములు, శృంగార వనములు, తటాకములు, మంటపములు చూచి, సంపంగిమన్నారు నగరివాకిలి చేరును. రాజగోపాలస్వామిని సందర్శించి, హేమాబ్జనాయికను ఏలుకొమ్మని కోరును. రాజగోపాల స్వామి ఇచ్చిన ముద్దుటుంగరమును తీసికొనిపోవును. రాజగోపాలస్వామి విరహావస్థ నందును. విజయరాఘవనాయకుడు వచ్చును. విషయము తెలిసికొని తంజావూరు వచ్చి కొలువుసింగారమై, సముద్రుని దగ్గఱకు వెళ్లును. కడలిరాజు స్వాగతసత్కారములు సేయును. విజయరాఘవనాయకుడు చెంగమ్మకు మన్నారుసామితో పెండ్లి సేయుమని చెప్పును. సముద్రుడు సమ్మతించును. స్వయంవరము ప్రకటించును. విష్ణుమూర్తులు వత్తురు. హేమాబ్జనాయిక రాజగోపాలస్వామిని వరించును. వివాహము జరుగును. హేమాబ్జనాయికారాజగోపాలకులు తంజావూరు వచ్చి విజయరాఘవనాయకుని ఆశీర్వ దింతురు. ఇది మన్నారుదేవుడు హవణించిన "శృంగారరసగర్భసందర్భవిభాసుర" మైన హేమాబ్జనాయికాస్వయంవరనాటకము.

ఇందు దేవదానవుల మాటలు, ముత్తైదువల మాటలు, పురోహితుల మాటలు హాస్యరసఘట్టములు.

దేవదానవుల మాటలు:

"ఒక రాక్షసుడు :- ఓరి జంభారి, యమృతకుంభం బేల వేలవంటేవు? ఈ సంరంభంబులు నా ముందఱనా?

ఇంద్రుఁడు :- ఓరి వికుంభ! యెన్ని డంభంబులు చేసేవు? నా దంభోళి నెఱుంగవా?

వికుంభుఁడు:- ఓరి యెగ్గుసిగ్గులు లేక యెన్ని వగలఁ బోయేవు? నిలు నిలువరా.

అగ్ని:- ఓరీ తారకా! మీటక ఊటక నోరు మూయరా.

రాక్ష:- ఓరీ దండధర! యీ చండితనంబు లటుండనీరా.

యముఁడు:- ఓరీ శంబర! నీ యాడంబరంబులు కట్టిపెట్టరా.

రాక్ష:- ఓరీ నైరృతి! గొఱ్ఱె వలె ఏల వెఱ్ఱి కూతలు కూసేవురా.

నైరృతి:- ఓరి సుమాలి! బైసి మాలి యేమి గొణిగేవురా.

రాక్ష:- ఓరి పాశి! గాసిపడక తీసిపోరా.

వరుణుఁడు:- ఓరి బాణ! నీదు త్రాణ నే నెఱుంగవా? నాదు బాణంబుల పాలుగాక తొలంగిపోరా.

రాక్ష:- ఓరి సమీరా! అనుమానపడక యడంకువతో నుండరా.

వాయువు:- ఓరి హేతి! నా చేతి హేతి నెఱుంగవేరా?

రాక్ష:- ఓరి కుబేర! నీకు బేరబంధువుమాట లేదా?

కుబేరుఁడు:- ఓరి దుందుభి! ఇందు నీ తలకిందు చెల్లురా?

కాలనేమి:- ఓరి యీశాన! యీసేనలోఁ దగులక నీ దేశానికి పోరా.

ఈశానుఁడు:- ఓరి కాలనేమి! ఈ వేళ నేమి వదరేవు! నా శూలంబు పాలు గాక తొలంగిపోరా."

ముత్తైదువుల మాటలు:

(ఒకరిమాట:-) రావే ఓ కాసల్నాటి తిమ్మక్క

మరొకరిమాట:- ఇదిగో వస్తుందానే పేరూరి కామక్క. వింటివాషే జందేల బుచ్చక్క.

ఒకతె:- అదేందే ఓ బారతాల సూరక్క. వస్తివాషే పుల్లగూర పేరక్క. మన సముద్రరాజా నగరను చెంగమ్మవారికి పెండ్లి చేస్తున్నారష. పాటలు పాడిన ముత్తైదువుల కల్లా కట్నవిస్తునారష. పుచ్చుకుందాం వచ్చేరాషే.

ఇంకొకతె:- అందుకే కాదుషే వచ్చింది. ఓసమ్మ వింటివాషె. మా వారు ఏమేమొ ఏపేషో యేందేందో అంచుందారే.

మరొకరు:- ఏమంచుందారే ఓసెమ్మ. మా వారు ఇందుకు మాత్రం ముసలివారష. ఎప్పైనా నన్ను గడించిపెట్టుమని పోరుక తించుందారే ఓసెమ్మ.

ఇంకొకతె:- ఓశమ్మ అట్లాననకువే. "పురుషుండే దైవంబు, పురుషుండే తండ్రి, పురుషుండే నా పాలి పురుషోత్తముండు" అన్నాడే ఓశమ్మ. అషుగనకనే మా వారిని బిడ్డకన్నా విశేషంగా పోషింతునే.

మరొకతె:- మీ వారిని బిడ్డకన్నా విశేషంగా పోషింతు నంటివే; అప్పైతే ఇరుగువారూ పొరుగువారూ ఏం గావలే నీకు ఓసమ్మ. మీ వార్నీ మా వార్నీ మార్చుకొందామషే?

:- ఓసెమ్మా నీకు నడుమేల బట్టుకొనేనే

:- ఓసెమ్మా వింటివాషే మా వారు నిన్న రాత్రి గంపెడేసి బందాలు పట్టించేరే

:- అవునే చాలు చాలు. పెండ్లి పందిట్లో ఒక నుడుగు అనరాదుషే."

కమ్మవక్కణ :-

"శ్రీమన్మహాగుణస్తోమనంపన్నుండై భాసిల్లు రాజ గోపాలశౌరిపాదంబులకు మ్రొక్కి పాలకడలిరాజు వేడ్కఁ జేయంగల విన్నపంబు. సౌమ్యసంవత్సరచైత్రశుద్ధాష్టమి మా పట్టియగు చెంగమ్మకు స్వయంవరమహోత్సవంబొనరింప మద్యుక్తులైనాము. తా మిటు విచ్చేసి యీ మహోత్సవంబు నెఱవేర్పంగావలె. స్వామి సమ్ముఖానకు నారదువి వెంట మా నియోగి నంపితిమి. వారి పల్కు లాలించిమీరు వేగనిటు సాగివచ్చేది విన్నపంబు."

హేమాబ్జనాయిక స్వయంవరమునకు విచ్చేసిన విష్ణుమూర్తులు :-

"అతిధవళదేహుండగు నాదివరాహుండును, రంగత్కృపాతరంగి తాంతరంగనవాథుండగు కస్తూరి రంగనాథుడును, పంకజాప్తనంకాశుండగు వేంకటేశుండును వరసద్గుణమణిశ్రేణియగు శార్ఙ్గపాణియును, పాలిత ద్విరదరాజులగు వరదరాజులును, చారుతరవైభవుండగు వీరరాఘవుండును, నీలమేఘుండగు నీలమేఘప్రభుండును."

చూర్ణిక:

"శ్రీరాజగోపాలదేవ,దేవతావతంససంస్తూయమానమహనీయనిజ
ప్రభావ, భావసంభవకోటిమోహనలీలామానుషవిగ్రహ, విగ్రహమహీ
విగృహీతదైతేయలోక, లోకరక్షణవిచక్షణకృపావిలోక, లోకాలోకవలయిత
ధరణీమండలమండనాయమానకవకాటవికృతివిహార, హారనీహారసారఘన
సారవటీరవద్యుశవిశదవిశాలయశోనిరంతరితసకలజగదంతర,
తరణిసహస్రవిభావిభాసమానప్రతాప, తాపసనముదయహృదయనివేశ,
దక్షిణద్వారకాధీశ, నమస్తే నమస్తే నమస్తే నమః

రక్తాబ్జనాయికారాజగోపాలకులు విజయరాఘవనాయకుని ఆశీర్వదించిన పద్యము:

"విజయరాఘవవత్స, యీ పెండ్లి నీవు
సంఘటింపంగ మా మది చల్లనయ్యె
ప్రబలి నీ వాయురారోగ్యభాగ్యములను
ధరణి వర్ధిల్లు మాచంద్రతారకముగ."

ఆయురారోగ్యభాగ్యములను కాకపోయినను; పద్యకవితాపరంపరను, పదకవితల తామరతంపరను, సంగీతభంగీతరంగములను విజయరాఘవనాయకుడు ఆచంద్ర తారార్కముగ ఆంధ్రధరణిని వర్ధిల్లుట అపరిహార్యము.

పెద్దదాసు : ఇతని కృతులు పదములు విష్ణుపరములు. ఇతడు విజయ రాఘవనాయకుని ఆస్థానకవి కాడు. విష్ణువు ఆస్థానకవి. ఇతని భక్తిని పదరక్తిని విని, విజయరాఘవనాయకుడు పిలిపించి, తన పూర్వుల గుఱించి, తన్ను గుఱించి, తన రాజ్యవైభవము గుఱించి పదములు రచించి పాడుమని కోరిన, "నారసింహుని పాడిన నోటను నూరసింహమును పాడన్" అని నిరాకరించినట్లు ఒక ఐతిహ్యము కలదు[34]. అది సింగరిదాసు రచించిన పెద్దదాసుచరిత్రమునందు కలదు. ఐతిహ్యమంతయు విశ్వసనీయము కాదు. పెద్దదాసు రాజభటులు బల్లెములతో పొడిచినప్పటికిని బ్రదుకుట, కొఱత వేయించిన కొఱత భస్మసాత్కృతమగుట, విష్ణువు మాఱువేషమున వచ్చి విజయ రాఘవనాయకుని శిక్షించుట, విజయరాఘవనాయకుడు పెద్దదాసు పాదములు పట్టుకొని క్షమింపుమని ప్రాధేయపడుట, అయినను పెద్దదాసు, అపచారము చేసినందున రాజ్యము పరాధీనమగునని శపించుట, అందువలన తంజావూరు రాజ్యము మహారాష్ట్రపాలకాధీన మగుట కాలక్రమకల్పనము. తాళ్లపాక అన్నమాచార్యులు సాళువనరసింహరాయల మీద వలె, పెద్దదాసు విజయరాఘవనాయకుని మీద పదములు రచించి పాడననుట మాత్రము నిజము కావచ్చును.

పెద్దదాసు పదములందు "తంజాపురీసదనగోపాలా" అను సంబుద్ధి కలదు.

"ఇదిగో వేళ, వేణుగోపాలా
నా మది గర్వ మెంచక, మన్నించి రక్షింపు
మదనజనక, తంజాపురీసదనగోపాలా"

కొన్ని పదములందు పెద్దదాసు పేరును కలదు.

"పామరుల చెంతఁ జేరము, శ్రీరామనామమే నమ్మినారము
ఈ మహి సంసారహీనులతో చెలిమి
సేయక శ్రీహరి శరణుఁ జొచ్చియున్నారము ॥పా॥
చపలచిత్తుల చెంతఁ జేరము
శ్రియః పతిని మతిని నమ్మినారము
కపటమానసులతో కలసి వర్తించము
నిపుణులైన వారి కృపఁ గాచుచున్నాము ॥పా॥
దూషణభూషణ సేయము ని
ర్దోషులమై యున్నవారము
పాషండులైనట్టి పతితుల కూటమి
రోసివేసి హరిదాసులై యున్నాము ॥పా॥
ఇందుముఖుల పొందుఁగోరము పర
నిందకాడిగట్టి తిరగము
పొందుగ నరసింహు పెద్దదాసును జూచు
ఇందిరేశు భజనానందులై యున్నాము." ॥పా॥

ఇందు పెద్దదాసు వ్యక్తిత్వముమ సువ్యక్తమగుచున్నది. "నరసింహు పెద్దదాసు" అనగా నరసింహుని అపత్యము పెద్దదాసు అని కావచ్చును. అథవా నరసింహస్వామి భక్తుడైన పెద్దదాసు అని కూడ కావచ్చును.

క్షేత్రయ్య : విజయరాఘవనాయకుని ఆస్థానమునకు విజయంచేసిన పదకవితాపితామహుడు. అతడు విజయరాఘవనాయకుని మీద చెప్పిన పదములు అనేకము కలవు. అయినను క్షేత్రయ్య విజయరాఘవనాయకుని ఆస్థానకవి కాడు. అభ్యాగతకవి. అంతేకాదు. దక్షిణాంధ్రదేశకవి కాడు. ఆంధ్రదేశకవియే. క్షీణయుగము నందు క్షేత్రయ్య అను శీర్షికను అరయునది.

లీలావతి : ఈమె కృతి కమ్మవక్కణ. లఘుకృతి. అముద్రితము. లీలావతి విజయరాఘవనాయకుని నాటకశాలలోని నట్టువకత్తె. ఇందు లీలావతితోగూడి విజయ రాఘవనాయకుడు చంద్రికావిహారవినోదములు సాగించుట ఇతివృత్తము[35].

# చెంజి వరదప్పనాయకుడు

వరదప్పనాయకుడు చెంజి నాయకరాజు. తంజావూరు నాయకరాజు విజయ రాఘవనాయకుని కాలమునందు తుండీరమండలపాలకుడు. తుండీరమండలమునకు రాజధాని చెంజి. చెంజి నాయకరాజులు తెలుగు వారు. కాని తెలుగుకవులు కారు. అయినను వరదప్పనాయకునికి ఆస్థానకవి, అతని ఆస్థానమునందు అడుగు పెట్టిన కవి కలరు[36].

ఋగ్వేదము వేంకటాచలపతి గురువు తిరువేంగళార్యకవి "పాకశాసనచిహ్నాభాసుర ప్రభ చెంజి వరదేంద్రు నాస్థానవసుధయందు మంతు కెక్కిన" వాడని శిష్యుని చంపూ రామాయణమునందు కలదు. కనుక వరదప్పనాయకుని ఆస్థానకవి తిరువేంగళార్యకవి. ఇతని కృతులు లభింపలేదు. కనీసము సమాచారమును కానరాదు.

గణపవరపు వేంకటపతి "కర్ణాటతుండీరపాండ్యమండలాధీశప్రముఖాఖిల మహీమండలాఖండలదత్తమత్తసింధురసైంధవాందోళికాచిరత్నరత్నాంబరాదివస్తుప్రశస్త మందిరుడని, అతని వేంకటేశ్వరనిఘంటువునందు కలదు. కనుక గణపవరపు వేంకటపతి చెంజి నాయకరాజు (తుండీర) వరదప్పనాయకుని ఆస్థానమునందు అడుగు పెట్టిన కవి అగును. అతడు తుండీరమండలపాలకునికి అంకితమిచ్చిన కృతి లేదు.

ఆస్థానకవిని కలిగియుండుట, ఆస్థానమునందు అడుగు పెట్టిన కవిని సత్క రించుట చెంజినాయకరాజుల సాహిత్యసేవ.

"కువలయాశ్వచరిత్ర రచించిన సవరము చిన నారాయణరాజు చెంజి రాజకుటుం బమునకు సంబంధించిన వాడని యెంచుటకు గొంత యవకాశము గలదు." అని ఒక అభిప్రాయము కలదు. ఆ విషయమిది[37]:-

> "సవరము చిన నారాయణనాయకుడు కువలయాశ్వచరిత్రను దన పితృవ్యుడైన సవరము నారాయణరాజున కంకిత మొసంగెను. ఈ నారాయణరాజు" మణినాగనగరకాంతు"డని షష్ఠ్యంతముల లోను, "మణినాగపట్టణవిశ్రుతప్రభుతోజ్జ్వలు"డని ప్రథమా శ్వాసాంతము నను జెప్పియున్నాఁడు. ఇందువల్ల సవరము నారాయణ రాజునకు మణినాగపురవరాధీశ్వరుడను బిరుదుండెనని తోచుచున్నది. ఈ మణినాగపురము తోటి సంబంధము చెంజి నాయకులకును గలదు. శకాబ్దము 1583 నకు సరియగు క్రీ.శ. 1670-71 సంవత్సరమున చెంజి వరదప్పనాయుడు రామేశ్వరము నుండి మధురజిల్లాలోని తిరుప్పరన్గున్ర మను గ్రామమున వ్రాయించిన శిలాశాసనములలో దన పూర్వికులిరువదియైదు తరములకు ముందు ఆర్యావర్తములోని మణినాగపురము నుండివిజయనగరమునకు వలసవచ్చిరని చెప్పియున్నాఁడు. (ARE 860,861 OF 1961.)చెంజి నాయకులకును

నవరము వారికిని దప్ప మణినాగపురము తోటి సంబంధమాంధ్రుల
కెవ్వరికిని లేదు. కావున నవరమువారును చెంజినాయకులు
నేకకుటుంబమునకు జెందినవారు కావచ్చును. అగునేని కువలయాశ్వ
చరిత్ర చెంజినాయకరాజ్యమం దుప్పతిల్లిన కావ్యమని చెప్పవచ్చును."

ఇరువదిరైదు తరము లనగా కనీసము 25×20=500 సంవత్సరము లగును. అయిన వరదప్ప నాయకుని పూర్వికులు విజయనగరమునకు వలసవచ్చిన కాలము 1670-500 = 1170 ప్రాంతమగును. విజయనగరనిర్మాణము 1336 వ సంవత్సరము నందు జరిగినది. కనుక శాసనవిషయము కల్పితమగును. అంతేకాదు. కువలయాశ్వ చరిత్రము కృతిభర్త, చిననారాయణనాయకుని పినతండ్రి అయిన నారాయణరాజా గుఱించి కువలయాశ్వచరిత్రమునందు ఇట్లు కలదు.

"తవ మాట కాంచికాతంజాపురీమధు
రాధినాథులకు నెయ్యంబు నెఱపఁ
దవ చీటి గోలకొండవరేంద్రముఖధరా
ధవపద్మబంధు లౌదల ధరింపఁ
దవ కీర్తి మట్లనంతన్నపాలముఖ్యగో
త్రామరేంద్రులు కొనియాడికొనఁగఁ
దవ దావగుణము గోదావరీతీరభూ
నిర్జరేశ్వరులు వర్ణించుకొనఁగ
వెలయు వేదండగండవిర్గళదనర్గ
ళమదధారాధునీనాథకుముదబంధు
కార్యకృద్దండిమారావధుర్యసైన్యుఁ
డతఁడు ప్రభుమాత్రుఁడే నారనాధినేత. " 60 ప. 1ఆ.

ఇందు నారాయణరాజా కంచి, తంజావూరు, మధురపాలకులకు సంధి చేయుట, గోలకొండ సుల్తానుల కడ పలుకుబడి కల వాడగుట, మట్ల అనంతరాజా ప్రశంస లందుకొనుట మాత్రమే గాక గోదావరీతీరభూసురులకు దానము లిచ్చుట కూడ కలదు. ఆతడు తుండీరమండలమునందు కలడేని, గోదావరీమండలమునందు దానములు సేయుట సంగతము కాదు. "కావున నవరమువారును చెంజినాయకులును నేక కుటుంబమునకు జెందినవారు" కాఁజాలరు. అంతేకాదు. నారాయణరాజా "శ్రీరంగరాజ కుమారవీరవేంకటరాయభుజాబలసహాయబహువిధోపాయధురీణు"డని ముందే కలదు. (17వచ.1ఆ.) "కర్ణాటకాధీశ్వరదయాపాంద్రు"డని (45వచ. 1ఆ.)" వీరవేంకటరాయభూవి భువి కరుణఁబరఁగు"నని కలదు. (59ప. 1ఆ.) కర్ణాటకాధీశ్వరుడు విజయనగరరాజా. శ్రీరంగరాజా కుమారుడైన వీరవేంకటరాయలు విజయనగరరాజైన మూడవ వేంకటపతిరాయలు. వీరశబ్దవిశేషణమతనిదే. పయి పద్యమునందు "సైన్యు" డని కలదు. కావున నవరము నారాయణరాజా వీరవేంకటపతిదేవరాయల సేనాధిపతి కావలయును కాఁబట్టి నారాయణరాజునకు అంకితమైన నవరము చిన నారాయణ

నాయకకవి కువలయాశ్వచరిత్రము చెంజి నాయకరాజ్యములోని కావ్యము కాదు. విజయనగరరాజ్యములోని కావ్యమే అగును.

చెంజి నాయకరాజుల ఆంధ్రసాహిత్యసమాదరమునకు తిరువేంగళార్యకవి, గణపవరపు వేంకటపతి మాత్రమే సాక్షులు.

# మధురనాయకరాజులు

రఘునాథనాయక, విజయరాఘవనాయకుల కాలమునందు (1600-73) కవులు కాకపోయినను, కవులను ఆదరించిన మధురనాయకరాజులు తిరుమలనాయకుడు (1623-29) చొక్కనాథుడు (1659-82) ముద్దళఘరి (1675-78) కలరు.

మధురశాఖను ప్రథమఫలము వచనగ్రంథము. రాయవాచకము. ఇది "శ్రీమన్మహామండలేశ్వరరాజమాన్యమహారాజరాజశ్రీవిశ్వనాథనాయనయ్యవారి "స్థానాపతి విన్నపముగ రచించినది. కాశీవిశ్వనాథనాయనయ్య మధురనాయకరాజ్యమును స్థాపించిన విశ్వనాథనాయకుడని ఒక అభిప్రాయము కలదు[38]. కొటికం నాగమనాయకుని కుమారుడు విశ్వనాథనాయకుడు మధురనాయకరాజ్యమును శ్రీకృష్ణదేవరాయల కాలమునందు స్థాపించినట్లు[39], అచ్యుతదేవరాయల కాలమునందు స్థాపించినట్లు [40] ప్రాచీనగ్రంథము లందు కలదు. కాని, అతడు శ్రీకృష్ణదేవరాయల కాలమునందు అడపము[41]. అనగా తాంబూలకరండవాహి. అచ్యుతదేవరాయలకాలమునందు మధురరాజ్యమునకు విజయ నగరరాజప్రతినిధి మాత్రమే[42]. మహామండలేశ్వరుడు కాడు. అతని కుమారుడు కృష్ణప్పనాయకుడు స్థాపించినది[43] మధురనాయకరాజ్యము. అంతేకాదు. కొటికం విశ్వనాథనాయకుడు శ్రీకృష్ణదేవరాయల కొలువునందు ఉన్నట్లు రాయవాచకమునందు కలదు. (పుట44పంక్తి20.) అతనికి స్థానాపతి రాయవాచకమును విన్నపము సేయుట అసంగతము. కాఁబట్టి రాయవాచకము మధురనాయకరాజవంశమునకు మూలపురుష డైన విశ్వనాథనాయకుని కాలములోనిది కాదు. అంతేకాదు. రాయవాచకమునందు కొటికం విశ్వనాథనాయకుని తోపాటు రాణా జగదేవు, మట్ల అనంతరాజు శ్రీకృష్ణ దేవరాయల కొలువునందు ఉన్నట్లు కలదు. (పుట44 పంక్తులు 16,22,23.) శ్రీకృష్ణదేవరాయల ప్రబలశత్రువు బాహుబలేంద్రముకుందగజపతి అని కలదు. (పుట23 పంక్తి 14) మైసూరు, చెన్నపట్టణము, బాగానగరము అనగా భాగ్యనగరము ప్రసక్తమైనవి. (పుట21 పంక్తులు 9, 17; పుట49పంక్తి20.) బాహుబలేంద్రముకుందగజపతి రాజ్యారంభ కాలము 1560 వ సంవత్సరము[44]. మైసూరు ఏర్పడినకాలము 1571 వ సంవత్సరము[45]. రాణా జగదేవు కర్ణాటకదేశములోని చెన్నపట్టణమునందు కోట కట్టించి, రాజధానిగ చేసికొన్న కాలము 1580 వ సంవత్సరము. [46] భాగ్యనగరము నిర్మింపబడిన కాలము 1591 వ సంవత్సరము[47]. మట్ల అనంతరాజు సిద్ధవటశాసనకాలము 1607 వ సంవత్సరము[48]. కాఁబట్టి రాయవాచకము తదనంతరకాలికగ్రంథమగుట తథ్యము.

పయి విషయములు ప్రక్షిప్తము లగుట నిరవకాశము. కారణము రాయవాచకము కన్నడభాషయందును కలదు. అది 1983 వ సంవత్సరమునందు ముద్రితము. అందును చెన్నపట్టణము (పుట10పంక్తి15) రాణా జగదేవ (పుట28పంక్తి13) విశ్వనాథనాయకుడు (పుట28పంక్తి19) బాహుబలేంద్రముకుందగజపతి (పుట31పంక్తి31 పంక్తి9) మొదలైన

రాయవాచకములోని పయి విషయములు కలవు. గ్రంథనామము శ్రీకృష్ణదేవరాయన దినచరి. అది పదునాఱవశతాబ్ది గ్రంథము కావచ్చునని అచటి అభిప్రాయము[49]. కర్తృనిర్దేశములేదు. దినచరి వాచకమునకు స్వతంత్రానుసరణము.

మధురనాయకరాజులందు రెండవ కృష్ణప్పనాయకుని (1595-1601) తమ్ముడు, ముత్తు కృష్ణప్పనాయకుని (1601-1609) తండ్రి అయిన విస్సప్ప అనగా విశ్వనాథ నాయకుడు రాయవాచకములోని కాశీవిశ్వనాథనాయనయ్య అని, రాయవాచకము రచనా కాలము 1591-1600 మధ్య కాలమని ఒక అభిప్రాయము కలదు[50]. 1592-1602 మధ్యకాలమని మఱొక అభిప్రాయము కలదు[51]. ఇంచుమించు రెండును సమానమే.

అయిన తన కాలములోని పాలకులను శ్రీకృష్ణదేవరాయల కొలువునందు ఉన్నట్లు స్థానాపతి రచించుట సంగతము కాదు. రాయవాచకమునందు కర్తృనిర్దేశమునకు ముందు, గ్రంథాదిని, అవతారిక పేర, నాలుగు కందపద్యములు కలవు. ఆదిమపద్యమిది:

"విజయనగరవృత్తాంతము
సుజనులచే విన్నయట్టి సూనృతవాక్కుల్
ప్రజలకుఁ దేటపడంగా
సృజియించితిఁ గృష్ణరాయశేఖరు చరితల్." ౧.

ఇందు విన్నది రచించినట్లు ఇదమిత్థముగ కలదు. సుజనులు చెప్పినవెల్ల సూనృత వాక్కులు కాలేదు. కారణము వారును కన్నది గాక విన్నది చెప్పుట కావలయును. రెండవ కృష్ణప్పనాయకుని అనంతరము విస్సప్ప కుమారుడు ముత్తు కృష్ణప్పనాయకుడు (1601-1609) మనుమలు ముత్తు వీరప్పనాయకుడు (1609-23) తిరుమలనాయకుడు (1623-29) వరుసగ మధురనాయకరాజులు. విస్సప్ప మనుమల కాలమునందును బ్రదికియుండుట అసంభవము కాదు. ఆ కాలమునందు ఒక స్థానాపతి రాయవాచకము రచించి, విస్సప్ప ఉరపు విశ్వనాథనాయకునికి విన్నపము సేయుట, అందుకు రాజ లాంఛనములు అలంకరించుట కూడ అసంభవము కాదు. అసంగతమును కాదు. కాఁబట్టి రాయవాచకము రచనాకాలము 1625 ప్రాంతము, శ్రీకృష్ణదేవరాయనదినచరి రచనాకాలము 1650 ప్రాంతము కావచ్చును.

రాయవాచకము తాళపత్రగ్రంథములు రెండును పుదుక్కోటలో లభించినవి. బహుశః రాయవాచకమును రచించిన స్థానాపతి, తిరుమలనాయకుని పుదుక్కోటలోని స్థానాపతి కావచ్చును. మధురనాయకరాజైన తిరుమలనాయకుని మహామండలేశ్వర విశేషణమును స్థానాపతి అతని తాతకు ఆపాదించుట అసంగతము కాదు. అంతేకాదు. కుమారుడు, మనుమలు మహామండలేశ్వరులైన విస్సప్ప రాజమాన్యుడే. మహారాజరాజశ్రీ సంబోధనమన్నామ్యుడే.

బహిరంతస్సాక్ష్యములకు బాధకము గాకుండ, రాయవాచకము తిరుమల నాయకుని కాలములోని గ్రంథమగుట సాధకము. మధురశాఖను ప్రథమఫలము. వచనగ్రంథము.

రాయవాచకము రసవత్కావ్యము కాదు. చరిత్రగ్రంథము. వ్యావహారికభాషా రచనము. శ్రీకృష్ణదేవరాయల చరిత్రకు శ్రీరామరక్ష. నాటి వ్యావహారికభాషావైఖరికి మేటి దర్పణము. తెలుగు కన్నడ గ్రంథములందు కబాయి, కుళ్లాయి (కుల్లాయి) జబురుజంగులు (జబరజంగి) డెరిజా (డెరిజ) దునేదారుఁ (దున్నెదారరు) నామజాదు, ఫిరంగి, రస్తు, హురుమంజి, హుర్మత్తు (హురమతి) మొదలైన అన్యదేశ్యపదములు సమానము. అంగజాదులు (అంగజాలరు) కందాచారం (కందాచార) తలారి (తళవార) ఫణిహారులు (పడిహార) మణియగార్లు (మణిహగారరు) రాణువ, సంప్రతులు (సంప్రతి యవరు) హెగ్గడికత్తెలు (హెగ్గడికాతి) మొదలైన రాజోద్యోగపదములు సమానము. రాయవాచకములోని వాక్యరచన సుదీర్ఘము. ఒక ఉదాహరణము.

> " -- పిన్న పెద్దలు అందరున్ను శాస్త్రోక్తముగ శుభముహూర్తమందలి కృష్ణరాయలవారికి మంగళస్నానం శేయించి, కళ్యాణవేదికయందు బంగారు పీఠమున కూర్చుండ నియమించి, దశదానములు షోడశమహాదానములున్ను శేయించి, స్వర్ణతుల రజితతుల రత్నతుల మౌక్తికతతుల మేరువులు కోటిగో దానాలు సహస్రకుటుంబప్రతిష్ఠలు మొదలైన దానధర్మములు శేయించి, చతు స్సముద్రముల నుంచిన్ని బంగారు కలశముల వుదకములు తెప్పించి మరిన్ని గంగాయమునాసరస్వతీగోదావరీనర్మదాసింధుకావేరితామ్రపర్ణి మొదలయిన మహానదుల వుదకములున్ను తెప్పించి, అష్టాదశవాద్యఘోషములున్ను మ్రోయగా--"

ఇట్లు "కృష్ణరాయల పట్టాభిషేకము" ఒక పుట ఒకే వాక్యము. రెండేసి పుటలు, మూడేసి పుటలు ఏకవాక్యములైన సందర్భములును కలవు.

**తిరుమలనాయకుడు: (1623-29.)** ఇతడు కవిపోషకుడు. లింగన మఖి తిరుకామయకు "స్వచ్ఛముక్తాగుళచ్ఛసితచ్ఛత్రచామరకళాచికాకనకాందోళికాది రాజోపచార"ము లొసగినట్లు, అతని సత్యభామాసాంత్వనములోని గద్యము నందు కలదు. కాని, తిరుకామయ తిరుమలనాయకునికి కృతి అంకితమిచ్చినట్లు కానరాదు. తిరుమలనాయకుని ఆస్థానకవి కాడు గాని, అభ్యాగతకవి అయిన క్షేత్రయ్య తిరుమలనాయకుని మీద రచించిన పదములు కలవు. అవి క్షీణయుగమునందు క్షేత్రయ్య అను శీర్షికము అరయునది.

**చొక్కనాథనాయకుడు: (1659-82.)** ఇతడు తిరుమలనాయకుని మనుమడు. ఇతడును కవి కాడు. కవిపోషకుడు. ఇతని ఆస్థానకవి లింగనమఖి తిరుకామయ. అతడు తిరుమలనాయకుని కాలమునందు యువకవి, చొక్కనాథ నాయకుని కాలమునందు వృద్ధకవి అగును. తిరుకామయ ధేనుమాహాత్మ్యము చొక్కనాథనాయకునికి అంకితము.

**ముద్దళఘురి: (1675-78.)** ఇతడు చొక్కనాథనాయకుని తమ్ముడు. అన్న రాజ్యకాలమునందే, అలతి కాలము పరిపాలన సాగించెను. ఇతని ఆస్థానకవి కూడ తిరుకామయ. అతని రుక్మిణీపరిణయము, సత్యభామాసాంత్వనము ముద్దళఘురికి

అంకితములు. ముద్దళఘురికి ఆస్థానకవి కాడుగాని, అభ్యాగతకవి అయిన గణపవరపు వేంకటపతి విద్యావతీదండకమును ముద్దళఘురికి అంకితము. ముద్దళఘురివిజయము కూడ గణపవరపు వేంకటకవి కృతి. అవి క్షీణయుగమునందు గణపవరపు వేంకటపతి అను శీర్షికను అరయునది.

లింగనమఖి తిరుకామయ: ఇతని కృతులు 1. ధేనుమాహాత్మ్యము. 2. రుక్మిణీపరిణయము. 3. సత్యభామాసాంత్వనము. మొదటిది వచనకావ్యము. రెండవది అనుపలబ్ధము. మూడవది పద్యగద్యకావ్యము.

ధేనుమాహాత్మ్యము: ఇది వచనకావ్యము. అముద్రితము. చొక్కనాథ నాయకునికి (1659-82) అంకితము. రచనాకాలము 1660 ప్రాంతము కావచ్చును. ఆద్యంతపద్యములివి[52]:

"శ్రీరామామణి వింతగా నురమునం జెన్నొంది కొల్చుండ నెం
తే రంగంబును కట్టుమట్టును సదా దీవ్యత్కృపాధార క్షీ
రారూఢిం దగఁ గామధేనువు వలెన్ రక్షించి లోకంబులో
శ్రీరంగేశుఁడు చొక్కనాథ (నృప) శౌరిన్ వేడుకన్ బ్రోచుతన్."

"వివిధకలాకలాపఖని వెంగనలింగమఖీంద్రు నాగ స
త్కవి తిరుకామకోవిదశిఖామణి, ధీరులు పాకవైరిలో
కవికచకల్పకస్తబకగంధధురంధరసూక్తియుక్తి నా
నవునని మెచ్చ నావుల మహాత్మ్య మొనర్చును తేట మాటలన్."

మహాభారతమునందు భీష్ముడు ధర్మరాజునకు చెప్పిన గోదానమాహాత్మ్యమే ధేనుమాహాత్మ్యము. తిక్కన పద్యగద్యములకు తిరుకామయ వచనము సన్నిహితము.

తిక్కనపద్యమిది:

"గోవు లెక్కుడు తపోభావితాత్ముల కంటె
వనివఁ దద్గౌరవంబునకు మేర
గలదె సత్యాఖ్యలోకంబున నవి సోమ
సంగతత్వంబున సంచరించు
విమతహోమముల కెల్లను బాలుఁ బెరుగు నే
యును విచ్చుఁ గర్వంబునకు నాదవుఁ
దోలు శృంగంబులు వాలంబు రోమచ
యము శకృన్మూత్రము లఖిలవర్త
నముల కుపచరించు శ్రమము శీతాతప
వ్యథయు లేమి నెపుడు వతిభరంపుఁ
బనులు సేయు గోవు బ్రాహ్మణుఁడవ వేక
తత్త్వ మగుటఁ బరపదంబుఁ గాంచు". 397వ. 2ఆ.అను.వ.

తిరుకామయ వచనమిది[53]:

"సత్యలోకమున నివి యజ్ఞసంగతి నివసించు. హోమమ్ముల
నెల్లను పాలచే చమురు నుపయోగించు. కొమ్ములు నెమ్ములుచర్మములు
మున్నని తోఁక రోమములు పేడ పంచితమును నన్నింటికినుపకరించు.
గాలిని చలిని ఎండను వీనికి బడలిక లేదు.కావున నా యా సమయమ్ముల
తమ కు నుచితమ్ములైనవ నులివి సేయు. కావున నావుమ
బ్రాహ్మణుండును నేకతత్త్వంబగుటం జేసి పరమపదంబుఁ జెందు."

తిరుకామయ వచనము సరళము. అలతి అలతి వాక్యముల అలరింపు. భాష గ్రాంథికము. వ్యాకరణస్ఖాలిత్యములు బహుళము. అవి పద్యగద్యకావ్యమునందును అంతే. వచనరచనమునందు నుకారద్విత్వసముచ్చయము సమధికము.

"అది యెవరున్ను యెఱుంగరు. ఇది నిశ్చయము. నేమన్ను
ఉత్తములైన మునులున్ను పతివ్రతాస్త్రీలున్ను యెఱుంగుదురు."

ఇట్టి నుకారద్విత్వసముచ్చయము, ద్రుతము మీది యడాగమము లేఖకకృతము కూడ కావచ్చును.

**సత్యభామాసాంత్వనము:** ఇది శృంగారప్రబంధము. (పుట9.) ముద్దళఘురికి అంకితము. రచనాకాలము 1675 ప్రాంతము కావచ్చును.

ముద్దళఘురి నిండు కొలువుండి, సాహిత్యప్రసంగము గంభీరప్రౌఢిమ మించ, తిరుకామయను పిలిచి, పలికిన విషయమిది:

"అమవుగ రుక్మిణీపరిణయంబును మున్ హవణించి యార్యులౌ
నవఁ దవియించివావు మము నప్రతిమంబుగ నవ్యకావ్యమిం
పున రచియించుమీ సొగసు పోఁడిమి మీఱఁగ సత్యభామసాం
త్వన మనఁ గప్పురంపు చలువన్ గెలువన్ దిరుకామసత్కవీ!

కాకులవలె నింటింటను,
గాకవు లున్నారు హంస కైవడి భువిలో
శ్రీకామ నీకె తగురా
యే కడ నుడి పాలు నీరు నేర్పఱుపంగన్.
ఏ భాషనైనఁ గృతిపతి
శోభనములఁ జెందు నీదు సూక్తులవలనన్
నీ భాగ్య మసదృశము గౌ
రీభవకరుణానివేశ శ్రీకామేశా." పుటలు20,21.

తిరుకామయ పార్వతీపరమేశ్వరభక్తుడే కాని; ముద్దళఘురి - ఒక్కతె పదము లభినయింప, ఒక్కతె వీణావినోదంబు వినికి సేయ, ఒకర్తు వంతు మార్గపు పాట వింత చూప, ఒకర్తు హితమైన శృంగారకృతులు చదువ, ఒక్కతె మదవతుల రాయబారంపు మాటలాడ, "జనులు కలియుగగోపాలుఁ డనఁగ" వెలసినవాడు. (పుటలు10,11) అంతేకాదు "ఏ వేళ వడిగిన హేరాళముగ నిచ్చు నేపాటి కవినైన మెచ్చు"ను. (పుట11.)

అతవి శ్రవణానందమువకే రచించినట్లు కలదీ శృంగారప్రబంధము.

"కాకుల వలె" అను పద్యము ఇంటింటి కుకవులకు తొలి మూదల.

సత్యభామాసాంత్వనము నాలుగాశ్వాసముల కావ్యము. ఇందు సత్యభామను శ్రీకృష్ణుడు సాంత్వనపఱుచుట ఇతివృత్తము. అది ద్వితీయాశ్వాసము తుది నుండి కలదు. అంతవఱకు శృంగారశృంగాటకము. అంత నుండి శృంగారశృంగాగ్రసరము. "కథాక్రమం బెట్టిదనిన" (పుట58.) మొదట ద్వారకాపురవర్ణనము. ఇరువదిపద్యములందు వేశ్యవాటికావర్ణనము. ఆ వర్ణమునందును ఒక అపూర్వపురాణాంశము!

"అత్యకలంకవృత్తి వెలయాంధ్రుని దాముని హృద్యవాద్యులై
యాత్య మెసంగ వంగజవిహారమహారసికావతంసులై
నిత్యము క్రీడ సల్పుదురు నీటులు మీఱఁగ వేశ్యవాటులన్
సాత్యకిచంద్రభానుశివసాంబజయాదికుమారవర్గముల్." పుటలు61-62.

వెలయాంధ్ర వృత్తి అత్యకళంకమైనను, సాత్యకిప్రభృతుల ప్రవృత్తి నిత్యకళంకము. అంతేకాదు. "వెలయు విటతాపసుల సేన వీటిలోన" (పుట64) ద్వారకలో "గోపురాంత సీమ మాపురారావంబు లమర బోగము కన్నెగము లెసంగ" పార్వతీపరమేశ్వరుల "పైడి దేవళంబు"! (పుట65.) "ఆ పురమేలు" కృష్ణవర్ణనము రెండు పద్యములు. (పుట66) ప్రథమాశ్వాసము పరిసమాప్తము.

"తదనంతరకథాక్రమం బెట్టిదనిన" (పుట66)

"తొడ మండి తమియుబ్బ దురుముగా మమగుబ్బ
పాలిండ్ల పాలోమి ప్రక్కఁ గ్రుమ్మ
గుమ్మలు వేవేలు కులుకుచు వెఱమేలు
కసరెత్తు వగ మాడిగముల పూవ" పుట70.

ఇంద్రుడు కామకలతో కృష్ణుని కడకు వచ్చును. శశిరేఖ చలువలు, హరిణి కస్తూరి, తార చేరుచుక్క, హేమ కాంచవసుమదామము, చిత్రరేఖ వన్నె చీరలు, రంభ సిరము కప్పురము, మంజుఘోష మణుల పెండెము, సుగుణ హారములు, తక్కిన కొమ్మలు పారిజాతకుసుమఫలజాలములు సమర్పింతురు. (పుట73) ఇవియెల్ల పలపుష్ప పత్రతోయములే! - పరస్పరకుశలప్రశ్నల, ప్రశంసల అనంతరము, ఇంద్రుడు దీనాతి దీనముగా నరకాసురుడు పెట్టు బాధలు మొఱపెట్టును. ప్రధానముగ నరకాసురుని సేనల ప్రతాపము, అప్సరసలను 'లూటి' చేయుట! రెండు సీసపద్యములు (పుటలు77,78.) కృష్ణుని సమాధానములోని ముఖ్యాంశము:

"సమముగ సమరాలంకృతి
హానిఁ బొందుట కంటెఁ బ్రకృతమైన వసంతో
త్సవము వెలవేర్చి మఱి దా
నవుపై దండెత్తవలయు నముచివిరోధీ." పుట 81.

వసంతోత్సవము పైడిదేవళములోని పార్వతీపరమేశ్వరులకు వసంతోత్సవము

కావచ్చును. కృష్ణునికి, ఇంద్రునికి అజేయత, శ్రేయము కలిగించునట. (పుట81.) అందుకు ఇంద్రుడు అప్సరసలను, జయంతుని ద్వారకలో ఉంచి అమరావతికి బయలు దేరును. కృష్ణుడు ఇంద్రునికి "మంచి చెంగావుల నిచ్చి" సాగనంపును. (పుట83.) అప్సరసలు వసంతోత్సవమునకు అవసరము. వారికి జయంతుడు కాపలాదారుడు!

ఇక వసంతోత్సవవర్ణనము. ఇది సుమారు నలుబది పద్యగద్యరగడల సుదీర్ఘఘట్టము. ఏబది పైగా పద్యముల పెట్టు. అందు వసంతములు చల్లుకొనునెడ శ్రుతి మించిన శృంగారమే కాదు; వలువలు జాఱిన విలువలు కలవు.

"పావడకట్టుతో భ్రమసి తొల్గెడి వారు
నాగి నీవి జాఱఁ గూర్చుండు వారు
రవిక వీడినఁ బైఁట రహిగఁ జెక్కెడు వారు
వది వోఁ గుచము కేల నదుము వారు
తడికోక తొడనిగ్గు లడర వ్రాలెడు వారు
వచ్చోఁ దళుక్కున వణఁగు వారు
కుచ్చెల వెఱికవోఁ గొతి కొదిగెడు వారు
నాభి బైలైన వెమ్మలయు వారు
నగుచు నగి నగి నగవగ నిగురు పొగరు
మిగుల పొగసుగ మగువలఁ జిగురువిల్తు
మాయలను జొక్కఁజేసిన మరునిఁ గన్న
సామి తమిఁ జెందుఁ జెందు నా సమయమందు". పుట99.

ఇది నేటి చలనచిత్రదృశ్యముల కంటె మేటి కాదుగాని, నాటి కావ్యవర్ణనముల కంటె ధాటి. ఇంతకు ముందు కొఱవి గోపరాజు సింహాసనద్వాత్రింశకయందు వసంతోత్సవవర్ణనము కలదు. అదెంత సముచితమో ఇదంత అనుచితము.

మఱి వసంతోత్సవము నాటి రాత్రి సత్యభామాశ్రీకృష్ణుల సంభోగశృంగారము ఒక నక్షత్రమాల. ఇరువదియేడు పద్యములు. శ్రీనాథుని శృంగారనైషధములోని "పతి పాణిపల్లవచ్యుత "అను సీసపద్యమునకు (177ప. 7ఆ.), ప్రతిద్వంద్విప్రాయమైన సీసపద్యము కలదు. అందు శ్రీహర్షుని నైషధీయచరితములోని కామశాస్త్రకారికలను అభ్యసించిన శారికల వలె మన్మథుని కొలువు కలదు. ఆ పద్యమిది:

"అధికహాస్యగాహశిథిలకుంతలవాల
మాతతశ్రమకణోద్యత్కపోల
మామృష్టముష్టాదివ్యాప్తిత వికటాల
మవ్యోన్నరవితాట్టహాసలీల
మధిగతముఖ మవంగామీలితవిహాల
మా ప్రయోగక్షతోష్ణప్రవాల
మలఘువక్షోజకట్యామర్దవప్సాల

మాకీర్ణకుసుమశయ్యానిచోళ
మవిరళావ్యక్తవాగ్జాల మతికరాళ
మాత్మపులకాంకురసిరాళ మమితఖేల
మగుచు మఱఁ డిచ్చఁ గొలువుండి నగుచు మెచ్చ
నమరి నిరతంబు మెఱసెఁ దత్సమరతంబు." పుటలు 107, 108.

సమరతములే కాదు; పునఃపునారతములు, ఎదురొత్తులు, మరుసాములు, మగసయ్యాటలు మామూలే.

ప్రభాతసమయమునందు ప్రద్యుమ్నుడు విజయయాత్రాముహూర్తము సమీపించినదని కృష్ణునికి ఏకాంతముగ విన్నవించును. అంతకుముందే చెలికత్తెలవలన విన్న సత్యభామ తన్ను తోడ్కొనిపొమ్మని హెచ్చరించును. అందుకు కృష్ణుని సమాధానము (పుటలు113-114.) పురుషాహంకారపూరితము. అందొక పద్యము:

"వెఱవక పోరు చూచుటలు వెన్నెల కుప్పలొ కాక గవ్వలో
గురుగులొ బొమ్మరిండ్లొ మఱి గుజ్జనగూడులొ పెండ్లి వీడులో
పొరిఁబొరి నిచ్చలున్ విసరు పువ్వుల రువ్వులొ తేట నవ్వులో
యరయరు కార్యముల్ మృగము లట్ల వెలందులఁ దెల్ప శక్యమే." పుట113.

ఇందు స్త్రీలను మృగములు! -అందును శ్రీకృష్ణుడు అనుట దారుణము. ఇష్టమైన మృగాక్షులు; కష్టమైన మృగము లనుట! "అవిరళబాణజాతముల నంగనఁ గాచుట యెట్లు" అను ప్రశ్న (పుట114) ఆ కాలమునకు అనుగుణమే. దానికిని సమాధానమిచ్చినను (పుటలు114-116.) సత్యభామను తోడ్కొని గాక, వీడ్కొని కృష్ణుడు "పాళెంబు విడియించె నంత" సత్యభామకు విరహము. (పుటలు119-122.) ద్వితీయాశ్వాసము సంపూర్ణమగును.

తృతీయాశ్వాసము ప్రారంభమగును. కృష్ణుని విరహము. కుతినీగుడారులోన దంతపు మంచము మీద పవళించిన కృష్ణుని విరహము, నెచ్చెలికాండ్ర సమాశ్వసనము, విదూషకుడైన కలవింకుని హాస్యకలనము కలిసి అదొక అష్టోత్తరము! నూటయెనిమిది పద్యగద్యములు.

"చక్కెర యన్నింట జాణ నిద్దా హొంత
కారి కురుజా తేనె గరిగె పచ్చి
కస్తూరి వీణె బంగారు తీగె యొయారి
జీవరత్నము రామచిలుక కన్నె
లేడి కలికి వన్నెలాడి చిత్తరు బొమ్మ
కులుకుల గని ముద్దుగుమ్మ కమ్మ
జాబిలేజీకూవ చక్కఁదనమ్ముల
యిక్క తళుక్కను చుక్క మరువి
ఢక్క మరతపు మల్తాని చొక్కుమందు
బరణి లేగుబ్జామామిడిపండు మెఱసి
నిలుచు క్రొమ్మించు మురుపు వన్నీటి చెఱువు

దాని నెడఁబాసి యీ వేళఁ దాళఁజాల" పుటలు 136-137.

అని కృష్ణుని చింత. నేస్తకాండ్రు వినగా సత్యభామ గుఱించి విరహప్రలాపములు. విన్న చెలికాండ్ర సమాశ్వసనము. అందు ఒక మందలింపు.

"సుదతి గుబ్బల మీఁద సుఖియింపుచుండఁగాఁ
దెలిరైక తపమెంత సలిపెనొక్కొ
తరుణి తొడల మీఁద మెఱయుచునుండఁగాఁ
బావడ యే పూజఁ బ్రబలెనొక్కొ
పొలఁతి మేనెల్లఁ గప్పుకయుండఁ జెంగావి
చీరె యే పుణ్యంబు చేసెనొక్కొ
యువిద వాతెర నాని యుండంగ ముక్కెఱ
నునుముత్య మే నోము నోమెనొక్కొ
రమణిఁ దన మీఁదఁ బొరలు కుంకుమపుఁ బఱపు
బళిర యెంతటి భాగ్యంబుఁ బడసెనొక్కొ
యనుచు నే వేళ నోరెత్తి యఱచెదేల
యకట చెలిపొందు గోరి యో శకటవైరి" పుట156.

కలవింకుని హాస్యకలనమునందు వేశ్యాగమనప్రబోధము (పుటలు 157-160) అపహాస్యభాజనము. కడకు చిలుక రాయబారము వలన (పుటలు 170-182) సత్యభామ కదనరంగమునకు వచ్చును. కృష్ణుడు మదనరంగమునకు తెచ్చును. తృతీయపురుషార్థము కడ ముట్టును. తృతీయాశ్వాసము తుద ముట్టును.

కృష్ణుని గూఢచారులు నరకాసురుని గూఢచారిని పట్టి బంధింతురు. ఆ 'దయ్యపువేగరి' కృష్ణుని సన్నిధికి రాగానే బ్రాహ్మణు డగును. అతని వృత్తాంతమును చిలుక వివరించును. అది శ్రీనీలుని వృత్తాంతము. సుమారు ఏబది పద్యగద్యముల ఘట్టము. సంభోగశృంగార సంభరితము. అది ముగియుసరికి శరత్కాలము వచ్చును. శరత్కాలవర్ణనము పండ్రెండు పద్యముల ఘట్టము. అందు సుదీర్ఘమైన రగడ ఒకటి. అనంతరము నరకాసురయుద్ధము. సుమారు ఏబది పద్యగద్యముల ఘట్టము. ఇది కండపట్టు. ఇందు సత్యభామ యుద్ధవర్ణనము నాచన సోమనాథుని ఉత్తరహరివంశము నందు కంటె, పోతన భాగవతమునందు కంటె ఉజ్జ్వలము. కృష్ణుడు వలదన్నను, అతని చేతి విల్లందుకొని నరకాసురుని సేనలను చెల్లాచెదరు చేయును. కృష్ణుడే నరకాసురుని సంహరించును. భగదత్తుని పట్టాభిషిక్తుని చేసి, నరకాసురుని చెఱసాల యందు పడియున్న "అకృతకరగ్రహలు, తటిత్ప్రకరోపమలు అయిన పదాఱువేల రాచ కన్నియలను పరిణయమాడును. అది సత్యభామ ఆగ్రహమునకు, కృష్ణుని సాంత్వనమునకు కారణము. కృష్ణుడు పాదాభివందనము చేయును. సత్యభామ పాదతాడనము చేయును. సంభోగశృంగారమే కడకు సాంత్వనము. (పుటలు259-262.) సత్యభామా సాంత్వనకావ్యము సంభోగశృంగారమయము. పునారతివర్ణనమిది:

"అనుపమరతికూజితానుమేయకపోత
మలఘురయోదయత్పులకజాత
మమితబంధోద్యమశ్రమజలసంపాత
మతివృత్తకుచనాట్యగతిసమేత
మకలంకరుచికిణచికురయాతాయాత
మాభుగ్నపటునితంబాభిఘాత
మత్యపాయరసాశయవ్యంజకాకూత
మసమసౌరభలసత్కుసుమపాత
మలకజాతాన్వితాంగచాపలవిభాత
మోదనస్ఫూత మధికప్రసాదచేత
ముగ నపుడు శౌరి మదికిని సొగసు నించె
మగువ మరు సాధనఘనంబు మగతనంబు." పుట261.

సత్యభామాసాంత్వనములోని శ్రీకృష్ణుని విప్రలంభశృంగారము పాత్రోచితము కాదు. సత్యభామాశ్రీకృష్ణుల సంభోగశృంగారమును పాత్రోచితము కాదు. సాత్యకి ప్రభృతుల వేశ్యాగమనము పాత్రోచితము కాదు. కలవింకుని వేశ్యాగమనప్రబోధము కావ్యోచితము కాదు. శ్రీనీలుని పరదారాగమనము కావ్యోచితము కాదు. "ఔచిత్యం రససిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితమ్" అని క్షేమేంద్రుని సిద్ధాంతము. అది క్షేమంకరము. ఎంత రసవంతమైన కావ్యమైనను ఔచిత్యము లేనిచో స్థిరము కానిది. జీవితము లేనిది. క్షేమేంద్రుని పదౌచిత్యాదుల తోపాటు పాత్రౌచిత్యమును పరిగణనార్హము. అంతేకాదు. "విశ్వశ్రేయః కావ్యమ్" అని ఆంధ్రశబ్దచింతామణీకారుని కావ్యనిర్వచనము. విశ్వశ్రేయస్సన జగద్ధితము. జనహితము. సమాజశ్రేయస్సు. సమాజశ్రేయస్కరము కాని కావ్యము సత్కావ్యము కాదు. అసత్కావ్యము. సత్యభామాసాంత్వనము సమాజ శ్రేయస్కరము కాదు. అసత్కావ్యము. అంతేకాదు. దక్షిణాంధ్ర యుగములోని అసత్కావ్యములకు అగ్రగామి.

# శహాజీ

తంజావూరు నాయకరాజుల పాలన ముగిసినది. మహారాష్ట్రపాలకుల పాలన వెలసినది. నాయకరాజులను అనుకరించి, తెలుగు కవులు అయిన మహారాష్ట్రపాలకులు కలరు. మహారాష్ట్రపాలకుల మాతృభాష తెలుగు భాష కాదు. మహారాష్ట్రభాష. తంజావూరు రాజ్యము తెలుగు దేశము కాదు. తమిళదేశము. అయినను మహారాష్ట్ర పాలకులు తెలుగుకవులు అగుట సందేహము కలిగించును[54]. అసంభవము కాదు. మఱి ఆస్థానకవులు రచించిన కృతులు మహారాష్ట్రపాలకులు రచించిన కృతులు అగుట కూడ అసంభవము కాదు.

తంజావూరు తొలి మహారాష్ట్రపాలకుడు ఏకోజీ. (1673-84) ఏకరాజప్రణీతము లుగ ఏ కృతులును లేవు. మఱి మహారాష్ట్రపాలకుడు శహాజీ. (1684-1712) శాహరాజ ప్రణీతములుగ ఇరువది రెండు కృతులు కలవు. అవి:

1. విష్ణుపల్లకిసేవాప్రబంధము. 2. శంకరపల్లకిసేవాప్రబంధము. 3. పంచరత్న ప్రబంధము. 4. త్యాగరాజవినోదచిత్రప్రబంధము ఉరపు శంకరకాళీనటన వాదమహా నాటకము. 5. శ్రీరామపట్టాభిషేకనాటకము. 6. భక్తవత్సలవిలాసశృంగార నాటకము. 7. గంగాపార్వతీసంవాదనాటకము. 8. రుక్మిణీసత్యభామాసంవాదనాటకము. 9. పార్వతీకల్యాణనాటకము. 10. విఘ్నేశ్వర కల్యాణనాటకము. 11. వల్లీకల్యాణనాటకము ఉరపు కుమారస్వామికల్యాణనాటకము. 12. సరస్వతీకల్యాణనాటకము. 13. రతి కల్యాణనాటకము. 14. సీతాకల్యాణనాటకము. 15. శాంతాకల్యాణనాటకము. 16. ద్రౌపదీకల్యాణనాటకము. 17. శచీపురందరకల్యాణ నాటకము. 18. జలక్రీడలు నాటకము. 19. కృష్ణలీలావిలాసనాటకము. 20. కిరాత విలాసనాటకము. 21. సతీపతి దానవిలాసనాటకము. 22. పతిదానశూరనాటకము.

ఇందు సరస్వతీకల్యాణనాటకమునందు "శ్రీశాహమహారాజప్రణీతంబైన సరస్వతీకల్యాణం బనెడు నాటకంబు" అని కలదు. (పుటలు 147,149.) కాని కథా సంగ్రహద్విపదను,

> "చిరపుణ్యరతమతి శేషాచలపతి
> వరశాహవిభుపేర వహివి దైవార
> xxx xxx xxx
> వరగు సరస్వతీపరిణయం బనెడు
> సరసనాటకము లాస్యముల రాజిల్లి
> భావములగు వేమభాషాదు లమరు
> గావించె ధరతులు గాయకు ల్మెచ్చ" పుటలు (48-149.)

అని కలదు. శేషాచలపతి శాహరాజా ఆస్థానకవి నివర్తి శేషాచలపతి. కాబట్టి సరస్వతీకల్యాణనాటకము శాహరాజప్రణీతము కాదు. నివర్తి శేషాచలపతికృతమే. ఇది

ఆస్థానకవులు రచించిన కృతులు మహారాష్ట్రపాలకులు రచించిన కృతులు అగుటకు ప్రథమోదాహరణము.

పార్వతీకల్యాణనాటకమునందు "ఆ(శాహ) మహారాజు పరమేశ్వరాంకితముగఁ బరఁగఁజేసిన పార్వతీపరిణయాఖ్య మనెడు నాటకము" అని (పుట6.), "శ్రీశాహమహారాజ ప్రణీతంబైన పార్వతీకల్యాణంబనెడు నాటకంబు" అని (పుట7.) కలదు. కాని, నాటకాంతమునందలి శోభనపదమునందు ఇట్లు కలదు.

" శ్రీచోళనాయకాయ శ్రీవాసుదేవకవి
వాచా సంతుష్టాయ మంగళం. "

ఇది నిమిత్తముగ పార్వతీకల్యాణము వాసుదేవకవికృతమని పరిశోధకాభిప్రాయము[55]. వాఙ్మయచరిత్రకారుని వంతపాట[56]. పరిష్కర్త ప్రతిపాదనము[57]. కాని పయి చరణము కల శోభనపదము దర్భా గిరిరాజు సర్వాంగసుందరీవిలాసమునందు కలదు, (పుట150.) అది ప్రతివిలేఖకుని ప్రక్షేపమని పరిశోధకాభిప్రాయము[58]. అంతే కాదు. సిద్ధాంతకౌముదీవ్యాఖ్యాత వాసుదేవవిద్వాంసుడే వాసుదేవకవి అని కూడ పరిశోధకాభిప్రాయము[59]. అతడు సంస్కృతకవి అగును. తెలుగుకవి అగుననుట ఊహామాత్రశరణ్యము. వాసుదేవకవి ప్రసక్తి కల శోభనపదము పార్వతీకల్యాణమునందు కలదు. సర్వాంగసుందరీవిలాసమునందు కలదు. అంతేకాదు. సర్వాంగసుందరీ విలాసములోని ఇష్టదేవతాస్తుతి (పుటలు119-123.) విఘ్నేశ్వరాగమనదరువు (పుటలు124-125.) నివర్తి శేషాచలపతి సరస్వతీకల్యాణమునందు కలవు. (పుటలు145-147.) ఆద్యంతములు నివర్తి శేషాచలపతి, దర్భా గిరిరాజుల జంటకవిత్వము కావచ్చును. నివర్తి శేషాచలపతి సరస్వతీకల్యాణములోని బ్రహ్మవర్ణన (పుట159) బ్రహ్మవిష్ణుదేవేంద్ర పరమేశ్వరాగమనపద్యద్విపదదరువులు రెండు, పద్యములు రెండు, ద్విపదఘట్టములు, నాలుగు దరువులు। (పుటలు 176-178.) మొత్తము ఎన్మిది, మఱొక శ్లోకము. (పుట36.) పార్వతీకల్యాణమునందు కలవు. (పుటలు34-35.) కావున పార్వతీకల్యాణనాటకమును నివర్తి శేషాచలపతికృతము కావలయును. ఇది ఆస్థానకవులు రచించిన కృతులు మహారాష్ట్రపాలకుల కృతులు అగుటకు ద్వితీయోదాహరణము.

పయి కృతుల పట్టికను ప్రబంధములు, నాటకములు అని కలవు. నాల్గవ ప్రబంధమునకు నాటకమను నామాంతరము కలదు. కడమ ప్రబంధములును నాటకములే. నాటకములవ యక్షగానములు. అందు పల్లకిసేవాప్రబంధములు ప్రత్యేకతను సంతరించుకొన్న ప్రక్రియాంతరములు.

> "పల్లకిసేవాప్రబంధములు చిత్రమైన కల్పనతో గూడిన నాట్యాధిక్యప్రధానములైన నాటకములు. శివుని, విష్ణుని పల్లకిసేవయే యీ నాటకములలోని ప్రధానేతి వృత్తము. నాట్యకళాప్రవీణలైన తరుణీమణులు పల్లకిబోయీల పాత్రలను ధరించి స్వామి పల్లకిసేవ చేయుదురు. ఇందు నిమిత్తము

పల్లకిబోయీలలో ముందువారు వెనుకవారు రెండు గుంపులుగ
నేర్పడి కథ వినిపింతురు. చిత్రమైన పరికల్పనమిది. "[60]

**1.విష్ణుపల్లకిసేవాప్రబంధము:-** ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుటలు 122,123,148) శాహరాజు "సకలభాషాచతుర్విధసాహితీనిర్వాహకు"డని కలదు. (పుట123) విష్ణుభక్తుడని కలదు. (పుటలు121,122,139,146,147.) అంతేకాదు. విష్ణువు "వరశాహనృపాలు"డని కూడ కలదు. (పుట141.) "నా విష్ణుః పృథివీపతిః" అను మాటను బట్టి అయినను, రాజే తాను విష్ణువునని ప్రకటించుకొనుట కంటె, రాజు విష్ణువని ఆస్థానకవి ప్రకటించుట సహజము. ఆస్థానకవి ఆంధ్రసాహితీనిర్మాణము శాహరాజు ఆంధ్రసాహితీనిర్వాహకమగునేమో?

లక్ష్మి విష్ణువు రాలేదని మంజువాణీప్రియంవదలను పంపును. వారు కొలువు కూటమునకు వెళ్లి విష్ణువును నుతింతురు. ఇంతలో సర్వగీర్వాణులు, గరుడాంజనేయాది భక్తులు, దేవతాకాంతలు వత్తురు. విష్వక్సేనుడు కైవారములు సేయును. మంజువాణీ ప్రియంవదలు వైకుంఠుని వైభవమునకు మురిసిపోవుదురు. తమ మనవి విష్ణువునకు విన్నవించలేదని నారదుని, గరుత్మంతుని, హనుమంతుని విమర్శింతురు. స్వయముగ విన్నవింతురు. విష్ణువు వినును. బోయలు పల్లకీ సిద్ధము సేయుదురు. మంజువాణీ ప్రియంవదలు తాము వచ్చిన పని సఫలమయ్యెనని,శీఘ్రముగా రావలెనని విష్ణువును కోరుదురు. విష్ణువు బయలుదేరును. విష్వక్సేనుడు స్తుతించును. మంజువాణీ ప్రియంవదలు హెచ్చరికలు సేయుదురు. మంజువాణి లక్ష్మికి బహుపరాకులు చెప్పును. లక్ష్మి విష్ణువునకు స్వాగతము పలుకును. మంజువాణీప్రియంవదలు విష్ణువును హంసతూలికాతల్పమునకు ఆహ్వానించి, ఆరతు లిత్తురు. జరముత్తైదువలు జయమంగళము పాడుదురు. మంజువాణీప్రియంవదలు లాలి పాడుదురు. ఆరగింపు సేవలు సేయుదురు. అష్టకములు పాడుదురు ధవళము పాడుదురు. హెచ్చరికలు సేయుదురు. లక్ష్మీనారాయణులు ఏకమగుదురు. కార్తికైకాదశి రాగా వందిమాగధులు మేలుకొలుపులు పాడుదురు. స్వామి మేలుకొన్న తర్వాత శోభనము పాడుదురు. ఇది విష్ణుపల్లకిసేవాప్రబంధములోని ఇతివృత్తము.

ఒక్క సూత్రధారి మాటలు వచనములు. అందరు పాత్రధారుల మాటలు పదములు, పద్యములు. దరువు, రగడ, అష్టకము, లాలి, ధవళము, బారి, హెచ్చరిక, మేలుకొలుపు, శోభనము, చూర్ణిక పదములు. ద్విపద, కందము, దోదకము, తోటకము, మత్తేభము, మయూరగతి, లయగ్రాహి పద్యములు. పద్యముల కంటె పదములు అధికము. అందు దరువులు అత్యధికము.

**2. శంకరపల్లకిసేవాప్రబంధము:-** ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుటలు103,118.) అది మొదట ద్విపదను ప్రథమపురుషయందు కలదు. ఆ వెంటనే సీసపద్యమునందు "బుడత వెలదాల్పు మము నేడు బ్రోచుగాత" అని

ఉత్తమపురుషయందు కలదు. అంతేకాదు. ప్రబంధమునందు ఒక చెలియ పార్వతికి పవ్వళింపు సేవను. " వెలయు శాహవిభుఁడు సేసిన వినుతిపదములఁ బాడుమీ" అని హితబోధ సేయును. (పుట116.) ఇట్లు శాహరాజా ఆత్మోత్కర్షకు పాలుపడుట కంటె, ఆస్థానకవి రాజోత్కర్షకు పాటుపడుట సహజము.

పార్వతి చెలులను పరమేశ్వరుని తీసికొనిరమ్మని పంపును. వారు పరమేశ్వరుని కొలువునకు వెళ్లుదురు. పరమేశ్వరుని చూచి వర్ణించుకొందురు. ఇంతలో బృందారకులు వత్తురు. హెచ్చరికలు సాగును. చెలులు పరమేశ్వరునికి తమ మనవి తెలుపుటకు సంకటపడుదురు. గంగను, లేడిని, వాసుకిని, చందమామను, నందిని అడిగి, వారు తెలుపరని విమర్శింతురు. స్వయముగ విన్నవింతురు. పరమేశ్వరుడు విని కొలువు చాలించును. విరిపల్లకి మీద బయలుదేరును. ఇంద్రాదిదేవతలు జేజేలు పలికి పరిచర్యలు చేయుదురు. నంది హెచ్చరిక చేయును. పరమేశ్వరుడు పడకయిల్లు చేరును. చెలులు పడకయింటిని వర్ణింతురు. పార్వతి పరమేశ్వరునికి స్వాగతము పలుకును. పరమేశ్వరుడు హంసతూలికాతల్పమును అధివసించును. చెలులు హారతి పట్టుదురు. ఆరగింపు సేవలు సేయుదురు. లాలి పాడుదురు. హెచ్చరికలు సేయుదురు. మంగళము పాడుదురు. ఇది శంకరపల్లకిసేవాప్రబంధములోని ఇతివృత్తము.

ఇందు సూత్రధారి ప్రసక్తి లేదు. పాత్రధారుల పలుకులు పదములు, పద్యములు, వచనములును. పద్యముల కంటె వచనములు, వచనముల కంటె పదములు అధికము. చంపకమాల కందము, ద్విపద పద్యములు. దరువులు, లాలి, అష్టకము, హెచ్చరిక, చూర్ణిక పదములు- అందు దరువులు అత్యధికము.

దేవుని పల్లకి సేవ, నగరవీథుల నర్తకీమణుల నాట్యప్రదర్శన- ఉద్దిష్టములైన పల్లకిసేవా ప్రబంధములు రెండును ఔచిత్యవిలసితములు. భక్తిరసవికసితములు.

పంచరత్నప్రబంధము:- ఇది శాహరాజా రచించినట్లు పది స్థలములందు కలదు. (పుటలు 67,68,70,81,88,89,92,96,99,100) అంతేకాదు. ఇందులోని పదకవితాప్రభేదములు శాహరాజప్రణీతములని పదియేను స్థలములందు కలదు. (పుటలు73,74,75,77,78,79,84,86,90,91,92,95,97,99) ముప్పదియారు పుటల గ్రంథమునందు పాతికస్థలములందు శాహరాజనామసంకీర్తనము! అది శాహరాజా ఆత్మనామసంకీర్తనమగుట కంటె, ఆస్థానకవి రాజనామసంకీర్తనమగుట సహజము. శాహరాజా "లలితసంగీతతానశ్రుతిస్వరస్థానరాగాంగగానక్రియాస్థాయిగమక ప్రబంధ సహితగాయకగుణతతానద్ధఘనసుషిర, గాత్రభేద, క్రియా, గ్రహజాతి మార్గతాళ దేశితాళతత్త్వజ్ఞ"డయినను (పుట67) అంతే.

ఇందు పరమేశ్వరుని కొలువునందు 1. బిరుదు మిటారులు 2. సపెద్దజోగి. 3. చెంచువాడు 4. బిరుదుబంటు 5. పాదసకాండ్లు నాట్యవిద్యలు ప్రదర్శించుట, నందికేశ్వరుడు సకలబిరుదులు బహుమానము చేయుట ఇతివృత్తము. నటపంచకము

నాట్యప్రదర్శనము పంచరత్నప్రబంధము. పంచరత్నముల నాట్యములకు సాహిత్యము సకృన్మాత్రము. సంగీతము సమృద్ధిప్రాయము." సలాందర్వు, అయిత్తం, సొల్లు, మోహరం, గణపతికవుత్తం, నెలకట్టు, సొల్లుకట్టు, ప్రబంధదరువు మొదలైన నాట్యప్రభేదములకు తాళాధ్యాయమే కలదు. ప్రారంభమునందు సూత్రధారి, వేత్రపాణి హాస్యప్రసంగము చేయుదురు. అందు కొంత అశ్లీలము కలదు. సుశీలమైన ప్రసంగమిది:

"కటికవాఁడు:- నే వచ్చిన కార్యం మా పరమేశ్వరుండు గొలువుకు
వస్తున్నాఁడు.అందుకు ఉలవ గిలవ, బియ్యం గియ్యం, పప్పు
గిప్పు, నేయి గీయి, పాలు గీలు, కసువు గిసువు, ఉప్పు
గిప్పు- ఇదంతా సంపాదించమని యెచ్చరించ వస్తినానోయి.
సూత్రధారి :- బియ్య మెవరికి, గియ్య మెవరికోయి?
కటిక :- బియ్యం నాకు. గియ్యం నీకు.
సూత్ర:- ఈ దంతాయెనోయి. కసువు ఎవ్వరికి, గిసువు
ఎవ్వరికోయి?
కటిక:- కసువు మా బసువుకి, గిసువు నీకి."

చెంచువాని వాక్యము గ్రాంథికభాషను కలదు. "హో వినవయ్యా మహానుభావ! నందికేశ్వర! చెంచువాఁడు వచ్చినాఁడని చంద్రశేఖరునితోఁ జెప్పవోయి''. సూత్రధారివచనములందు "వాఁడు వేడ్కై వేడు వాడై నవరసాలంకారమై, ధవళప్రకాశమై, విచిత్రార్థమై యుండవలెను. పరాకు స్వామి. " అని పదే పదే కలదు. పంచరత్న ప్రబంధము విచిత్రప్రబంధమే.

**4. త్యాగరాజవినోదచిత్రప్రబంధము:-** ఇది అముద్రితము. ఇంతవఱకు వెలుగునకు వచ్చిన సమాచారమిది:[61]

త్యాగరాజవినోదచిత్రప్రబంధమునకు శంకరకాళీనటనవాదమహానాటకమని నామాంతరము. కాళీతాండవనాటకమని ప్రసక్తము. ఇది శాహరాజు ఇష్టదైవమైన త్యాగేశునకు అంకితము. ఇందు ఆరు అంకములు కలవు. ప్రతి-అంకము తుదిని శాహరాజు రచించినట్లు గద్య కలదు. సంస్కృతభాష, సంస్కృతభూయిష్ఠ మహారాష్ట్రభాష, తెలుగుభాష- మూడు భాషలందు రచింపబడినది. అందు తెలుగుభాష అత్యల్పము. ప్రథమాంకమునందు సూత్రధారుని మహారాష్ట్రభాషాప్రసంగమునకు తెనుగుసేత ఒక ద్విపదను, ఒక వచనమును కలదు. చతుర్థాంకమున సవ్యాపసవ్యసమపదలీల అను దరువు తెలుగు భాషను కలదు. షష్ఠాంకమున ఒక దరువు, క్రమసప్తస్వరవర్ణార్థలీల అను దరువు, జక్కిణి అను దరువు తెలుగు భాషను కలవు. ఇందు భద్రకాళి నాట్యవిద్యయందు తనకు సాటిలేరని విఱ్ఱవీగును. ఆమెకు గర్వభంగము సేయుటకు వారదుడు త్యాగేశుని ప్రోత్సహించును. భద్రకాళీత్యాగరాజులకు వాదోపవాదములు సప్రయోగముగ జరుగును. భద్రకాళి ఓడును. త్యాగరాజు పణముగ భద్రకాళిని పరిణయమాడును. ఇది త్యాగరాజవినోదచిత్రప్రబంధములోని ఇతివృత్తము.

పంచరత్నప్రబంధము వలె త్యాగరాజవినోదచిత్రప్రబంధము నాట్యప్రధానము. అంతే కాదు. అక్షరముల అక్షక్రీడలు, శబ్దజాలముల ఇంద్రజాలములు, రాగతాళసంగతుల సర్పనృత్యభంగిమలు సమధికము. ఒక్కమాటలో త్యాగరాజవినోదచిత్రప్రబంధము సంగీతసాహిత్యముల సాముగరిడీ.

ఇది శాహరాజకృతము కావచ్చును. ఇంకను పరిశోధనీయము. తద్జ్ఞ పరిషద్విజ్ఞేయము.

**5. శ్రీరామపట్టాభిషేకనాటకము:**- ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుటలు28,29,43.) ఇందలి వేత్రపాణి పంచరత్నప్రబంధములోని వేత్రపాణికి ఏకోదరుడు. సూత్రధారి, వేత్రపాణి కావించిన హాస్యప్రసంగమును పంచరత్నప్రబంధము లోని హాస్యప్రసంగమునకు సహోదరము. రెండును ఏకకవికృతము లగును. అది శాహరాజకృతమైన ఇది శాహరాజకృతము. అది తదాస్థానకవికృతమైన, ఇది కూడ తదాస్థానకవికృతము.

ఇందు భరతశత్రుఘ్నుల కొలువునకు హనుమంతుడు వచ్చి సీతారామలక్ష్మణుల రాకను తెలుపుట, భరతుడు వసిష్ఠునికి తెలుపుట, వసిష్ఠుని ఆదేశమున అయోధ్యాపట్టణ మును అలంకరింపజేయుట, భరతవసిష్ఠశత్రుఘ్నులు రామునికి ఎదురువెళ్లి, అయోధ్యా నగరమునకు తీసికొనివచ్చి, పట్టాభిషేకము చేయుట ఇతివృత్తము.

ఇందలి వేత్రపాణి వికటాంగుడు మాత్రమే కాదు; విదూషకుడు కూడ.

"సూత్రధారి : ఓయి వాయఁడా! డెబ్బైరెండు వినియోగా లవగా నేమేమోయి
వికటాంగుడు : నీళ్లు కట్టేది. తోరణాలు చల్లేది. బియ్యం గియ్యం, పప్పు గిప్పు నేయి గీయి, యిదంతా మాష్టీదుగాఁ జేసేందుకు వచ్చినానోయి." పుట30.
"మంత్రి : ఎవరోయి కటికవాఁడు, నే వచ్చినావని చెప్పవోయి.
కటిక:- మంచిది ఈడనుండు. - సామి! నే వచ్చినాను.
రాము:- నీ వేల వచ్చితివి. వాకిట పదిలంగా నుండరా.
కటిక:- మాబాగు.....
మంత్రి:- ఏమి చెప్పితివిర.
కటిక:- నే వచ్చినావని చెప్పితివి. ఛీ యేల వస్తివి పొమ్మనెను." పుటలు39.40.

ఇందు పదముల కంటె, పద్యముల కంటె, వచనసంభాషణలు అధికము.

**6. భక్తవత్సలవిలాసశృంగారనాటకము:**- ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుటలు5,5,6,34.) ఇందలి కృత్యాది, పంచరత్నప్రబంధమునందలి కృత్యాది సమానము. ఇందలి చండికేశ్వరుడు అందలి వేత్రపాణికి అగ్రజుడు. అది శాహరాజకృతమైన, ఇది శాహరాజకృతము. అది తదాస్థానకవికృతమైన, ఇది తదాస్థానకవికృతము.

ఇందు భక్తవత్సలుడైన శివుడు, తన భక్తుడైన బాణాసురుని కోరికను శోణపురమునకు వచ్చుట, పార్వతి విరహావస్థ నందుట, శివుడు కూడ విరహావస్థనందుట,

పార్వతి నెచ్చెలిని పంపించుట, ఆమె పార్వతి విరహావస్థను పరమేశ్వరునికి విన్నవించునెడ; బాణాసురుడు విని, తత్కారణము తానని గ్రహించి, పరమేశ్వరుని కైలాసమున కేగుమని కోరుట, బాణాసురుని కోరికను శివుడు కైలాసమునకు వచ్చుట ఇతివృత్తము. శివుడు భక్తునియెడల వత్సలు డగుట ఒక విలాసము. అందువలన పార్వతీవిరహమును అనుభవించుట మరొక విలాసము. విరహము విప్రలంభశృంగారము. కనుక భక్తవత్సల విలాసశృంగారనాటకనామధేయము సార్థకము.

పార్వతీపరమేశ్వరుల విప్రలంభశృంగారము సరసము. అందుకు షడృతువేపథ్య కల్పనము సమంజసము. కాని సంభోగశృంగారము పార్వతీపరమేశ్వరుల పరముగ పరమానౌచిత్యము. శుక్రాచార్యశిష్యుల ప్రసంగము అశ్లీలము. అసభ్యము. వ్యావహారికభాష ప్రయుక్తము. పార్వతీప్రాణసఖుల ప్రసంగము భామాకలాపసరణి.

పార్వతి వచనం: హా వినవే చెలియ! నా ప్రాణనాయకుడైన పరమేశ్వరుని
గానవటవే కొమ్మా!
సఖివచనం : హా వినవె గట్టురాపట్టి! నీ ప్రాణనాయకుండైన పరమేశ్వ
రుండు ఏ అందమువాఁడు? ఏ చందమువాఁడు? ఎటువంటి
వాఁడు?చెప్పవేయమ్మా!
పార్వతి వచనం:
దరువు. వసంతభైరవి. ఏకతాళము.
ముమ్మొనవాలువాఁడమ్మా! వాఁడు మువ్వన్నె చేలవాఁడమ్మా!
కమ్మని మోమువాఁడమ్మా! నన్ను నెమ్మెన నుంచువాఁడమ్మా! ॥౧॥
చక్కని మేనివాఁడమ్మా! ఇప్పుడెక్కడనున్నాఁడో కొమ్మా!
మొక్కేనె ఓ ముద్దుగుమ్మా! మోమైన జూపవే కొమ్మా! ॥౨॥
కొండవీటి జంగమమ్మా! చంద్రకోటీరుండె ముద్దుగుమ్మ!
విందువేడుకలవాఁడమ్మా! నివ్వటిమంచి రాడమ్మ.॥3॥. పుట 14.

ఇందు రాక్షసజంగములు తత్త్వములు పాడుట ఇతోధికవిశేషము.

"వందనుల భామినుల నమ్మి మోసపోకుండి
ఇందుధరు వేలుపని యెప్పుడు భజింపుఁడు ॥౧॥
అయ్యలార రొక్కముల ఆసలు పోగొట్టుడి
తియ్యవిల్తు పగరము దేవుడని పట్టండి. ॥౨॥
వంగతి గానియ సంసారముల రోయండి
బంగరు గట్టువిల్తుని పాదపూజ సేయండి. ॥3॥
పాటి పెనగొవ్వ కర్మబంధముల వీడండి
చూటి తప్పకుము త్యాగసుందరేశు చూడండి. ౪. పుట 13.

ఇందు కొండవీటి రాయడు, క్రొన్నెల తలపువ్వు, చుక్కల రాయడు, గట్టుపట్టి నేలిన జగజెట్టి, ముమ్మొనవాలు, చవ్వంచములు కలవాఁడు, క్రొన్నెల తలపువ్వువాఁడు,

ఆరుమోముల చిన్నపాపఁడు, ఏనుగుమోము కుఱ్ఱఁడు, గట్టురాపట్టి, ముమ్మొనవాలు వాఁడు, తియ్యవిల్తు పగర, బంగరు గట్టువిల్తుడు, పువ్వుల విలుకాఁడు, మిక్కిలి కంటి దేవర, నెలపువ్వుతాల్పు, పాముసొమ్ములసామి, అప్పలయగుంట మొదలైన అచ్చతెనుగు మచ్చుతునుకలు గమనార్హములు.

**7. గంగాపార్వతీసంవాదనాటకము:-** ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుటలు39,39,62) ఇందు శాహరాజప్రణీతములుగ కల ఇతరయక్షగానములలోని కృత్యాది కలదు. కనుక శాహరాజకృతమనిపించుట సహజము. కాని, ఇందు కుబేరకుండోదరసంవాదమునందు ఇట్లు కలదు.

"కుబేరవచనం:- అట్లా గాదోయి ఏకపింగుడు వచ్చినాఁడని చెప్పవోయి.
కుండోదరుని వచనం:- ఎట్లా యెట్లా. నీ పేరద్వాన్నంగాను. ఏక యంటే యేమిరా.
కుబే. వ:- ఏక యంటే యొకటోయి.
కుండో. వ:- మీ యమ్మా బొసిమాలిన కూన. అందఱికి నొక పింగు గాని రెండు పింగులు గద్దట్రా. ఛీ. కంపేస్తుంది. ఆవలికి పోరా.

ఇందు పేరులోని ఏకశబ్దము మీద హేళన కలదు. శాహరాజు తండ్రి పేరు ఏకరాజు. ఏకోజీ. తండ్రి ఏకరాజు పేరు స్ఫురించు ఏకశబ్దహేళన, తనయుడు శాహరాజే చేయుట కంటె, నాయకరాజవంశమును నాశనము చేసి, తంజావూరు రాజ్యమును కైవసము చేసికొన్న ఏకరాజు పేరు స్ఫురించు ఏకశబ్దహేళన ఆస్థానకవి చేయుట సహజము. కనుక గంగాపార్వతీసంవాదనాటకము శాహరాజకృతము కాక, తదాస్థానకవికృతము కావచ్చును.

ఇందు శివుడు గంగతో శృంగారవనము నందుండుట, నారదుడు వచ్చి గంగను పొగడి, పార్వతిని తెగడుట, అది విన్న పార్వతి సఖి పార్వతికి చెప్పుట, పార్వతి కయ్యమునకు కాల్చాచుట, ఎదురైన నారదుని నిరసించుట, శృంగారవనమున కేగి గంగతో కలహించుట, శివుడు గంగాపార్వతులకు సఖ్యము కలుపుట ఇతివృత్తము. సూత్రధారి కుండోదరుల సన్నివేశము, కుబేరకుండోదరసన్నివేశము, చింతపంటిపోచక్క, నల్లేరుశివుల సన్నివేశము హాస్యఘట్టములు. అందు హాస్యము కంటె అశ్లీలము, అసభ్యత అత్యధికము. గంగాపార్వతుల సంవాదమునందు పాత్రౌచిత్యము పూర్ణానుస్వారము.

"పార్వతి:- వంగనాచివటవె! కొన్నంగడి మారుబేరాల గంగ యూరకె నాతో కారులాడకె.
గంగ:- అంగడి మీఁదఁ గమ్మలు! అత్త నెత్తి చెయ్యన్నట్లు బంగుముపై బత్తెగాని, జాడలు వేరె.

xxx xxx xxx

పార్వతి:- గుడి మాత్రమె లేని దొక్క కొదువ యింతెగాని నీకు జడమతివైన మహాస్వామిని గావ.
గంగ:- గుడి మండి గుడిత్రాళ్లను! గోపె హంతవు గాఁబట్టి వీడనాడేవు వన్నీలాగు శివుని ముందరా" పుట60.

ఇంతకంటె గంగాగౌరీసంవాదమనెడు జావపదగేయము సరసము.

**8. రుక్మిణీసత్యభామాసంవాదనాటకము:–** ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుట17,17.) ఇందు ఆదిని కృత్యాది లేదు. తుదిని కర్తృనిర్దేశద్విపద లేదు. కథాసంగ్రహము నుండి కథాంతము వఱకు మాత్రము కలదు. విఘ్నేశ్వరాగమనము దరువునందు నివర్తి శేషాచలపతి సరస్వతీకల్యాణము, పార్వతీ కల్యాణములలోని, అదే దరువులోని ఆరు చరణములును కలవు. అదనముగ మఱొక నాలుగు చరణములు కలవు. కావున రుక్మిణీసత్యభామసంవాదనాటకము నివర్తి శేషాచలపతికృతము కావచ్చును.

ఇందు కృష్ణుడు రుక్మిణిని శృంగారవనములోని సంకేతస్థలమునకు రప్పించును. రుక్మిణి వచ్చిన తర్వాత సత్యభామను కూడ సంకేతస్థలమునకు రప్పించును. రుక్మిణి సంకేతస్థలమైన పొదరింటికి పోయి. కృష్ణుడు రుక్మిణితో ఉండును. సత్యభామ కృష్ణుడు రాలేదని చెలికత్తెను పంపును. సత్యభామ చెలికత్తె చెప్పిన ప్రకారము, కృష్ణుని సఖుడు గోపాలుడు కృష్ణునితో యశోద రమ్మన్నదని అబద్ధమాడును. రుక్మిణి వారించినను కృష్ణుడు బయలుదేరును. గోపాలకుడు నిజము చెప్పును. కృష్ణుడు సత్యభామ సంకేత స్థలమైన పొదరింటికి పోయి సత్యభామతో ఉండును. కృష్ణుడు రాలేదని విరహానుభూతితో రుక్మిణి, సత్యభామాకృష్ణులున్న పొదరింటికి పోయి, చూచి సత్యభామతో కలహమునకు దిగును. సత్యభామ కూడ రుక్మిణితో కలహమాడును. ఇద్దఱు కృష్ణుని మీద విఱుచుకొని పడుదురు. కృష్ణుడు భరింపలేక మఱొక ప్రదేశమునకు పోవును. రుక్మిణీసత్యభామలు విరహావస్థకు పాల్పడుదురు. సత్యభామ చెలికత్తె "రుక్మిణి పట్టపురాణి. అమె చెప్పినట్లు వినుము. రుక్మిణితో గూడి కృష్ణుని వేడుము" అని సత్యభామకు బోధించును. సత్యభామ అట్లు చేయును. రుక్మిణీసత్యభామల జంటకవిత్వములకు కృష్ణుడు ప్రసన్నుడగును. ఇది రుక్మిణీసత్యభామాసంవాదనాటకములోని ఇతివృత్తము.

ఇతరగ్రంథములందు రుక్మిణి శాంతస్వభావ. సత్యభామ కోపస్వభావ. ఇందు రుక్మిణి కోపస్వభావ. సత్యభామ శాంతస్వభావ. ఇది విశేషము. అంతేకాదు. సత్యభామ కంటె సత్యభామ చెలికత్తె తెలివైనది. సవతుల సంవాదము కంటె సతీపతుల సంవాదము రక్తి కట్టించును. హాస్యఘట్టములు ప్రత్యేకముగ లేకపోవుటవలన అశ్లీలము, అసభ్యత లేదుగాని, ప్రధానపాత్రల పరముగ అనౌచిత్యము లేకపోలేదు. గంగాపార్వతీసంవాద నాటకము కంటె రుక్మిణీసత్యభామాసంవాదనాటకము నయము. అదొక సయ్యాట, కృష్ణలీల అని సమాధానపడవచ్చును.

**10. విఘ్నేశ్వరకల్యాణనాటకము:–** ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుటలు5,5,29.) ఇందుమ ఆదివి కృత్యాది, తుదిని కర్తృనిర్దేశము భిన్నము. కర్తృనిర్దేశము సూత్రధారివచనము. అందు "శ్రీత్యాగేశసాంబశివార్పణమస్తు" అని కూడ కలదు. కమక త్యాగేశునకు అంకితము. పరమేశ్వరునికి అంకితమైన పార్వతీకల్యాణనాటకము శేషాచలపతి కృతమని పూర్వోక్తము. మఱి త్యాగేశునికి

అంకితమైన విఘ్నేశ్వరకల్యాణనాటకము తత్కృతమగునేమో! తదన్యకృతమో!!

ఇందు పార్వతీదేవి చెలికత్తె సకలకళాప్రవీణ. ఆమె పార్వతికి విఘ్నేశ్వరుని వివాహవాంఛ తెలుపును. పార్వతి పరమేశ్వరునికి తెలుపును. సకలకళాప్రవీణ పార్వతీపరమేశ్వరులకు విఘ్నేశ్వరుడు కోరిన కన్యలు - సిద్ధి,బుద్ధి అని చెప్పి, వారిని చూచుటకు సుగంధమధువనమునకు తీసికొనివెళ్లును. అచటికి సిద్ధి, బుద్ధి అరుదెంతురు. విఘ్నేశ్వరుని గుఱించి విరహమును అనుభవింతురు. పార్వతీపరమేశ్వరుల ఆదేశానుసారము సకలకళాప్రవీణ వారి సమాచారము తెలిసికొని తెలుపును. అదే పని మీద వారదుడు వచ్చును. పెండ్లిపెద్ద అగును. పార్వతీపరమేశ్వరులు బ్రహ్మవిష్ణుమహేం ద్రాదిదేవతలను ఆహ్వానింతురు. సమస్తదేవతల సమక్షమునందు సిద్ధి, బుద్ధి అను బ్రహ్మమానసపుత్రికలతో విఘ్నేశ్వరునికి వివాహము జరుగును. ఇది విఘ్నేశ్వరకల్యాణ నాటకములోని ఇతివృత్తము.

విఘ్నేశ్వరకల్యాణనాటకమునందు విఘ్నేశ్వరపాత్రకు ఒక్కసారే ప్రవేశము కలదు. అది కూడ ఆదిని కాదు; తుదిని. వివాహమునకు మాత్రమే. సంభాషణమును ఒక్కటే కలదు. ప్రవేశించగానే పరమేశ్వరునితో "శరణు శరణయ్య స్వామి" అనుట మాత్రమే. విఘ్నేశ్వరుని పెండ్లికి వేయి విఘ్నములను సామెతకు స్థానము లేకపోయినది. ఏ విఘ్నము లేకుండ పెండ్లి జరిగిపోయినది. కారణము కార్యనిర్వహణధురీణ సకలకళాప్రవీణ.

"తాను జూచిన యట్టి తరుణీరత్నములఁ
బూని వివాహ మిప్పుడు సేయకున్నఁ
బొలుపార నెందైనఁ బోయెద ననుచు
వెలయ నీతో విన్నవింపుమన్నాఁడు"

అని పార్వతికి శ్లాస అందిచ్చినది. సనాతనుడైన విఘ్నేశ్వరుడు అధునాతను డగుట విశేషము. విఘ్నేశ్వరుని ప్రేమించిన సిద్ధి, బుద్ధి మాత్రము అధునాతనలు కాలేదు.

"మేము కన్యలము. పితామహాధీనలము. వారి యుత్తరువు లేక మేమై పెండ్లికి నొప్పేది వాయము గాదు ... వారి వడిగిన వారు చూచి యిచ్చిన మాకు సమ్మతమే."

అనిరి. విఘ్నేశ్వరుని నిశ్చయము విని, సిద్ధి బుద్ధి కన్యల విరహమును కని, వారలకు వివాహము చేసిన పార్వతీపరమేశ్వరులు ఆదర్శజగత్పితలు. పార్వతీ పరమేశ్వరుల ఆదర్శము, సకలకళాప్రవీణ కార్యనిర్వహణము విఘ్నేశ్వరకల్యాణ నాటకమునకు విశిష్టతలు.

విఘ్నవల్లికి సేవాప్రబంధములోని మూడు పదములకు మాతృకలు కలవు. 1. అమ్మవాన్. (పుట128.) 2. మాతృక. ధీరసమీరే యమునా. (పుట135) 3. మాతృక. కొంచగత్తెల మీరు. (పుట 138.) ఇందు మొదటిది మాతృక అని లేదుగాని, అది మాతృ కయే అగును. తమిళమాతృక. రెండవది అష్టపది. సంస్కృతమాతృక. మూడవది

తెలుగు మాతృక. ఇట్లు విఘ్నేశ్వరకల్యాణ నాటకమునందు పది పదములకు మాతృకలు కలవు. 1. మాతృక. శరణు శరణు సురేంద్ర సన్నుత (పుట10) 2. మాతృక. తియ్యమామిడి చెట్టుక్రింద. (పుట10) 3. మాతృక. అయ్యసామి నీవాడ. (పుట10) 4. మాతృక. ఇప్పటి యానాల్ సెంగై. (పుట13) 5. మాతృక. సమర్త పెండ్లికూతురను (పుట14) 6. మాతృక. వరవళ్లెత్తువాడి (పుట14) 7. మాతృక. కన్నెలు వెడలిరి కన్నెలు (పుట 15) 8. మాతృక. కన్య శహజి మన్నెహంవీరుఁ డెన్ని (పుట17). 9. మాతృక. ఏమి సోద్యమైన సురత (పుట18.) 10. మాతృక. పిన్న పట్టెవర్ధనాలు పిన్న శిఖలు. (పుట18.) ఇందు నాల్గవది, ఆరవది తమిళమాతృకలు. మిగిలిన ఎనిమిది తెలుగు మాతృకలు. అందు ఎనిమిదవ మాతృక అప్పటిదే. మిగిలిన తెలుగుమాతృకలు (1+7=8) ఎప్పటివో? అప్పటికి ప్రసిద్ధములై ఉండవలయును.

**11. వల్లీకల్యాణనాటకము:-** ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుటలు34,35.) కాని గిరిరాజు పదముల ప్రసక్తి, గిరిరాజు దరువు చరణములు కలవు. వల్లీదేవి చెలికత్తెలతో గూడి,

" పరువడి గిరిరాజపదములను
పరసుఁడైన యట్టి శాహరాజేంద్రునిఁ
బరిపరివిధములఁ బాడుచును" పుట44.

కోలాటమాడును. గిరిరాజన దర్బా గిరిరాజు. అతని పదములను శాహరాజు పరసుడని కలదు. అవి దర్బాగిరిరాజు శాహరాజు మీద రచించిన శృంగారపదములగును. వాని ప్రశంస శాహరాజునకు కంటె గిరిరాజునకు ఉత్కర్షాపాదకము. అంతేకాదు. వల్లీకల్యాణములోని,

"కోలో కోలో యని కుందరదవలెల్ల
జాలా వాడేరు జనులు సంతసిల్ల
కోల బంగారుకోలె కోల రత్నాల కోలె
కోల వజ్రాల కోలె కోలె యని - " పుట44.

అను గిరిరాజు ప్రసక్తి కల దరువులోని చరణములు ఇంచుమించుగ దర్బా గిరిరాజు వాదజయమునందు కలవు.

"కోలు కోలెన్న యని కుందరదవలారా
చాల వాడుదము జనులు సంతసిల్ల
కోలె బంగారుకోలె కోలె రత్నాల కోలె
కోలె వజ్రాల కోలె కోలెయని-" పుట91.

దరువుల సంవాదము, గిరిరాజు పదముల ప్రసక్తి వల్లీకల్యాణము దర్బా గిరిరాజు కృతమగుటకు సాధకములు.

ఇందు కుమారస్వామి కొలువునకు అరవ తెలుగు కాపులు వచ్చి మృగబాధ మొఱపెట్టుకొనుట, కుమారస్వామి వేటగాండ్రతో వేటకు వెడలుట, వేట తర్వాత వల్లీ

దేవిని చూచి వరించుట, కుమారస్వామిని చూచి వల్లీదేవి వరించుట, కుమారస్వామి మిత్రుడు శ్రీమంతుడు రాయబారము నడుపుట, వల్లీదేవి తండ్రి చెంచురాజు సమ్మతించుట, వల్లీదేవీకుమారస్వాముల వివాహము జరుగుట ఇతివృత్తము. కటికవాడు, అరవ తెలుగు కాపులు, వేటగాండ్రు హాస్యరసమునకు ఆలంబనవిభావములు. కుమారస్వామి కొలువు తీర్చుట, ఆ కొలువుకూటమునకు నాటకశాలలోని నర్తకీమణులు వచ్చుట సమకాలికసమాచారము. వల్లీదేవీకుమారస్వాముల వివాహము సమస్తదేవతల సమక్షమున తంజావూరులోనే జరుగుట శాహరాజు మాహాత్మ్యము. విజయరాఘవ నాయకుని విప్రనారాయణచరిత్ర ప్రభావము.

"శాహేంద్రమానసజలజంబునందుఁ
దనరుచునున్నాఁడు తరుణేందుశేఖరుఁడు"

ఇది శాహరాజు ఆత్మశ్లాఘన మగుటకంటె, ఆస్థానకవి దర్భాగిరిరాజు రాజశ్లాఘనమగుట సహజము.

**13. రతికల్యాణనాటకము:-** ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుటలు49,49,51.) సదాశివునికి అంకితము. (పుట48.) ఇందును గిరిరాజు పదముల ప్రసక్తి, గిరిరాజు దరువు చరణములు కలవు. అంతేకాదు. శాహరాజు ప్రశంస అధికము.

" -పరువడి గిరిరాజు- పదములను
సరసుఁడైన యట్టి- శాహేంద్రునిఁ
బరిపరివిధములఁ- బాడుదురు" పుట70.
"కోలె కోలె యని 'కుందరదనలెల్లఁ
జాలనాడిరి జనులు- సంతసిల్ల"
కోలె బంగారు కోలె- కోలె వజ్రాల కోలె
కోలె రత్నాల కోలె కోలె యని॥ " పుట 69.

దరువుల సంవాదము, గిరిరాజపదముల ప్రసక్తి, శాహరాజప్రశంస- రతికల్యాణ నాటకము దర్భాగిరిరాజకృతమగుటకు సాధకములు. అంతేకాదు. రతికల్యాణనాటకములోని రతిదేవి వర్ణనము (పుటలు60,61) నివర్తి శేషాచలపతి సరస్వతీ కల్యాణనాటకములోని సరస్వతి వర్ణనము (పుట160.). పందొమ్మిది ద్విపదపంక్తులు అవే. అందు కొన్ని:

"కలుగు తామరలందుఁ గనకకాహళులు
కనకకాహళులపైఁ గరికరంబులును
కరికరంబులపైఁ బ్రకాశించు నభము
నరుదైన నభమువం దగు హస్తతలము
నల హస్తతలముపై నలరు శైవలము
అలరు శైవలముపై హస్తికుంభములు
నొవరఁ గుంభములపై నొప్పు శంఖంబు

వినుము శంఖముపైని వెలయుఁ జందురుఁడు
మూఁగి చందురు మీఁద మొగిలు రాజిల్లు-" పుట61.

ద్విపదల సంవాదము రతికల్యాణనాటకము నివర్తి శేషాచలపతికృతమగుటకును సాధకము. కాఁబట్టి శాహరాజప్రణీతములుగ కల యక్షగానములు ఆస్థానకవుల జంట కవిత్వములు, బృందగానములును కావచ్చును.

ఇందు మన్మథమహారాజు వృద్ధబ్రాహ్మణదంపతులకు కామవికారము, బ్రహ్మచారిణీబ్రహ్మచారులకు మదనోన్మాదము కలిగించి, శృంగారవనమునందు గౌరీ పూజ సేయు రతిదేవిని చూచి, చంద్రుని రాయబార మంపుట, రతిమన్మథులు పరస్పర పరవశులగుట, విరహార్తులగుట, మఱల చంద్రుని రాయబారమున రతిమన్మథుల వివాహము జరుగుట ఇతివృత్తము.

మన్మథమహారాజు కొలువునకు సకలసామంతవర్గములు, కొలువువేశ్యలు వచ్చుట సమకాలికసమాచారము. రతిమన్మథుల వివాహము సమస్తదేవతల సమక్షమునందు తంజావూరులోనే జరుగుట శాహరాజమాహాత్మ్యము. విజయరాఘవనాయకుని విప్ర నారాయణచరిత్ర ప్రభావము. తంజావూరు ప్రసక్తిని శాహరాజు ప్రశంస నాలుగు సారులు కలదు. అందు రతిదేవి అలివేణుల,

"సకలజనుల కెంచఁగఁ గల్పకమై
మకరకేతుఁ డన మహి వెలయు
సుకృతిని శాహక్షోణీవిభుని విజ
సుకృతమువలనను జూడఁ గలిగెనని" పుట 88

సంబరపడుట సంభ్రమజనకము. ఇది శాహరాజు ఆత్మశ్లాఘనమగుట కంటె ఆస్థానకవుల రాజశ్లాఘనమగుట సహజము.

**14. సీతాకల్యాణనాటకము:-** ఇది శాహరాజు రచించినట్లు కలదు. **(పుటలు61,62,62.)** ఇందు మిథిలానగరమును అలంకరించుటకు తలవరులు చాటించుట, శ్రీరామపట్టాభిషేకమునందు అయోధ్యా నగరమును అలంకరించుటకు తలవరులు చాటించుట వలె కలదు. అందలి దరువులోని కొన్ని చరణములే ఇందలి దరువు. **(పుట35)** అంతేకాదు. ఇందు స్వయంవరమునకు మగధ, మాళవ, లాట, సింధురాజుల ఆగమనము (పుటలు65,66.) దర్భా గిరిరాజు సర్వాంగసుందరీ విలాసములోని మగధ, మాళవ, లాట, సింధురాజుల ఆగమనము వలె కలదు. (పుటలు136,137.) కావున సీతాకల్యాణము దర్భా గిరిరాజకృతము కావలయును.

ఇందు ప్రసిద్ధమైన రామాయణకథయే కలదు. ఇతరవికారములు లేవు. మగధ, పాండ్య, భోజ, అంగ, లాట, గౌళరాజులు ఇందుశేఖరుని విల్లు ఎత్తలేమనుట, జనకమహారాజు విచారించుట, విశ్వామిత్రుడు రాముని విల్లెక్కుపెట్టుమనుట, రాజులు విశ్వామిత్రుని పరియాచకము లాడుట కథను రక్తి కట్టించును. రాముడు "హరుని

చాపంబు నెడమచేతఁ గైకొన్నవాఁడై, ఎడమ పాదాంగుష్ఠమున పెట్టుకొన్నవాఁడై, విశ్వామిత్రునితో-

" చులకనైనది నాదు ఘనభుజబలిమి కిపుడు
పొలదు నెలయ నీ విల్లు వంచినప్పుడే విఱుఁగునేమో? "

అనుట, విశ్వామిత్రుడు "విరిగితే నేమాయె.... విల్లెక్కుపెట్టు" మనుట, రాముడు విల్లెక్కుపెట్టిన శివధనుర్భంగమగుట నిరాడంబరముగ కలదు.

జనకమహారాజు కొలువునకు నాటకస్త్రీలు వచ్చుట సమకాలికసమాచారము. జనకమహారాజు, దశరథమహారాజునకు పంపిన కమ్మవక్కణయందు సీతాకల్యాణలగ్నము "వైశాఖనెలను పున్నమినాఁడు" అని కలదు. అది స్థానికవిశేషమగును.

**15. శాంతాకల్యాణనాటకము:-** ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుట81.) ఇందు కొలువు భోగపుచానల వర్ణనము రతికల్యాణనాటకములోని కొలువు వేశ్యల వర్ణనమే. ఆ వర్ణనమిది:

"కురులపై నెత్తావి సరులు పిసాళింపఁ
గలికిచూపుల వీటు లొలుకుచుండ
మెఱుఁగు గుబ్బలఁ బైట చెఱఁగు దువాళింప
హరువు ముత్తెపుసరుల్ మురువులీన
జాళువాయందెలు లీల ఘల్లున మ్రోయ
గిలుకుమట్టెల నాదు గులకరింప
బంగారు రవిక డాల్ శృంగార మలరంగఁ
బలుకులఁ దేనియ లొలుకుచుండఁ
జిత్తరువు బొమ్మ చందంబు చెలువు మీఱ
చిత్తజాని రాణి వైఖరి శ్రీ చెలంగఁ
గొలువు భోగంపుజావ లయ్యలరువిల్తు
కొలువు పేయంగ వచ్చిరి చెలువెసంగ." పుట 55

ఇందలి "నాదు" కు "సద్దు" అని, "రాణి" కి "మాయ" అని మాత్రము అలతి భేదమున, సీసపాదములు నాలుగు, మూడవపాదము వినా ఎత్తుగీతము యథాతథముగ శాంతాకల్యాణమునందు కలదు. మూడవ పాదములోని అలరువిల్తుడు రతి కల్యాణనాటకమునకు ఆవశ్యకము. శాంతాకల్యాణనాటకమునకు రోమపాదుడు ఆవశ్యకము. "అలరువిల్తు" బదులు "రోమపాదు" అని కలదు. పాదాది "కొలువు" యతిమైత్రికి అనుకూలము కాదు. కనుక మఱొక పదము ఉండవలయును. కాని ఏ పదమును లేదు. చుక్కలు కలవు. "రోమపాదు" లోని "రో" కు యతిమైత్రి గాని, "మ" కు ప్రాసయతి గాని కలసి వచ్చునట్లు "కొలువు"నకు పర్యాయపదము కూర్చుట దుర్ఘటము. కనుక చుక్కలు కలవు. రతికల్యాణనాటకములోని పద్యమే శాంతాకల్యాణములోని పద్యము. అది శాహరాజకృతమైన ఇది శాహరాజకృతము. అది

తదాస్థానకవికృతమైన, ఇది కూడ తదాస్థానకవికృతము.

కొలువు వేశ్యలు ఋష్యశృంగుని లోబఱుచుకొను ఘట్టము (పుటలు91-96) వేశ్యోచితము కావచ్చునేమోగాని, కావ్యోచితము కాదు. ఇంత బరితెగించుట ఇంతకు ముందు కావ్యములందు లేదు. రోమపాదుని మంత్రి బంగారు శాంతను ఋష్యశృంగుని సేవలకు నియోగించుమనుట, రోమపాదుడు నియోగించుట, అంతఃపురకన్య శాంత ఋష్యశృంగునికి స్త్రీ పుంసభేదము చెప్పుట, శివపూజను శరీరపూజ చేయుట, అందుకు శివజీవాభేదతత్త్వము చెప్పుట (పుటలు97-101) పాత్రానుచితమేగాక, కావ్యానుచితము.

రోమపాదుడు వరుణజపము చేయించుటకు, మునులు కావలయునన్న వస్తుసామగ్రి పురోహితుల నిలువుదోపిడికి నిదర్శనము. సమకాలికసమాచారము కావచ్చును. మురారిదిల్లి బియ్యము తంజావూరి మేలిరకము బియ్యమగును. వక్కలాకులేగాక, బంగు పొగాకు కూడ తంజావూరు పురోహితుల అభ్యాసము కాబోలు! వస్తుసామగ్రిని ఎత్తుకొని పోవుట కూడ అచటి పురోహితుల అవలక్షణమే అగును. (పుటలు87,88.)

**16.** ద్రౌపదీకల్యాణనాటకము:- ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుట4) ఇందు ద్రుపదునగరమును అలంకరించుటకు తలవరులు చాటించుట సీతాకల్యాణనాటకమునందు వలె కలదు. అదే దరువు. (పుట11) అంతేకాదు. స్వయంవరమునకు మగధ, మాళవ, లాట, సింధురాజుల ఆగమనము, దర్భా గిరిరాజు సర్వాంగసుందరీవిలాపమునందు కల మగధ, మాళవ, సింధురాజుల ఆగమనము వలె కలదు. అవే దరువులు. (పుటలు11,12). సీతాకల్యాణమునందు రాజులు తమ అపమర్తను జనకమహారాజునకు చెప్పిన, ద్రౌపదీకల్యాణనాటకమునందు రాజులు తమలో తాము చెప్పుకొందురు. అందు జనకమహారాజు శివధనుస్సంధానపణమునకు విచారించినట్లు, ఇందు ద్రుపదమహారాజు మత్స్యయంత్రపణమునకు విచారించును. కావున ద్రౌపదీకల్యాణనాటకమును దర్భా గిరిరాజకృతము కావలయును.

ఇందు ప్రసిద్ధమైన భారతకథయే కలదు. ద్రౌపది సౌందర్యమును వర్ణించుట కావ్యసరణి. యంత్రమత్స్యమును త్రుంచెదనని బ్రాహ్మణవేషధారి అర్జునుడు ప్రకటించినపుడు, బ్రాహ్మణసమూహము సంతోషభరితాంగులై పంచె లెగురవేయుట భారతసరణి. దరువు పాడుట యక్షగానసరణి. ధర్మరాజు యంత్రమత్స్యమును త్రుంచుటకు అనుజ్ఞ అడిగిన, "మనకు లేమిని తిరిపెమెత్తేవారలకు నీ బిరుదు లేలను కన్య లేలను బీరమేల" అనుట, అర్జునుడు శత్రుపలాయనము చేయించినత్తువనిన, "వినవోయి యర్జున, వారి గొడవ మనకేల? మనము కన్యకామణినిఁ దోడ్కొని పోవుదము రావోయి" అనుట పాత్రస్థాయికి తగినట్లు లేదు. పదపద్యములున్నను. వచనము ప్రధానమైన యక్షగానము.

**17. శచీపురందరకల్యాణనాటకము:-** ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుటలు 140,142,142,149.) త్యాగేశసాంబశివునికి అంకితము. ఇందు వల్లీకల్యాణ, రతికల్యాణనాటకములందు వలె, దర్భా గిరిరాజు వాదజయములోని కోలాటము దరువు కలదు. (పుట180.) అందు గిరిరాజు పదముల ప్రసక్తి, శాహరాజప్రశంస యథాతథము. కావున వల్లీకల్యాణ, రతికల్యాణనాటకముల వలె శచీపురందరకల్యాణ నాటకమును దర్భా గిరిరాజకృతము కావలయును. త్యాగేశాంకితమైన విఘ్నేశ్వరకల్యాణ నాటకము వలె, శచీపురందరకల్యాణనాటకము ఆస్థానకవికృతమగుట అబ్బురము కాదు.

ఇందు విఘ్నేశ్వరపూజాఘట్టము కలదు. పూజారికి పొగాకుతోట కలదు. పొగాకుతోటకు నీళ్లుచల్లుట అతని ప్రథమకృత్యము. తర్వాత రెండుచుట్టలు కాల్చి, కాలకృత్యము తీర్చి, శుద్ధాచమనము చేసి, విఘ్నేశ్వరపూజ చేయుట విహితకృత్యము సాయంకాలము కాకముందే నైవేద్యములు వేశ్యాగృహమునకు పట్టించుకొనిపోయి, సూర్యోదయమైన ఎనిమిది గడియల వఱకు దానింటిలోనే పరుండుట నిత్యకృత్యము. అతని కంటె ఘనుడు అతని పై అధికారి మణియము. అతడు దండించదలచిన పూజారి అతని గుట్టు దివాణము వాకిట చాటింపు వేయును. పరిచారకుని మీద మాత్రము ప్రతాపము చూపును. ఇదొక చిన్న ప్రహసనము.

వక్రదంతుడు, వాని గురువులు కపిలకణ్వమహర్షులు మాటాడు ఘట్టము సుమారు ఇరువదిరెండు పుటల గ్రంథము. పెద్ద ప్రహసనము. ఇందు మునులకు మునిశిష్యునికి అలభ్యమైన అపభ్యపదములు అనేకములు కలవు. కపిలకణ్వమహర్షుల నోట "శుద్ధీ బద్ధీ" లేని తిట్టుల వర్షము! వక్రదంతుని సంగతి చెప్పనక్కఱలేదు. ఇదియెల్ల పులోముడను రాక్షసుడు పెట్టిన బాధలను కపిలకణ్వాదులు దేవేంద్రునితో మొఱపెట్టు కొనుటకు మాత్రమే ఉద్దిష్టము. ఇది లేకపోయినను నష్టము లేదు. దేవేంద్రునితో కపిలకణ్వాదులు మొఱపెట్టుకొన్నది చాలును. ఉన్నందుకు ప్రయోజనము - తమిళదేశములోని పుణ్యక్షేత్రములలో, పంచనదము దొడ్డస్థలము, కుంభకోణము ముఖ్యస్థలము, మధ్యార్జునము మాయూరము శ్రీవాంఛము మహా దొడ్డ స్థలములు, కమలాపురము ఉత్తమస్థలము- అను ప్రతిపాదనమే. ఉత్తమస్థలమైన కమలాపురము నందే, పులోముడు సపరివారముగా వచ్చి, తపస్సుచేయు కపిలకణ్వమహర్షులను కొట్టినది! బాధలు పెట్టినది! అది వేఱే విషయము.

ఈ రెండు ఘట్టముల తర్వాత శచీపురందరవివాహఘట్టము. అదే ఏకైక ఘట్టమైన, నాటకమునకు ఏవిధమైన కొఱతయును లేదు. మొత్తము సుమారు ముప్పది పుటలయందున్న రెండు ఘట్టములు వచనప్రధానములు. వ్యావహారికభాష ప్రయుక్తము.

అసలు ఘట్టము: దేవేంద్రుడు కొలువుసేయుట, రంభోర్వశులను పిలిపించుట, రంభ వచ్చుట, ఇంతలో కపిలకణ్వాదులు వచ్చి మొఱపెట్టుకొనుట, దేవేంద్రుడు కుమార స్వామిని చంద్రుని పిలిపించి సమరసన్నాహము చేయించుట, బయలుదేరుట, అంతలో

పులోముని తనయ శచీదేవి చెలికత్తెలతోగూడి శృంగారవనమునందు కోలాటమాడుట, దేవేంద్రుడు చూచి పరవశించి చంద్రుని పంపుట, శచీదేవి దేవేంద్రుని గుఱించి విరహము చెందుట, దేవేంద్రుడు పులోముని చంపబోవుట, కార్యసంఘటన చేసికొని వచ్చిన చంద్రుడు వారించుట, దేవేంద్రుడు "మునులు తామెందుఁ బోయిన నేమి? దనుజాండ్రైన పులోమాసురుం డెందుఁబోయిన నేమి? వనజాక్షియైన శచి తనకుఁ గలిగినఁ జాలు" నని పులోముని చంపకుండుట, చంద్రుడు పులోముని ఇంద్రునికి కూతురు నిమ్మని అడుగుట, పులోముడు సమ్మతించుట, సకలదేవతల సమక్షమునందు శచీపురందుల వివాహము తంజావూరులోనే జరుగుట యథాప్రకారమే.

దేవేంద్రుడు "శాహేంద్రుఁ డేలు తంజాపురంబున వివాహంబు గావింప వలసియున్నది. నే నట పోవుచున్నాను. నీవు శీఘ్రముగా నీ బాంధవులతోఁగూడఁ గన్యను దోడ్కొని తంజాపురంబునకు "రమ్మనుట, తాను పోవుట పులోముడు కన్యను తోడ్కొని వచ్చుట, దేవేంద్రుడు త్రిమూర్తులను తంజావూరు రప్పించుట శాహరాజునకు మోహనాస్త్రము.

అసలు ఘట్టమువందును వచనము అధికము. గ్రాంథిక, వ్యావహారికభాషలు రెండును ప్రయుక్తములు. ఇందు "మాతృక" అను మాట పదునెన్మిది స్థలములందు కలదు. (పుటలు142, 173, 175, 176,177,179,180,181,182,183,184,186, 187,193,194,195,196,197.) ఒక్క స్థలమున "పూజ్యము" అని కలదు. (పుట173) మఱొక్కస్థలమున "కొంచెకత్తెలమె" అను ఎత్తుగడ కలదు. మాతృకల వివరములు లేఖకపరిత్యక్తములు కావచ్చును.

రంభ ధరించిన బంగారు చీర, మల్లెవిరుల చుట్టి, వజ్రాల కమ్మలు, పంజుల కమ్మలు, ముత్యాల హారములు, అందెలు; శచీదేవి ధరించిన చెంగావిపావడ, పద్మరాగపుఁదీగె, నవరత్నమయమైన పంజుకమ్మలు, కంకణములు, విరిసరులు; దేవేంద్రుడు ధరించిన ముత్యాలసరులు, కుమారస్వామి ధరించిన కుండలములు; చంద్రుడు ధరించిన పచ్చని దుప్పటి, పసిడిపావాలు, పూలవంకి, కంకణములు సమకాలిక మైన వస్త్రాభరణవిశేషములు. ఇతరయక్షగానములందును ఇవి కలవు.

**18. జలక్రీడలునాటకము:-** ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుటలు106,107,107) శాహరాజప్రణీతములుగ కల యక్షగానములందు విఘ్నేశ్వరాగమనము విధాయకము. అది ఒక ద్విపదను, ఒక దరువున కలదు. ఇట్లు వివర్తి శేషాచలపతి పార్వతీకల్యాణమువందు, సరస్వతీకల్యాణమునందును కలదు. కాని ఇందు ద్విపద లేదు. దరువు మాత్రమే కలదు. (పుట107.) కావున జలక్రీడలు నాటకము వివర్తి శేషాచలపతికృతము కావలయును.

ఇందు ప్రసిద్ధమైన భాగవతములోని గోపికావస్త్రాపహరణవృత్తాంతమే కలదుగాని, వ్యత్యాసము కలదు. అందు గోపకుమారికలు శ్రీకృష్ణుడు భర్త అగుటకు

కాత్యాయనీవ్రతము పట్టి, ఒకనాడు వలువలు విజనస్థలమున విడిచి జలకము లాడిన, వ్రతనిష్ఠలైయుండి వలువలు గట్టక జలకము లాడుట కాత్యాయినీదేవిని కల్లసేయుట అని కృష్ణుడు గోపికావస్త్రాపహరణము చేసి, వ్రతఫలము వలసిన చేతులెత్తి మ్రొక్కి చీరలు పుచ్చుకొమ్మన్నట్లు కలదు. ఇందు గోపకన్యలు సవిలాసముగ స్థలక్రీడ లాడి, జలక్రీడ లాడునెడ వారిని గాంధర్వవివాహము చేసికొనుటకు కృష్ణుడు గోపికావస్త్రాపహరణము చేసి గట్టుమీదికి రమ్మన్నట్లు కలదు. గోపికలు వచ్చినట్లును కలదు. గాంధర్వవివాహము జరిగినట్లు కలదు.

సరిక్రొత్తగా కల్పించిన పప్పు తిమ్మక్కపాత్ర పరమవికారము.

**19. కృష్ణలీలావిలాసనాటకము:-** అముద్రితము. గ్రంథపట్టికలవలన తెలియనగు సమాచారమిది : ఇది "శాహమహారాజప్రణీతం"బని, "శాహేంద్రుఁడు వేడ్కతో ..... విరచించె" నని అవతారికయందు కలదు. కాని అవతారికయెల్ల సరస్వతీకల్యాణములోని అవతారికవలెనే కలదు కాఁబట్టి సరస్వతీకల్యాణము వలె కృష్ణలీలావిలాసనాటకమును నివర్తిశేషాచలపతికృతము కావచ్చును.

ఇందు దేవకీదేవి దౌహృదము, కృష్ణజననము, పూతనాహరణము, బాలకృష్ణుడు గొల్లభామల యిండ్ల కావించిన లీలలు, దేవకీదేవి కృష్ణునికి సత్యభామతో వివాహము కావించుట ఇతివృత్తము. దేవకీదేవి బాలకృష్ణుని లాలించు విధమిది:

"చిన్నికృష్ణా యింతా దుడుకు చెల్లునటరా
గోపకన్నికలను బాట్టి యింత గాసి సేయ మేర గాదు
అన్నా పొరుగిండ్ల కేఁగి వెన్న తినవేలా నీకు
వెన్న పాలు లేవటరా చి................................"

**20. కిరాతవిలాసనాటకము:-** ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుటలు68,68) ఇందును విఘ్నేశ్వరాగమనము, నివర్తి శేషాచలపతి సరస్వతీకల్యాణము, పార్వతీకల్యాణములందు వలె కలదు. (పుట68.) ద్విపద లేదు. దరువు కలదు. కావున కిరాతవిలాసనాటకము కూడ నివర్తి శేషాచలపతికృతము కావచ్చును.

ఇందు పరమేశ్వరుడు పార్వతికి చదరంగమునందు ఓడిపోయి, పందెము ప్రకారము తన సర్వస్వము -పునుక, పులితోలు, త్రిశూలము, రుద్రాక్షమాలిక, విభూతిభరిణె, నాగభూషణము, వృషభవాహనము - ఇచ్చివేసి, నారదుని సూచన ప్రకారము చెంచురాజు వేషము ధరించి వనాంతరమునకు పోవును. పరమేశ్వరుని కొఱకు పార్వతి కూడ నారదుని సూచనప్రకారము చెంచురాలి వేషము ధరించి వెదుకును. ఉభయులు హిమాచలప్రదేశమునందు కలిసికొందురు. చెంచురాజు చెంచురాలిని మోహించును. చెంచురాలు చెంచురాజును వారించును. పార్వతీ పరమేశ్వరులమని ఏకమగుదురు. ఇది కిరాతవిలాసనాటకములోని ఇతివృత్తము. పాత పాట కాదు. క్రొత్త పాట.

అంతేకాదు. జాణతనము కల జానపదుల పూలబాట.

"నీవు యిందేల వచ్చినావు చెంచుపడుచా తెలుపవే ॥౧॥
చెంచుదాన నేను చెలువూన నా పుట్టింటనున్నాను చెంచురాజా ॥౨॥
వెలఁది నీ పేరేమి వేగమె తెలుపవే చెంచుపడుచా ॥౩॥
అందఱుం బిలుతురు ఆకులు లేమిదని చెంచురాజా ॥౪॥
మగని పేరేమి మచ్చికఁ దెలుపవే చెంచుపడుచా ॥౫॥
ఆదరించి వినుము అతనికిఁ బేరు మొద్దు చెంచురాజా ॥౬॥
తనయుని పేరేమి తరుణిరో తెలుపవే చెంచువడుచా ॥౭॥
కొమ్ములేని వాఁడొకఁడు కొమ్మొకటి కలవాఁడొకఁడు చెంచురాజా." ॥౮॥

పుట్టిల్లు హిమాచలము. ఆకులు లేమిది అపర్ణ. మొద్దు స్థాణువు. కొమ్ము లేనివాడు కుమారస్వామి. కొమ్మొకటి కలవాడు ఏకదంతుడు.

చెంచురాలు తన "పురుషుడు బలుకోపగాఁడు, పురముల జయించినవాఁడు, కరమున శూలము కలవాడు; అగ్రతనయుడు అఖిలవంద్యుడు, ఉగ్రతనయుడు కొండను గొట్టి పిండిచేయువాడు, సేనాధిపతి, చుక్కనామదైత్యమర్దనుడు" అని హెచ్చరించును. పలుకోపగాడు రుద్రుడు. పురముల జయించినవాడు త్రిపురారి. కరమున శూలము కలవాడు త్రిశూలి. అఖిలవంద్యుడు విఘ్నేశ్వరుడు. ఉగ్రతనయుడు, కొండను గొట్టి పిండి చేయువాడు, సేనాధిపతి, చుక్కనామదైత్యమర్దనుడు కుమారస్వామి. తారకాసురసంహారి.

**21. సతీపతిదానవిలాసనాటకము:–** ఇది శాహారాజు రచించినట్లు కలదు. (పుట5.) ఇందును విఘ్నేశ్వరాగమనము నివర్తి శేషాచలపతి సరస్వతీకల్యాణము, పార్వతీకల్యాణములందు వలె కలదు. (పుట5) ద్విపద లేదు. దరువు కలదు. కావున సతీపతిదానవిలాసనాటకము కూడ నివర్తి శేషాచలపతి కృతము కావచ్చును.

ఇందు ప్రసిద్ధమైన శ్రీకృష్ణతులాభారము కథ కలదు. ఏతత్కథాబీజము నంది తిమ్మన పారిజాతాపహరణములోని పుణ్యకవ్రతమునందు కలదు. అందు నారదుడు సత్యభామకు పతిదానవ్రత ముపదేశించి, ఆమె దానమిచ్చిన కృష్ణుని ఆమెకు తిరిగియిచ్చును. ఇందు నారదుడు సత్యభామకు పతిదానవ్రత ముపదేశించి, ఆమె దానమిచ్చిన కృష్ణుని ఆమెకే కాదు; బలరాముడు అడిగినను, ఇచ్చిన దానమును తిరిగి అడుగుట న్యాయము కాదని ఈయడు. బలరాముడు చేయునది లేక ఉపాయము చెప్పుమనిన, కృష్ణునితో తులదూగు ధనమిచ్చి పుచ్చుకొనవచ్చునని చెప్పును. బలరాముని, కృష్ణుని, రుక్మిణి వినా అష్టమహిషుల, యశోద, వ్రేపల్లె వారందఱి ధనము, వస్తువులు కలిపినను తుల దూగదు. కడకు రుక్మిణి భక్తితో తులసిదళము నిడ తులదూగును. కృష్ణుడు అందఱి వాడును అగును.

సత్యభామ ఎవరికి చెప్పకుండ తనంతతాను కృష్ణుని దానమిచ్చినందుకు,

సపత్నులకు సత్యభామకు జరిగిన కలహము వారి స్థాయికి తగినట్లు లేదు.

"కలహకంటకులారా! యీ కంటుమాట లేలానే, నా
చెలువుని నేను దానము చేసితిఁ బోవే ॥౧॥
దార నీ వెట్లాడువె దానవారి శ్రీకృష్ణుడు
ఒకరి సొమ్మటె దెలుపవె చుప్పనాతి ॥౨॥
తప్పు మాట లాడకురె దవడఁగొట్టఁ బొయ్యేగాని
చొప్పున శ్రీకృష్ణుఁడు దన సొమ్ముగాదటే ॥౩॥
పట్టపురాణి రుక్మిణి ప్రాణేశుఁ డంటె చెల్లు, యీ
వట్టి మాట లేలె తల మొట్టఁబొయ్యేము ॥౪॥
మాట లేలాడరె, యిఁక మీ మనసు ముట్టి చూచుకోరె
పాటించి యిఁక నే మీకు భయపడుదున ॥౫॥
చాలుఁ జాలు నిఁకను వట్టి జగడమేలె రంపెలాడి
వాలాయముగఁ జల్లఁగా వర్ధిల్లు మింక ॥౬॥

**22. సతిదానశూరనాటకము:–** ఇది శాహరాజు రచించినట్లు కలదు. (పుటలు202,203,204.) ఇందును విఘ్నేశ్వరాగమనము నివర్తి శేషాచలపతి సరస్వతీకల్యాణము, పార్వతీకల్యాణములందు వలె కలదు. (పుట204.) ద్విపద లేదు. దరువు కలదు. అంతేకాదు. సూత్రధారి మతంగస్త్రీవర్ణనము (పుట206.) దర్భా గిరిరాజు రాజమోహనకొరవంజిలోని సూత్రధారి రాజకన్యకామణివర్ణనము వలె కలదు. ఉపరి, బ్రాహ్మణోత్తముని మతంగస్త్రీవర్ణనము (పుటలు208,209) నివర్తి శేషాచలపతి శాహరాజవిలాసములోని రతీశ్వరుని లీలావతీవర్ణనము వలె కలదు. మొదటిది యథాతథము. రెండవది తీగ సాగదీసినది.

"పల్లవంబులఁ బోలు భామ పాదములఁ
బిల్లాండ్లు మెట్టెలు బిరుదుపెండెంబు
గజ్జెలు నందెలు ఘల్లుఘల్లనఁగ
ముజ్జగంబుల వారు మోనసి చూడఁగను
పెనుపైన తన మేటి పిరుదందుఁ జాలఁ
గనకసూత్రనికాయఘంటికల్ మెఱయఁ
బద్మరాగపుఁ దీఁగె పరఁగ ధరించి
పద్మబాంధవు రీతిఁ బలుదిశల్ వెలుఁగ
వన్నెమీఱఁగఁ దన వాలుఁ గన్నులను
దివ్వఁగాఁ గాటుక దీర్చి వెన్నదుటఁ
దెలివొందఁ గస్తూరితిలకంబు దిద్ది
చెలు లిరుగడలును సేవలు సేయఁ
బరువడి శాహేంద్రుపై మరులైవ
వరరాజకన్యక వచ్చె నీ వేళ." రామో.కొ. పుట26.

ఇందలి తొమ్మిదవ పంక్తి లుప్తమై; పదమూడు, పదునాలుగు పంక్తులు "సారసలోచనోత్సవము చూడంగ। గరిమతో మాతంగకన్య తా వెడలె" అని మాఱి పతిదానశూరనాటకమునందు కలదు.

లీలావతీవర్ణనము:

"సొమ్మో పూవుల కొమ్మో
చిత్తరు బొమ్మో
యీ ముద్దుగుమ్మో లాల.
బాగో బంగరు సోగో
పూవుల తీగో
యీ యెలనాగో లాల
ఒప్పో కాటుక కుప్పో
కరిమబ్బుల కప్పో
యీ యింతి కొప్పో లాల
గోమో మాయల దీమో
శాహేంద్రు నోమో
యీ చెలి నగుమోమో." లాల. శా.రా.వి.

మతంగస్త్రీవర్ణనము:

కొమ్మో పూవుల రెమ్మో బంగారు
బొమ్మో మరుని శరమ్మో లేక।
తళుకో మరువంపు మొలకో రతిచేతి
చిలుకో ముద్దుల కలికో లేక।
ఇంతో వెన్నెల కాంతో చెలుల మేల్
బంతో మదముని దంతో లేక
వారో మేటి మిటారో చికిలి క
టారో యిది యొయ్యారో లేక।
తేటో మదముని తోటో గుణముల
కోటో పింగారపు పేటో లేక।" స.దా.శూ.

ద్విపదఘట్టముల ఐక్యము, పదముల చాకచక్యము ప్రస్ఫుటము. కాఁబట్టి సతిదానశూరనాటకము వివర్తి శేషాచలపతి, దర్భా గిరిరాజుల జంటకవిత్వము కావచ్చును.

సత్రమరులు నాటకము తర్వాత సతిదానశూరనాటకము సాంఘికేతివృత్తము కల యక్షగానము. అది సత్రముల అధ్వాన్నస్థితికి నిదర్శనము. ఇది ధర్మముల ఉన్నత స్థితికి ఉదాహరణము. దేవుని మాహాత్మ్యము కంటె జీవుని మనస్తత్త్వము ప్రధానమైన కథ. మోరోభట్టు అను బ్రాహ్మణోత్తముడు మతంగస్త్రీయెడల మరులుగొని, ఒక వంక శిష్యుడు, మఱొక వంక మతంగస్త్రీ ఎంత వారించినను వినక, ఎట్లైన వాంఛాఫలసిద్ధికి వదరుచు, మాతంగస్త్రీభర్త అక్కడికి వచ్చి అదలించినను బెదరించినను అదే పాట

పాడును. నీచవృత్తియైనను ఉత్తమప్రవృత్తి కల మాతంగస్త్రీభర్త బ్రాహ్మణోత్తమునికి తన దారను ధారవోయును. అప్పుడు మోరోభట్టు అకస్మాత్తుగా విద్యుద్ఘాతము తగిలిన వాని వలె పరివర్తనమంది పశ్చాత్తాపమునందును. అంతటితో కథ ఆగలేదు. పశ్చాత్తాపమునందిన బ్రాహ్మణోత్తముడు ఆమె తనకు అక్కఅలేదనేనే కాని, మాతంగస్త్రీ భర్త దానతిరస్కారము చేయరాదని శాసించును. దాన మిచ్చిన తర్వాత ఆమె తన భార్య కాదని అతడు, పరివర్తన మంది పరదార వలదని ఇతడు పంతము లాడుటలో వారిద్దఱి మధ్య ఆమె రెంటికిఁ జెడిన రేవడ అయినది. ఆ స్థితిలో పరమేశ్వర సాక్షాత్కారము అపరిహార్యమైనది. పరమేశ్వరుడు దానభంగము రాకుండ, ధర్మగ్లాని లేకుండ, బ్రాహ్మణోత్తమునికి సాయుజ్యము, మాతంగస్త్రీకి సామీప్యము, మాతంగస్త్రీ భర్తకు సారూప్యము, శిష్యునికి సాలోక్యము ప్రసాదించును.

కథాంత మటుంచిన, మనస్తత్త్వప్రధానమై, సంఘర్షణాత్మకమైన సంఘటనతో, నాటకీయత జీవనాడిగా సాగిన యక్షగానమిది. ఇందు అంగిరసము దానవీరము. అంగరసమైన హాస్యము అతిమాత్రమైనను, అవి అంగిరసోపస్కారకములు. భాష వ్యావహారికము. శైలి సరళము. శ్లోకములు ఎక్కువ. ద్విపదలు, దరువులు తక్కువ. వచనము సమధికము. గురుశిష్యసంవాదమునందు శ్లోకనిదర్శనము లేని సంభాషణలు అరుదు. మాతంగస్త్రీభర్త కూడ శ్లోకములను ఉదాహరించుట విశేషము. మాతంగస్త్రీ సహితము శ్లోకమును ఉదాహరించుట ఇతోధికవిశేషము. ఎన్ని శ్లోకములు ఉదాహృతము లైనను ఇంచుమించు ఎక్కడి కక్కడ అర్థవివరణము సంభాషణరూపమువందే కలదు.

"గురువు :- ఇంకా చెప్పెద వినరా.

శ్లో॥ స్త్రీతి నామాపి సంహ్లాది, వికరత్యేవ మానసం।
కిం పునర్దర్శనం తస్యా విలాసోల్లాసితభ్రువః ॥

శిష్యుడు:- అట్లా అంటే అర్థమేందయ్యా.

గురువు :- ఎంత జపము చేస్తూ వున్నాగాని, ఎంత తపంచేస్తూవున్నాగాని, ఎంతసమాధిగా వున్నాగాని, ఎంత నిష్ఠగా వున్నాగాని స్త్రీ యనే రెండక్షరాలు వింటే అదంతా విడిచిపెట్టి దానిమీద మనం పారుచువ్నది. మనస్సుకు వికారం పుట్టుచువ్నది. మరిన్నెట్లానంటే, విలాసాలచేత ప్రకాశించుచుండే కనుబొమ్మలు గలిగినమంటి స్త్రీని జూచి యెవరి మనస్సుకు వికారం పుట్టక యుండుర." పుటలు209, 210.

"శిష్యుడు:- అయితే మీకు వెఱ్ఱిపట్టింది. నిజమే. సరి. ఎట్లా అంటే చెప్పెద వినవయ్యా.

శ్లో॥ ఉదర్కఫలమిచ్ఛద్భి స్సద్భి ర్నైవావలోక్యతే।
చతుర్థీ చంద్రరేఖేవ పరస్త్రీఫాలపట్టికా ॥

గురువు:- అంటే అర్థం ఏందిరా!

శిష్యుడు:- మహాదైవ ధర్మమోక్షమనేమవంటిది అపేక్షించే పెద్దలు పరస్త్రీవి

జాచేది లేదు. అది యెట్లానంటే పిల్లారిచవితినాటి చంద్రకళ
నెమవలె చూడరాదో అమవలెనే చూడరాదయ్యా." పుట210.

మాతంగస్త్రీభర్త:-

శ్లో॥ జితేంద్రియత్వం వినయస్యలక్షణం
గుణప్రకర్షో వినయా దవాప్యతే।
గుణాధికే పుంసి జనోనురంజతే
జనానురాగప్రభవాహి సంపదః ॥

గురువు:- అట్లా నంటే అర్థమేదిరా.

మా.స్త్రీ.భ:- వినవయ్య బాపనయ్యవారు. మీవంటి పెద్దలకు జితేంద్రియత్వముండవలెను. అదప్పుడు వినయానికి లక్షణం, ఆ యొక్క వినయమువల్లను గుణాధిక్య మౌచున్నది. గుణాధిక్యము గలిగి పురుషుని యందు సకల జనములు వనురక్తముగా నుందురు. ఎవరియందు జనాను రాగముగలిగెనో వారికి సంపదలకుఁ గొదవయేందయ్యి. కాఁబట్టి మీవంటి పెద్దలకుజితేంద్రియత్వముండవలెను. అదంతా విడిచిపెట్టి యిట్లాయేల చేసెదవయ్యా." పుటలు250,251.

అని మాతంగస్త్రీభర్త మఱొక రెండు శ్లోకములు ఉదాహరించును. మాతంగస్త్రీశ్లోకమిది:

"సూత్రధారి వచనం: అంత నీ విధంబున మతంగస్త్రీ పరమేశ్వరుని గూర్చి పలికే మార్గము:

శ్లో. స ఏవ ధ్యేయో మే ముకుళిత యదుత్కుంచిత పద
స్ఫురన్మంజీరాంతశ్శయితహరినాభీసరసిజే
వసన్ ధాతాభ్యర్ణప్రకటితనిజాజీర్ణశిరసః
స్రగాలోకాశంకి శశివ మనుగృహ్ణాతి శతశః" పుటలు263,264.

ఈ శ్లోకమునకు మాత్రమేగాక, పరమేశ్వరుని గుఱించి మాతంగస్త్రీభర్త, గురుశిష్యులు పలికిన శ్లోకములకును అర్థవివరణము లేదు. కారణము ప్రార్థనశ్లోకములగుట కావచ్చును. ఇంత సంస్కృతపరిజ్ఞానము మాతంగదంపతులకు పదునేడవశతాబ్దిని కల్పనాకథనమో, వాస్తవచిత్రణమో సంశయాస్పదము. మాతంగస్త్రీ పలికిన పతివ్రతాధర్మము (పుట235) జారత్వనింద (పుట237) పతిపరాక్రమము (పుట239) మొదలైనవి; మతంగస్త్రీభర్త వివరించిన వేదాంతము (పుటలు 250-252) ఉట్టంకించిన భర్తృహరిసుభాషితరత్నములు (పుట 247,251) మొదలైనవి సంస్కృతపరిజ్ఞానమునకు సమర్థములు.

ఇందలి శిష్యుడు గురువును మించిన శిష్యుడు.

"పరమెంచు" మనిన మాతంగస్త్రీభర్తకు, గురువు ప్రతిపాదించిన స్వమతమిది:

"అవిదితసుఖదుఃఖం నిర్గుణం బ్రహ్మ పొక్తా
జ్జడమతి రిహ కశ్చి న్మోక్ష ఇత్యాచచక్షే
మమతు మత మనంగస్మేరతారుణ్యపూర్ణ

స్తనభరమదిరాక్ష్యా నీవిమోక్షోహి మోక్షః॥"
("సుఖదుఃఖములు తెలియని నిర్గుణమైన బ్రహ్మమే మోక్షమని బుద్ధి లేనివాఁడు చెప్పును. మా యొక్క మతము వినవోయి. మన్మథుని యొక్క సర్వోత్కర్షాపరిపూర్ణమైన యౌవనము గలిగినటువంటి, గొప్పస్తనాలు గలిగినటువంటి మదిరాక్షియొక్క కోకముడి విడుచుటే మోక్షముగాక మఱి వేఱే మోక్షము గలదఁటరా?")

గురువు స్వమతమును శిష్యుడు మూడు శ్లోకములతో ప్రత్యాఖ్యానము చేసెను. మూడవ శ్లోకమిది:

"ఆదిత్యస్య గతాగతై రహరహ స్సంక్షీయతే జీవితం ।
వ్యాపారై ర్బహుకార్యభారగురుభిః కాలో న విజ్ఞాయతే।
దృష్ట్వా జన్మజరావిపత్తిమరణం త్రాసశ్చ నోత్పద్యతే।
పీత్వా మోహమయీం ప్రమాదమదిరా మున్మత్తభూతం జగత్॥."

( "సూర్యునియొక్క యుదయాస్తమానములచేతను రాత్రింబవళ్లు నాయుస్సు క్షయించుచున్నది. అపరిమితమయినటువంటి కార్యాలచేతను కాలముతెలియఁబడుటలేదు. పుట్టుకయున్ను వృద్ధాప్యమున్ను ఆపత్తున్ను మరణమున్ను జూచి భయపడేది లేదు. ఈ లోకము మోహమయమైనటువంటి యవగడమనేమద్యాన్ని పానముచేసి మిక్కిలి మదించియున్నదయ్యా")

ఇట్లు పలికిన శిష్యుని వాక్యములు, అట్లు పలికిన మాతంగస్త్రీభర్త మాటలు విని, గురువు వేదార్థతత్త్వము విచారించి, మనస్సునందు విరక్తి జెంది పశ్చాత్తాపమునందును. అందుకు,

"బాలుడవైనాను భక్తిచే నీ గురుని
శీలము విలిపితి సీమెల్లఁ బొగడ"

అని శిష్యునికి పరమేశ్వరుని కతపత్రము. మొత్తము మీద పతిదానశారనాటకము మోదావహము. అంతేకాదు. అనేకయక్షగానములలో ఇది అగ్రేసరభాసమానము.

మొత్తము మీద శాహరాజప్రణీతములుగ కల ఇరువదిరెండు నాటకములందును రెండు నాటకములు శాహరాజకృతములు కావని ఇతఃపూర్వమే నిశ్చితము. మిగిలిన ఇరువది నాటకములుమ నివర్తి శేషాచలపతి,. దర్భా గిరిరాజా సంతరించి శాహరాజు పేర సంఘటించినట్లు స్పష్టము.

నివర్తి శేషాచలపతి వరస్వతీకల్యాణములోని జయ దేవకీపుత్ర జయ దివ్యమతిపాత్ర, శరణు శరణు జగద్విధాయక, మహిషాసురమర్దని తే, లంబోదరః, నృత్యాకారగతైః, వందే తం దేవదేవం, చండప్రాండవకాండ, శ్రీమానస్తు స శంకరః, శ్రియమురు దిశతాంతే, అను ఇష్టదేవతాస్తుతులు; " నాలుగు నెమ్మొగంబులను" అను బ్రహ్మవర్ణన; పాశాంకుశంబుల, ముదమునఁ గుండలముల అను విఘ్నేశ్వరాగమనము; శాహేంద్రః, జయజయ శ్రాంత అను శాహరాజస్తుతులు శాహరాజప్రణీతములుగ కల

యక్షగానములందు కలవు.

దర్భా గిరిరాజా రాజకన్యాపరిణయములోని జయ పార్వతీరమణ జయ జానకీరమణ, సర్వాంగసుందరీవిలాసములోని జయ పార్వతీరమణ జయ మనోభవహరణ అను ఇష్టదేవతాస్తుతులును శాహరాజప్రణీతములుగ కల యక్షగానము లందు కలవు.

నివర్తి శేషాచలపతి సరస్వతీకల్యాణములోని జయ దేవకీపుత్ర జయ దివ్యనుతి పాత్ర, శరణు శరణు జగద్విధాయక, మహిషాసురమర్దని తే, లంబోదరః, నృత్తాకారగత్తైః, వందే తం దేవదేవం, చండస్తాండవకాండ అను ఇష్టదేవతాస్తుతులు; ముదమునఁ గుండల ముల అను విఘ్నేశ్వరాగమనము సర్వాంగసుందరీవిలాసమునందు కలవు.

ఇవి నివర్తి శేషాచలపతి, దర్భా గిరిరాజుల జంటకవిత్వమునకు, శాహరాజా పేర కవిత్వమునకు నిదర్శనములు.

## శహాజీఆస్థానకవులు

**నివర్తి శేషాచలపతి:–** ఇతని కృతులు 1. సరస్వతీకల్యాణనాటకము. 2. పార్వతీకల్యాణనాటకము 3. శాహరాజవిలాసనాటకము. ఇవిగాక భోసలకోసలీయము సంస్కృతకావ్యము. ఆంధ్రవ్యాకరణము శాస్త్రగ్రంథము.

శేషాచలపతికి శాహరాజా శిబికాప్రదానము, కనకాభిషేకము చేసినట్లు; శేషాచలపతి ఆంధ్రపాణిని అని, భోసలకోసలీయమునందు కలదు[62]. అంతేకాదు. అతని శిష్యుడు నెల్లూరి శివరామకవి కామకళానిధి అను గ్రంథమునందు ఆంధ్రవ్యాకరణవిషయము కలదు[63].

" సకలాంధ్రోక్తుల వాంధ్రపాణిని యనన్ శాస్త్రంబు గల్పించి, త
త్ప్రకృతిప్రత్యయనిర్ణయంబు కొఱకై భాష్యంబు గావించి, దే
శికుఁడై రాజులచేతఁ బూజఁగొను వా శేషాచలర్షిన్ నివ్ర
త్తికులస్వామిని మద్గురున్ గొలుతు భక్తిన్ మానసాబ్జంబునన్."

నివృత్తి లేక నివర్తి శేషాచలపతి " అష్టభాషాకవిత్వంబు లమరు సుకృతి" అని (పుట88.) "అష్టభాషాసుకవి" అని (పుట137) అతని శాహరాజవిలాసమునందు కలదు. అష్టభాషలు సంస్కృతము, ప్రాకృతములు, తెలుగు. అందులేని కన్నడపదములును శాహరాజవిలాసమునకు అనుబంధము. శాహరాజవిలాసములోని "శేషాచలగీతశాహేంద్ర పదము" (పుట108.) "అష్టభాషాసుకవిగేయుఁడైన ధీరుని" (పుట137) అను పంక్తులను బట్టి అతడు తెలుగు పదములును రచించినట్లు తెల్లమగును. అవి కూడ అతని నాటకము లందు అంతర్లీనమగును.

**1. సరస్వతీకల్యాణనాటకము:–** ఇది శాహరాజా పేర రచించినది. "మొల్లపువ్వుల పొట్లములు విప్పినట్లు । చల్లఁగాఁ బన్నీరు చల్లిన తీరు । పరగు సరస్వతీపరిణయం బనెడు సరసనాటకము ... కావించినట్లు" చెప్పినది. ఇది పూర్వోక్తము.

ఇందు బ్రహ్మ భార్య సావిత్రి. అయినను సరస్వతీచతుర్ముఖుల వివాహము పరమేశ్వరసంకల్పము. నారదసంధానము. సరస్వతికి బ్రహ్మ గుఱించి, బ్రహ్మకు సరస్వతి గుఱించి చెప్పి, నారదుడు సరస్వతీచతుర్ముఖులను పరస్పరపరవశులను చేయును. భావజ్ఞుని ద్వారా సావిత్రి అనుమతి గైకొని, సరస్వతీచతుర్ముఖులకు సమస్త దేవతల సమక్షమున, శాహరాజు రాజధాని తంజావూరులోనే వివాహము జరిపించును.

బ్రహ్మ విరహమునందు శృంగారము శ్రుతి మించినది. పాత్రానుగుణము కాదు.

గురుశిష్యులైన నారద, విశారదుల సంవాదము, డామరకుని పక్షిశకునము, అన్నాజెట్టి తిప్పాజెట్టుల ముష్టియుద్ధము, మంగుభట్లు రంగుభట్ల పాండిత్యప్రకటనము హాస్యరసఘట్టములు. పాండిత్యప్రకటనమునందు అసభ్యవిషయము కలదు. ముష్టియుద్ధ ఘట్టము ముగిసినంతనే "క్రిందఁబడ్డవారికే బహుమానము" అని సూత్రధారి అనుట హాసజనకము.

సరస్వతి చెలికత్తె వర్ణనము రతికల్యాణ, శాంతాకల్యాణనాటకములందు కొలువు వేశ్య వర్ణనమయినది. బ్రహ్మ వర్ణనము సతిదానశూరనాటకమునందు బ్రహ్మవర్ణనము. ఇది పూర్వోక్తము. చంద్రముఖి అభినయపదము శాహరాజు మీది పదమగుట (పుట151) డామరకుడు సరస్వతికి పక్షిశకునము చెప్పుచు, "ఈ సభాపతియైన శ్రీశాహమహారాజు వారిక్కి సకలాయురారోగ్యబలంబులు గలుగుతాయి" అని శాహరాజునకు సైతము పక్షిశకునము చెప్పుట (పుట159), చంద్రముఖి సరస్వతి "శ్రీశాహరాజపురిని విలసిల్లు' ననుట (పుట152) బృహస్పతి "శ్రీశాహమహారా జేలు తంజాపురి వైఖరిఁగనుఁగొని వర్ణించు"కొనుట (పుట179) సరస్వతీచతుర్ముఖుల వివాహము "శాహరాజు రాజధాని' తంజావూరులోనే జరిపించుట (పుట174) శాహరాజు భవనమును వర్ణించుట (పుటలు 178,179.) శేషాచలపతి ప్రభుభక్తిపరాయణతకు ప్రముఖోదాహరణము.

**2. పార్వతీకల్యాణము:-** ఇది శాహరాజు పేర రచించినది. వాసుదేవకవికృతము కాదు; శేషాచలకవికృతమని పూర్వోక్తము. అవతారికలోని శ్లోకములు అభినవము. నాందీద్విపదఘట్టమునందు పూర్వకవిస్తుతి కలదు. వ్యాసవాల్మీక కాళిదాసుల, నన్నయభట్టు ప్రవక్తులు. విఘ్నేశ్వరాగమనద్విపద, దరువులు సరస్వతీకల్యాణములోనివి.

ఇందు పార్వతి తపశ్చర్య మొదలు పార్వతీపరమేశ్వరుల పరిణయము వఱకు ఇతివృత్తము కలదు. పార్వతిని పరీక్షించుటకు పరమేశ్వరుడు కపటవటురూపమున గాక, వృద్ధబ్రాహ్మణరూపమున వచ్చుట మార్పు. పార్వతీపరమేశ్వరుల విరహములు పురాణదంపతులకు అనుగుణములుగ లేవు. అరుంధతీసమేతముగ వచ్చిన సప్తర్షులు హిమవంతునితోనేగాక మేనకతోను సంబంధము గుఱించి సంప్రదించుట, పెండ్లి కూతురు చూపులు జరుపుట, నిశ్చయతాంబూలముల గుఱించి సంప్రదించుట, పుచ్చుకొనుట సహజముగ, సముచితముగ కలవు. నిశ్చయతాంబూలములకు ఒక

ఋషి పదికోట్ల టెంకాయలు, ఇరవైకోట్ల అరటిపండ్లు, ఇరవై వేల పెరికల వక్కలు, ముప్పైవేల పెరికల తమలపాకులు తెప్పించుమనుట సరసముగ లేదు. నిశ్చయతాంబూలసంకల్పము విరసముగ కలదు. పార్వతీపరమేశ్వరుల పరిణయమునకు బ్రహ్మవిష్ణుదేవేంద్రులు వచ్చునప్పటి పద్యపదద్విపదలు సరస్వతీకల్యాణములోనివి. సప్తర్షుల మంగళాష్టకశ్లోకమును సరస్వతీకల్యాణములోనిదే.

సూత్రధారి పార్వతిని వర్ణించిన పద్యము (పుట9) సప్తర్షులు పరమేశ్వరుని వర్ణించిన పద్యము (పుట27) ఉదాత్తరసాన్వితములు.

పూజారి పరిచారకుల సంభాషణ, కటికవాని సప్తర్షుల తోడి సంభాషణ హాస్యఘట్టములు. కాని అనుచితములు. హాస్యమంగళాష్టకపద్యము అసందర్భము. అసభ్యము. అశ్లీలము.

పార్వతీకల్యాణములోని పదములకు మాతృకలు కలవు. 'వందే ఈశ్వరవరదగ' (పుట7.) 'తాళైప్పణిందెం కృపై పారడి' (పుట10) 'మ్రొక్కెద నా సామి యీ' (పుట16) 'పాలజలధిలోపల' (పుట17) 'గోపాలా రామ దయాని' (పుట18) 'ఆశై కొండాలున్మిదిల్' (పుట24) 'రాయల మెచ్చదురా' (పుట25) మోహం కొండాలు ముందవ్ స్నేహం' (పుట26) 'రాకుట్టుచు పలుకు గల రవముల చిగు' (పుట27) 'వచ్చేది లేదవె వేవి విడిదికి' (పుట29) 'ఎఱుకలసావి వీ దేయూరు' (పుట31) 'అదివాళ ముతవెన్నె' (పుట33) 'కొలువై యున్నాఁడే' (పుట35.) 'యెయ్యకొండు చెలువమవ్వా' (పుట36) 'యెందెన్మిదిల్ అడిక్కడి.' (పుట36.)

ఇందు "కొలువైయున్నాఁడె" అను పదము దర్భా గిరిరాజు పదము. అది వాదజయమువందు కలదు. (పుటలు 108.109.)

3. శాహరాజవిజయము:- ఇది శాహరాజు గుఱించి రచించినది. ఇందు అవతారిక శాహరాజమయము. ఇష్టదేవతాస్తుతి మూడు పద్యములు. శాహరాజస్తుతి రెండు దరువులు, మూడు పద్యములు. అందు శేషాచలపతి నాట్యము (యక్షగానము) శాహరాజపభమ ధన్యమైనదని ధన్యవాదము కలదు. (పుట88.) కథా సూత్రమునకు పాత్రమైన శాహరాజు చారిత్రము సుదీర్ఘద్విపదఘట్టము. అతిశయోక్తి మయము. శాహరాజు యవనభూమి హరించెనట. వంగభూమి భరించెనట. ఆసేతు హిమాచలము కీర్తి వందెనట. అతడు పారివెడల సమస్తదేశాధిపతుల సుతలు సపర్యలు సేయుదురట!

కథావిషయము శాహరాజు మీది వలపు వ్యాపారము. శాహరాజు పారివెడల వారిలోకమునకు వాడీవేగము! అందు లీలావతి మోహము, విరహము, పక్షి రాయబారములు, శైత్యోపచారములు, విలాపములు, మన్మథుని వరములు, పురోహితుల ఆశీర్వాదములు, ఎఱుకత సోదె, విద్యావతి రాయబారము, శాహరాజు కులాంగన విజయ మాగధి అనుమతి, లీలావతికి ఇష్టసిద్ధి. ఇవి సవిస్తరములు.

ఎఱుకత పేరు దమయంతి. సింగి అని కూడ వ్యవహృతము. సింగితోపాటు సింగడు కలడు. ఎఱుకతయే కొరవంజి. కొరవంజి పేరు కల యక్షగానములందు కంటె, ఇందు కొరవంజిఘట్టము సుదీర్ఘము. ఎఱుకత వేషభూషలు, ఖండఖండాంతర పరిజ్ఞానము, ద్వీపద్వీపాంతరపరిజ్ఞానము, తమిళదేశపరిజ్ఞానము, బహుదేవతాప్రదత్త బహుమానస్వీకారము మొదలైనవి సవివరములు.

"త్వా మనిశం ప్రేమయుతం " అను అష్టపదికి "మాతృక సావిర" అని కలదు.

కథానాయకుడగుట వలన కలసివచ్చినను, శాహరాజు ప్రశంస అత్యధికము. అంతేకాదు. లీలావతి చెలికత్తెలు శైత్యోపచారములు సేయుచు, "శేషాచలగీతశాహేంద్రు పదము చదువరమ్మా" అనుట (పుట108) ఉభయతారకము. సరస్వతీకల్యాణములోని శాహరాజభవనవర్ణనము శాహరాజవిలాసనాటకమునందును కలదు. (పుటలు 131,132) తెలుగుపదములు మాత్రమేగాక, కన్నడపదములును (పుటలు140,141) శాహరాజ సంకీర్తనములే. మొత్తము మీద శాహరాజవిలాసనాటకము నివర్తి శేషాచలపతి ప్రభుదాస్య పరాకాష్ఠదశకు పరమనిదర్శనము.

శేషాచలపతి ముద్ర కల ఒక పదము:

"కోకిల కూర్పవే నన్నుఁ గోరెద నిన్ను నేకరాజకుమారునితో
శ్రీకరశాహధీరునితో కోకిల
పంచమరాగము రాగఫణితులఁ బాడి వేగ
అంచిత లియ్యత మించి యతని మెప్పించి
పంచబాణవిభుండే నేనా ప్రభునిచే వరమైనఁ
గాంచి కోకిలవాణి కలయఁగఁ గోరి వాణి కోకిల
అతనిఁ గన్నది మొదలు నతను సింగిణి రొదలు
వెతలు సేయఁగ చాల విమటకేఁ దాళ
వతిమోహాంబుధిలోన వయ్యయో యీదగలేనె
రతిరాజసముఁడైన రాజేంద్రునితో నెటులైన కోకిల
నెవరు వాయెడ పూని నను బ్రోవు ప్రతి లేని
తవరు పుణ్యము గలదు తడవింక వలదు
ఘనశేషాచలసూరి వినుతసద్గుణహారి
అసమభోసలధీరుఁడైన శాహేంద్రధీరు" కోకిల.పుటలు102,103

దర్భాగిరిరాజు:- ఇతని కృతులు 1. శాహరాజపదములు. 2. శరభోజీ పదములు. 3. శాహేంద్రచరిత్రయక్షగానము. 4. రాజమోహనకొరవంజి. 5. రాజకన్యా పరిణయము. 6. వాదజయనాటకము. 7. సర్వాంగసుందరీవిలాసనాటకము. 8. లీలావతీ కల్యాణము.

ఇతడు శహాజీ ఆస్థానకవి మాత్రమేగాక; తదనుజుడు, తదనంతరపాలకుడును అయిన శరభోజీ ఆస్థానకవి కూడ. శహాజీరాజ్యకాలము 1684-1712. శరభోజీరాజ్య

కాలము 1712-1728. కాఁబట్టి గిరిరాజు కాలము 1684, 1728 మధ్యకాలమగును.

**1. శాహరాజపదములు:-** తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమునందు "శాహరాజపదములు" అను పేర రెండు గ్రంథములు కలవు[64]. ఒక గ్రంథమునందు 132 పదములు, మఱొక గ్రంథమునందు 28 పదములు కలవు. మొత్తము 160. అందు"గిరిరాజవినుతుఁడు శాహభూకాంతుఁడు", "గిరిరాజనుత", "గిరిరాజనుతశాహధరణీశ", "గిరిరాజసన్నుతశాహరాజేంద్రా" అను గిరిరాజు కవిముద్రలు కలవు. అవి శాహరాజు మీదిపదములు. కనుక శాహరాజపదములు. శాహరాజ ప్రణీతములుగ కల వల్లీకల్యాణ, రతికల్యాణ, శచీపురందరకల్యాణనాటకములందు "గిరిరాజపదములను సరసుఁడైన యట్టి శాహరాజేంద్రునిఁ బరిపరివిధములఁ బాడుచును అని కలదు.(పుటలు44,70,180.)కనుక శాహరాజపదములు శృంగారపదము లగును.

గిరిరాజు రాజమోహనకొరవంజియందు "గిరిరాజనుతుని" (27) "గిరిరాజ సన్నుతుఁడు శాహేంద్రుఁడు" (28) "గిరిరాజకవినుతశాహేంద్రుఁడు" (59); రాజకన్యా పరిణయమునందు "గిరిరాజనుతశాహవరుఁడు" (67) "గిరిరాజనుతశాహవర" (73) "గిరి రాజ నుతశాహేంద్ర" (74) గిరిరాజపాల శాహరాజభూమిపాల" (76) "గిరిరాజ నుతశాహధీర" (77) "గిరిరాజసన్నుతశాహేంద్ర" (78) "గిరిరాజనుతశాహవరుని" (78) "గిరిరాజపాలునికి .... శాహేంద్రునికి" (79); వాదవిజయనాటకమునందు "గిరిరాజనుత శాహధరణీశుఁడు" (88) గిరి రాజనుతుఁడు శాహభూవిభుఁడు" (90) గిరిరాజనుతుఁడు' (91) "గిరిరాజసన్నుతశాహేంద్రుడు" (97) గిరి రాజనుతుఁడైన శాహభూవిభుఁడు" (97) "గిరిరాజనుతుఁడగు శాహ భూవరుఁడు" (99) "గిరిరాజనుతశాహధీర" (101) "గిరిరాజనుత" (102) "గిరిరాజసన్ను తుఁడు వరశాహరాజేంద్రుఁడు" (106)" గిరిరాజసన్నుతుఁడు ఏకరాజసుతుఁడు శ్రీశాహరాజదేవేంద్రుఁడే" (109) "గిరిరాజనుత వినుము శాహేంద్ర (పుట111) "గిరిరాజవినుత వినుము శాహేంద్ర (పుట111) "గిరిరాజకవిపాల .... శాహభూపాల" (111) "గిరిరాజవినుత ... శాహభూవర" (112) "వరకవివరగిరిరాజసన్నుత .... శాహజీ రాజ" (113) గిరిరాజ కవినుతశాహేంద్ర" (114) "గిరిరాజనుతశాహవరుని" (115) అను గిరిరాజకవిముద్రలు కల పదములు కలవు. ఇవి 27 పదములు. అన్నియును శృంగారపదములే.

సరస్వతీమహలు గ్రంథాలయములోని శాహరాజపదములు అముద్రితములు. అందొక పదము[65].

"పదరి వచ్చునంట రాకుమి చక్కని సామి
పదరి వచ్చునంటరాకు పడుచుదావర మ్రొక్కేర నీకు
ముదమున నా మోవి నొక్కకు సదయ శాహేంద్ర
యేల యీ దుడుకు
పైయెద జారదీయ మందుర

బాగుగా కౌఁగిలిమ్మని యందురా
ఈ యెడ మావారు వింటే యేమందురా
యెవరైన నను బొట్టు కట్టుకొందురా
వేడుకతో విడెమెచ్చేవదేరా
వీథిలో నన్నడ్డగించేది మేరా
జాడగా సర(స)ము లాడకపోరా
స్వామిగా యిపుడు నా మనవి చేకోరా
నేను కావలె నంటె నింటికి రారా
నీవె మావారిని వేడుకోరా
పూని మావారు నన్ను ధారబోసితే
గిరిరాజనుత యేలుకోరా. "

ఇందు పారదారికశృంగారమునకు శృంగములు వచ్చినవి. వీథిని పడినది. దారను ధారఁబోయు తారస్థితి నందినది.

**2. శరభోజీపదములు:** ఇవి అనుపలబ్ధములు. గిరిరాజు లీలావతీకల్యాణమునందు శరభోజీపదముల జాడ కలదు. "గిరిరాజవినుతశరభోజీంద్ర" (194) "గిరిరాజనుతలీల శరభోజిభూపాల"(195) అను గిరిరాజకవి ముద్రలుకలపదములు మూడు కలవు. అవి గిరిరాజు శరభోజీ మీద కూడ పదములు రచించెననుటకు నిదర్శనములు. అంతేకాదు. అవి రెండును శృంగారపదములే. పారదారికశృంగారప్రవణములు కావుగాని, అన్యపదములు పారదారిక శృంగార ప్రవణములు కావచ్చును.

**3. శాహేంద్రచరిత్రము:-** ఇందు ప్రథమత: యక్షగానపదబంధము ప్రయుక్తము.

"కండచక్కెర లీలఁ గల్పించి రుచుల
గండుమీఱిన యక్షగానంబు మిగుల
గరిమను గిరిరాజకవి రచియించె "

వని గ్రంథాంతమునందు కలదు. (పుట22) ఇది కథాప్రధానము. ఇతర విధానము లేదు. అవతారిక అయిన వెంటనే కథాప్రారంభము కలదు. ఒకనాడు శాహరాజు పారివెడలును. ఒకానొక పాపికూతురు మోహించును. విరహావస్థనందును. చెలికత్తె కుందరదన వేశ్యమాతకు చెప్పును. వేశ్యమాత వేశ్యావృత్తి ఘనత బోధించును. పాపికూతురు వినదు. కుందరదనను శాహరాజు కడకు పంపించును. అతడు సమ్మతించును. పల్లకీ పంపించును. పాపికూతురు పల్లకీమీద శాహేంద్రనగరికి పోవును. శాహరాజు మదనసామ్రాజ్య మేలించును. ఇది కథ. వేశ్యావృత్తి వేదిక నెక్కినది. కావ్యప్రయోజనము కారాగారప్రవేశము చేసినది.

**4. రాజమోహనకొరవంజి:-** ఇది శరభోజీకి అంకితము. యక్షగానము.

ఇందు అవతారిక లేదు. కథాసంగ్రహమునుండి కలదు. అందు గ్రంథనామము "రాజమోహన కొరవంజి" అని కలదు. (పుట25.) కొరవంజిఘట్టము కల యక్షగానము కొరవంజి అగును. ఇందు కథ కంటె కొరవంజిఘట్టము సుదీర్ఘము.

శాహరాజు సారి వెడలును. ఒక రాజకన్యక మోహించును. శృంగారవనమును చేరును మన్మథచంద్రమలయమారుతోపాలంభములు సేయును. కోకిలను, చిలుకను, హంసను, తుమ్మెదను రాయబారమునకు పంపును. ఇంతలో ఎఱుకత వచ్చును. "ఇదిగో ఇప్పుడు శహరాజదేవేంద్రుడు వచ్చి నిన్నుఁ బెండ్లాడుచున్నాఁడు" అని సోదె చెప్పును. పక్షి రాయబారములు ఫలించి శాహరాజు వచ్చును. రాజకన్యక శాహరాజును పెండ్లాడుమని కోరును. రాజకన్యక, శాహరాజు కూడియుండ చెలికత్తెలు శోభనమంగళములు పాడుదురు. ఇది కథ.

ఇందు ఎఱుకతయే కొరవంజి. ఎఱుకత వేషభూషలు; దేశ, ద్వీప, పర్వత, వృక్ష, జంతు, రత్న, క్షేత్ర, నదీ, దేవతా స్వజాతి పరిజ్ఞానములు సవివరములు. ఎఱుకత జాతి చతుర్విధమట. దేశ యెఱుకతజాతి. అడవి యెఱుకతజాతి. కొండ యెఱుకత జాతి. జేజే యెఱుకతజాతి. చివఱి ఎఱుకతజాతి చోళదేశమునందే కలదట. వారి వగలు చూడవచ్చిన ఈ ఎఱుకత కొండ యెఱుకత. ఇష్టదేవత కొల్లాలమ్మ. ఎఱుకత పేరు సింగి. భర్త సింగడు. సింగిసింగుల సింగారమును ఇందు కలదు. మొత్తము మీద కొరవంజిఘట్టము మోదావహము.

రాజకన్యక "కొక్కోకమెఱిఁగివదావ" నని కొంకు లేకుండ చెప్పుట క్రొత్త ఘనత.

**5. రాజకన్యాపరిణయము:–** ఇది యక్షగానము. ఇందును అవతారిక లేదు. కథాసంగ్రహముమండియే కలదు. శాహరాజు సారి వెడలుట, రాజకన్యక మోహించుట, విరహావస్థనందుట, శృంగారవనము చేరుట, చెలికత్తెకు చెప్పుట రాజమోహనకొరవంజికి సదృశము. చెలికత్తె రాజకన్యక తలిదండ్రులకు చెప్పుట, వారు శృంగారవనమునకు వచ్చుట, కన్నకూతురిని మెచ్చుకొనుట, చెలికత్తెను సంబంధము నిశ్చయించుటకు పంపుట, చెలికత్తె శాహరాజునకు చెప్పుట, శాహరాజు పెండ్లికి సమ్మతించుట, రాజకన్యక ఆమె తల్లిదండ్రులు పెండ్లికి సాగివచ్చుట, శాహరాజును పెండ్లాడుమని కోరుట భిన్నము. అందలి రాజకన్యక "కొక్కోక మెఱిఁగినదావ"నని కొంకు లేకుండ చెప్పిన, ఇందలి రాజకన్యక "కొక్కోక మెఱిఁగిన జాణ"నని జంకు లేకుండ చెప్పుట (పుట78) అంతకంటె ఘనత. అందు లేని పరిణయవృత్తాంత మిందు కలదుగావున, రాజకన్యకాపరిణయమని గ్రంథనామము. ఇందు గిరిరాజు శాహరాజపదములు ఎనిమిది కలవు. అవి గుదిగ్రుచ్చుటకే ఇది రచితము కావచ్చును.

రాజకన్యక శాహరాజును మోహించితినని చెప్పిన, చెలికత్తెచేత,

"నిన్నే కన్యకామణీ, ఇది దోసమని మనస్సున నెంచ పనిలేదు. అది యెట్లాగంటే చుక్కనిధారిలో చుక్కనివాఁడైనటువంటి, పున్నమచందురు

మోముగలటువంటి మొక్కఁదగినటువంటి ముద్దుశాహేంద్రుని
జూచినదే ధన్యురాలౌను. అట్టి పట్ల నీవు చూచి మోహించినావు
గాఁబట్టి యే కన్యలు నీకు సరి సాటి గాదు"

అని చెప్పించుట గిరిరాజు ప్రభుభక్తి పరాయణతకు ప్రముఖోదాహరణము.

**6. వాదజయనాటకము:-** ఇది, యక్షగానము. శహాజీకి అంకితము. ఇట్లు ముమ్మాఱు కలదు. (పుటలు83,84,85.) ఇందు బసవని నోములు నోచిన, నాట్యము సేయు భామలు కోలాట లాడుదురు. ఇద్దఱు నాట్యకత్తెల మధ్య వాదము వచ్చును. మొదటి నాట్యకత్తె గర్వము కలది. రెండవ నాట్యకత్తె" మన మిద్దరాడుదము. బిరుదు వక్కాణించి పెంపు చూపుదము. రావే" అనిన, మొదటి నాట్యకత్తె "నా సరివానవా నీవు నన్నాడరమ్మనెదవు" అని గేలిసేయును. రెండవ నాట్యకత్తె "సరిగాక తగ్గ" నుటకు కారణమడుగును. మొదటి నాట్యకత్తె "నా వలెను విద్యలచేత భూమండలములో నే దొరను మెప్పించి గూడితివి? ఎక్కడ పేరు పొందితివి?" అని ప్రశ్నించును. రెండవ నాట్యకత్తె "విద్యలచేత శాహరాజు మనసు మెప్పించి, అతనితోగూడి నీ సరిదాననగుదు"నని సమాధానమిచ్చును. మొదటి నాట్యకత్తె "శాహరాజుమనసు మెప్పించి మరుకేళిఁ గూడిన సరి దానవని సన్నుతించెదను" అని సమ్మతించును. రెండవ నాట్యకత్తె "శాహరాజును మెప్పించి కూడకయున్న నీకు తొత్తునయ్యెదను." అని శపథము చేయును.

శపథము చేసిన నాట్యకత్తె సన్నద్ధురాలగుసరికి, ఆమె అక్క అక్షరాలా దండకము చదువును. శాహరాజును మెప్పించుట అసంభవమని, పొందు అసాధ్యమని, శపథము వలదని వారించును. అయినను రెండవ నాట్యకత్తె వెనుకడుగు ప్రసక్తి లేదని, శాహరాజును మోహించితినని, శాహరాజును మెప్పించి ఆతని గూడని ఆడపుట్టుక ఎందుకని ముందడుగు వేయును. ముందు అక్క మాట విని చెలికత్తెను రాయబారము పంపును. నాయకురాలి వృత్తాంతము నాయకునికి చెప్పి, చెలికత్తె రెండవ నాట్యకత్తెకు సంతోషవార్త చెప్పక ఆట పట్టించును. రెండవ నాట్యకత్తె చెలికత్తె దోషారోపణ చేయును. చెలికత్తె కోపాతిశయమున సంతోషవార్తను విషాదవార్తగ చెప్పును. రెండవ నాట్యకత్తె స్వయముగ శాహరాజు నొద్దకు బయలుదేరును. అక్క, చెలికత్తె బుద్ధి చెప్పుదురు. అయినను రెండవ నాట్యకత్తె శాహరాజు కొలువు చేరి, తన నాట్యవిద్యలు ప్రదర్శించును. శాహరాజును మెప్పించును. బహుమానము లందుకొనును. మొదటి నాట్యకత్తె "జాణవు నెఱజాణవు పరిసాటి" అని సన్నుతించును. ఇద్దరు నాట్యకత్తెలు శాహరాజును గూడియుందురు. ఇది వాదవిజయనాటకవిషయము.

ఇది కొత్తపుంత. అయినను పాతసంత. లక్ష్యము శాహరాజశ్లాఘనమే. నాట్యకత్తెల వాదము సహజము. పందెము బహుమతులందుట, బిరుదములందుట సముచితము. శాహరాజు మరుకేళిఁగూడుట వేశ్యోచితము కావచ్చునేమోగాని కావ్యోచితము కాదు.

ఇందు గిరిరాజు ముద్రలు కల శాహరాజు పదములు పదియారు కలవు.

రాజకన్యకాపరిణయములోని పదములకు రెట్టింపు. అవి గుది గ్రుచ్చుటకే వాదజయ నాటకరచనము కావచ్చును. ఆ యా పదముల అభినయములు, గానములు రంగస్థలములందు రాణించునవి. సహృదయాంతరంగస్థలములందు సంకోచము కలిగించునవి. సమాజమునకు శ్రేయస్కరములు కావు. అంతేకాదు. రెండవ నాట్యకత్తె అక్క శాహరాజు "లోకస్తుతాకారరేఖాజితానేకకందర్పసౌందర్యుడు, సత్యభాషా హరిశ్చంద్రుడు, నిర్మలజ్ఞానవిద్యావివేకక్షమానిష్ఠుడు, ధార్మికశ్రేష్ఠుడు, వానితో పొందు సాధారణస్త్రీలకు సాధ్యము కాదు" అని దండకము చదువుట, రెండవ నాట్యకత్తె శాహరాజు "అన్ని విద్యల నీడు జోడు లేని వాడు, ఆతని గూడని ఆడపుట్టుక ఏల?" అనుట మొదలైనవి దర్భా గిరిరాజు ప్రభుదాస్యపరాకాష్ఠదశకు పరమనిదర్శనము.

7. సర్వాంగసుందరీవిలాసనాటకము:- ఇది యక్షగానము. ఇందు ఆద్యంతముల విషయము పూర్వోక్తము., విఘ్నేశ్వరాగమనద్విపద లేదుగాని, "విఘ్నేశ్వరుని ద్విపద చదివేది" అను ప్రయోగసూచన కలదు. విఘ్నేశ్వరపూజ కలదు.

శివరాత్రి నాడు పంచనదీశ్వరుని రెండవ జాము పూజకు శాహరాజు కొలువుండును. అర్చకులు, మణియము (కరణము), గుడివేశ్యలు, కణకపిళ్లె, బ్రాహ్మణులు, ముత్తైదువలు, పంవ్యాములు, పాతాని దంపతులు, ఢామరకుడు (బుడుబుడుక్కులవాడు) కోమట్లు, గొల్లలు, గొల్లభామలు; మగధ, మాళవ, లాట, సింధు రాజులు వచ్చిన అనంతరము, కుంతలేశ్వరుని కూతురు సర్వాంగసుందరి సఖీసమేతముగ పంచనదీశ్వరుని సన్నిధానమునకు వచ్చును. నిండుకొలువై యున్న శాహరాజునకు సలాము చేయును. ఆతని రూపరేఖావిలాసములు చూచి మోహించును. విరహావస్థనందును. చెలికత్తె చెప్పిన ప్రకారము, శాహరాజు పతి అగుటకు పంచనదీశ్వరపూజ చేయును. తన వృత్తాంతము తల్లిదండ్రులకు చెలికత్తెచేత చెప్పించును. కుంతలేశ్వరుడు సంతసించి, భార్య శకుంతలతో సర్వాంగసుందరి సన్నిధికి వచ్చును. శాహరాజును మోహించినందుకు కన్నకూతురిని ప్రశంసించును. శాహరాజును సందర్శించి కూతురు సంగతి చెప్పును. సర్వాంగసుందరి కూడ శాహరాజును పెండ్లాడుమని కోరును. చెలులు మంగళము పాడుదురు.

ఇది పాడిన పాట. అంతేకాదు. శివరాత్రి నాడు శివసన్నిధానమునందు శివమెత్తి నది శృంగారము. విరహావస్థ సాహిత్యపతనావస్థ.

గుడివేశ్యలు వచ్చు విధానమునకు, సర్వాంగసుందరి వచ్చు విధానమునకు పునర్దరువులు కలవు. రెండేసి దరువులు. కుంతలేశ్వరుని శాహరాజుస్తోత్రము చూర్ణిక. బ్రాహ్మణుల, ముత్తైదువల, కోమట్ల గొల్లల మాటలు హాస్యార్థము. పేలవము. కరణము, కటికవాడు, వేశ్యలు, వేశ్యమాతలు, కణకపిళ్లె తమిళము మాటాడుదురు.

ఇందు మూడు పదములకు మాతృకలు కలవు. 'చెంగట భృంగి యాడేని" (పుట145.) "తుమ తుమాన మెబపె" (పుట145.) "మంగళ ఉపచారా" (పుట147.)

వాదజయనాటకములోని రాజకన్యక పాడిన "నన్నే పెండ్లాడుమీ" అను పదము (పుటలు113,114) సర్వాంగసుందరీవిలాసనాటకమునందు సర్వాంగసుందరి కూడ పాడును. (పుటలు 149,150.) అందు "కొక్కోక మెఱిఁగిన దాన" అను చరణము కలదు. అంతేకాదు. అది దర్భా గిరిరాజా శాహరాజపదము. "గిరిరాజకవినుతశాహేంద్ర' అను గిరిరాజకవిముద్ర కలదు.

8. లీలావతీకల్యాణము:- ఇది యక్షగానము. ఇందు అవతారిక కలదు. కర్తృవిషయము లేదు. కాని గిరిరాజకవిముద్రలు కల శరభోజీపదములు మూడు కలవు. ఇది పూర్వోక్తము. కావున లీలావతీకల్యాణము దర్భా గిరిరాజకృతము కావలయును.

మహారాష్ట్రదేశాధిపతి కీర్తిచంద్రుడు కూతురు లీలావతికి తగిన వరుని అరయుమని ఒక యోగినిని నియోగించును. ఆమె అంగవంగకళింగాదినానాదేశములు అరసి, కడకు తంజావూరు వచ్చి, సారి వెడలు శరభోజీని చూచి, లీలావతికి తగిన వరుడని ముందు లీలావతికే వివరించును. వినుకలి ప్రేమను లీలావతి విరహము చెందును. యోగిని కీర్తిచంద్రునికి చెప్పి వివాహము జరిపించును. ఇది కథ.

ఇందు యోగిని పాత్ర ఇతరయక్షగానములలోని కొరవంజి పాత్ర వంటిది. కొరవంజి సోదె చెప్పును. యోగిని వార్త చెప్పును. యోగిని కావించిన శరభోజీవర్ణనము అతిశయోక్తిమయము కాదు. అందు శరభోజిని "కవు లొకవంకను గల్పన లొనరిచి కవితలు వక్కాణింప" అని కలదు. (పుట173). వాస్తవమే. "కవులకు ముంగిటి కల్ప భూజము .... ఇచ్చెవా బహుమాన మేమఁగు పాడి." (పుట176) అని కూడ కలదు. కించిదతిశయోక్తికిలికించితమైనను, అసమంచితము కాదు. అయినను శరభోజీ పదములు, లీలావతీకల్యాణము వినా ఆస్థానకవులు రచించిన కృతులు లేవు.

లీలావతీకల్యాణము నిర్వచనయక్షగానము.

చెలికత్తెలు లీలావతికి ముందే చెప్పిన అప్పగింతలు ముచ్చట గొలుపును.

"పడుచుదనము లేక విడువవు యమ్మ
పుడమిజనులు మెచ్చ నడుచుకోవమ్మ
ధవుని దైవము గాఁగఁ దలఁచవే యమ్మ
సవతు లేమనుకొన్నఁ జెవి నిడకుమమ్మ
xxx xxx xxxx
చన్న యత్తింటికి ఘనమైన కీర్తి
కన్నయింటికి నన్నె గలిగింపుమమ్మ
బుద్ధిమంతురాలై పొగడొందు నీకు
బుద్ధి తెల్పేపాటి పొలఁతు లెవరమ్మ". పుట 191.

ఇవి ప్రౌఢవిన మాటలైనను ఇట్టి మాటలు యక్షగానములందు అరుదు.

బాలకవి సుబ్బన్న: ఇతని కృతులు 1. పంచకన్యాపరిణయనాటకము. 2. లీలావతీశాహరాజీయనాటకము. 3. శాహమహారాజకల్యాణనాటకము. యక్షగానములు.

**1. పంచకన్యాపరిణయము:-** ఇది శహాజీకి అంకితము. ఇందు అవతారికను కర్తృనిర్దేశము పూర్తిగా లేదు. శాహరాజు "పంచకన్యల పెండ్లి బాలకవీంద్రాంధ్రభాష నీవు .... రచియింపు" మన్నట్లు కలదు (పుట88) తెలుగు సంబుద్ధి మీద సంస్కృతసంధి! నాటకాంతవచనమునందు కర్తృనిర్దేశముండు స్థలము ఖిలమైనది. (పుట133.) బాలకవిబిరుదాంకితుడు సుబ్బన్న. లీలావతీశాహరాజీయమునందు "బాలకవి సుబ్బన్న"అని పూర్తిగా కలదు. (పుట42) కాఁబట్టి బాలకవీంద్రుడు బాలకవి సుబ్బన్న కాఁగలడు.

ఇందు కృష్ణుడు పంచకన్యలను పరిణయమాడుట ఇతివృత్తము. కలకంఠి, కనకాంగి, ఇందువదన, మనోరమ, చిత్రలేఖ పంచకన్యలు. పురాణప్రసిద్ధలు కారు. నవీనబద్ధలు. పంచకన్యల పరిణయమునకు ప్రధానసాధనము వస్త్రాపహరణఘట్టము. ఇది జలక్రీడల నాటకమునకు ఇంచుక ప్రపంచీకరణము. అందు పప్పు తిమ్మక్క పాత్ర కలదు. ఇందు మరాళిక పాత్ర కలదు. తిమ్మక్కకు తలతిక్క కలదు. మరాళికకు మర్యాద కలదు.

బాలకవి సుబ్బన్న పూర్వకవిస్తుతియందు వ్యాసవాల్మీకికాళిదాసాదిసంస్కృతకవుల ప్రసక్తి మాత్రమే కలదు. ఆంధ్రకవి ప్రసక్తి లేదు. అంత మాత్రమున బాలకవి సుబ్బన్న నన్నయకు పూర్వుడు కాడు. అర్వాచీనుడే. శహాజీ ఆస్థానకవి. అతని చోళమండల వర్ణనమున

"గృహము గృహమున దినమొక్క కృతియొనర్పఁ
బాలు లక్షణకవులుమ ... ... ..." పుట96

కలరని కలదు. ఇంటింటి సుకవులకు ఇది తొలిమాదల. పంచకన్యలును "తెనుఁగు సంస్కృతమహారాష్ట్రకన్నడద్రావిడకబ్బంబులందు .... కీర్తి గాంచిన వారట! (పుటలు115,116) కవులకు, కవయిత్రులకు తంజావూరు కాణాచి.

పంచకన్యాపరిణయమునందు సూత్రధారికి మాఱుగ ప్రసంగి, కటికవానికి బదులుగ కేతీనాయుడు అను పాత్రలు కలవు. అంతేకాదు. ప్రధానకథయందు బాలపాత్ర కలదు. బాలపాత్ర అయినను కీలకపాత్ర. అంతకంటె కీలకపాత్ర మరాళిక. కృష్ణుడు పంచకన్యల వస్త్రము లపహరించుట మరాళిక సమ్మతిని. పంచకన్యలు కృష్ణుని పరిణయమాడుటకు ఇష్టపడుట మరాళిక హితోపదేశమున. పరిణయానంతరము కనకాంగి కలహమాడుట కొసమెఱుపు.

**2. లీలావతీశాహరాజీయము:-** ఇది శహాజీకి అంకితమగును.తుది వచనము "-బాలకవిసుబ్బన్న మేలిమి మీఱ రచియించిన లీలావతీశాహరాజీయంబను

నాటకంబునకధీశ్వరుని" అని త్రుటితమైనది. అధీశ్వరుడు శహాజీయే.

ఇందు శాహరాజును కొలువ వచ్చిన, కాశ్మీరదేశాధిపతి రాజకంఠీరవుని కూతురు లీలావతి, ముందే వెన్నెలలో విహరింపవచ్చి, శాహరాజును చూచి మోహించుట, శాహరాజు రహఃకేళి సల్పినట్లు కల గాంచుట, విరహావస్థనందుట, చెలికత్తె శుకవాణిని రాయబారము పంపుట, పార్వతి తన భక్తురాలి మనోరథము నెఱవేర్చుటకు ఎఱుకతగా వచ్చి, సోదె చెప్పుట, శుకవాణి రాయబారము ఫలించుట, సంగతి తెలిసి కాశ్మీరదేశాధిపతి కన్నకూతురిని ప్రశంసించుట, శాహరాజును సందర్శించుట, లీలావతిని పెండ్లాడుమని కోరుట, శాహరాజు సమ్మతించుట ఇతివృత్తము.

ఇది పాడిన పాటయే. ఇందు లీలావతియే శాహరాజును పెండ్లాడుమని కోరకపోవుట మేలిమియే. రాజకంఠీరవుని శాహరాజప్రశంసను, "మహినిఁ గల సకలకవులు" శాహరాజును "అహరహము పొగడుదు"రనుట, శాహరాజు పతంజలి వలె పండితులు మెచ్చ గహనములైన బహుగ్రంథములు రచించుననుట బాలకవి సుబ్బన్న ప్రభుభక్తి పరాయణతకు ప్రముఖోదాహరణము.

3. **శాహమహారాజకల్యాణము:-** ఇది కృతికర్తృనిర్దేశము, కృతిభర్తృనిర్దేశము కల నాటకాంతభాగము లభించని ప్రతి. కాని పంచకన్యాపరిణయములోని తుది సీసపద్యము (ట133) ఇందు తుది సీసపద్యము. (పుట84.) ఆ పద్యమిది:

" ఎంతకాలము చంద్రుఁ డీశుని మౌళిపై
 కాంతిమంతుండయి కదలకుండు,
ఎంతకాలము దివ్యదంతావళంబులు
 దిక్కుల యందులఁ దీయకుండు,
ఎంతకాలము [రాక్షసేంద్రుండు లంకలోఁ
 బట్టాభిషి]క్తుఁడై పరఁగుచుండు,
వెంతకాలము రమాకాంతుఁ డవంతునిఁ
 దల్పంబు చేముక దవరుచుండు,
వంతకాలము నీవు నీ యుమజతమజ
బంధుమిత్రులు సుఖమునై వఱలవలయు
ధరణిలోపల నాచంద్రతారకముగ
సకలగుణసాంద్ర, శాహరాజక్షితీంద్ర!

ఇందు కుండలీకృతభాగము పంచకన్యాపరిణయమునందు ఖిలమైనది. "అంత కాలము"తర్వాత ఎత్తుగీతము, తదనంతరనాటకాంతవచనము శాహమహారాజ కల్యాణమునందు లేవు. ఉన్నంతవఱకు సమానము. కావున శాహమహారాజకల్యాణము బాలకవి సుబ్బన్నకృతము కావలయును. అంతేకాదు. వయి సీసపద్యములోని పంబుద్ధినిబట్టి పంచకన్యాపరిణయము వలె శాహమహారాజకల్యాణము శహాజీకి

అంకితము కావలయును.

ఇందు శాహరాజు కొలువు సేయుట, గాయకులు పదములు పాడుట, నగరి నాటకశాల నర్తకీమణులు పదకేళిక అభినయము పట్టుట, శాహరాజు నగరయాత్ర సేయుట, రూపావతి మోహించుట, విరహావస్థనందుట, నారదుడు ఎఱుకతగా వచ్చి సోది చెప్పుట, ప్రాణసఖి కలకంఠి రాయబారము సేయుట, శాహరాజు పెండ్లికి సిద్ధపడుట, రూపావతిమందిరమునకు వచ్చి, వివాహమాడుట ఇతివృత్తము.

ఇది కూడ పాడిన పాటయే. ఇందు రూపావతి శాహరాజు మందిరమునకు గాక, శాహరాజు రూపావతి మందిరమునకు వచ్చుట విశేషము. రఘునాథనాయ కాభ్యుదయసరణి.

తంజావూరులోని కవులు "వార్తాచమత్కారవైభవంబునను" కీర్తిగాంచిరని కలదు. (పుట58.) శాహరాజు సాహిత్యభోజుడు, సాహసాంకుడు, సత్యభాషాహరిశ్చంద్రుడు, సత్క వీంద్రపోషకుడు, పుణ్యశీలుడు, పురుషోత్తముడు అనియేగాక, "కలియుగకర్ణావతా రుడు'', "కలియుగకృష్ణుడు" అని కూడ కలదు. (పుటలు59,60.) అంతేకాదు. "మరాట కర్ణాటకబోటు లతని భేటికై కోటానుకోటులు వాకిట గాటంపు మమతతోఁ గాచి యున్నా"రని కలదు. (పుట59.) ఇదియెల్ల బాలకవి సుబ్బన్న ప్రభుదాస్యపరాకాష్ఠదశకు పరమనిదర్శనము.

సోమన్న: ఇతని కృతులు శాహరాజపదములు. ఇంతవఱకు చరిత్రకు ఎక్కని కవి ఇతడు. సరస్వతీమహలు గ్రంథాలయమువందు ఇతని పదములు 17 కలవు[66]. ఇందు "సోమసుకవి .... శాహభూపతి", "సోమకవివరమత .... శాహభూవర" అను సోమకవిముద్రలు కలవు. ఇవి శాహరాజు మీది పదములు. శృంగారపదములు. ఒక ఉదాహరణము:

" సరసపద్గుణసాంద్ర శాహమహారాజేంద్రా
వినయసంతానవిజయధురీణ
మనవి వింటైన వినవేమని తెలుపుదాన
ఘనమోహమున తాళగల దాన గాను
వెనరున జేరి మన్నించు వేడుకను.
మదనావతారా నా మమతలు దీర
ముదము దైవార నీదు కెమ్మోవి విందర
పదర యింటికి దాని పదరులకేమి
నిదురకంటికి రాదుర నా సామి
విరులశయ్యను వన్నెవేళ
సరసరతులను ధర వేడ్కతోను
సోమకవివరమత నమ్ము
విరుల సరుల సరిగురుల

తురిమి యెంతో హాయిగా
శాహభూవర యేతౌర. " పుటలు86-87.

అజ్ఞాతకవి:- ఇతని కృతులు త్యాగేశపదములు. ఇంతవఱకు చరిత్రకు దక్కని కవి ఇతడు. సరస్వతీమహలు గ్రంథాలయమునందు త్యాగేశపదములు అయిదు గ్రంథములు కలవు[67]. ఒక గ్రంథమునందు 208 పదములు కలవు. అవి బహువిధములు. భక్తిపదములు 50. భావపదములు 5. వైరాగ్యపదములు 9. శృంగారపదములు 103. ఆరజం(హాస్య)పదములు 14. నీతిపదములు 24. మంగళములు 3. మొత్తము 208. రెండవగ్రంథమునందు పదసంఖ్య లేదు. అన్ని పదములు త్యాగేశుని మీద రచించినవి. భక్తిపదము లగును. ఇందు మొదటి రెండు పదములందు శాహరాజా పేరు కలదు. అది కారణముగ శాహరాజా రచించిన పదములుగ భ్రమపడుట జరిగినది[68]. మొదటి పదమునందు "వరశాహనృపకామ" అని కలదు. అది కవిముద్రయే కావలసిన ఆవశ్యకము లేదు. శాహరాజా త్యాగేశభక్తుడు. కాఁబట్టి త్యాగేశునికి విశేషణము కావచ్చును. సుమారు 300 త్యాగేశపదముల కర్త అజ్ఞాతకవి. భావిపరిశోధనమున సుజ్ఞాతకవి కావచ్చును. త్యాగేశపదములకు ఒక ఉదాహరణము.

"వీథిలో వచ్చీని వసంతత్యాగుఁడు
వీథిలో వచ్చెమ వేడుక జూతాము రారే.
మోదము మీరను ముద్దు తేరుపై నెక్కి
కోరిన జనులకు కోర్కె లీడేర్చుచు
వారిజానన వినుతవైభవత్యాగేశుఁడు.
రత్నసింహాసనముపై రంగుగా నెక్కి నేఁడు
యత్నము లేకనె యెంతో ఆనందముగా నాడుచు.
సకలదేవతలు సన్నుతి సేయఁగా
అకలంకజనములకు అభయము లిచ్చుచు
అకళంకనిజరూపుఁ డంబాస్కంధసహితుఁడు
మకరాంకబిరుదశాహామహీరాజకులదైవము."

ఇది త్యాగేశుని రథోత్సవమునకు సంబంధించిన పదము.

కవిగిరి ఉరపు వేంకటగిరి: ఇతని కృతులు 1. రుక్మాంగదచరిత్రము 2. అభినయదర్పణము. 3. ఘటికాచలమాహాత్మ్యములోని అవతారికాశ్వాసాద్యంత పద్యములు. మూడవది పూర్వోక్తము[69]. రెండవది నందికేశ్వరకృతమైన అభినయదర్పణమునకు పద్యానువాదము[70]. శాస్త్రగ్రంథము. మొదటిది ద్విపదకావ్యము. శహాజీతరములోని యక్షగానేతరకావ్యము. అముద్రితము. ఇందు కవిగిరి దర్భా గిరిరాజా తమ్ముఁడని, వీరి ఇంటిపేరు దర్భ అని కలదు.

"దర్భవంశాంభోధితారావిభుండు"
"కీర్తి కెక్కిన వాఁడు గిరిరాజుసుకవి"

కవిగిరి దరా గిరిరాజా కనిష్ఠసోదరుడు. "కవిగిరి యను పేరు కలిగినవాఁడు." శహాజీ బంధువు విచిత్రరాయని కుమారుడు ఖండోజీరాయడు ఇతనిని "విచిత్రరాయ వసంత" అని సంబోధించినట్లు[71], రుక్మాంగదచరిత్రము రచింపుమని ఆదేశించినట్లును కలదు. కావున శహాజీ, శరభోజీలకు గిరిరాజా వలె, విచిత్రరాయఖండోజీ రాయలలకు కవిగిరి ఆస్థానకవి కావలయును.

కవిగిరికి పూర్వము చదలువాడ మల్లన ప్రథమతః రుక్మాంగదచరిత్రము ద్విపదకావ్యమును రచించినట్లు, అతని విప్రనారాయణచరిత్రమునందు కలదు. అది అనుపలబ్ధము. ఇది పూర్వోక్తము[72]. తదుపరి ప్రౌఢకవి మల్లన రుక్మాంగదచరిత్రము పద్యగద్యకావ్యముగ రచించుట ప్రసిద్ధము. ఇది కూడ పూర్వోక్తము[73]. ప్రౌఢకవి మల్లన పద్యగద్యకావ్యమునకు, కవిగిరి రుక్మాంగదచరిత్ర ద్విపదకావ్యమునకు సామ్యభేదములు కలవు. అది పదునాఱవశతాబ్ది రచన. ఇది పదునేడవశతాబ్ది రచన. అయినను కవిగిరి రచన ఉదాత్తము.

నాగేశ్వరుడు: ఇతడు చరిత్రకు ఎక్కని, కృతులు దక్కని శహాజీ ఆస్థానకవి. నాగేశ్వరకవిముద్ర కల ఒక దరువు, దర్బా గిరిరాజా శాహేంద్రచరిత్రమునందు కలదు. ఆ దరువిది:

" ఏమి చేతునె ముద్దు గుమ్మరొ వాని
నే రీతిఁ జాతునె కొమ్మరొ ।
ఎప్పుఁడు వాఁడిటు వచ్చి - యింపైన తన కౌఁగిలిచ్చునొ ॥
తివిరి నిద్దురరాదు కంటికి కసి - దీరదు నా గుబ్బచంటికి ॥
మోవి సానక మీరా పలుకర నాతో - పంతము లేలర ॥
నరనుత యేకోజి - నాయకేంద్రకుమార
వరుసను నను మరవకే
విరిశరు కేళిని గరిమ నన్నేలర ।
పరమఁడ నాగేశ్వరకవిసన్నుత
తిరమువఁ ద్ర్యంబకధీర యొయ్యార ॥
సఖి వీఁడెప్పుఁడు నన్నుఁ గోరునె, కోరి
శాహేంద్రుఁడు నన్నుఁ జేరునె ॥ " పుటలు9,10.

ఇందు "నాగేశ్వరకవిసన్నుత" అను కవిముద్ర ఇదమిత్థముగ కలదు. కనుక నాగేశ్వరకవి ఒక శహాజీ ఆస్థానకవి అగును. అంతేకాదు. నాగేశ్వరకవిముద్ర కల దరువిది నాగేశ్వరకవికృతము కావలయును. విసర్తి శేషాచలపతి శ్లోకములు, మంగళము సర్వాంగసుందరీపరిణయమునందు సంఘటించినట్లు, నాగేశ్వరకవి యక్షగానములోని దరువును దర్బా గిరిరాజా శాహేంద్రచరిత్రమునందు సంఘటించుట సంభవము.

విసర్తి శేషాచలపతి, దర్బా గిరిరాజా వలె నాగేశ్వరకవి కూడ శాహరాజప్రణీతము లకు నేపథ్యగాయకుడు కావచ్చును.

శాహరాజు "వాగ్గేయకారతతికి వైఖరులు దిద్దు సద్గురుస్వామి" అని, భోజుని తర్వాత శహాజీతో "సములగు కవిరాజులు లేరు భువిని" అని, శహాజీ "కవిత వినెడు వీనుల్ వీనుల్" అని చాటుపద్యములందు కలదుగాని, అవి సంస్కృత మహారాష్ట్రభాషలకు వర్తించునవి కావచ్చును. మాతృభాష కాని తెలుగుభాషకు వర్తించునవి కాకపోవచ్చును.

శాహరాజాస్థానకవి: ఇతని కృతి వాదజయకొరవంజి. అముద్రితము. గ్రంథపట్టికయందు ఇట్లు కలదు.

"అసమగ్రము. తప్పుల కుప్పలు. వ్రాంత తెలుగు. శైథిల్యము కలదు. గ్రంథనామము గాని తత్కర్తృనామము గాని తెలియు నవకాశము గాన్పింపదు. గ్రంథప్రతిపాద్యము గూడఁ దెలియుట కష్టతరము. ముఖపత్రమున "వాద జయకొరవంజినాటకం" అని నిర్దేశింపఁబడెను."

అయినను, గ్రంథమునందు శాహరాజు ప్రశంస కనబడుచున్నందున, ఒక అణవ దరువునందు రామకవి పేరు దొరలినందున, నివర్తి శేషాచలపతి శాహరాజవిలాసము అవతారికలోని శాహరాజప్రశంసను, "సభాసీనుల్ ప్రవీణుల్ కవుల్ రామాదుల్" అని యున్నందున వాదజయకొరవంజికర్త రామకవి అని ఒక అభిప్రాయము కలదుగాని, ప్రామాదికము. శాహరాజవిలాసములోని పద్యమిది:

"శ్రీమత్త్ర్యంబకపుత్రముఖ్యులు సభాసీనుల్ ప్రవీణుల్ కవుల్
రామాదుల్ పతి సత్కళానిధి సభారంగంబు సింహాసన
శ్రీ మీఱన్ దగు శాహభూపతి మహాశృంగారభంగిన్ వసం
తామాత్యున్ రతిరాజుఁ బోలు నిఁక ధన్యంబయ్యె మా నాట్యమున్."

విఘ్నేశ్వరాదులు, సభాసదులు, ప్రవీణులు, కవులు, రామాదులు, సత్కళానిధి అయిన పతి సభారంగస్థలము, సింహాసనము అతిశయింప; వానికి తగిన శాహరాజు మహావిలాసవైఖరిని వసంతుని, మన్మథుని పోలునని అర్థము. ఇందు "కవుల్" అను పదము విశేషణము కాదు. సభాసదులు, పండితులు వలె కవులు. వారి వలె రామాదులు. స్త్రీలు మొదలైన వారని అర్థము. రామాదులు కవులని అర్థము కాదు. తప్పులతడక తాళపత్రగ్రంథములోని తమిళదరువునందలి రామకవి వాల్మీకి గాని, కంబడు గాని అగునేమో తద్జ్ఞపరిషద్విజ్ఞేయము. కాఁబట్టి వాదజయకొరవంజికర్త రామకవి కాడు. గ్రంథములోని శాహరాజప్రశంసనుబట్టి శాహరాజాస్థానకవి అగును.

అసమగ్రమైన, అస్పష్టమైన, ప్రభ్రష్టమైన తాళపత్రగ్రంథమునుబట్టి, అందు వాదజయము లేదు; కొరవంజి లేదు అనుట కూడ సంగతము కాదు. అవి సమగ్రమైన ప్రతియందు ఉండుట సంభవము. సంభావ్యము.

# మైసూరు పాలకులు

శహాజీకాలమున (1684-1712.) మైసూరు పాలకులును తెలుగు కవులు. వారిలో ప్రథముడు ఇమ్మడి హిరియ కెంపరాయలు[74]. శివసముద్రప్రాంతము నేలిన కెంపగౌడు లలో ముగ్గురు కెంపరాయనామధేయులు కలరు. 1. మొదటి హిరియ కెంపరాయలు (1513-69.) 2. మాలె కెంపరాయలు (1658-78.) ఇతని కనిష్ఠసోదరుడు 3. ఇమ్మడి హిరియ కెంపరాయలు. కాలము 1678-1700 కావచ్చును. వీరిలో ఇమ్మడి హిరియ కెంపరాయలు తెలుగు కవి. తమిళపెరియశబ్దమే కన్నడహిరియశబ్దము. తెలుగు శబ్దము పెద్ద.

ఇమ్మడి పెద కెంపరాయలు: ఇతని కృతి గంగా గౌరీవిలాసము. యక్షగానము. రచనాకాలము 1680 ప్రాంతము కావచ్చును. ఇందు గంగాగౌరీశంకరుల పరస్పరాన్వేషణములు, చెలికత్తెల రాయబారములు, పునస్సమాగమములు ఇతివృత్తము. దేశికవితారీతుల కంటె మార్గకవితారీతులు అధికము. సంధివచనములకు బదులు కంద, గీతపద్యములు కలవు. సీసపద్యములు, వృత్తములును కలవు. రాగతాళముల తోడి దరువులు అధికము. ఇవి అర్వాచీనతకు సూచకములు.

చిక్కదేవరాయాస్థానకవి: ఇతని కృతులు చికదేవరాయవిలాసము. శతకము. చాటుపద్యములు. శ్రీరంగపట్టణము రాజధానిగ మైసూరు రాజ్యమును పాలించిన చిక దేవరాయలు (1672-1704.) కవి. కవిపండితపోషకుడు. అతని కృతులు లభించ లేదు. ఆస్థానకవుల తెలుగు, కన్నడ, సంస్కృతకృతులు లభించినవి. చికదేవరాయవిలాసము యక్షగానము. యక్షగానమని కవినిర్దేశము కలదు. చికదేవరాయప్రశంసాత్మకము, చికదేవరాయాంకితమునైన చికదేవరాయవిలాసము చికదేవరాయాస్థానకవికృతమగును. కవి పేరు లేదు. రచనాకాలము 1685 ప్రాంతము కావచ్చును.

చికదేవరాయవిలాసమునందు[75] అవతారిక కలదు. ఇష్టదేవతాస్తుతి, కవిజనసీజనకప్రసక్తి, శ్రీరంగపట్టణవర్ణనము, చికదేవరాయవిజయప్రశస్తి, షష్ఠ్యంత పద్యములు కలవు. ఇందు చికదేవరాయలు వాహ్యాళి వెడలుట, చంద్రరేఖ అను పొరకాంత మోహించుట, విరహావస్థనందుట, చెలికత్తె రాయబారము చేయుట, నాయకుడు సమ్మతించుట, నాయిక అందలమెక్కి రాచనగరికి వెడలుట, నాయికానాయకుల సంభోగశృంగారము. వైతాళికగీతములు, చికదేవరాయల ప్రశంస ఇతివృత్తము.

ఇది పాడిన పాటయే. తంజావూరు ఆస్థానకవుల యక్షగానములకు సహోదరము.

శతకము శృంగారసీసపద్యశతకము[76]. చికదేవశబ్దము, శతకశబ్దము, కల సీసపద్యమిది:

"వింతగా బొడగన్న వెలదివి నవలీల

సాధించు దేవవేశ్యాభుజంగ!
ముందర పొడగట్టు మొగనాలినైనను
దొరకించుకొనునట్టి దుండగీఁడ!
తిరునాళ్లకని వచ్చు పరువంపు వెలఁదులఁ
దిరిగి పోనీయని ధీరవిటుఁడ
వేటకుఁ బోవుచో వీట నెవ్వతెనైన
వనువులఁ దేలించు వటనకాఁడ!
నీకు శృంగారనటనల నేర్పున గల
శతకమొక్కటి వినిపింతు చక్రహస్త!
భక్తసురసాల చికదేవ .... ....
.... .... .... .... .... "

ఇందు "చికదేవ" తర్వాతి భాగము లేదు. ఇతరపద్యములందును లేదు. కొన్ని సీసపద్యములకు ఎత్తుగీతమే లేదు.

చాటుపద్యములు కాకినాడ సరస్వతి పత్రికయందు (1911) చాటుపద్య మణిమంజరి ప్రథమభాగమునందును (1913) ప్రకటితములు. అందు చారిత్రిక చాటువులు అధికము. అందు చికదేవరాయవిలాసయక్షగానాంతపద్యము కలదు. (పుట34.) శృంగారపద్యమును కలదు.

"ఒక చెలి నొక్కచే వెనుక మంచి కనుంగవ మూసిపట్టి వే
ఱొక కరమెత్తి కొమ్మనుచు నొక్కతెకుం గనుసన్న చేసి న
న్నొకపరి ముద్దు వెట్టుకొన నొక్కతె వెంటనె వచ్చి మెచ్చె దా
నికిఁ జికదేవరాయ లొక నేర్పున వంచన సేయకుండునే," పుట 36.

చికదేవరాయవిలాసయక్షగానము, చికదేవసంజ్ఞితశృంగారసీసపద్యశతకము, చికదేవరాయశృంగారచాటువులు ఆస్థానకవికృతమో, ఆస్థానకవుల కృతములో నిర్ధరించుట దుర్ఘటము. ఇవి శహాజీ ఆస్థానకవులకు తీసిపోని, చికదేవరాయల ఆస్థానకవి లేదా ఆస్థానకవుల ప్రభుదాస్యపరాకాష్ఠదశకు పరమనిదర్శనములు.

కంఠీరవరాజు: పూర్తి పేరు కంఠీరవనరసరాజు. ఇతని కృతులు 1. కొరవంజి కట్టె. 2. పంచాయుధకట్లె. 3. లక్ష్మీవిలాసము. 4. కలవాణీవిలాసము. 5. నాట్యవిద్యా విలాసము. 6. వసంతోత్సవవిలాసము. 7. విభక్తికాంతావిలాసము. 8. అష్టదిక్పాలక విలాసము.

ఇతడు చికదేవరాయల కుమారుడు. చికదేవరాయల అనంతరము మైసూరు రాజ్యపాలకుడు. (1704-13.) ఇతడు పుట్టుచెవిటి. పుట్టుమూగి. మూకరసు అని నామాంతరము[77]. పుట్టుచెవిటి, పుట్టుమూగి కృతులు రచించుట సందేహము కలిగించును. అంతేకాదు. ఆ యీ కృతులందు అధికభాగము కంఠీరవరాజు శృంగారప్రసంగములు, ఘనకార్యప్రశంసలు కలవు. అవి ఆత్మశ్లాఘనము లగుట కంటె ఆస్థానకవుల

రాజశ్లాఘనము లగుట సహజము. కృతుల స్వరూపస్వభావములును[78] తదుపబలకము.

**1. కొరవంజి కట్లై:-** ఇది 1. ఆంధ్రకొరవంజి. 2. ప్రాకృతకొరవంజి. 3. తిగుళ కొరవంజి. 4. తెలుగు కొరవంజి- నాలుగు భాషలలోని నాలుగు యక్షగానముల సంపుటి. తెలుగు కొరవంజియందు కంఠీరవరాజా శ్రీరంగనాథుని దర్శించి, తిరిగివచ్చుచుండగా, పాంచాలదేశరాజకుమారి కాంచనలత చూచి మోహించుట, విరహావస్థనందుట, సరస్వతీదేవి కొరవంజి రూపమున వచ్చి సోదె చెప్పుట, కాంచనలతా కంఠీరవరాజులకు వివాహమగుట ఇతివృత్తము. ఇది పాడిన పాటయే. కంఠీరవరాజే రచించిన, అతడు నాలుగు భాషలలో కవి కావలయును.

**2. పంచాయుధకట్లై:-** ఇందు శ్రీరంగనాథుని పంచాయుధములు కంఠీరవరాజును రక్షించునుగాక అని ఆశీర్వదించుట విషయము. ఇందు ఆరు శ్లోకములు కలవు. ఇది కంఠీరవరాజే రచించిన, అతడు అయిదుభాషలలో కవి కావలయును. అంతేకాదు. ఆశీర్వాదము తానే తుమ్ముకొని తానే చిరంజీవ అనుకొన్నట్లగును.

**3. లక్ష్మీవిలాసము:-** ఇందు నిండు కొలువుండిన కంఠీరవరాజా కడకు, అతని సామ్రాజ్యలక్ష్మి అరుదెంచి, నటియించి, ఆతనిని ఆశీర్వదించుట విషయము. ఇది కంఠీరవరాజే రచించిన స్వీయాశీర్వాదమగును.

**4. కలవాణీవిలాసము:-** ఇందు కంఠీరవరాజును వలచి వచ్చిన కాంభోజరాజకుమారి వేడుకొనుట విషయము. ఇది కంఠీరవరాజే రచించిన స్వీయసంప్రార్థనమగును.

**5. నాట్యవిద్యావిలాసము:-** ఇందు ఒక నాట్యవిద్యావిలాసిని కంఠీరవరాజా సమ్ముఖమునందు పదకేళికలు ప్రదర్శించుట విషయము. పదకేళికలలోని అంశములు ప్రశంసలే. ఇది కంఠీరవరాజే రచించిన ఆత్మశ్లాఘనమగును.

**6. వసంతోత్సవవిలాసము:-** ఇందు కొలువుండిన కంఠీరవరాజా సమ్ముఖమునందు మల్లిక, మందారిక, మంజుభాషిణి, మధురవాహిని మొదలైన బిరుదుపాత్రలు సదాభినయము పట్టుట, అందు మల్లిక కంఠీరవరాజును చేపట్టి వివాహమాడుట విషయము. నాందీప్రస్తావన లుండుట విశేషము. నటి కృతికర్తృ విషయమును అడుగుట, సూత్రధారి కంఠీరవరాజని కంఠోక్తిగ చెప్పుట ప్రస్తావనలక్షణము. పదములు శృంగారప్రసంగములు కలవి. ఇది కంఠీరవరాజే రచించిన ఆత్మశ్లాఘనమే అగును.

**7. విభక్తికాంతావిలాసము:-** ఇందు ఉదాహరణకావ్యసరణిని అష్టవిభక్తులందును కలకంఠీమణులు కంఠీరవరాజును స్తుతించుట విషయము. నటీసూత్రధారుల ప్రస్తావన విశేషము. ఇది కంఠీరవరాజే రచించిన ఆత్మశ్లాఘనమే అగును.

8. అష్టదిక్పాలకవిలాసము:- ఇది వాసవి, పావకి, వైవస్వతి, నైరుతి, వారుణి, వాయువి, కౌబేరి, ఐశాని నాటకములని ఎనిమిది నాటకములు అంతర్నాటకము లైన ఒక పెద్ద నాటకము. ఇందు ఒకనాడు ఇంద్రుడు అష్టదిక్పాలకులతో గూడి నాటకశాల పరీక్షించుటకు వెళ్లిన, అష్టదిక్పాలకుల ప్రతినిధులాంధ్ర వలె, వాసవి మొదలైన వేలుపు నట్టువకత్తెలు వచ్చి తమ తమ విద్యల తారతమ్యము నిర్ణయింపు మనుట, నారదుడు వారి నాట్యవిద్యల తారతమ్యము కంఠీరవరాజు నిర్ణయింప గలడనుట, వేల్పునట్టువకత్తెలు కంఠీరవరాజు సమ్ముఖమునకు వచ్చి తమ తమ విద్యలు ప్రదర్శించుట ఇతివృత్తము. ఇది కంఠీరవరాజే రచించిన ఆత్మశ్లాఘనమే అగును.

అన్ని యక్షగానములందును ఆత్మశ్లాఘనము కలదు. అంతేకాదు. అవి రచించుటకు అయిదు భాషల సాహిత్యపరిజ్ఞానము, నాట్యగానయుగళమైన సంగీతపరిజ్ఞానమును ఆవశ్యకము. అది పుట్టుచెవిటి, పుట్టుమూగి అయిన కంఠీరవరాజునకు కలలోని వార్త. కావున ఆస్థానకవుల రచనములే కావలయును.

కంఠీరవరాజాస్థానకవి: ఇతని కృతులు కంఠీరవరాజపదములు. తొమ్మిది పదములు లభించినవి[79]. కంఠీరవరాజు మీద ఆస్థానకవి రచించినవి. ఒకటి కైవారపదము. ఎనిమిది శృంగారపదములు. కైవారపదము సమాసభూయిష్ఠము. శృంగారపదములు ఒక్కటి వినా సమాసరహితములు. ఒక శృంగారపదమునందు కైవారపదములోని పల్లవి పునరుక్తమయినది. అది సమాసభూయిష్ఠము. శృంగారపదములందు శృంగారము విశృంఖలము ఒక ఉదాహరణము:

"పదరి నన్నంటి వచ్చేవేర
మొదటి వలె గాదు చాలురా మోహనాకారా!
కులుకు గుబ్బలాన వొయ్యారి గుమ్మిన మీరి
గురుతైయున్నదిరా కస్తూరి
అలదాని వద్ద నీవు దూరి సారి
అటువంటి దినమున మైసూరి కంఠీరవేంద్రు
కంటి కంటిరా నీ మాయలెల్ల అమ్మ నే జెల్ల
కల్ల కాదు కామిని వల్ల
వింటి వింటి వింటిరా నీ మాటలెల్ల అల్ల
వెలందియందే నీ ప్రేమమేల కంఠీరవేంద్రా
అవరాని మాట లాడేవేర అవురా చాలురా
అదే రా నీ కా మేరవయ్యెరా.
దినమున నేలుదాని భారమౌర
దేవరాజేంద్రుని కుమార కంఠీరవేంద్ర."

ఇవి కంఠీరవరాజునకు వినబడవు. కారణము పుట్టుచెవిటి. అతడు మాటాడలేడు. కారణము పుట్టుమూగి. అయినను వినుమని నాయిక మొఱ! అవరాని మాటలాడితివని

నెపము!! కంఠీరవరాజు సైగలతో కాలక్షేపము చేసెడివాడట. నాటకశాలనర్తకీమణులు పదాభినయము పట్టునపుడు సైగలు గ్రహించగలడు. అందుకు వినునట్లు, మాటాడునట్లు ఆస్థానకవి అల్లిక. కంఠీరవరాజు అభినయసంజ్ఞలు గ్రహించి ఆస్థానకవిని అందల మెక్కించును. ఆ యక్షగానములు, ఈ శృంగారపదములు ఆస్థానకవుల ప్రభుదాస్యపరాకాష్ఠదశకు పరమనిదర్శనములు.

# తుళుజాజీ

శహాజీ (1684-1712), శరభోజీ (1712-18) తర్వాత తంజావూరు మహారాష్ట్ర పాలకుడు తుళుజాజీ ఉరవు తుక్కోజీ. (1728-32) వీరు ముగ్గురు ఏకోదరులు. ఏకోజీ (1673-84) కుమారులు. 1684 లో పాలకుడైన శహాజీ 1665 ప్రాంతమున, శరభోజీ 1670 ప్రాంతమున, తుళుజాజీ 1675 ప్రాంతమున జన్మించుట సంభవము. అయిన తుళుజాజీ జన్మస్థలము తంజావూరే అగును. ఇతడు తెలుగులో కావ్యరచన చేయుట అసంభవము కాదు. మఱి అసందిగ్ధమును కాదు. తుళుజాజీకృతములుగ రెండు యక్షగానములు కలవు. 1. శివకామసుందరీపరిణయము. 2. రాజరంజనవిద్యావిలాసము.

శివకామసుందరీపరిణయము:- ఇది తుళుజరాజు రచించినట్లు కలదు. (పుటలు3,4) ఇందు నాందీప్రాయమైన శివస్తుతి, సభాపతి మంగళము మాత్రమేగాక; సూత్రధారి, పారిపార్శ్వకప్రవర్తితమైన, ప్రస్తావనప్రాయమైన అవతారిక కలదు. అందు ఇష్టదేవతాస్తుతి, పూర్వసంస్కృతకవిస్తుతి మాత్రమేగాక, తుళుజరాజు పితృ, మాతృ, భ్రాతృద్వయస్తుతి కూడ కలదు. సభావర్ణన తర్వాత మఱల భూమి ప్రార్థన, ఈశ్వరప్రార్థన, విఘ్నేశ్వరప్రార్థన కలవు. ఆ తర్వాత విఘ్నేశ్వరాగమనము. అనంతరము నారదుని ఆగమనముతో కథ ఆరంభము.

ఇందు శివకామసుందరీచిదంబరేశ్వరుల కల్యాణము ఇతివృత్తము. ఇందుకు తుళుజరాజు మహాదేవపట్టణమునందు ఆదివరాహస్వామి ఉత్సవము చేయును. ఉత్సవమునకు వచ్చిన నారదుడు, అచట విష్ణువు లేకపోవుటవలన, హిమవంతుని ఇంటికి వెళ్లుట వలన, అచటికి వెళ్లును. విష్ణువు భూలోకవిశేషము లడిగిన, నారదుడు ఆదివరాహ స్వామి ఉత్సవము గుఱించి చెప్పును. అది చూచుటకు -విష్ణువు, హిమవంతుడు, మాయాదేవి, దేవేంద్రుడు, మన్మథుడు, రతిదేవి, వరుణుడు, గంగాదేవి, చంద్రుడు, మైనాకుడు, భూదేవి, బృహస్పతి, జయ, హిమవంతుని భార్య మేనక, పార్వతి మహాదేవ పట్టణమునకు వత్తురు. చిదంబరేశ్వరుడు కనకసభకు వచ్చి రత్నసింహాసనాసీనుడగును. బ్రహ్మ, సరస్వతి, విద్యాదేవి, వాయుదేవుడు, ఆకాశము, సూర్యుడు, శుకుడు, వ్యాఘ్రపాదుడు, పతంజలి, కుబేరుడు, అవిద్య, తేజస్సు, గణపతి, నారదుడు అచటికి వత్తురు. దేవతలు ముజ్జగముల వింతలు చెప్పుమనిన, నారదుడు ఆదివరాహస్వామి ఉత్సవమునకు విష్ణ్వాదులు వచ్చి, ఉత్సవమంటపమునందు ఉన్నారని, పార్వతి వరరూపరేఖలు వర్ణింపఁదరము కాదని, వర్ణించును. దేవతల కోరికను చిదంబరేశ్వరుడు, బ్రహ్మాదులు మహాదేవపట్టణమునకు వత్తురు. అందఱు ఉత్సవమంటపమునందు ఆసీనులగుదురు. కుశలప్రశ్నల అనంతరము పార్వతీపరమేశ్వరులు పరస్పరావలోకనము కావింతురు. అది జయాసరస్వతులు గమనింతురు. జయ శివకామసుందరీహృదయము, బ్రహ్మ శివహృదయము తెలిసికొని, ఇద్దఱికి వివాహము చేయుటకు ఉద్యుక్తులగుదురు.

ఇంతలో శివకామసుందరి సఖీసమేతముగ సమీపమునందలి శృంగారవనమున ప్రవేశించి, మధుమాససంపదలు గని, విరహావస్థనందును. అది జయ చూచి, బ్రహ్మను పెండ్లి చేయుమనును. శుకుడు నిర్గుణుడైన శివునికి పెండ్లిమాట తలపెట్టరాదనును. అతనిని పతంజలి సమర్థించును. మన్మథుడు ప్రతిఘటించును. ఇతనిని వ్యాఘ్రపాదుడు సమర్థించును. విద్యాదేవి విమర్శించును. మాయాదేవి ప్రతివిమర్శించును. వారి వాగ్వాదమును శారద వారించును. బృహస్పతి విశ్వేశ్వరునికి తెలిపి వివాహము కావింపు మనును. బ్రహ్మ శివుని శక్తిసంగతిని సగుణుడవు కమ్మని కోరును. జయ కల్యాణము సంగతి చెప్పును. స్వామి అంగీకరించును. బ్రహ్మ పెండ్లిపెద్దగ శివకామసుందరీచిదంబరే శ్వరుల కల్యాణము జరుగును. విద్యాదేవి, సరస్వతీదేవి, భూదేవి, లక్ష్మీదేవి మొదలైన ముత్తైదువలు ధవళము పాడుదురు. ఆదివరాహస్వామి ఉత్సవము కారణముగ, శివ కామసుందరీచిదంబరేశ్వరుల కల్యాణము మహాదేవపట్టణమునందు జరుగుట విశేషము.

ఇందు- విష్ణ్వాదులు, బ్రహ్మాదులు, చిదంబరేశ్వరుడు- ముప్పదిమందిని సూత్రధారి ప్రవేశపెట్టుటలోనే సగము పుణ్యకాలము గడిచిపోవును. నందికేశ్వరుడు తత్త్వము పాడును. (పుట13) నారదుని పార్వతివర్ణనము (పుట19) కావ్యసరణి. పార్వతి శృంగారవనప్రవేశము, విరహానుభవము (పుటలు21-23) యక్షగానసరణి. శుకపతంజలి మన్మథవాదప్రతివాదముల సంగ్రహము (పుటలు23,24) విద్యాదేవీమాయాదేవుల వాగ్వివాదముల సవిస్తరము (పుటలు24-26) ప్రధానకథాపరిపోషకములు కావు. కనీసము ఉత్కంఠాపాదకములు కావు. ఉద్వేగాపాదకములే. అంతేకాదు. అద్వైతసిద్ధాంతఖండన మండనములకే వినియోగము. అంత అద్వైతసిద్ధాంతమును బృహస్పతి "అద్వైతవాదంబు లతిశయంబునకె" అని ఒక్కమాటలో కొట్టివేయుట (పుట27) చార్వాకపద్ధతి కావచ్చును. కనకసభ నుండి మహాదేవపట్టణమునకు వచ్చిన చిదంబరేశ్వరుడు సగుణుడు కాగా, శుకయోగి నిర్గుణుడనుట, బ్రహ్మ శక్తిసంగతిని సగుణుడవు కమ్మని కోరుట నిరుపయోగము. అయినను ఇది అసభ్యత, అసహ్యత, అశ్లీలము లేని యక్షగానము.

**2. రాజరంజనవిద్యావిలాసము:**- ఇది తుళుజరాజు రచించినట్లు కలదు. (పుటలు34,35.) ఇందును నాందీప్రాయమైన శివస్తుతి కలదు. నాంది అను నిర్దేశమును కలదు. "నాంద్యంతమున" సూత్రధార, పారిపార్శ్వకప్రవర్తితమైన, ప్రస్తావన ప్రాయమైన అవతారిక కలదు. అది శివకామసుందరీపరిణయములోని అవతారికయే. నాటకనిర్దేశము, కథాసంగ్రహము భిన్నము. సూత్రధారుని వసంతర్తువర్ణనము, తుళుజరాజవర్ణనము, ప్రేక్షకవర్ణనమును అదనము.

తుళుజరాజు కావించు ఆదివరాహస్వామి మహోత్సవమును చూచుటకు వచ్చిన పరమహంసలు, పరమయోగులు, పరమమునులు, పరమవైష్ణవులు, తక్కిన రసికజనులు రాజరంజనవిద్యావిలాసయక్షగానప్రదర్శనమునకు ప్రేక్షకులు. రసికజనుల కంటె పరమ హంసలు, పరమయోగులు, పరమమునులు, పరమవైష్ణవులు తగిన ప్రేక్షకులు. కారణము

రాజరంజనవిద్యావిలాసము వేదాంతనాటకము. ప్రబోధచంద్రోదయమునకు మానసపుత్రిక.

ఇందు జీవాత్మ గాత్రపురము నేలు జీవమహారాజు. అతని సంసారమునందు భార్య మాయాదేవి. సంతానము కామక్రోధాదులు. చిత్తము చిత్తశర్మ. సుజ్ఞానము సుజ్ఞానవర్మ. జీవుడు చిత్తమునందు సుజ్ఞానము కలిగిన సంసారమును రోయును. జీవమహారాజు చిత్తశర్మ, సుజ్ఞానవర్మలను గూడి మాయాదేవీప్రభృతులను పాఱద్రోలును. పరమాత్మ పుండరీకపురము నేలు ఆత్మమహారాజు. పరమేశ్వరుడు. మాయాదేవి ఆత్మమహారాజును సందర్శించి తనకు జరిగిన అన్యాయము చెప్పుకొని శరణువేడును. అనంతరము కామక్రోధాదులలోని మోహుడు మాత్రమే ఆత్మమహారాజును ఆశ్రయించును. క్రమముగ కర్మశర్మ, సుఖాభిధానుడు, అధర్ముడు, తామసబుద్ధికాంత ఆత్మమహారాజును సందర్శించి తమగోడు చెప్పుకొందురు. ఆత్మమహారాజుమోహుని మోహయోగి రూపమున గాత్రపురికి పంపించును. గాత్రపురమునందు జీవమహారాజు కొలువునకు చిత్తశర్మ వచ్చి మాయాదేవీప్రభృతులు ఆత్మమహారాజును ఆశ్రయించినట్లు గాలివార్త వచ్చినదని చెప్పును. సుజ్ఞానవర్మ వచ్చి గాలివార్త యథార్థమని చెప్పును. నిశ్చయాఖ్యుడు వచ్చి నిశ్చయము చేయును. అనంతరము మోహయోగి వచ్చును. అదే సమయమున అదృష్టశర్మ, సత్యాఖ్యుడు, ఆనందుడు వత్తురు. మోహయోగి తాను ముక్తిని కోరి పరమేశ్వరుని గూర్చి తపస్సు చేసినట్లు, పరమేశ్వరుడు ప్రత్యక్షమై విద్యలు మాత్రమే ప్రసాదించినట్లు చెప్పి తన విద్యలు ప్రదర్శించును. జీవమహారాజు ఆశ్చర్యపడును. మోహయోగి పరమేశ్వరానుగ్రహము లేనిది ముక్తి లభింపదని ఉపదేశించును. జీవమహారాజు మోహయోగికి సకలబహుమానము లొసగును. జీవమహారాజు చిత్తశర్మను చూచి, "ఎన్ని సాధనములున్నప్పటికిన్ని శివప్రసాదం లేక ముక్తి ఘటించదు. కావున తపస్సు చేసెద"నని నిత్యత కోరి నిశ్చలధ్యానైకమనస్కుడగును. పరమేశ్వరుడు ప్రత్యక్షమగును. జీవమహారాజు సాష్టాంగదండప్రణామము చేసి, స్తోత్రము సేయును. పరమేశ్వరుడు, జీవమహారాజు మాటలాడు సమయమున, పరమేశ్వర నేత్రసంజ్ఞను మాయాదేవి వచ్చును. పరమేశ్వరుడు జీవమహారాజునకు "సంసారములో నున్నప్పటికిన్ని పూసలలోని దారము వలె నిస్సంసారివై, నిరామయుండవై యుండు" మని ఉపదేశించును. మాయాదేవీజీవమహారాజుల మధ్య వాగ్వాదము జరుగును. పరమేశ్వరుని ఆనతిని జీవమహారాజు సంతానమైన మన్మథుని రప్పించి, రతిదేవితో వివాహము సేయుము.

రతిమన్మథుల వివాహమునకు తగిన ప్రేక్షకులు రసికజనములు.

ఇది రాజరంజనవిద్యావిలాసము. "గ్రంథనామమునకు గ్రంథస్థవిషయమునకు సంబంధము లేదు. అసలీ కవికి అద్వైతసిద్ధాంతమే తెలియదు. 'బ్రహ్మ సత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవ నాపరః- ఇదిఅద్వైతసిద్ధాంతసారము." అని ఒక అభిప్రాయము కలదు[80].

కాని యథార్థము కాదు. గ్రంథస్థవిషయమునందు జీవాత్మ ఒక రాజు. పరమాత్మ మఱొకరాజు. జీవమహారాజును రంజింపజేసిన మోహయోగి విద్యలు కలవు. నిస్సంగత్వమును ఉపదేశించిన ఆత్మమహారాజు విలాసము కలదు. కనుక గ్రంథ నామమునకు గ్రంథస్థవిషయమునకు సంబంధము కలదు. ఇందు బ్రహ్మ సత్యము, జగత్తు మిథ్య, జీవుడే బ్రహ్మము, మఱొకటి కాదు అను శాంకరాద్వైతసిద్ధాంతసారము లేని మాట నిజము. అద్వైతమన శాంకరాద్వైతమే కాదు. కవికి అద్వైతసిద్ధాంతము తెలియకపోవుట కాదు. కవికి తెలిసిన శివాద్వైతసిద్ధాంతము విమర్శకునికి తెలియక పోవుట వలని ప్రమాదము. కవి శివభక్తుడు. అంతేకాదు. తమిళదేశస్థుడు. తమిళశైవము నందు అద్వైతము కలదు. శైవాద్వైతమునందు పరమాత్మ బ్రహ్మపదార్థము కాదు. పరమేశ్వరుడే.

రతిమన్మథుల వివాహము నిర్నిమిత్తము కాదు. మన్మథుడు మాయాదేవీ జీవమహారాజుల సంతానము. "కొడుకుకు పెండ్లి సేకున్న నేరీతి వంశంబు విఖ్యాతిగాను .... కావున పెండిలి కాముని కిపుడు గావించి రక్షించు కరుణాపయోనిధి!" అని మాయాదేవి ప్రార్థించుట వలన పరమేశ్వరుడు చేయించినది రతిమన్మథుల వివాహము. ఇది జీవమహారాజు సన్న్యాసి కాకుండ నిస్సంసారిగ సంసారమునందుండుటకు నిమిత్తము.

# విజయరంగచొక్కనాథుడు

శహాజీ, శరభోజీ, తుళుజాజీసోదరుల కాలమునందు (1684-1736) మధురనాయకరాజు విజయరంగచొక్కనాథుడు. ఇతని రాజ్యకాలము 1706-32. బాల్యమునందు మాతామహి మంగమ్మ - చొక్కనాథుని (1659-82) భార్య, మూడవ ముద్దువీరప్ప నాయకుని (1682-89)తల్లి - మనుమడు. విజయరంగచొక్కనాథునికి సంరక్షకురాలుగ పరిపాలన చేసినది. (1689-1706.) అంతేకాదు. కొడుకు పోయినపుడు కోడలు సహగమనము చేయదలచినను చేయనీయని సంస్కారిణి. మధురరాజ్యమును శత్రురాజుల నుండి కాపాడిన మహారాణి. ఆమె కావించిన దానధర్మములు అనేకము. ఆమె కట్టించిన అన్నసత్రములు, చలివేంద్రలు అసంఖ్యాకము. అట్టి మహారాణి మంగమ్మ గుఱించి, మధుర మంగాపుంశ్చలీ లీలావిలాసము అని ఒక వచనకావ్యము, మంగమ్మ దండకము అని ఒక దండకము కలవు. అవి మధుర కొలువులోని ప్రతిమగవానితోను రంకు కట్టి వికటకవి గోపాలరాయడు రచించిన బూతుపుస్తకములు. " అతడే కారణము వలననో మంగమ్మయొక్క కోపమునకుఁ బాత్రుడై, దేశత్యాగము చేసి తిరుచునాపల్లి నుండి యానెగొంది వఱకు గల దేశమున పలుతావుల గ్రుమ్మరుచు నిడుమలు గుడిచెను. అతడు మంగమ్మపై గసి తీర్చుకొనుటకు చంద్రలేఖావిలాపమును బోలి పచ్చిబూతులు గల భాషలో నామె దుశ్చరిత్రమును గర్హించెను." అని ఒక అభిప్రాయము కలదు[81]. అది యథార్థమగును. దుశ్చరిత్రము అతడు కల్పించినదే అగును.

రాణి మంగమ్మ దళవాయి నరసయ గుఱించి నరసభోజనుతి అను సీసపద్య కావ్యము, శృంగారపదములు కలవు. కర్తృవిషయము లేదు. నరసదళవాయి 1702 నాటి మరవ యుద్ధమునందు మరణించెను[82]. కాఁబట్టి నరసభోజనుతి రచనాకాలము 1700 ప్రాంతము, శృంగారపదముల రచనాకాలము తత్పూర్వము కావచ్చును. నరసయ దళవాయి శృంగార పదములందు రక్తుడు. నరసభోజనుతియందు భక్తుడు. శృంగారపదము ఒక్కటే లభించినది. అందును పంక్తులు అక్కడక్కడ లోపించినవి. ఆ పదమిది[83]:

"ఒళువెల్ల దెలిసేరా ఓరోరి జాణ
దళవాయి నరసవజీరా దాతల రాయ నీ ॥ఒ॥
నిన్న దాని నేలుకొన్న పగలెల్ల నేను
విన్న చిలుకతాళి మువ్వ యిచ్చి సుప్ర
సన్న సరసావ మున్న ........................ ॥ఒ॥
రాక యేతురా పరాక? దానికి సరిగా
కోక లిచ్చితే ........................................
లేక నే నందాక ................................ ॥ఒ॥

వరుస దప్పక నన్ను వరుసమాన యేలి యొక
వరుస సొమ్ము లొసఁగిన నీ సరిసాటి యెవ్వారు
సరసదళవాయి నరసా ॥౭॥

నరసభోజనుతిలోని ఒక సీసపద్యము[84]:

"శ్రీరంగనాథుని చెన్నొంద మదిలోనఁ
గోరి పూజలు చేసి మీఱినావు
జంబునాథస్వామి సద్భక్తి సేవించి
వరములు కొని కీర్తి నిలిపినావు (?)
చెవ్వంది లింగని చేరి సన్నుతు లీవు
గావించి పుణ్యముల్ గాంచినావు
ఎన్ని కార్యములైన యాదేర్చి ప్రభువుచే
బహుమానములు చాలఁ బడసినావు
ప్రౌఢి వినయంబు నేర్పు సంపదలఁ బొదలఁ
బాండ్యరాజేంద్రు క్రీఁగంటఁ బ్రబలినావు
భానుసమతేజ! దీక్షయప్రభుతమాజ!
వరగుణసమాజ! దళవాయినరసభోజ!"

ఇవి రాణిమంగమ్మ రాజ్యము చేసిన కాలములోనివి. (1689-1706.) ఆమె కవయిత్రి కాదు. కవులను పోషించినట్లును కానరాదు. ఇంతవఱకు మధురనాయక రాజులందు కవులు లేరు. కవిపోషకులైన తిరుమలనాయకుడు, చొక్కనాథుడు, ముద్దళఘరి అను వారి గుఱించి పూర్వోక్తము. మంగమ్మ మనుమడు, మూడవ ముద్దువీరప్ప నాయకుని కుమారుడు అయిన విజయరంగచొక్కనాథుడు మాత్రమే మధుర నాయకరాజులందు కవి. కవిపోషకుడు. అంతేకాదు. తంజావూరు నాయకరాజులందు రఘునాథనాయకుని వలె, మధురనాయకరాజులందు తెలుగు సాహిత్యమునకు వెలుగురేఖలు వెదజల్లిన వాడు. విజయరాఘవనాయకుడు యక్షగానరచనకు యజ్ఞము చేసినట్లు, విజయరంగచొక్కనాథుడు వచనకావ్యరచనకు వ్రతము చేసిన వాడు. మధుర శాఖ మధురఫలము వచనకావ్యము.

తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమునందు ఉత్తరగోపురవచనము, నారదగర్వభంగము అని రెండు వచనకావ్యములు కలవుగాని, అవి కర్తృకాలప్రదేశములు తెలియనివి. రెండును అముద్రితములు. ఉత్తరగోపురవచనము వచనరామాయణము లోని భాగము కావచ్చును. ఇందు రామలక్ష్మణులను, వారి సేనలను, సేనాధిపతులను చూడగోరి, రావణుడు గోపురమెక్కిచూచి, శుకచారులను అడిగి, ఎదిరిబలమును ఎఱిగి, ఆలోచన సేయుట ఇతివృత్తము. వచనము గ్రాంథికము సరళము.

"రావణుండు ..... ఉత్తరగోపురంబు చూచి, రాము బలంబులను సేనాధిపతులను రామలక్ష్మణులను చూడ నపేక్షించి రథంబు డిగ్గి యా గోపురం బెక్కి, యింద్రజిత్తు అతికాయాదికుమారులును నుభయ

పార్శ్వంబుల నుండ ప్రహస్తాదిమంత్రులు వినఁగ శుక్రాచార్యుల బిలిచి మీ రా రాము బలంబులు చూచి వచ్చితిరె? యే మంత్రితో భాషించు? నెవ్వని మీదఁ గరుణ? యెవ్వనితో భాషణంబులు పలుకు? నెవ్వనితో నిష్టాలాపము లాడు, నెవ్వడురామున కాత్మ్మండై యుండు? వెండి, రాఘవుండు లక్ష్మణుండు సుగ్రీవఅంగద హనుమంతాదులు చేరి జాంబవంతసుషేణమైందద్వివిధగజగవయగవాక్షగంధమాదనల నీలజంఘప్రజంఘాదు లేరి? అని యడిగిన శుకచారు లిద్దఱు నిలువం బడి విన్నవింప నంత ప్రహస్తుండుఅడ్డంబు వచ్చి వారిని వారించి మీ రొక్క రొక్కరే విన్నవింపుడని యాడిన, అంత శుకుండను వాడు కేలు మొగిడ్చి విన్నవింపఁదొడఁగె."

నారదగర్వభంగము పురాణగాథ. వచనము గ్రాంథికము. సరళము.

"ద్వారకానగరమునందు శ్రీకృష్ణస్వామి రుక్మిణీసత్యభామాసమేతుఁడై యుండు సమయమందు నారదుఁడు శ్రీకృష్ణదేవునియొక్క దర్శనార్థమై రాగాను దవ్వులను వచ్చు నారదుని చూచి యెదురుగాఁబోయి వినయము తోబాటు తోడి తెచ్చి ఆసనార్ఘ్యాదిపూజలను సంతుష్టుని జేసి యిష్టాలాప ములుగా వార్త లాడుకొనుచున్న సమయమందు దేవేంద్రుని సముఖమున నుంచి(న్ని) దేవదూత వచ్చి శ్రీకృష్ణస్వామి సమ్ముఖమందునున్న నారదమునీంద్రునిఁ జూచి దేవేంద్రుఁడు మిమ్ము పిలుచుక రమ్మనినాడు. వేంచేయుమని పల్కరించగా నారదముని మమ్ము పిలువవచ్చిన కారణ మేమి? ఆ పూర్వోత్తరము సవిస్తరముగా మాకు తెలియ వివరింపు మనఁగా ఆ దేవదూత విన్నపము చేసిన వివరము."

**విజయరంగచొక్కనాథుడు:** ఇతని కృతులు 1. శ్రీరంగ మాహాత్మ్యము. 2. మాఘమాహాత్మ్యము. రెండును వచనకావ్యములు. రెండును అముద్రితములు.

**శ్రీరంగమాహాత్మ్యము:-** ఇది పేరును బట్టియే శ్రీరంగక్షేత్ర మాహాత్మ్యమును ప్రతిపాదించు క్షేత్రమాహాత్మ్యకావ్యమని వ్యక్తమగును. విజయ రంగచొక్కనాథుడు శ్రీరంగనాథభక్తుడు. కాఁబట్టి శ్రీరంగక్షేత్రమాహాత్మ్యమును గుఱించి వ్రాయుట సహజము. ఇందు మహేశ్వరుడు శ్రీరంగక్షేత్రమాహాత్మ్యమును నారదునికి వివరించినట్లు కలదు. ఇతఃపూర్వము భైరవుడు రచించిన శ్రీరంగమహాత్మ్యము పద్యగద్యకావ్యమును శ్రీరంగక్షేత్రమాహాత్మ్యమును ప్రతిపాదించు క్షేత్ర మాహాత్మ్య కావ్యమే[85]. అందు మూలము గరుడపురాణమని కలదు. అంతేకాదు. వ్యాస శిష్యనందనుడైన రోమహర్షణుడు శౌనకాది మహామునులకు చెప్పినట్లు కలదు. ఇందు వక్త, శ్రోత భిన్నులు. మూలముమ భిన్నమగును. ఇందు భాష గ్రాంథికము. శైలి సరళము. ఒక మచ్చుతునుక:

"చతుర్ముఖుఁడు ఆ దేవదేవునుద్దేశించి, స్వామీ! నీవు నా యందు ప్రసన్నుఁడవగుట నిక్కంబేని నీ నిజరూపంబు నేటివరలొనొక్క నాడేనియు దివ్యకల్యాణవిగ్రహంబు కనుంగొన జే (శా)యవైతివి. మత్స్యరూపంబును కూర్మరూపంబును హంసరూపంబును హయగ్రీవ రూపంబునుఁ జూపితిరి. యింక(కా)ను సనాతనంబును అతి రహస్యంబునుఅత్యుత్తమంబైన నీ నిజరూపంబు నిరీక్షింపుచున్నవాడ ననిన శ్రీమన్నారాయణుండు బ్రహ్మదేవునిఁ జూచి, ఓ(వో) యి చతు ర్ముఖా! నీ వంటివారలు మాయవతారంబులైన మత్స్యకూర్మాది రూపంబులఁ జూచినఁ జూచితిరిగాని, అప్రాకృతంబును దివ్యంబును వేదవేద్యంబునైనమా నిజరూపంబు(లు) చూడ నర్హు(రుహు)లు గారు.'

**2. మాఘమాహాత్మ్యము:-** ఇది మాఘస్నానమాహాత్మ్యమును ప్రతిపాదించునది. అది కూడ మాఘమాసమునందు కావేరీనదీస్నానమాహాత్మ్యమును ప్రతిపాదించునది. క్షేత్రమాహాత్మ్యకావ్యప్రాయమైన తీర్థమాహాత్మ్యకావ్యము. ఇది శ్రీరంగనాథునికి అంకితము. ఆశ్వాసాదిపద్యము వలె గ్రంథాదిపద్యము కలదు.

" శ్రీమచ్చంద్రపరోవర
తామరసపరాగచారుతరపటవాసా!
కామారివినుత! జగదభి
రామామృతగుణవిలాస! రంగనివాసా!

ఇందును భాష గ్రాంథికము. శైలి సరళము. ఒక మచ్చుతునుక.

"తదనంతరంబ వసిష్ఠమహామునీంద్రుఁడు దిలీపమహారాజునుఁ జూచి, మృగశృంగమహామునీంద్రుఁడు సలక్షణంబుగా నఖిలవేదంబులఁ జదివి బ్రహ్మచర్యవ్రతంబు నెరవేర్చి, ఉచిథ్యకన్యకయగుసువృత్తను వివాహంబుగా గోరి యు(వు)న్నయెడ కుత్సమహాముని పుత్రుని యభిప్రాయంబు నెఱి(రి)ంగి, ఉచిథ్యుని యింటికిం జని తన కుమారునకు కన్యాదానంబు సేయుమని ప్రార్థించిన నతండును సంతసంబునముహూర్తనిశ్చయంబును అంకురార్పణంబునుఁ జేయించి బాంధవులైన మునీశ్వరులఁ బిలిపించుటయు, జైమిని జమదగ్ని కపిల పైల సుమంత వాసుదేవ జాబాలి కాశ్యప భృగు పర్వత శరభంగ --- "

ఇందు వక్త వసిష్ఠమహాముని. శ్రోత దిలీపమహారాజు. కథానాయకుడు మృగ శృంగమహాముని. అతని తండ్రి కుత్సమహాముని. కథానాయిక సువ్రత. ఆమె తండ్రి ఉచిథ్యమహాముని. మృగశృంగమునికుమారుడు కావేరీనదిలో ఎనిమిది దినములు మాఘస్నానము చేసిన సుకృతమును ధారవోసి ఒక ఏనుగునకు సుగతి కల్పించును.

శ్రీరంగమాహాత్మ్యమునందు పది అధ్యాయములు కలవు. మాఘమాహాత్మ్యము నందు పదియేను అధ్యాయములు కలవు. ప్రతి - అధ్యాయమునకు అధ్యాయాంతగద్య ఇట్లు కలదు.

"ఇది శ్రీపాండ్యమండలాధీశ్వర విజయరంగచొక్కనాథ భూపాల ప్రణీతంబైన ..... వచనకావ్యంబున ....."

ఇందు వచనకావ్యశబ్దప్రయోగము గమనార్హము.

## విజయరంగచొక్కనాథుని ఆస్థానకవులు

సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు: ఇతని కృతులు 1. జైమినిభారతము. 2. అహల్యాసంక్రందనము. 3. సారంగధరచరిత్రము. ఇందు రెండవది పద్యకావ్యము. మొదటిది, మూడవది వచనకావ్యములు. మూడవది అముద్రితము. అహల్యాసంక్రందనమునందు "మునుపు జైమినిభారత మనఁగ వచనకావ్య మొనరించినట్టి సత్కవి" అని కలదు. (14వ. అవ.) అహల్యాసంక్రందనము అవతారికలోని కవివంశవర్ణనము శేషము వేంకటపతి, బుణిగె కృష్ణ కవీంద్రుడు వచించినది. అది వినా కడమ అవతారిక సారంగధరచరిత్రమునందు కలదు.

పయి మూడు కృతులు కాక, రాధికాసాంత్వనమను ఏకాశ్వాసకృతి ఒకటి సముఖము వేంకటకృష్ణప్పనాయకప్రణీతముగ కలదు. అది తత్కృతమే అనుటకు నిదర్శనములు కలవు. అవి:

1. ఏకాశ్వాసరాధికాసాంత్వనము సముఖము వేంకటకృష్ణప్పనాయక ప్రణీతముగ ఆశ్వాసాంతగద్య కలదు.
2. అహల్యాసంక్రందనములోని మూడు పద్యములు ఏకాశ్వాసరాధికా సాంత్వనమునందు కలవు.
3. జైమినిభారతమునందు, అహల్యాసంక్రందనమునందు కల సంభోగ వర్ణనవచనము ఏకాశ్వాసరాధికాసాంత్వనమునందు కలదు.

ఇవి ఏకాశ్వాసరాధికాసాంత్వనము సముఖము వేంకటకృష్ణప్పనాయకకృత మనుటకు నిర్ధారకసాధనములే అనిపించును. కాని ఏకాశ్వాసరాధికాసాంత్వనము కూట సృష్టి. దీనికి మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందు ఒక తాళపత్రగ్రంథము, కాకినాడ ఆంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునందు మఱొక తాళపత్రగ్రంథము కలవు. పరిషత్కార్యాలయప్రతి తుదిని,

"కీలకనామసంవత్సరమార్గశీర్షబహుళషష్ఠీశుక్రవారమునాడు బాగూరు రంగశాయి కుమార్తె అమ్మికి తంజావూరుకవి వేంకటస్వామి నాయుడు రాధికాసాంత్వనము సర్వము స్వహస్తలిఖితముగా నిచ్చినది."

అని కలదు[86]. కీలకనామసంవత్సరము 1728 లేదా 1788 అగును. ఇందు 1728 సముఖము వేంకటకృష్ణప్పనాయకుని (1706-32) కాలములోనిది. 1788 ఆ కాలములోనిది కాదు. అంతేకాదు. రాధికాసాంత్వనము నాలుగాశ్వాసముల కావ్యముగ రచించిన ముద్దుపళని (1739-62)కాలములోనిది కాదు. ఉపరి, కీలకనామసంవత్సర మార్గశీర్షబహుళ షష్ఠీశుక్రవారము 1728 లోను లేదు. 1788 లోను లేదు. అది బుధ

వారము. ఇది గురువారము. కాఁబట్టి ప్రతిలేఖనకాలము యథార్థము కాదు. కల్పితము. ప్రతిలేఖకుడు వేంకటస్వామినాయుడు తంజావూరికవి అగుట గమనార్హమైన అంశము.

ఏకాశ్వాసరాధికాసాంత్వనము కథాభాగము 114 పద్యములందు కలదు. అందు సుమారు ఏబదిపద్యములు యథాతథముగను, పదునైదు పద్యములు కొలది భేదమున ముద్దుపళని రాధికాసాంత్వనమునందు కలవు. కనుక సముఖము వేంకట కృష్ణప్ప నాయకుని ఏకాశ్వాసరాధికాసాంత్వనమును ముద్దుపళని చతురాశ్వాస రాధికా సాంత్వనము చేసినదని, వేంకటకృష్ణప్పనాయకుని పద్యములను చౌర్యము చేసినదని పెక్కుమంది అభిప్రాయము. కాని ఏకాశ్వాసరాధికాసాంత్వనము సముఖము వేంకట కృష్ణప్పనాయకప్రణీతము కాదు. కూటసృష్టి.

ముద్దుపళని రాధికాసాంత్వనమునందు ఇళాదేవీశ్రీకృష్ణులు కారణముగ రాధ సంతాపము, శ్రీకృష్ణుని సాంత్వనము ఇతివృత్తము. ఏకాశ్వాసరాధికాసాంత్వనమునందు సత్యభామాశ్రీకృష్ణులు కారణముగ రాధ సంతాపము, శ్రీకృష్ణుని సాంత్వనము ఇతివృత్తము. ముద్దుపళని రాధికాసాంత్వనమునందు సత్యభామకు ప్రమేయము లేదు. ఏకాశ్వాసరాధికాసాంత్వనమునందు ఇళాదేవికి ప్రమేయము లేదు. అయినను ఏకాశ్వాసరాధికాసాంత్వనమునందు ఇళాదేవి ప్రసక్తి మూడు స్థలములందు కలదు.

1. "చూపు లోపల నొక వింత చూపుఁ దళుకు
నడుపు లోపల నొక వింత నడుపు బెళుకు
నుండు నునికిని నొక వింత యుండు కులుకు
వచ్చెఁ గదవమ్మ మన యిళావనిత కిపుడు." 51ప.

ఇది యథాతథముగ ముద్దుపళని రాధికాసాంత్వనములోని పద్యము. ఇందు ఇళాదేవి ప్రసక్తి కలదు. అది ముద్దుపళని రాధికాసాంత్వనమునందు ఆవశ్యకము. ఏకాశ్వాససాంత్వనమునందు అనావశ్యకము. "వచ్చెఁ గదవమ్మ మన సత్యభామ కిపుడు' అని యుండవలయును. కాని లేదు. కారణము ముద్దుపళని పద్యమును యథాతథముగ గ్రహించుటయే.

2. "కరుణ దైవాఱ బిగియారఁ గౌఁగిలించి
మానినీమణి వేయి జన్మాలకైన
విమము నీ మేలు మఱువలేవవిన మాట
మఱచెనో శౌరి తగు నిళామాయ మీఱ" 67ప.

ఇది ముద్దుపళని రాధికాసాంత్వనములోని పద్యము కాదు. అయినను ఇళాదేవి ప్రత్యక్షమయినది. "మఱచెనో శౌరి సత్యభామ మటుమాయ" అనిన సరిపోవును. కాని అవలేదు. కారణము ముద్దుపళని రాధికాసాంత్వనము ప్రభావమే.

3. "అంతట నవనంతశయనుండగు మురాంతకుండు మంతనసేసి
సాత్రాజితిని వీడ్కొని యిళాదేవిం దోడితేరం దగువారల
న్నియమించి....గోకులంబువ కరుదెంచి..... రాధిక వృత్తాంతం

బంతయు నాకర్ణించి......యారాత్రి......రాధామందిరంబు
చేరంబోవు సమయంబున" 100వచ.

ఇది కూడ ముద్దుపళని రాధికాసాంత్వనములోని గద్యము కాదు. అయినను ఇళాదేవి అవతరించినది. శ్రీకృష్ణుడు గోకులమునకు, రాధామందిరమునకు పోవుటకు సాత్రాజితిని వీడ్కొనుట ఆవశ్యకము. ఇళాదేవిని తోడ్కొనుట అనావశ్యకము. అనావశ్యకమే కాదు; రాధామందిరమునకు పోవుటకు ఆటంకము కూడ. ఇళాదేవిని తప్పించి సత్యభామకు స్థానమిచ్చిన ఏకాశ్వాసరాధికాసాంత్వనకర్త మెదడులో, ముద్దుపళని రాధికాసాంత్వనములోని ఇళాదేవి తిష్ఠ వేసినది. ముద్దుపళని రాధికాసాంత్వనము ముందు లేనిచో ఇళాదేవియే లేదు.

కాఁబట్టి ఏకాశ్వాసరాధికాసాంత్వనము కూటసృష్టి
అయిన కూటసృష్టికర్త ఎవరు?

సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు కాదు. ముద్దుపళని కాదు. కావున తంజావూరుకవి వేంకటస్వామినాయుడు కావలయును. ముద్దుపళని తంజావూరు కవయిత్రి. వేంకటస్వామినాయుడు తంజావూరు కవి. ముద్దుపళని "చోళసింహాసనాధ్యక్ష ప్రతాపసింహమహారాజబహూకృతానేకచామీకరాంబరాభరణ" (ఆశ్వాసాంతగద్య) "ఘటియింపనేర్చు(ను) కవనజాతు లెఱింగి పలుకుల కల్కి వెల్వెలనఁబాఱ" (36ప. అవ.) అని కలదు. రాధికాసాంత్వనము రసికజనమనోభిరామము. అసమర్థ సమకాలిక కవులకు అసూయాజనకము. అసూయ కళంకాపాదకము. కాఁబట్టి ఏకాశ్వాసరాధికా సాంత్వనము తాళపత్రగ్రంథము స్వహస్తలిఖితము చేసిన తంజావూరు కవి వేంకట స్వామినాయుడే కూటసృష్టికర్త అగును.

అతడు స్వహస్తలిఖితము చేసిన కీలకనామసంవత్సరమార్గశీర్షబహుళషష్ఠీశుక్ర వారము కూడ కూటసృష్టియే. సముఖము వేంకటకృష్ణప్పనాయకుని పేర కూటసృష్టి చేయుటకు హేతువు, ఇతడు లబ్ధప్రతిష్ఠుడగుట, మధురకవి అగుట కావచ్చును. కూటసృష్టి కాలము 1769 ప్రాంతము కావచ్చును. కాఁబట్టి ఏకాశ్వాసరాధికాసాంత్వనము సముఖమువేంకటకృష్ణప్పనాయకప్రణీతము కాదు.

జైమినిభారతము:- ఇది విజయరంగచొక్కనాథునికి అంకితము. ఇందు ద్వితీయ, తృతీయ, చతుర్థ, పంచమాశ్వాసములందు ఆశ్వాసాదిపద్యములు కలవు. ప్రథమ, తృతీయ, చతుర్థాశ్వాసములందు ఆశ్వాసాంతపద్యములు కలవు. పంచమా శ్వాసమునందు ఆశ్వాసాంతగద్య కలదు. ఆశ్వాసాద్యంతపద్యములు విజయరంగ చొక్కనాథపరము. ఆశ్వాసాంతగద్యను సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు, "పాండ్య మండలాధీశ్వరవిజయరంగచొక్కనాథు"ని వలన "గజతురంగ మాందోళికా ప్రముఖ నిఖిలసంప"దలు పడసినట్లు కలదు. విజయరంగచొక్కనాథుని కాలము 1706-32 అని పూర్వోక్తము. కాఁబట్టి వేంకటకృష్ణప్ప నాయకుని తొలి కృతి జైమినిభారతము

రచనాకాలము 1710 ప్రాంతము కావచ్చును.

జైమినిభారతము సంస్కృతగ్రంథము. జైమినికృతము. అశ్వమేధపర్వము మాత్రమే లభించినది. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు ఆంధ్రీకరించినది. అది పద్యగద్య కావ్యము. ఇది వచనకావ్యము. భాష గ్రాంథికము. రచన సరళము. పఠనపాఠములందు ప్రసిద్ధము. సంస్కృతాంధ్రజైమినిభారతములను అనుసరించినను, స్వతంత్రరచనమును కలదు.

యౌవనాశ్వుడు భీమాదులతో భద్రావతి కేగునపుడు మావంతులు సిద్ధము చేసిన భద్రగజముల చిత్రవర్ణములు, రత్నవరిస్తీర్ణములును అయిన మెత్తలు, శరచ్చంద్రచంద్రికాడంబరములైన కర్ణచామరములు, దంతముల వజ్రవలయములు, గైరికాదిధాతురసకల్పితచిత్రతిలకములు సముఖము తీర్చిదిద్దినవి. బిరుదావళులు, వంశావళులు, తమ్మటలు, గుమ్మెటలు, మురజములు, కరగజములు వేంకటకృష్ణప్ప వెలయించినవి. "పోకమ్రాకులు, మామిడాకుల తోరణములు, ముత్యములు, కెంపులు, పచ్చలు, మగజాలు, పగడములు నాయకుడు చేర్చినవి; కూర్చినవి. (పుట25)

శ్రీకృష్ణుని భోజనమునకు తమ్మిపువ్వుల వలె తెల్లనైన రాజాన్నములు, సువర్ణ చ్ఛాయారూపములైన సూపములు, సద్యోఘృతములు, అప్పడములు, వడియములు, తాలింపులు, పడిదెములు, తియ్యచారులు, మోరుచారులు, పంచదారలు, పానకములు, ఆనవాలు, చక్కెరపొంగలి, దధ్యోదనము, పులియోర, ఒళ్లోగిరము, అతిరసములు, వడలు, అప్పములు, దోసెలు, ఇడ్డెనలు, లడ్డువములు, పేణీలు, సుకియలు, కుడుములు, మణుగుబూరెలు, సారెసత్తులు, అరిసెలు, అమృతఫలములు, మండెగలు, పాయసములు, మజ్జిగపులుసులు, ఫలరసాయనములు, పచ్చళ్లు, పెరుగు, ఊరగాయలు వేంకటకృష్ణప్ప నాయకుడు సిద్ధము చేయించినవి. అంతేకాదు. కుందేలు, ఉడుము, ఆళువ, లేడి, అడవిపంది మొదలైన భూచరముల; గండెవాలుగ, జెల్ల, మలుగు, కొఱ్ఱ, మారువాయి, బొమ్మిడాయ, ఇసుకదొందు, ఉంచ, తిరికిచేప, తాబేలు మొదలైన జలచరముల; కౌజు, పూరేడు, పొట్టిపిట్ట, పొన్నంగి, వెలిచె, బెడిచె, లావుక, కేరజము, బెళవ, పాడబెళవ, పచ్చబెళవ, కాటిగాడు, ఉల్లంకి, చింతవంకలు, లకుముకి, వంగపండు మొదలైన ఖేచరముల-లవణామ్లమరీచికాజీరకకర్పూరమృగమదాదిపరిమళసంభారసంభృతపాకములు సముఖము వేంకటకృష్ణప్పనాయకుని స్వయంపాకములే. (పుటలు32-34)

ప్రమీల ధరించిన రతనాలకమ్మలు, కెంపుల సొమ్ము, ముత్యపు ముంగర, వింత వింత మణుల కంఠసరములు, కంటె, పేవళము, ముత్యాల దండలు, సందిటి కడెములు, ప్రత్తికాయ తాయెతులు, కంకణములు, రవలగాజులు, కడెములు, మొలనూలు, ఒడ్డాణము, అందెలు, పాడగములు, పాదసరములు, మట్టెలు, బిల్లాణులు, వీరముద్రికలు; కట్టిన చందురకావి పావడపై రాయంచ యంచుల మించు పైఠాణి దుప్పటము, నిండు తగటి ఆవిక, పట్టిన మరకతపు పిడిబాకు, తొడిగిన గిలుకు పావలు సముఖము

వేంకటకృష్ణప్పనాయకుని నాటి వేషభాషలే. కొలువుకూటము పగడాల కంబములు, దారవజ్రముల బోదెలు, జీవదంతపు దంతెలు, నీలంపు దూలములు, కెంపుటోడు బిళ్లల పైకప్పడము, కనకకలశముల విలసిల్లు ద్వారములు, చంద్రకాంతవజ్ర మణిమయగజరాజశోభితములైన పార్శ్వసోపానములు, పచ్చరాతిన్నె, ఇరుగడల కలశములు తుండముల గైకొని, అభిషేకములు సేయు దారవజ్రపు టేనుగులు, లక్ష్మీ విగ్రహముల పొలుపొందు ద్వారదేశములు, జాళువాసరిగకుట్టుపని హరువుల ప్రతిమల ప్రతిలేని తెరలు, కొత్తముత్యాల జల్లుల మేలుకట్టులు, నెమలి తెక్కలచాయల తివాసులు విజయరంగచొక్కనాథుని కొలువు కూటమునకు నిలువుటద్దము. ఒక్క చక్కి మందయానలు దండకతారావళిప్రముఖప్రబంధములు విన్నపము సేయుట, మఱియొక్క దిక్కున రాకేందువదనలు మీమాంసావ్యాకరణాదిశాస్త్రము లనర్గళప్రవాహములుగా ఉపన్యసించుట, వేఱొక్క చాయ పల్లవాధరలు అష్టాదశపురాణములు, కథలు వినిపించుట, మఱొక్క దిక్కున నీలవేణులు జంత్రగాత్రముల రాయి గీతప్రబంధములు, ఘననయదేశీయములు వినికిసేయుట, ఒక వంక బిరుద పాత్రలు చర్చరి, చారి మొదలైన పదియాఱు నాట్యములు ప్రదర్శించుట ఒక్కచోట కలకంఠకంఠులు పరిహాసములు, వినోదప్రసంగములు సేయుట, సింహాసనమునకు ఇరువంకల పంకజాక్షులు కనకదండమండితధవళచామరములు వీచుట, ముప్పదిరెండాయుధములు మహారాజచిహ్నములు పూని ఊడిగంపు చేడియలు ఊడిగములు సేయుట మహిళాపరమైన మధుర కొలువుకూటము. సముఖమునందలి సమాచారము సముఖము కృతిని ప్రతిఫలించినది.

బభ్రువాహనవృత్తాంతము వ్యాసభారతమునందు, జైమిని భారతమునందును కలదు. పుత్త్రుడైన బభ్రువాహనునిచేత అపమరణము నందిన అర్జునుని గుఱించి చిత్రాంగద మొదలైన అంతఃపురాంగనలు రోదించినట్లు మాత్రమే ఉభయసంస్కృతభారత ములందును కలదు. (38,39శ్లో.79అ.1శ్లో.80అ.వ్యా.భా; 77,78శ్లో.38అ.జై.భా.) తిక్కన చిత్రాంగద పార్థుని సమీపించి విలపించినట్లు రచించెను. (68,69ప.4ఆ.) అది గమనించి పినవీరభద్రుడు, అంతకంటె హృదయవిదారకముగ, ఒక్క చిత్రాంగదయేగాక, ఉలూచి తోపాటు అంతఃపురాంగన లందఱును "శోకవహ్నిం బొగిలి బొగిలి" విలపించినట్లు రచించెను. (58,59ప.7ఆ.) అట్టిది సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు కుంతి మఱింత హృదయవిదారకముగ రోదించినట్లు రచించెను. అది సుదీర్ఘమైన పరిచ్ఛేదము. (పుటలు149,150.) అందు కొన్ని పంక్తులు:

> "హా సుకుమారా, హా వరగుణాధారా, హా విద్యావినయవిహారా, హా కులకలశపారావారకుముదబాంధవా, నోమరాని నోములు నోమి, చేయరాని పంతంబులు సేసి, యుండరాని యుపవాసంబు లుండి, యనేకదానంబు లొనర్చి, నిన్నుఁ గాంచి నాటఁ బెంచువానిఁ బూటఁ

బెంచి, దాది తొమ్మున దూదిపాన్పున నుంచి, యభివృద్ధినొందించి, కడపట బభ్రువాహనుని యస్త్రాగ్నిపాలు సేయవలసెనే! ..... అన్నా, నన్ను గన్న కన్నా, నిన్నుం గన్నది మొదలుగా వడవులం దిరిగియు, నిడుమలం బడియు, వెతలఁ జెందితివే కాని, సుఖంబున మండనోచనైతిని. నాముద్దుల కొడుకా, యెటు లోర్తురా! ..... ఎన్ని విధంబులఁ బిలిచినఁ బలుకవేమిరా! దేవదేవుండైన శ్రీకృష్ణుండు ప్రాపై యుండ నీ కితరభయంబు లేదని యెంచి, కమ్మలపండువుగా నీ మేను గందుఁ గదయ్యా! భానుకిరణంబుల నీ మేమ గందుఁగదయ్యా! ఇంక నిన్నే లాగున మఱతు? నా కెవ్వరు దిక్కు? నన్నెవ్వరాదరించువారు? కమ్మని మాటల నెమ్మి మీఱ 'పమ్మా' యని నన్నెవ్వరు పిలుచువారు? ..... "

శ్రీరామచరిత్రమునందు సీతాపరిత్యాగఘట్టమున పినవీరభద్రుని అమూల కోపమావమును సముఖము వేంకటకృష్ణప్పనాయకుడు సంతరించెను.

"ఆ తీవ్రభాషణము విని
సీతాతన్వంగి సొమ్మసిలి వ్రాలె ధరి
త్రీతలము మీఁద ఝుంఝూ
వాతాహతిఁ బడిన పుష్పవల్లికఁ బోలెన్. 65ప.6ఆ.

"తీవ్రభాషణంబు లశనిపాతంబు రీతిఁ గర్ణరంధ్రంబులు సోకుటయు, సురగాలిచేత వ్రాలిన కుసుమవల్లియుం బోలె మూర్ఛంజెంది పుడమిం బడి-"పుట107.

ఇట్టి వింకను గలవు. మొత్తము మీద సముఖము వేంకటకృష్ణప్పనాయకుని జైమిని భారతము జైమిని-భారతమునకు కంటె, పినవీరభద్రుని జైమినిభారతమునకు సన్నిహితము.

వచనకావ్యమునందు "వచనములు" కలవు.

"ఆపదుద్ధారకా, ఆదిదేవా, అనంతా, అనంతశయనా, అంబుజనాభా,అచ్యుతా, హరీ, శ్రీకృష్ణా, నిన్ను నమ్మిన వాఁడ. లక్కయింటఁ జిక్కువడకుండఁ, గౌరవసభాస్థలంబున ద్రౌపదికి మానభంగంబు గాకుండ, వడవుల విడుమలంబడు నవు డాపదలం బొరయకుండ, భీష్మద్రోణకృపాశ్వత్థామకర్ణాదియోధవీరుల యస్త్రాగ్ని జ్వాలలం గ్రాగకుండ, సైంధవవధంబునఁ బ్రతిజ్ఞాభంగంబుగాకుండ రక్షించి, సకలసంకటంబులు వెడఁబాపితివి. త్రిలోకాధ్యక్షా, పంకజాక్షా, ఇప్పుడీ సంకటంబు తొలఁగించి రక్షింపవే! రక్షింపవే!" (పుటలు71-72)

ఇది శ్రీకృష్ణునికి అర్జునుని ప్రార్థనము. కృష్ణమాచార్యుల సింహగిరినరహరివచనము లను గుర్తునకు తెచ్చునది.

"--- ప్రళయసాగరంబున శ్రుతిచోరకుఁడగు దైత్యుని సంహరించుటకు మీనరూపంబునైన నీకుఁ బ్రణామంబు. కూర్మరూపధరుండవై జలధిమథనంబ గావించి మరల కమృతంబు నొసంగిన నీకు వందనంబు.

లీలావరాహమూర్తివై భూమి నుద్ధరించిన నీకు నమస్కారంబు. స్తంభంబునఁ బుట్టి ప్రహ్లాదుఁ గాచిననరసింహా, నీకు దండంబు వామనమూర్తివై మూఁడడుగుల ముల్లోకంబులనాక్రమించిన త్రివిక్రమా, నీకుఁ బ్రణుతి నొనర్చెద. క్షత్త్రియకులధూమకేతువైన భృగురామా, నీకు మ్రొక్కెద. దశకంఠకంఠతలుంఠకనారాచధారాచకితర...... దానవ శైలవజ్రాయుధా, హలాయుధా, నీకు జోహారు.త్రిపురసంహారహేతుబౌద్ధా, యనిరుద్ధా, నీకుఁ గేలు మోడ్చెద. మ్లేచ్ఛనికర విచ్ఛేదన ప్రచండ మండలాగ్రధారానంపాదితకీర్తీ, కలికిమూర్తీ నీ పదాబ్జంబులకు వమ్రుండనైతి. "

ఇది మయూరధ్వజాని శ్రీకృష్ణస్తుతి, దశావతారస్తుతి. శ్రీనాథుని భీమేశ్వరపురాణము లోని వ్యాసుని భీమేశ్వరస్తుతిని జ్ఞప్తి కెలయించునది.

అహల్యాసంక్రందనము:- ఇది శ్రీరంగక్షేత్రదైవమైన రంగనాథునికి అంకితము. ఇందు అవతారిక, ఆశ్వాసాద్యంతపద్యములు, ఆశ్వాసాంతగద్యములు కలవు. అవతారికలోని కవివంశప్రశంస ఆత్మస్తుతి కాదు. మధురనాయకరాజు ప్రసక్తి కలదు.

"నలనాసత్యవసంతులన్ గెలుచు సౌందర్యంబు ధైర్యంబు దో
ర్బలమున్ స్వామిహితానువృత్తి దయయున్ ప్రౌఢత్వమున్ విద్యయున్
వెలయన్ బాల్యమునందె నీవు మధురోర్వీనాథు మెప్పించవా?
భళిరా! వేంకటకృష్ణభూవరమణీ! భాషాఫణిగ్రామణీ!" 41ప. అవ.

ఇందలి మధురోర్వీనాథుడు ఆశ్వాసాంతగద్యములోని విజయరంగచొక్కనాథుడు. జైమినిభారతములోని ఆశ్వాసాంతగద్యమే అహల్యాసంక్రందనమునందు కలదు. పద్యము నందు "బాల్యమునందె" అని కలదుగాని; సౌందర్య, ధైర్య, దోర్బల, స్వామిహితానువర్తన, దయా, ప్రౌఢిమా, విద్యావిషయములందు విజయరంగచొక్కనాథుని బాల్యమునందే మెప్పించుట సంభవము కాదు. బాల్యమునుండి మెప్పించుట సంభవము. సంభావ్యము. జైమినిభారతము రచనాకాలము 1710 ప్రాంతమని పూర్వోక్తము. కాఁబట్టి అహల్యాసం క్రందనము రచనాకాలము 1715 ప్రాంతము కావచ్చును.

అహల్యాసంక్రందనములోని ఇతివృత్తము అహల్యాసంక్రందనుల వ్యభిచారము. అది వైదికవాఙ్మయమునందు, లౌకికవాఙ్మయమునందు కలదు. ఇంద్రునికి"అహల్యాయై జార" అను ఆమంత్రణము తైత్తిరీయారణ్యకమునందు కలదు[87].

" ఇంద్రాగచ్ఛ హరివ ఆగచ్ఛ మేధాతిథే
మేషవృషణశ్వస్య మేనే
గౌరావస్కంది న్నహల్యాయై జార
కౌశికబ్రాహ్మణగౌతమ బ్రువాణ"

ఇది వాల్మీకిరామాయణమునందు కథారూపమున కలదు. బాలకాండలోను,

ఉత్తరకాండలోను కలదు. అహల్య శిలారూపము నందుట బాలకాండలో లేదు. ఉత్తర కాండలో కలదు. బాలకాండలోని అహల్యాదేవరాజుల కథ అతిసంగ్రహము. ఆరు శ్లోకములు. (17-22శ్లో-48అ.) అందు అహల్య మునివేషధారి ఇంద్రుడని ఎఱిగి, దేవరాజు నెడ కుతూహలము వలన, దుర్మేధ కనుక సమ్మతించినట్లు స్పష్టముగ కలదు.

" మునివేషం సహస్రాక్షం విజ్ఞాయ రఘునందన,
మతిం చకార దుర్మేధా దేవరాజకుతూహలాత్." 19శ్లో.48అ.

ఇది వచించినది విశ్వామిత్రుడు. రచించినది వాల్మీకి. అతడు బ్రహ్మర్షి. ఇతడు మహర్షి. శ్రోతలు బాలురైన రామలక్ష్మణులు. అతిసంగ్రహకథ అత్యంతసముచితము. అది పురాణములందు పులిసిపోయినది. కావ్యములందు కంపుకొట్టినది. అందు ధరణి దేవుల రామయమంత్రి దశావతారచరిత్రమునందు మితిమీఱినది. సముఖము వేంకటకృష్ణనాయకుని అహల్యాసంక్రందనమునందు శ్రుతి మించినది. రామయమంత్రి రేఖాచిత్రమే కృష్ణప్పనాయకుని వర్ణచిత్రము.

అహల్యాసంక్రందనముల శృంగారము పారదారికశృంగారము. పారదారిక శృంగారమునకు ప్రథమోదాహరణము ప్రాకృతగాథాసప్తశతి. అది సామాజికము. ఇది పౌరాణికము. సామాజికపారదారికశృంగారము సామాజికస్థితగతికి నిదర్శనము. పౌరాణికపారదారికశృంగారము పౌరాణికప్రతిపత్తికి భంగకరము. అపమార్గచోదకము. అయినను సముఖము అహల్యాసంక్రందనమునందు పారదారికశృంగారము పరాకాష్ఠదశ నందినది.

అహల్యను బ్రహ్మ అపూర్వసుందరిగ సృజించును. అందుకు హేతువు ఇంద్రము నీంద్రసంవాదము. అది సుధర్మసభ. ఇంద్రుని కొలువు. పరాశరాదిమునీంద్రులు, పురూరవాదిదేవతలు, షట్చక్రవర్తులు సభ్యులు. వారి సమక్షమున వారకాంతలు వైదికులను గేలిసేయుట పరసము కాదు. విరసము.

" అతిరాత్రయాజుల యరిది కుండలములు
మెట్టె మించులు గాఁగ నెట్టుపఱచి,
సత్రయాజుల వెల్ల జన్నిదంబులు దీసి
పన్నగజ్జెలు గూర్చ సంఘటించి
యుక్థయాజుల కవకోత్తరీయంబుల
మేలు ముసుంగుగాఁ గీలుకొల్పి
యల వాజపేయయాజుల యాతపత్రంబు
లెండకు మఱుఁగుఁగా నేర్పఱించి
తలిరువిలుకాని బిరుదుపతాక లవఁగ
నోర పైఁటలు జాఱ, వొయ్యార మెసఁగ
వత్తు రింద్రుని కొలువుకు వారకాంత
లచ్చెరువు వొంది సురలెల్ల మెచ్చి పొగడ." 19ప. 1అ.

ఛాందసుల మనవులు చతురములు కావు. కామాతురములు. దయనీయములు.

" 'అమనిషఁ బోవకే! యిషువులచే నన్ను
    విషమాస్త్రుఁ డేసీని వెల్తిపడుచ!
వాజపేయఫలంబు వలదసే? యో యోష! .
    యింద్రుఁ డేమిచ్చీని యిష నిలువవె!
మేము శుంఠలమషే! మీరు నేర్చిన పాటి
    యెఱుఁగమషే వేదమెల్లఁ జదివి,
యతివ! నీవు ద్వరోష్ట యయ్యే దినములయ్యె
    నగరికిఁ బోవకే నడుమ నెమలో?'
యనుచు ఛాందసులగు సోమయాజివరులు
వెంట నంటంగ, మధుమయవినయభరిత
మంజుభాషలచేత సమ్మతులు చెప్పి
వెడలి రప్పుడు వేలుపు వెలవెలఁదులు." 21ప. 1ఆ.

"ఇటు వచ్చిన యచ్చర గచ్చరాంద్రలో నే రుచిరాంగి చక్కనిది? యెవ్వతె విద్యల మేటి? " అను ఇంద్రుని ప్రశ్నకు - దేవతల చక్రవర్తుల వాదప్రతివాదములు, మునీంద్రుల వీరావేశములు, సభ్యతాదూరములైన సమాధానములు. పరాశరాదిమునీంద్రులు భంగు బైరాగులను తలపింతురు. ఎవరి అప్సరసను వారు అగ్గింతురు. కడకు,

" 'తారతమ్య మెఱుంగలే రింద'ఆని లేచె
    గాధేయుఁ డంత లోకములు బెదర
'నీవేమి తెలిసి వర్ణించితో మేనక'
    వని యాతని విభాండుఁ డగమెఁ గేల,
'హరిణితోఁ దిరిగిన యడవిమెకంబ వీ'
    వని కండు వతని మేళ్ళళించెఁ
'గండువుకే కాని కాదు ప్రమ్లోచ' యం
    చతని వెన్ దట్టె మహర్షి యొక్కఁ
డదియె పెద పెద మాటలై యలుక వొడమి,
జడలు వీడంగ, వల్కలాచ్ఛాదనములు
జాఱ, దండకముండలుల్ పాఱవైచి,
గజిబిజిగఁ బోరుచుండ నాఖండలుండు." 62ప. 1ఆ.

సామనయవాక్యములు పలుకును. అందఱు కలిసి బ్రహ్మను సందర్శింతురు. ఇంద్రుడు బ్రహ్మను అదే ప్రశ్న అడుగును. "నా మనసునకు సరిపోయిన రామామణిఁ గాన నీ ప్రపంచములోననే" అని (6ప.2ఆ.) బ్రహ్మ అహల్యను సృజించును.

" అంబుజగంధి చక్కఁదన మల్లనఁ గన్గొని విస్మితాత్ముఁడై
యంబుజనేత్రుఁడప్పుడు త్రియంబకభావముఁ గోరె నాతఁ డ
ష్టాంబకలీలఁ గోరె మది, నాతఁడుఁ గోరె సహస్రలోచన

త్వంబు వతం డనంతవయనత్వముఁ గోరె మతేమి చెప్పఁగన్." 13ప. 2ఆ.

అహల్యవర్ణనమునందు (13-29ప.2ఆ.) సముఖము వేంకటకృష్ణప్పనాయకుని కవితారసధార చిత్రవిచిత్రగతుల పరవళ్లు త్రొక్కినది.

" కినిసి, కుచానవాంగరుచి; గిన్నెలతో, నెలతో, లతోన్నతిన్,
ఘనకచకంతరూపములు; కందరమై, దరమై, రమైక్యమై,
గొనబగు వాక్కటీక్షలటు, కోయిలకో, యిలకో, లకోరికో,
వనిత నొసల్ వళుల్ నడుము, బాలహరిన్ లహరిన్ హరిన్ నగున్. 24ప. 2ఆ.

గోరసమా పల్కుల రుచి?
సారసమా ముఖవిలాససంపద? మరుచే
నారసమా వీక్షణ, మళి
కోరసమా కేశపాశ మబ్జానవకున్. 25.ప.2ఆ.

ఇవి కవి వర్ణనలు. ఇక మరులు గొన్న మహేంద్రుని వర్ణన యమకముల గమకములు.

"డంబులు శైలశేఖరవిడంబులు, దీవి కుచంబులెన్న; నొ
చ్చెంబులు పల్కుఁ గుందవవుఁ జెంబులు, నిద్దపుటద్దముల్ కపో
లంబులు, నీలమేఘపటలంబులు పెన్నెరు లౌర! యౌర! యా
యంబుజగంధిరత్న మిలయందలి సుందరులందు నెంచఁగన్. 31ప. 2ఆ.

ఇందు చేమకూరపాకము సమతూకమువ పడినది.

ఇంద్రుడు అహల్యను మోహించును. అహల్య ఇంద్రుని కాంక్షించును. బ్రహ్మ అహల్యను గౌతమునికి ఇచ్చును. ఇంద్రుడు విరాళి చెందును. బ్రహ్మను నిందించును. గౌతముని దూషించును.

"కాముని చర్యల కగు చెలి
కా మునిచర్యలకు నగునె యకటా! మాధు
ర్యామలసాహితి, రసికశి
ఖామణికివి గాని మడ్డిగానికిఁ దగునే?" 74ప. 2ఆ.

ఇందు ఇంద్రుని స్వపక్షసమర్థనము తోపాటు సముఖము స్వపక్షసమర్థనమును కలదు. అయినను అహల్యాగౌతముల వివాహము జరుగును. ఇంద్రుడు గౌతముని ఆశ్రమమునకు రాకపోకలు సాగించును. గౌతమునితో మాటలాడునపుడు ఆశ్రమవర్ణనగా అహల్యావర్ణన చేయును.

"ఈ నళినప్రవాళములు నీ కదళీతరు లీ మహీస్థలం
బీ నడబావి యీ ఖగము లీ లత లీ క్రముకాభిరూప్య మీ
భూమతపోమలక్ష్మియు నపూర్వములంచు నుతించు వాసవుం
డా నలినాక్షి చక్కఁదన మాశ్రమవర్ణనగా మునీంద్రుతోన్. 118ప. 2ఆ.

అహల్య కడకు ఒక యోగినిని దూతిగా పంపును. ఆమె అహల్యకు చేసిన

హితబోధ (19-21-,26-41ప.3ఆ.) యోగినీసహజము కాదు. భోగినీసహజము. అది మఱింత అపమార్గబోదకము.

" కొసరులొ? చెక్కునొక్కుటలొ? కూకిరవల్ పలికించి పల్కుటో?
యొసపరి యల్కలో? నయములో? రతి పద్దులొ? వింత ముద్దులో?
పసఁ దొడసందు పొందికలొ? వాతెర కూర్పులొ? పక్క మార్పులో?
రసికత లేని గేస్తు రతి రామకు నేమి సుఖంబు చెప్పుమా?" 19.
" ఎందును సంచరింప కఖిలేంద్రియముల్ సుఖమొంద, డెందమున్
బొందుగఁ దున్నుఁ దా మఱవ, బుద్ధి కగోచరమైన యట్టి 'యా
నందమె బ్రహ్మమందు రది నవ్యవయోనవమోహనాంగియౌ
చందనగంధికిన్ దొరకుఁ జక్కని మక్కువకాఁడు చిక్కినన్. " 27.
" వారక యత్తగారిఁ గమఁబ్రామి, నిజేశ్వరు మోసపుచ్చి, యే
యారుమ దూరునైనఁ బడి, యందఱి కన్ను ఘటించి, యాత్మఁ దాఁ
గోరిన నాథునిం గలసి కొల్లలుగా సుఖమందకున్న, నా
పారసపత్రవేత్రి యెలజవ్వనమేటికి? జన్మమేటికిన్." 29ప.3ఆ.

అహల్య ఇంద్రునియెడల అనురాగమును వెల్లడించును. గోపనమును కోరును.

" పట్టఁగరాని మోహమునఁ బైకొని, తోచినవెల్లఁ బల్కి తీ
మట్టునఁ గట్టిపెట్టు మిది మానసమందె, ధరిత్రిలోపలన్
పుట్టని యట్టి బిడ్డలకుఁ బూసలు గట్టుదు రమ్మలక్క లే
గుట్టున నుండుదావ నతికోపముఁ డింటి గృహస్థు యోగినీ!" 57ప.3ఆ.

అహల్య వియోగదశను ఆలకించి, ఇంద్రుడు గౌతముని ఆశ్రమమునకు వచ్చును. కోడియై కూయును. గౌతముడు గంగకు వెడలును. ఇంద్రుడు అహల్యాజారుడగును. అహల్య ఇంద్రభోగములు అనుభవించును. అహల్యాసంక్రందనుల సంభోగశృంగారము సముజ్జృంభించును. వేకువ జామున ఇంద్రుడు వెడలిపోవునెడ అహల్య ఆక్రందించును.

"నమ్మినదాన నా తనువు నమ్మిన దానము నీకు, నింక నే
నమ్మకచెల్ల! నన్ను విరహాగ్నికిఁ బాల్పడఁజేసి పోవుటల్
సమ్మతమాయెనా? విడువఁజాలితివా? యెటులైన నిన్ను నేఁ
బొమ్మనఁజాలఁ జాలినము బొందిని ప్రాణము లుండనేర్చునే?" 122ప. 3ఆ.

ఇట్టి అహల్య పంచకన్యలలో ఒకతె! కాదు కాదు. పంచకన్యలలో ఒకతె అయిన అహల్యకు ఇట్టి పాత్రచిత్రణము!

ఇంద్రునికి ఎదురైన గౌతముడు ఏమి జరిగినది గ్రహించి ఇంద్రుని శపించును. కాళ్లకు వీళ్లను గొంచు వినయముతో నిలిచిన అహల్యను శపించును.

"ఆ తఱి నా లతాంగిని మహాగ్రహదృష్టిని జూచి, 'యోసి! నీ
చేతిజలంబులంట నిఁకఁజెల్లునె యెంతటి జంతవే? బలా
రాతిని గోరి కూడితివి రాతిరి జామునఁ గావునన్ బలా!
రాతి శరీరమందు'మని రాజముఖిన్ మునఖిన్ శపింపఁగన్." 127ప. 3ఆ.

శపించినవాడు అనుగ్రహించుచు. అహల్య శిల అగుట, శ్రీరామపాదరేణుస్పర్శన మున శిలవతి అగుట, అహల్యాగౌతములు అన్యోన్యదంపతులగుట కథాంతము.

ఇది విశ్వామిత్రుడు బాలురైన రామలక్ష్మణులకు చెప్పినది కాదు. వైశంపాయనుడు జనమేజయునికి చెప్పినది. (2-1,3-2,3-3) అయినను మఱి అనుచితమే. అపమార్గచోదకమైన, పరాకాష్ఠదశనందిన పారదారికశృంగారము రసికులకు రాసలీలయేగాని, సహృదయులకు హృదయంగమము కాదు. సమాజమునకు శ్రేయస్కరము కాదు. కనుక అసత్కావ్యము.

సారంగధరచరిత్రము:- ఇది చేమకూర వేంకటకవి సారంగధర చరిత్రమునకు, ఇంచుక స్వతంత్రమైన వచనరూపాంతరీకరణము. ఒక ఉదాహరణము:

" ఆ రీతిఁ బారువము పో
సారంగధరుండు తోడి జనవాథసుతుల్
సారెకుఁ గేకలు వేయఁగఁ
గారాకూరములు మనసు కళవళపడఁగన్. 3.

బెంగ లిడంగ గెంటి యిట పెంటిని గానక తేలిపోయి చి
త్రాంగివిచిత్రరత్నరచనాంగణసీమను దేల వ్రాలె నా
బంగరు ముద్దుపావురము; బాపురె! యంతిపురంబులోని కె
బ్బంగుల వన్యలవ్ వెదకఁ బంపఁగ రాదిఁక నేమిసేయుదువ్. 4.

తామసము సేయఁ దగదింక దీమసమువ
వేరుపరినైన నేఁ బోక తీరదమచుఁ
బోవ, మతిమంతు మతుఁడు సుబుద్ధి దీర్ఘ
దర్శి గావున సారంగధరువ కనియె. 5.

మన్నవ చేసి మీరు బహుమావముతో నను నేలినారు; నేఁ
గన్నది దెల్పకుండిన వఘంబగుఁ గాదని వెగ్గలింప కీ
విన్నప మాలకింపుము, వివేకివి గాని మఱొండు గావు, నీ
కెన్నఁడు లేని యోజ యిదియే? మటుపోయిన హాని యయ్యెడున్. 6.

రా జొకఁ డూరలేఁడు, చెలి ప్రాయపు బిత్తరి, నీవు రూపరే
ఖాజితమన్మథుండ, వటుగావునఁ బోఁదగదయ్య నీకు నో
రాజకుమార, యెక్కడి పరాకిటు సూడఁగదయ్య భామినీ
రాజాలచిత్తముల్ దెలియరా దెటుపో యెటువచ్చునో కదా. 7ప.2ఆ.

"అక్కపోతంబు చిత్రాంగిశాతోదరి వగరిలోన వాలుటయుఁ జేరికల మున్న రాకొమరులు సారెసారెకుఁ గేకలు వేయ వ్యాకులంబగు మనంబునఁ గలవరపడుచు మత్సారావతంబు పెంటిం గానక చిత్రాంగి విచిత్రాంగణంబున నేటికి వ్రాలె? నా బంగరు పావురంబు దొఱంగి యెబ్బంగి మందు? పోతుటీఁగ కేనియుం (జొరఁ) గూడని యంతి పురంబునకు నెవ్వరిఁ బనుతు? దీమసంబునఁ దామసంబు సేయరాదు.

తక్కొక్కరి నా యమ యింటికిఁ బంపుట న్యాయము గాదు.ఏనె పోవలయు" నంచు నెంచి యా నగరి కభిముఖంబుగఁ జనుచుండ, మతిమంతుఁడను మంత్రిసుతుఁడు, సారంగధరుం జేరంగనేఁగి, "పోవలదు పోవలదు పరాకు రాకుమార! నన్ను మన్నన చేసి యిన్ని వితంబుల నేలు నేలికవు గావునఁ గన్న కార్యంబు విన్నవింపక యుండిన దోషంబు. కనుక తోచిన విధంబు విన్నపంబు చేసెద. వివేకివి గాని మఱొకండవు గావు. ఎన్నండు లేని యోజన సేయుదురే? ఈ కార్యం బొనర్చిన హాని వాటిల్లు. ఇక్కార్యంబు సేయఁదగదు. ఆ తావునకుం బోయిన నిందలు వచ్చు. ఆ తావునకుం బోవంజనదు. పోరాని చోటులకుఁ బోయిన రారాని మాటలు వచ్చు. ఇంత యెఱుంగవె? ఇంత యేమిటి కంటివేని ధారణివల్లభుం డూరలేఁడు. నీవు చక్కెర విలుకాని ధిక్కరించు చక్కఁదనంబున నివ్వటిల్లు జవ్వనంబును విలాసినీవిభ్రమకంబులైన విభ్రమంబులు గలవాఁడవు. తిమురు కొమరుఁబ్రాయంపు సొంపున నింపు మీఱు నా చంపకగంధి. అటు గావున నీ వొంటిగ నవ్వాలుగంటి యింటికిఁ బోవఁజనదు. ఆటలా? యేటి మోమోట? నా మాట వినుము. రాజుల వృత్తంబుమ రాజవదనల చిత్తంబు నెఱుంగంగూడదు. "

ఇందు చేమకూర వేంకటకవి పద్యపంక్తుల తోపాటు, సముఖము వేంకటకృష్ణప్ప నాయకుని స్వతంత్రవచనపంక్తులును కలవు. అందు "పోవలదు పోవలదు పరాకు రాకుమార" , "ఇక్కార్యంబు సేయందగదు. ఆ తావునకుం బోయిన నిందలు వచ్చు. ఆ తావునకుం బోవంజనదు. పోరాని చోటులకుఁ బోయిన రారాని మాటలు వచ్చు." "నీవు చక్కెర విలుకాని ధిక్కరించు చక్కఁదనంబున నివ్వటిల్లు జవ్వనంబును, విలాసినీ విభ్రమకంబులైన విభ్రమంబులు గలవాఁడవు. తిమురు కొమరుఁ బ్రాయంపు సొంపున నింపు మీఱు నా చంపకగంధి. అటుగావున నీ వొంటిగ నవ్వాలుగంటి యింటికిఁ బోవఁజనదు. ఆటలా? యేటి మోమోట? నా మాట వినుము" అను పంక్తులు సందర్భో చితములైన స్వతంత్రరచనలు.

వంగలసీనయ్య: ఇతని కృతులు 1. మన్నారురంగపదములు. 2. రామానుజ విజయము. పదములు నాలుగైదు లభించినవి[39]. రామానుజవిజయము అనుపలబ్ధము.

ఇతడు కృతికర్త మాత్రమే కాదు; కృతిభర్త కూడ. శేషము వేంకటపతి శశాంకవిజయము వంగలసీనయకు అంకితము. అందు సీనయ వివరములు కలవు. ఇతడు విజయరంగ చొక్కనాథుని మంత్రి. అతని వలన మందిరారామగ్రామములు. చీనిచీనాంబరములు, నవరత్నఖచితభూషణపేటికలు, చేటికలు, హాటకాందోళిక, శిబిక, భద్రాసనము, డోలిక మొదలైనవి వడసిన వాడు. సంగీతవిద్యావిశారదుడు. వీణానివాదవినోదభూలోక నారదుడు. తర్కవేదాంతవ్యాకరణశాస్త్రసమ్మతానర్ఘళోపన్యాసకుడు. రామానుజదివ్య చరిత్రప్రబంధమును వేంకటేశ్వరునికి అంకిత మిచ్చిన వాడు. పదపద్యగద్యరచనా

భోజుడు. (23వచ.అవ.) పాండ్యేశ్వరస్నేహాలంకృతుడు. (57వ.6వ.) శ్రీమన్నరురంగనామాంకితగేయరచనాప్రసిద్ధుడు. (67ప.అవ.) ఆలంకారికసమ్మతోజ్జ్వల కవిత్వాగాధుడు. (47ప.1ఆ.) గాయకరత్నము. (145ప.2ఆ.) నాటకదండకరచయిత. (205ప. 4ఆ.)

ప్రసిద్ధమైన "శివపూజాపరురాలనురా" అను పదము వంగల సీనయ పదముగ ప్రసిద్ధము. పదమునందు మన్నారురంగా అని కలదు. "పోపోరా మన్నారురంగా మాట్లాడ కురా" అనుట వ్యంగ్యము కావచ్చును. "నే శ్రీవైష్ణవుడంటే చేరనురా, రుద్రాక్షసరులు త్రెంచకురా, నామము తోడ భూతి కూర్పకురా" అనుట కూడ వ్యంగ్యమే అగునా? అంతేకాదు. మన్నారురంగడు శ్రీమహావిష్ణువు అగునుగాని, శ్రీవైష్ణవుడగునా?- పదమునందు "శివదీక్షాపరురాలనురా" అనియేగాక, "పంచాక్షరీజపపరురాలనురా" అని కూడ కలదు. ఈ పదము శైవులకు మోదావహమగును. వైష్ణవులకును మోదావహమగుట వైపరీత్యము. ఎవరో శివపూజాపరురాలు -స్త్రీ-రచించిన పదము, సీనయ పదములలో చేరిపోయినదేమో?

సంగీతసర్వార్థసారసంగ్రహములోని మఱొక పదమిది:

"వాడెవరో మనమెవరో - వనితరో యీ వట్టి వాదేల పోపోవే ....
నాడు వాడే మన్నారురంగని చెలిమి కూడదని మల్లాడలేదటవే,
యిపుడేటి దిటవే? ....
వెనరువాడమకొంటివా - వాని పొలుకువ నేటివరలో గంటివా - ఏటిమాట
అనుకూలు డవువంటివా దానిపై వాని యాసకు మితిగొంటివా - పదివేలైన
వివావె యింతటి తెలివి వలద - తను వెఱుంగని శివము గలదా? "

ఇందు క్షేత్రయ్య ధోరణి కలదను మాట యథార్థము.

**శేషము వేంకటపతి:** ఇతని కృతి శశాంకవిజయము. వంగల సీనయ్యకు అంకితము. కవ్యంకితము. సీనయ విజయరంగచొక్కనాథుని మంత్రి అని, శేషము వేంకటపతి సముఖము వేంకటకృష్ణప్పనాయకుని ఆప్తసఖుడని పూర్వోక్తము. వేంకటకృష్ణప్ప నాయకుడు "శేషము వేంకటపతి, బుణిగె కృష్ణకవీంద్రుడు" అని పేర్కొనుటవలన అహల్యా సంక్రందనము రచనాకాలము నాటికి వేంకటపతి కవీంద్రుడు కాడని అనిపించును. తర్వాత శశాంకవిజయము రచించిన కవీంద్రుడగును. కనుక అహల్యాసంక్రందనము తర్వాత శశాంకవిజయము రచింపబడినట్లు గ్రహింపవచ్చును. అహల్యాసంక్రందనము రచనాకాలము 1715 ప్రాంతము కావున, శశాంకవిజయము రచనాకాలము 1720 ప్రాంతము కావలయును.

సముఖము వేంకటకృష్ణప్పనాయకుని అహల్యాసంక్రందనము వలె, శేషము వేంకట పతి శశాంకవిజయము కూడ పారదారికశృంగారము పరాకాష్ఠదశ వందిన కావ్యము. అహల్యాసంక్రందనమునందు అహల్య అధీర. ఇంద్రుడు మహాధీరుడు. శశాంక

విజయమునందు తార మహాధీర. చంద్రుడు అధీరుడు. అహల్య అధీర అగుట వలన యోగిని అవసరము కలిగినది. తార మహాధీర అగుట వలన భోగిని అవసరము లేక పోయినది. ఆమెయే భోగిని అయినది. అది పదియేను పద్యములందు కలదు.

" ప్రమదారత్నము తార చంద్రు నెనయన్ భావించుఁ దోడ్తోన న్యా
యము గాదంచుఁ దలంచుఁ దాళఁగలనా యంచున్ వితర్కించు వం
శము శీలంబు మదిం గణించును ప్రతిష్ఠ ల్బూచినం దీరునా
తమి యంచుం గమకించు భీతి మదిలోఁ దర్కించుఁ గాంచు న్వెతన్." 71ప. 2ఆ.

చూపులు విలుపును. రాపులు కలుపును. తీపులు తెలుపును. రూపులు కొలుపును. ఇంట మెలగెడు చంద్రుని ఇట్లు ప్రశ్నించును.

" జిలుఁగువల్వ వదల్చి చెంగావి ధరియించి,
యది బాగొ యిది బాగొ యనుచు నడుగు
తైక సడల్చి యారజపుఁ బైట ఘటించి
యది మేలొ యిది మేలొ యనుచు నడుగు
జడ విచ్చి వింతగా జాఱుకొ ప్పమరించి
యది నీటొ యిది నీటొ యనుచు నడుగు
హెచ్చు ముక్కర దీసి పచ్చతళ్కు ధరించి
యది లెప్పొ యిది లెప్పొ యనుచు నడుగుఁ
గమ్మకస్తురితిలకమ్ముఁ జిమ్మి పమ్మ
దమ్ము గ్రమ్మఁగ జిగి కుందనమ్ముఁ దళుకు
తిలక మలికమ్మునను జిగి దొలఁకఁ బూని
యందొ యిందొ యందమం చడుగువాని." 81ప. 2ఆ.

తార తోఁదోపులకు, తరితీపుంజూపులకు, కోపులకు, నేపులకు, వైపులకు చంద్రుని మేను పులకరించును. హృదయము చలించును. అయినను,

" కులుకులాడిని ప్రేమ దొలుకుఁజూపులఁ జూచి
యలుకు మీఱఁగ దోసమనుచుఁ దొలఁగు
కవకాంగి తనఁజేరఁ జెవకంగ నుంకించి,
వెనుకటి కిది మాట యనుచు వెఱచు
సరసిజాననతోడ సరసమాడఁ దలంచి,
వరుస కాదంచు భావమున నెంచు
నెలఁతఁ గన్గొని సొక్కి నిచ్చలు తనకిదే
మరులాయెనని హరిస్మరణ సేయు
నొంటిపాటున నవ్వాలుగంటి వంటి
యొంటుకొనఁ జూచి యోహో యయుక్తమనుచుఁ
దలఁచుఁ దలఁచియు మరునికిఁ దల్లడిల్లు
మల్లమున మండు యామినీవల్లభుండు." 89ప.2ఆ.

అయినను చంద్రుడు కామపరవశుడగును. "ఈ మిటారి మైచాయ యొకింత సోఁకినను జాలు నదే కనకాభిషేకమౌన్" అని తలంచును. "దీని ముద్దు చెక్కిట నుంచు మోము మోము, ఈ యింతి మోవిపై నానించు మోవి మోవి, ఈ కలికి చన్గవఁ బట్టు కరము కరము, ఈ సుదతి అందము చూచు చూపు చూపు" అని దిగజాఱును. వివిధశాస్త్రములకు వినూతనార్థములు భావించును.

" పాలయల్కలోన నీ పాలఁతుకతోఁ గూడఁ
దర్కించు వేడుక తర్కశాస్త్ర
మంగజుకేళి నీ యంగనతోఁ గళా
స్వరములు పల్కుటే శబ్దశాస్త్ర
మదనమౌ తమి దీని యాస్యంబున నిజాస్య
యోగమొనర్చుటే యోగశాస్త్ర
మిమ్ముగా నిమ్ముద్దుగుమ్మ గుణమ్ములు
సంఖ్య యొనర్చుటే సాంఖ్యశాస్త్ర
మలఁతి కొనగోట నొక్కి యీ యతివ నీవి
మోక్ష మొనరించుటే యెల్ల మోక్షశాస్త్ర
మేమ నీవని పైకొనుటేమ ద్వైత
మిరువు రొకటైన నద్వైత మిద్ధరిత్రి." 101ప. 2ఆ.

బృహస్పతి ఇంద్రుని యాగము నిర్వహించుటకు బయలుదేరును. తారకు పతివ్రతాధర్మములు బోధించును. తార పతివియోగము భరింపలేనని వగలు పోవును. తప్పదని బృహస్పతి చంద్రుని ప్రేమతో చూడుమని చెప్పును. "ఆత్మకుమారునిం బలె (ఆత్మకు + మారునిం బలె ) యా యత్రికుమారుని పోషింతునని తార చెప్పును. చంద్రుడు బృహస్పతిని సాగనంపి వచ్చును. వచ్చిన వెంటనే తార, చంద్రునికి వరగంధామలకము పెట్టి, అభిషేకమొనర్చి భోజనము చేయించును. భోజనము చేయించుటలోనే తార యోజనము తారాడును.

"విరహాగ్ని నీ రీతిఁ గరఁగె నా మానసం
బనినట్ల నెన్న గాచిన ఘృతంబు
పాలఁబోల్పయను నీ పాలు పేయుట కిదె
యానవాలన్నట్టు లావవాలు
వెమ్మె నీ రీతి నా కమ్మోవిఁ గ్రోలుమీ
పూని నీవన్నట్టు పానకంబు
తన వచోమాధుర్యమెనయునా యివి చూడు
మన్నట్టు మేలి రసాయనములు
నొప్పుగా గిన్నియల మంచి యుపచరించి
పాణిపంకజకంకణక్వాణ మెసఁగఁ
బువ్వుసరటిని విసరుచు భోజనంబు

కాంత సేయించెఁ దన మనఃకాంతునకును. 15ప. 3ఆ.

అనంతరము తార అలంకరించుకొని శృంగారవనమునకు వచ్చును. అక్కడున్న చంద్రుడు, ఆమె సౌందర్యమునకు అవశుడగును. ముప్పదివద్యములందు వర్ణించుకొనును. తార సమీపమున కూర్చుండును. చంద్రుడు ఎందుకు వచ్చితివని ప్రశ్నించును. వెంటనే తార వచ్చిన పని వాచ్యముగనే చెప్పును. (60-63ప.3ఆ.) చంద్రుడు పతివ్రతాధర్మములు పలుకును. తార తారాపథమును తాకును.

" మగని నతిక్రమించుటలు మానినికిం దగదంటి వొప్పితిన్
మగఁడు మగం డనంగ మది మక్కువ యెవ్వనియందొ కంటికిం
పగు నతఁ డెవ్వఁడో యతఁడె యాతనిఁ గాదని యమ్మ్యఁ గూడినన్
దగదిది కాముకీజనుల ధర్మము మర్మము నే నెఱుంగుదున్. 79
బాళి మనంబునం దణఁచి ప్రాయము వ్యర్థము చేసి యూరకే
దూలిన నేమి పుణ్యమని తోఁచెను ము న్నల దారుకావన
స్త్రీలు గిరీశునిన్ గలియరే వ్రజభామలు శౌరిఁ గూడరే
యాలలనాశిరోమణుల కందున నిందున నేమి చెప్పుమా. 80.

కన్నకూఁతురటంచు నెన్నక భారతీ
తరుణిఁ గూడఁడె నీ పితామహుండు
మేనత్త యను మేర మీఱి రాధికతోడ
నెనయఁడే నిన్న నీ యనుఁగుబావ
వదినె యంచు నొకింత నావి లేకయె జ్యేష్ఠు
నెలఁతతోఁ బొందఁడె నీ గురుండు
మునిపత్ని యన కహల్యను బట్టఁడే నీదు
సహపాఠి యగు పాకశాసనుండు
ఇట్టి మీ వారి నడతలు గట్టి పెట్టి
యమ్మ నే చెల్ల! న్యాయంబు లాడె దౌర!
కడకు నీ రంకు నీ నెఱుంగని వితాన
దూరెదవు నమ్ము జలపోరి దోసకారి! 81.

లోకములోనఁ గొంద ఱబలు ల్పతులం దనియింపలేక య
స్తోకమనీష నన్యపురుష ల్దమకాంతల నంటకుండఁ దా
టాకులలోన వ్రాసిరి పరాంగనఁ గూడినఁ బాపమంచు న
య్యాకులపాటుఁ జూచి యిపు డాకులపా టెనయంగ నేటికిన్. " 82ప. 3ఆ.

ఇట్లు తార ఇంకను (83-88ప. 3ఆ.) హేతువాదము సేయుటయేగాక, చంద్రుని "పైఁబడి కౌఁగిలిం"చును. (89ప.3ఆ.) "హా! శ్రీహరీ!" అన లేదు చంద్రుడు. పరవశుడయ్యెను. తారాచంద్రుల సంభోగశృంగారము పాతికపద్యములందు కలదు. (89-114ప.3ఆ.) అది పరాకాష్ఠదశ నందిన పారదారికశృంగారము.

ఇంత చేసి తార, ఇంటికి వచ్చిన బృహస్పతిని ఎంత గౌరవించునో!

" పాదములు గడిగి పయ్యెద
చేఁ దడియొత్తి పదజలము శిరమునఁ గొని యా
వేదండయాన యతనికిఁ
గైదండ యొసంగి వినయగౌరవ మెసఁగన్. 5.
ఇంటికిఁ దోడి తెచ్చి మణిహేమమయోజ్జ్వలపీఠి మంచి ప
య్యంట చలింపఁగా సురటి వల్లన వీచుచుఁ బ్రాణనాథ! న
న్నొంటిగ మంచి యీ కరణి నుండుదురే? క్రతువాయెనే? సుఖం
బుంటిరె యిన్నినాళ్ళు? పురుహూతబహూకృతిఁ గంటిరే? యనన్." 6ప. 4ఆ.

బృహస్పతి జరిగినది దివ్యదృష్టిని తెలిసికొని తారను ప్రశ్నించును. తార "తప్పొనర్పనివారు ధరణిఁ గలరె?" అని తప్పును ఒప్పుకొని బృహస్పతి పాదముల మీద పడి కన్నీరు మున్నీరుగా ఏడ్చును. బృహస్పతి కరుణించును. చంద్రుని పంపించివేయును. అయినను తారకు చంద్రవిరహము! (28-39ప.4ఆ.) చంద్రునికి తారావిరహము! (46-97ప.4ఆ.) బాల్యసఖి రాయబారము ఫలించి తార,

"కపటయుతాంతరంగమున గ్రక్కున ముందటి జాము కూటమిన్
స్వపతిని నిద్రఁబుచ్చి తనపై వతఁ డుంచిన కేల్దెమల్చి పా
న్పువుపయి మంచి లేచి పదనూపురము ల్వదలించి తల్పునే
రుపు తగఁ బట్టి గొల్లెమిడి రూపవతీమణి సంభ్రమంబునన్." 118ప.

xxx xxx xxx

- పొసఁగ కటిపన్ని పాలుపు ముసుఁగు వెట్టి
చాల పొమ్ములు పూలు బాగాలుఁ గొనుచు
గురుని జవరాలు తమ తోఁట గోడ దాఁటి
శశిఁ గదియ వచ్చె-" 119ప.4ఆ.

చంద్రుడు సౌఖ్యరసానుభూతిని తేలి, తారను తోడ్కొని ప్రతిష్ఠానపురమునకు పోవును. తారాచంద్రులు లేచిపోవుట తారస్థాయికి చేరిన పారదారికశృంగారము.

తారాశశాంకవృత్తాంతము పురాణములందు కలదు. కాని పచ్చి శృంగారము లేదు. అంతేకాదు. తారాశశాంకుల ప్రవర్తనమునకు సమర్థనము లేదు. ఖండనమే కలదు. కాశీఖండమునందు "భూభుజుల తప్పె యది వారిఁ బొందియున్న ధరణి సామ్రాజ్యభారంబు తప్పు గాక", "బాహ్యశత్రులఁ బరిహరింపంగవచ్చు నంతరారుల నిర్జింప వలవి కాదు." అని శ్రీనాథుని పోల్లుంఠనము కలదు. (202,203ప.4ఆ.) అట్టిది శేషము వేంకటపతి లక్ష్యము సమర్థనమే. శశాంకవిజయమను గ్రంథనామమే అందుకు సాక్ష్యము. అది శశాంకుని అనంతరకథలోని యుద్ధవిజయమే కాదు; అసలు కథలోని పారదారికశృంగారవిజయము కూడ.

" క్షితిలో స్త్రీవ్యసనం బే
యతిగర్హిత మందుస్రైఁ బరాంగన యా పై

మతశీలుఁడైన గురుసతి
పతివ్రత నీ వాచరింపఁబడియె నీకున్." 176ప. 4ఆ.

అను ఇంద్రసందేశమును "ఒజ్జలపుచ్చకాయవిత"మని చంద్రుడు అధిక్షేపించుట, (181-82ప.4ఆ)

" నిముఁ జేపట్టి వరం బిటు
లమవుగ విచ్చిన విధాత ననవలెఁ గాక
న్నిను దూఱం బని గలదే
వివరా నీ గర్వమెల్ల విడిపింతు ననిన్." 97ప. 5ఆ

అను నిటలాక్షుని "దారువనమౌనికాంతాజారుఁడ"వని చంద్రుడు ప్రత్యాఖ్యానించుట (99-101ప.5ఆ.) కవికి తారాశశాంకుల యెడ సానుభూతికి తార్కాణము.

తార హేతువాదము, పరపురుషగమనము; చంద్రుని పరదారాగమనము, తారా చంద్రుల వచ్చిశృంగారము రసికులకు రాసలీలయేగాని, సహృదయులకు హృదయంగమము కాదు. సమాజమునకు శ్రేయస్కరము కాదు. కనుక అహల్యా సంక్రందనము వలె శశాంకవిజయమును అసత్కావ్యము.

కుందుర్తివేంకటాచలపతి: ఇతని కృతులు 1. భారతము. వచనకావ్యము. 2.భాగవతము. వచనకావ్యము. 3. రామాయణము. వచనకావ్యము. 4. బహునాటకములు 5. అనేకచాటువులు (39ప.అవ.మి.ప.) 6. మిత్రవిందాపరిణయము. 7. కార్తీకమాహాత్మ్యము. ఇందు చివతి రెండు గ్రంథములు మాత్రమే ఉపలబ్ధములు అందు రెండవది అముద్రితము. మిత్రవిందాపరిణయము శ్రీరంగపతికి, కార్తీక మాహాత్మ్యము గోపాలస్వామికి అంకితములు- రెండును దైవాంకితములు. ఇతడు మధురవిజయరంగచొక్కనాథుని వలన "భర్మమణీశిబికాదిసంపద" లందినట్లు మిత్రవిందాపరిణయమునందు కలదు. తీర్థపుర (తురయూరు?) వేంకటాచల భూపాలుని వలన "మహత్తరాంబరాభరణకల్యాణపల్యంకికాదిబహుబహుమానము" లందినట్లు కార్తీకమాహాత్మ్యమునందు కలదు. విజయరంగచొక్కనాథుని కాలము 1704-32. కాఁబట్టి మిత్రవిందాపరిణయము రచనాకాలము 1730 ప్రాంతము, కార్తీకమాహాత్మ్యము రచనా కాలము 1735 ప్రాంతము కావచ్చును.

మిత్రవిందాపరిణయము:- ఇందు మిత్రవిందాశ్రీకృష్ణుల పరిణయము ఇతివృత్తము. ఆశ్వాసాంతగద్యను "కథాశువేంకటాచలకవిప్రణీతంబైన" అని కలదుగాని, మిత్రవిందాపరిణయమునందు కథ ఆశుధార కాదు. మందగతి. కావ్యమెల్ల వర్ణనాభూయిష్ఠము. చిలుక రాయబారము రసము చిలుకరించువది. జయసేనరాజా తనయ మిత్రవింద, శ్రీకృష్ణునికి చిలుకచేత ప్రేమలేఖ పంపించును. విరహవిహ్వలయైన మిత్రవిందకు చిలుక ధైర్యము చెప్పుట చిత్రము.

" ఏఁ గలుగంగఁ జింతిలఁగ నేటికి నేఁటికి ద్వారకాపురం

బే గతినైవఁ గాంతు జగదీశ్వరుని న్వాడగందు నిందు నా
భోగిశయామఁ దెత్తు నిదె వోయెదనమ్మ నితాంతవేదనం
దోఁగకు మమ్మ యమ్మరుని తూపులఁ గుందకుమమ్మ యిమ్మెయిన్." 69ప.3ఆ.

ద్వారకాపురమున కేగి, శ్రీకృష్ణుని గాంచి, రాయబారము మొదలుపెట్టి, మిత్రవిందాసౌందర్యముమ వర్ణించుటకు చిలుక ఉపక్రమణిక నిపుణము.

" జివ్వా లొక రెండువేలు గాంచిన ఫణీంద్రుఁ
డతివ సౌందర్య మెన్నలేఁ డైనఁ బక్షి
నైన నేఁ బల్కఁ బూనుట హాస్యకరము
గాదె కానిమ్ము తోఁచిన గతి వచింతు." 96ప. 4ఆ.

మిత్రవిందమ వివాహమాడుమని కోరిన చిలుకను, కృష్ణుడు అంగీకారము తెలిపి, పంపిన విధము పముచితము.

" అనుచు నవరత్నకీలితమైన పొమ్ము
చిలుక నెమ్మేనఁ గీలించి చిత్తమలరఁ
గండచక్కెర బత్తెంబు గట్టి పమప
మఱలెఁ జక్రికి మ్రొక్కి యా మరువి జక్కి " 122ప. 4ఆ.

ప్రథమాశ్వాసమునందు అవంతీపుర(5-24ప.), పుష్పలావీ (25-31ప.), జయసేన రాజ (32-40ప.), వేంకటాచల (48-55ప.), శేషాద్రి (56-57ప.), గ్రీష్మర్తు (71-76ప.), వర్షర్తు (77-85ప.), శరదృతు (86-90ప.), శేషశైలాధినేతృ (91-92ప.), వర్ణనములు, రాజనీతి (41-47ప.), వేంకటేశ్వరస్తుతి (94-95ప.) కలవు. ద్వితీయాశ్వాసమునందు దౌహృద (10-16ప), మిత్రవిందాజనన (17-21ప.), మిత్రవిందాబాల్య, (22-28ప.) యౌవనదశా (30-60ప.), వసంతర్తు (74-82ప.), వనవిహార (80-118ప.) వర్ణనములు కలవు. తృతీయాశ్వాపమునందు కాసార (4-9ప.) జలక్రీడా (10-33ప.), మనోజపూజా సన్నాహ (34-44ప.), మనోజపూజా (45-55ప.) వర్ణనములు కలవు. చతుర్థాశ్వాసమునందు మిత్రవిందాచిత్రపటరచన (4-6ప), మిత్రవిందావిరహా (47-53ప.) శ్రీకృష్ణవిరహా (123-145ప.) వర్ణనములు కలవు. పంచమాశ్వాసమునందు సూర్యాస్తమయ (5-18ప.), జ్యోత్స్నా (19-27ప) మన్మథాద్యుపాలంభ (28-45ప) సూర్యోదయ (46-52ప) మిత్రవిందావివాహప్రయత్న (53-62ప.) మిత్రవిందావిచార (63-84ప.) వర్ణనములు కలవు. షష్ఠాశ్వాపమునందు మిత్రవిందాశ్రీకృష్ణుల వర్ణనముల తోపాటు యుద్ధ (78వచ)రత్నాకర (87-9ప6) వివాహ (102-142ప.) వర్ణనములు కలవు.

ఇంత వర్ణనాభూయిష్ఠమైన కావ్యము దక్షిణాంధ్రయుగమునందు మఱొకటి కానరాదు. మిత్రవిందాపరిణయములోని వర్ణనములు ప్రౌఢములే కాని, ఆముక్తమాల్యదలోని వర్ణనముల వలె సహజప్రకృతిచిత్రణములు కావు. వసుచరిత్రములోని వర్ణనముల వలె ఉత్ప్రేక్షావల్లరులు.

శ్రుతి మించిన శృంగారము లేకపోవుట మిత్రవిందాపరిణయము విశేషము.

తిరుమలయ్య : ఇతని కృతి చిత్రకూటమాహాత్మ్యము. తిల్లగోవింద నాటకమని నామాంతరము. ఇది "విజయరంగచొక్కనాథుని నగర ... వసించు" శౌరికి అంకితము. ఇతడు పార్వతీపతిభజననిర్మలమతి. విష్ణునిత్యసేవకుడు. సంగీత సాహిత్యచతురుడు. విజయరంగచొక్కనాథుని వలన కర్ణభూషణములు, కరభూషణములు, స్వర్ణాంబరములు, సరిపెణలు, తాళి, అందలము, అగ్రహారము మొదలైన ఘనబహుమానములు పడసిన వాడు. చిత్రకూటమాహాత్మ్యము వచనచమత్కారవైఖరి మీఱ, నర్తనయోగ్యముగ రచించినది. (నాటకాంతద్విపద.)

విజయరంగచొక్కనాథుని తరమునందు, మధురశాఖను పదపద్యగద్యరచనము తోపాటు యక్షగానరచనమును కలదు. విస్తృతము కాదు. పరిమితము. ఉపలబ్ధమైనది తిరుమలయ్య చిత్రకూటమాహాత్మ్యమే. ఈ పేరునుబట్టి చిత్రకూటక్షేత్రమాహాత్మ్య ప్రతిపాదకగ్రంథ మనిపించుట సహజము. క్షేత్రమాహాత్మ్యమువకు సూత్రధారణము లేకపోలేదు గాని, నాటకేతివృత్తము తావన్మాత్రము కాదు. తిల్లగోవిందనాటక మను నామాంతరము సార్థకము. తిల్ల అన పార్వతి. చిత్రకూటక్షేత్రమునందు తిల్లాదేవీ పరమేశ్వరుల ఆలయము తోపాటు గోవిందస్వామి ఆలయమును కలదు. కవి "పార్వతీ పతిభజన నిర్మలమతి, విష్ణునిత్యసేవకుడు" కావున, ఉభయకుశలముగ తిల్లాదేవీపరమే శ్వరుల నాట్యప్రదర్శనముల పంతమునకు, గోవిందస్వామి ప్రాడ్వివాకునిగ రూపొందించిన నాటకము. అంతేకాదు. ఈ నాటకమును గోవిందుని యెదుట ప్రదర్శించినట్లు ప్రసక్తియేగాక, (పుట172.) అంతట ప్రమేయము కలదు. కనుక తిల్లగోవిందనాటకసంజ్ఞ సార్థకము.

ఇందు నాటకేతివృత్తమునందు మాత్రమేగాక, నాటకస్వరూపమునందును నవ్యత కలదు. నాటకేతివృత్తము నాలుగు రోజులు నడచిన కథ. "ఇది మొదటి నాటి సంవిధానము. రెండవ నాటి సంవిధానము." (పుట190.) "రెండవ నాటి సంవిధానము ముగిసినది. మూఁడవ నాఁటి సంవిధానము." (పుటలు200,201). "మూఁడవనాఁటి సంవిధానము ముగిసెను. నాల్గవ నాఁటి సంవిధానము." (పుటలు208,209). అను కవినిర్దేశములు కలవు. ఈ నాలుగునాళ్లు ప్రదర్శనకాలము కాదు. కథాకాలము. ప్రతిదినసంవిధానము తర్వాత ఎడనెడ, ప్రసంగము కైవారము కలవు. ప్రసంగములందు నాటి కథాసంగ్రహము కలదు. కైవారములందు గోవిందునికి పరాకులు కలవు. గోవిందుడు ప్రాడ్వివాకుడు మాత్రమే కాదు; ముఖ్యప్రేక్షకుడు. ఏవంవిధమైన నాటక సంవిధానము నూతనవిధానము.

మొదటి నాటి కథ:- పార్వతి చిత్రకూటమునందు తిల్లాదేవిగ అవతరించును. పరమేశ్వరుడు చిత్ర కూటములోని తిల్లవనమునకు వచ్చును. పరమేశ్వరుని నటనబిరుదుకటకమును తిల్లాదేవి అపహరించును. బిరుదందె గుఱించి వాదోపవాదములు జరుగును. న్యాయనిర్ణయము కొఱకు బ్రహ్మ దగ్గఱకు బయలు

దేరుదురు.

రెండవ నాటి కథ:- తిల్లాదేవీపరమేశ్వరులు తమ వాదములు బ్రహ్మకు నివేదింతురు. బ్రహ్మ న్యాయనిర్ణయమునకు తగిన వ్యక్తి విష్ణువని చెప్పును. ముగ్గురు విష్ణువును సందర్శింతురు. తిల్లాదేవీపరమేశ్వరుల వాదములు విని, తిల్లవనమునందే తీర్తునని, తిల్లవనమునకు పంపించును.

మూడవనాటికథ:- విష్ణువు తిల్లవనమునందు విశ్వకర్మచేత నిర్మింపజేసిన కనక సభయందు తిల్లాదేవీపరమేశ్వరులు నాట్యవిద్యలు ప్రదర్శింతురు. ఇద్దఱి నాట్యవిద్యలు మహత్తరములని విష్ణువు, తిల్లాదేవీపరమేశ్వరులకు గాంధర్వవివాహము జరిపించును. కనకసభయందు తిల్లాదేవి అయిన పార్వతి, పరమేశ్వరుడు; విశ్వకర్మచేత నిర్మింపజేసిన మఱొక మందిరము మణిసౌధమునందు, తిల్లగోవిందుడైన విష్ణువు అధివసింతురు.

నాల్గవ నాటి కథ:- పార్వతీపరమేశ్వరుల సరసములు,సల్లాపములు,సంభోగములు, వనవిహారములు, జలక్రీడలు మొదలైనవి.

ఇందు జగత్పితలైన పార్వతీపరమేశ్వరుల సంభోగములు వినా, కడమవిషయము లెల్ల సముచితములు. రచన సరళము. రసవత్తరము. పరమేశ్వరుడు నిగర్వి. పార్వతి సగర్వ.

" స్వామి:- నిదురఁజెందియున్న నాదు - పదమునందుఁ బరగు వందె
వదురు బెదురు లేక యట్టు - లపహరింప నాయమా!
అమ్మ:- నటనలీల దంటనైన - నాదు వనము నీవు చేరి
యిటుల వందెబిరుదు పూన - నేమ తాళియుందునా? " పుట 189.

" స్వామి:- వనజగంధులతోడ - వాదింపఁదగవుగా
దని నుడివి నాదు బిరు దిమ్మనవలయునయ్యా
అమ్మ:- నటనలీలల నితఁడు నను గెలిచి యీ బిరుదు
కటకము గ్రమ్మఱఁ గైకొనుట లెస్స. " పుటలు 198, 199.

"స్వామి:- అడుగిడెదు నపుడె కం - దెడు పదములను నీవు
విడివడి నాదు వెం-బడి నాడ నేర్తువా?
అమ్మ:- ఒక మూలయం దొదిగి - యుండి యాడెదు నీవు
ప్రకటముగ సభను న - ర్తన మొనర్చుదువా " పుట 204.

వెలిదండ్ల అళఘురి: ఇతని కృతి సుదంతాకల్యాణము. పద్యకావ్యము. అముద్రితము. ఇతడు విజయరంగచొక్కనాథుని ఆస్థానకవి. ఇతని తండ్రి పెద్ద రాఘవరాజు విజయరంగచొక్కనాథుని మంత్రి. విజయరంగచొక్కనాథుడు అళఘురిని, శ్రీరంగపతికి కృతి రచింపుమన్నట్లు అవతారికయందు కలదు.[88]

" అదృశ్యయంవ్యక్తమైన రంగస్థలం
బే నృపతికి రాజధాని యయ్యె
నధికచంచలమైన యల మహాలక్ష్మి యే

విభుని పూజల కిలవేలు పయ్యెఁ
బ్రత్యక్షవిరజయై పరఁగు కావేరి యే
ప్రభుని కోటకు మహాపరిఘ యయ్యె
రాజార్హమైన చిరత్నరత్నంబు లే
దంటపీమకు మిట్టపంట యయ్యె
నట్టి నృపపాలిత ........ సమిద్ధ
పంచతిరువటరాజపప్తాంగపాళి
శాత్రవీకంత సూత్రశాసవ . శూలి
శ్రీవిజయరంగచొక్కధాత్రీశమౌళి.
........ విందు కొలువుండి వేడ్క న న్బిలువనంపి,
నాకు నారోగ్యభాగ్యముల్ నీకుఁ బ్రతిభ
విప్నవారికి హర్షంబు విస్తరిల్లఁ
గృతి యొనర్పుము శ్రీరంగపతికి ననిన
నాఁటి నెమ్మది నొక హోయి నాటి రేయి. "

కాఁబట్టి సుదంతాకల్యాణము రచనాకాలము 1705 ప్రాంతము కావచ్చును. ఇందు సుదంతాశ్రీకృష్ణుల వివాహము ఇతివృత్తము. వర్ణనాభూయిష్ఠము. ఒక పద్యము:

" లలితరసాలసాలపరిలంబిమహీతలచుంబివల్లికాం
చలయుగళంబులం బెనచి చయ్యన నుయ్యెల లూఁగు వేళలన్
గులుకు మిటారి జవ్వనపుఁగొమ్మలు పాల్చిరి పంచకాండకుం
డలితధమర్లతాంతరకనత్కనకాంబకరేఖలో యనన్, "

బద్దెపూడి ఎల్లభూపాలుడు: ఇతని కృతి యువజనహృదయానందము- రెండు ఆశ్వాసములు మాత్రమే లభించినవి[89]. ఇందు శశాంకవిజయ వృత్తాంతమే ఇతివృత్తము. ఇతడు రేపూరి అనంతకవి శిష్యుడు. విజయరంగ చొక్కనాథునికి ఆస్థానకవి కాడు. అభ్యాగతకవి అగును. ఇతని సుదీర్ఘమైన, బహుబిరుదబంధురమైన ఆశ్వాసాంతగద్యము "మధురదేశాధీశవిజయరంగచొక్క నాథధరానాథవితీర్ణసువర్ణదండప్రకీర్ణధ్వజచ్ఛత్రపల్యంకికా ప్రముఖబహువిధ రాజలక్షణానుషంగ, బుధవిధేయాంతరంగ, బద్యపూఁడి పురవరాధ్యక్ష యెల్లభూపాలహర్యక్ష ప్రణీతంబైన" అని కలదు. యువజనహృదయానందము అముద్రితము.

వెలగపూడి కృష్ణయ్య: ఇతని కృతులు 1. మాలినీమాధవీయము. 2.గౌళికాశాస్త్రము 3.కందపద్యశతకము. 4. వేదాంతసారసంగ్రహము. 5.భానుమద్విజయము. ఇందు మొదటిది, మూడవది, నాల్గవది అనుపలబ్ధములు. గౌళికా శాస్త్రము ముద్రితము. ఏకాశ్వాసగ్రంథము. బల్లి పలుకు శాస్త్రగ్రంథము. వేదాంతసారసంగ్రహము అనుపలబ్ధమైనను, అది వచనకావ్యమని భానుమద్విజయము నందు కలదు. భానుమద్విజయము సటీకగ సముపలబ్ధమైనను అముద్రితము. కృష్ణయ తండ్రి నరహరి విజయరంగచొక్కనాథునిచేత సమ్మానితుడు.[90]

" శ్రీవిజయరంగచొక్కమ
హీవరకరుణాకటాక్షవీక్షణగురుసం
భావితగజాంతవరల
క్ష్మీవిభవుఁడునై నరహరి మీఋన్ వేడ్కన్.
బంగరు మొలాము గంటము
సింగారపు వెండి యొరయు క్షితి బిరుదుగ మీ
అం గని సముఖము సంప్రతి
యంగుగఁ గావించె నరహరయ్య చెలంగన్. "

నరహరి విజయరంగచొక్కనాథుని సంప్రతికరణము కావచ్చును. అతని కుమారుని కృతి భానుమద్విజయము. ఇందు భానుమంతుడను బ్రాహ్మణకుమారుడు, ఉజ్జయిని రాజకుమారి పద్మావతిని పరిణయమాడుట ఇతివృత్తము. వర్ణాంతరవివాహము మాత్రమే కృతివిశేషము కాదు. యోగశాస్త్రవిషయమును ప్రత్యేకమొక ఆశ్వాసముగ నుండుట కూడ విశేషమే. అంతేకాదు. భామమద్విజయము తన్నుల్ అరియం వెరుమాళ అను పేర, పూర్వమే తమిళపరివర్తనమందుట మహావిశేషము. అయినను తెలుగు కావ్యము ముద్రణభాగ్యమునకు నోచుకొనలేకపోవుట శోచనీయము. ఇతడు విజయరంగచొక్కనాథుని ఆస్థానకవి కావచ్చును.

శ్యామరాయకవి: ఇతని కృతి రామాయణము. వచనకావ్యము. అముద్రితము. బాల అయోధ్య, అరణ్యాకాండములు మాత్రమే లభించినవి. అందు కృత్యాది కలదు[7]. శ్యామరాయరామాయణము విజయరంగచొక్కనాథుని కరుణా కటాక్షవీక్షణములకు పాత్రుడైన వణిగ్గ్రణి సుబ్బరాయనికి అంకితము. కవి పేరు "అపహాయశ్యామరాయవిద్వత్కవి" అని కలదు. విద్వత్కవి అయినను విజయరంగ చొక్కనాథుని ఆస్థానకవి అయినట్లు లేదు. తత్కాలమధురకవిమాత్రమే. భాష గ్రాంథికము. శైలి సరళము. ఒక మచ్చుతునుక:

" - కుశుం డనెడి రాజావకు బలవంతుఁడగుచు ధార్మికుఁడై కుశనాభుఁ డనెడి కుమారుఁ డుదయించె. వా కుశనాభమహీవల్లభునికి గాధిరాజని ప్రసిద్ధుఁడగు కొడుకు కలిగె. వా గాధిభూపాలునికి మహాపరాక్రమ శాలియగు విశ్వామిత్రుఁ డనెడి మహానుభావుఁ డావిర్భవించె. మహా పరాక్రమంబుమఁ బూన్చి బహువర్షసహస్రములుభూమిని పరిపాల నంబుమఁ గావించుచు, రాజనీతిఖ్యాతిని గాంచి - "బాలకాండము.

ఇందు పుటల కొలది ఒకటే వాక్యము గాక, అలతి అలతి వాక్యము లుండుట విశేషము.

దేవకి వెంకటసుబ్బయ్య: ఇతని కృతి రామాయణము. వచనకావ్యము. అముద్రితము. ఇతడు శ్యామరాయకవి మిత్రుడు. మధురనివాసి అగును. విజయరంగ చొక్కనాథుని ఆస్థానకవి కాడు. తత్కాలమధురకవి మాత్రమే. ఇతని భాష కూడ

గ్రాంథికము. శైలి సరళము. ఒక మచ్చుతునుక:

"- రాఘవశార్దూలుండు హనుమంతునిఁ జూచి యిట్లనియె.పవననందనా! వినుము. ఈ (యీ) సముద్రంబు నన్ వేడుకొనియెడు.కాదేని మద్బాణంబుల వేడిమిఁ జూపి యింకించెద నొం(యొం)డేని బంధించెద. న(య)ది యట్లుండనిమ్ము. సముద్రలంఘనం బంత పెద్ద గాదు. నీవు పదితలల వాని పట్ట(ణ)ంబునకుఁ బోయి, చూచి వచ్చితివి గావున దాని తెఱంగు నీవలనన్ వినవలతు నా పట్టణంబునకు కోటలును గవనులును కావలియుండు రాక్షసులును గృహపంక్తులను బలంబుల సంఖ్యయు నెంతమాత్రంబు గలవు. నిక్కంబుగాఁ జెప్పుమనిన, నా(యా)ంజనేయుఁ డంజలిబంధనంబు గావించి రామదేవున కిట్లనియె. " యుద్ధకాండము.

ఇందును పుటల కొలది ఒకటే వాక్యముగ కాక, అలతి అలతి వాక్యముల రచన సాగుట విశేషము. శ్యామరాయ, వెంకటసుబ్బయ్యల మైత్రి సఫలము.

శ్రీపతి రామభద్రుడు: ఇతని కృతి హాలాస్యమాహాత్మ్యము. ఎనిమిది ఆశ్వాసముల వచనకావ్యము. ఆశ్వాసాంతగద్యమ శ్రీపతి రామభద్రునికి "శ్రీమీనాక్షీసుందరేశ్వరసాంద్రకృపారసలబ్ధకవితామాధురీధురీణ" అను విశేషణము కలదు. కావున మధురనివాసి కావచ్చును. మధురనివాసి అగుటవలన, వచనకావ్యము రచించుట వలన, వచనరచనము శ్రీరంగమాహాత్మ్య, మాఘమాహాత్మ్యముల వచన రచనను పోలుట వలన, విజయరంగచొక్కనాథుని కాలమువాడని ఒక అభిప్రాయము కలదు.[92] కావచ్చును. భాష గ్రాంథికము. శైలి సరళము. ఒక మచ్చుతునుక:

" అశ్వినీదేవతలు చూచి యిది యపరిహార్యం బనిన వారు నిరుద్యోగులై జాగులైరి. తద్రోగపరిహారార్థంబుగా నొక్క యుపాయంబు దేవ రానతీయవలయు ననిన, వరుణముఖావలోకనంబు చేసి వాసవుండు, "వినుమ మోసంబు లేదని సుధాపారసమావచనంబులు పలికినవుడు ఏ మహావ్యాధి పీడితులై, పాపకృత్యులై, యపమృత్యుపీడితులై, కాలమృత్యు వశమైన వారెవ్వరో వారందఱు సుందరమూర్తిసందర్శనంబునం బునీతు లగుదురు .... పాండ్యరాజాగ్రణీ! భక్తిప్రభావంబును నా దేవుని మహిమాతిశయంబును నీవు లెస్సగఁ బరీక్షించి తెలిసి, తల్లింగార్చనంబు గావించితివాయెనా నీ రోగంబు దొలంగు."

# కళులె వీరరాజు

మధురలోని వచనకావ్యరసాలము మైసూరునందు అంటుమామిడిచెట్టు అయినది. అంటు కట్టినది కళులె వీరరాజు. మొక్క నాటినది తుపాకుల అనంతభూపాలుడు. నీరు పోసినది కళులె వీరరాజు కుమారుడు నంజరాజు.

కళులె వీరరాజు: ఇతని కృతి ఆంధ్రవచనభారతము. ఇంటిపేరు కళివె అని పఠితము. కళువె అని ప్రసిద్ధము. రెండును ప్రమాదములే. సరియైన ఇంటిపేరు కళులె. అది గ్రామనామము. కళులె అను గ్రామము నంజనగూడు దగ్గఱ కలదు. ఆంధ్రవచనభారతమునందు ఆది, సభా, భీష్మపర్వములు మాత్రమే కలవు.

ఇతడు సంస్కృతాంధ్రకర్ణాటాదినానాభాషలందు కావ్యరచనాచతురుడు. చిక్కదేవరాయల కరుణ ప్రాప్తించిన వాడు. శ్రీరంగపట్టణసేనాధిపతి. ఇట్లు సభాపర్వాంత గద్యమునందు కలదు. ఇతని గద్యము తర్వాత, తుపాకుల అనంతభూపాలుని గద్యము కలదు. అతడు సేతుశీతాచలమధ్యభూతలమునుండి వచ్చినవాడు. కనకధారాభిషేకము గైకొన్నవాడు. సాంద్రవచనమాధురీగరిమను అధరీకరించినవాడు. ఇట్లు సభాపర్వాంత గద్యమునందు కలదు. భీష్మపర్వములోని భగవద్గీతకు ప్రత్యేకప్రతులు కలవు. అందు వీరరాజు గద్యము లేదు. అనంతభూపాలుని గద్యమే కలదు. సభాపర్వాంత గద్యమునకు భిన్నము. అది సుదీర్ఘము. ఇది హ్రస్వము. ఇందు అనంతభూపాలుడు ఉభయభాషా కవిత్వఫణీంద్రుడని కలదు. కళులె వీరరాజు రామభక్తుడు. అనంతభూపాలుడు కృష్ణభక్తుడు. ఆద్యంతపద్యములు కృష్ణ పరము.

సభాపర్వాంతమునందు గద్యములకు ముందు రచనాకాలమును తెలుపు పద్యము కలదు.

> "వెయ్యిన్ని యార్నూట వెలయు యేఁబదిరెంటి
> మీఁదటి శకవర్ష మెలమి నడుచు
> వరున సాధారణవత్సరంబువ మాఘ
> శుద్ధపంచమియందు శుభదినంబు
> వరువఁ దవర దళవాయి దొడ్డేంద్రుని
> సుతుఁడు వీరేంద్రుఁడు సుకవినుతుఁడు
> వచనభారతమందు వైఖరి నీ సభా
> పర్వంబు రచియించె -- "

శకవర్షము 1652 అవగా 1730 వ సంవత్సరము. అది సభాపర్వరచనాకాలము. ఆంధ్రవచనభారతము మొత్తము రచనాకాలము 1729-35 కావచ్చును.

పయి సీసపద్యమునందు దళవాయి దొడ్డరాజు కుమారుడు వీరరాజు సభాపర్వము రచించినట్లు స్పష్టముగ కలదు. సభాపర్వములోని వీరరాజు గద్యను అతనికి "రామాయణసభాస్థానస్థరత్నసింహాసనాధిరూఢనానా విద్వదభీష్టవరప్రదానరాజ

చిక్కదేవరాజకరుణాప్రాప్త" అను విశేషణము కలదు. రామాయణసభ అను పేరు కల ఆస్థానమునందున్న రత్నసింహాసనమును అధిష్ఠించిన, అనేకానేకవిద్వాంసులకు అభీష్టవరప్రదానములు చేసిన రాజు చిక్కదేవరాజు కరుణ ప్రాప్తించిన వాడు వీరరాజని అర్థము. కరుణాప్రాప్తుడన మంత్రి లేక, సేనాధిపతి, లేక మఱొక రాజోద్యోగి కావలయును. వీరరాజు శ్రీరంగపట్టణసేనాధిపతి అని అదే గద్యను కలదు. శ్రీరంగపట్టణము రాజధానిగ మైసూరురాజ్యపాలకుడు చిక్కదేవరాయలు. కావున వీరరాజు చిక్కదేవరాయల దళవాయి కావలయును. చిక్కదేవరాయల కాలము **1684-1704** అని పూర్వోక్తము. సభాపర్వము రచనాకాలము **1730** వ సంవత్సరము. కాఁబట్టి వీరరాజు చిక్కదేవరాయల దళవాయి అయిన కాలము **1701-1704** కావచ్చును. తర్వాత దళవాయి కాకపోవచ్చును. "గీర్వాణాంధ్రకర్ణాటకాదినానాభాషాకావ్యరచనాచతురు"డే కావచ్చును.

దళవాయి దొడ్డరాజు సుతుడు, సుకవినుతుడు అయిన కళులె వీరరాజు సభాపర్వమును, తదుపలక్షణముగ ఆంధ్రవచనభారతమును రచించిన, అందు వీరరాజు రచించినట్లు కల గద్యల తో పాటు, తుపాకుల అనంతభూపాలుడు రచించినట్లు కల గద్యలును ఉండుటకు హేతువేమి? అసలు తుపాకుల అనంతభూపాలుడు ఎవరు?"సేతుశీతాచలమధ్యభూతలాయాతక" అను విశేషణము అతని గద్యను కలదు. ఆయాతకుడన వచ్చిన వాడని అర్థము. సేతుశీతాచలమధ్యభూతలమునుండి వచ్చినవాడని తాత్పర్యము. అది చెంజి కాదు. మధుర కాదు అనంతభూపాలుడు చంద్రగిరికృష్ణనృపతనూభవుడని అతని గద్యను కలదు. చంద్రగిరి కృష్ణనృపుడు చరిత్రప్రసిద్ధుడైన తుపాకుల కృష్ణప్పనాయకుడని ఒక చారిత్రికసమన్వయము కలదు[93]. దాని ప్రకారము, తుపాకుల కృష్ణప్పనాయకుని ప్రాభవకాలము **1635-1655** అగును. అతడే చంద్రగిరి కృష్ణనృపుడైన, అతని తనూభవుడు తుపాకుల అనంతభూపాలుని ప్రాభవ కాలము **1665-1685** కావలయును. అయిన కళులె వీరరాజు సమకాలికుడగుట సాధ్యము కాదు. కాబట్టి తుపాకుల కృష్ణప్పనాయకుడు చంద్రగిరి కృష్ణనృపుడు కాజాలడు. చంద్రగిరి- గృహనామము తోపాటు, కృష్ణనృపుని గ్రామనామమును కావచ్చును. అయినను, చంద్రగిరి కూడ సేతుశీతాచలమధ్యభూతలము కాదు. అనంతభూపాలుని గద్యను "దక్షిణసింహాసనసముద్ధరణాధురంధర" అను విశేషణమును కలదు. దక్షిణ సింహాసనమన చెంజి సింహాసనము, మధుర సింహాసనము మాత్రమే కాదు; విజయ నగరసింహాసనము కూడ. దక్షిణాధీశు ముత్యాలశాల సుప్రసిద్ధము. విజయనగరము సేతుశీతాచలమధ్యభూతలమగును. మఱి, అనంతభూపాలుని గద్యను "కవేరకన్యానదీ తీరప్రతిష్ఠాపితనిస్తులవస్తుసమగ్రానేకాగ్రహారసంతోషిత" అను విశేషణము కూడ కలదు. కావేరీనదీతీరమునందు ప్రతిష్ఠాపించిన, సాటిలేని వస్తువులతో సమగ్రమైన అగ్రహారముల వలన సంతోషించిన వాడని అర్థము. కావేరీనదీతీరమునందు అగ్రహారములు ప్రతిష్ఠాపించిన వాడని తాత్పర్యము. ప్రతిష్ఠించిన వాడని కాదు. ప్రతిష్ఠిత- స్వార్థకము. ప్రతిష్ఠాపిత - ప్రేరణార్థకము. కావేరీనది మైసూరు రాజ్యమునందు కలదు.

శ్రీరంగపట్టణము చుట్టును కలదు. తుపాకుల అనంతభూపాలుడు విజయనగరము నుండి, శ్రీరంగపట్టణము వచ్చి, శ్రీరంగపట్టణసేనాధిపతి కళులె వీరరాజు మిత్రుడయి, అగ్రహారము లిప్పించుట అసంభవము కాదు. కాఁబట్టి కళులె వీరరాజు ఆంధ్రవచన భారతమునందు తుపాకుల అనంతభూపాలుడు సహరచయిత కావచ్చును. ఉభయుల గద్యల ఉనికి తన్మూలమే అగును.

ఆంధ్రవచనభారతమునందు ఆశ్వాసవిభాగము లేదు. అధ్యాయవిభాగము కలదు. అది వ్యాసభారతసరణి. అందువలన ఆంధ్రవచనభారతము కేవలము వ్యాసభారతానుసరణమే కాని, కవిత్రయభారతానుసరణము కాదని ఒక అభిప్రాయము కలదు[94]. కాని వ్యాసభారతానుసరణము తోపాటు క్వాచిత్కముగనైన కవిత్రయ భారతానుసరణము కలదు.

నన్నయ భారతము:

" రాజయ్యెడు వాఁడు దన రాజ్యభారంబు దాన చూచి యరయ
వలయు. నేను షడంగసహితంబుగా వేదాధ్యయనంబు సేసి యర్థ
శాస్త్రంబులందుఁ గృతనిశ్చయుండనయి బలంబు గలిగియు నంగ
వైకల్యంబునం బరచక్రంబులకుం బ్రతివ్యూహంబులు రచియింప
నేరమిం జేసి రాజ్యంబునకుఁ దగకున్న 123వచ.

xxx xxx xxx

మఱియు వాని కంటె గుణంబుల మిక్కిలియయి జనంబులకు
ననురక్తులై పరఁగుచున్న పాండురాజు కుమారుల నెవ్విధంబునఁ బాప
నేర్తునని దుఃఖించిన " 126వచ. 6ఆ. ఆ.ప.

ఆంధ్రవచనభారతము:

" కుమారకా! యేను జాత్యంధుండయినను పాండుభూపాలుండు
నన్ను మిగులం బూజించె. అది యెట్లంటేని లోచనంబులు లేమింజేసి
పరదళంబుల మొగ్గరంబులు పన్ని యగ్గలిక మెఱయ గెలువంజాల;
స్వరాష్ట్రపరిపాలనంబున కసమర్థుండు; సాంగంబుగ వేదంబులను రాజ
నీతిశాస్త్రంబులు నధికరించితి.

xxx xxx xxx

ధర్మపౌరుషప్రభావంబుల వార లధికులై యున్నయెడ వారల నెట్లు
నగరంబు వెలవరింపించి వారణావతం బనుపువాఁడ నట్లు పనిచినను
లోకంబునం గల జనులు నిందింపకుందురె "

నన్నయ భారతము :

" ఈతని వృద్ధని యెఱిఁగి పూజించితే
వసుదేవుఁ డుండఁగ వసుమతీశ
ఋత్విజాం డని విచారించి పూజించితే

ద్వైపాయనుం డుండ ధర్మయుక్తి
నాచార్యుఁడని వినయమునఁ బూజించితే
కృతమతుల్ ద్రోణుండుఁ గృపుఁడు నుండ
భూనాథుఁ డనియెడు బుద్ధిఁ బూజించితే
యాదవుల్ రాజులే యవనిమీఁదఁ
బూజనీయులైన పురుషుల లోపల
నెవ్వఁ డయ్యెఁ గృష్ణుఁ డిట్టు లేల
పూజ్యులయిన వారిఁ బూజింప నొల్లక
భీష్మపలుకుఁ జేసి బేలవయితి. " 11ప. 2ఆ. స.ప.

ఆంధ్రవచనభారతము:

" ఇతఁడు వయోవృద్ధుఁడని పూజించితివేని, వసుదేవుఁడుండ నతని పుత్రుఁడగు నితఁడెట్లు పూజార్హుఁడగు? కాక మిత్రమహత్త్వంబు వలన నితఁడు పూజ్యుఁడని తలంచితివేని, నిఖిలగుణగరిష్ఠుఁడగు ద్రుపదునిఁ బూజింపరాదే? గురువని తలంచితివేని యాచార్యుఁడగు ద్రోణుం డుండ కృష్ణుఁడు పూజనీయుఁ డగుటెట్లు? లేక ఋత్విజుండని విచారించితివేని, బ్రహ్మనిష్ఠుఁడగు సాత్యవతేయుఁడు లేఁడయ్యెనే? -- "

తిక్కన భారతము:

" కార్చిచ్చు గవిసి మృగతతి
నేర్చుకరణి నేఁడు భీష్ముఁ డేచిన కడిమిం
బేర్చి మహాసేనఁ బొదివె శ
రార్చుల వప్పేరుఁ గన్నులారం గంటే. " 277ప. 3ఆ. భీ.ప.

ఆంధ్రవచనభారతము:

" రాజీవాక్షా! నేఁడు సురనదీసూనుండు రణంబున విజృంభించుట గమంగొంటివె. ఆతఁడు గ్రీష్మసమయంబునఁ బేరడవి నేర్చు కార్చిచ్చు విధంబున విజృంభించి మన బలంబులనెల్ల నిశిత విశిఖంబులచే
సమయింపఁదొడఁగె. "

" కృష్ణ పశ్య మహాత్మానం భీష్మ ముగ్రపరాక్రమమ్
గజం నలవనానీవ విమృద్నంతం బలం మమ. ౧౩.
నచైవైనం మహాత్మానా ముత్సహామో నిరీక్షితమ్,
లేలిహ్యమానం సైన్యేషు ప్రవృద్ధమివ పావకమ్." ౧౪. 108అ.భీ.ప.

నన్నయ వచనములోని వైఖరి, సీసపద్యములోని ఎత్తుగడ, ఋత్విజుండని విచారించి" అను యతిమైత్రీఘటితపదములు; తిక్కన పద్యములోని అమూలకమైన కార్చిచ్చు ఉపమానము ఆంధ్రవచనభారతమునందు కలవు. తిక్కన భారతములోని కార్చిచ్చు జంతుసమూహమును కాల్చిన, ఆంధ్రవచనభారతములోని కార్చిచ్చు

మహారణ్యమునే కాల్చును. కారణము గ్రీష్మకాలములోని దగుట. ఇది స్వతంత్ర కల్పనము. మొత్తము మీద ఆంధ్రవచనభారతము కవిత్రయభారతమును సంప్రదించిన వ్యాసభారతానుసరణము. భాష గ్రాంథికము. శైలి సరళము.

ఆంధ్రవచనభారతమునందు ముద్రితము కానిది ఆనుశాసనికపర్వము-అందు వీరరాజు గద్య లేదు. భగవద్గీతయందు వలె అనంతభూపాలుని గద్యయే కలదు. అనంతభూపాలుని భగవద్గీతగద్యయందు అతనికి ఉభయభాషాకవిత్వఫణీంద్ర, విమలయశోవిశాల అను విశేషణములు మాత్రమే కలవు. ఆనుశాసనికగద్యయందు ఉభయభాషాసాహిత్యభోజ, సాంద్రతేజోవిశాల అను విశేషణములు మాత్రమే కలవు. ఉభయభాషాసాహిత్యభోజ అను విశేషణము కంటె, ఉభయభాషాకవిత్వఫణీంద్ర అను విశేషణము, సాంద్రతేజోవిశాల అను విశేషణము కంటె, విమలయశోవిశాల అను విశేషణమును అర్థవంతములు. ఈ రెండు విశేషణములును ఆంధ్రవచనభారతములోని అనంతభూపాలుని సుదీర్ఘగద్యను లేవు. అంతేకాదు. అందలి అనేకానేకవిశేషణములలోని ఏకైకవిశేషణమును సంగ్రహగద్యలందు లేదు. అవియెల్ల అనంతభూపాలుడే పరిహరించుట కంటె, ప్రతివిలేఖకులు సుదీర్ఘమని పరిహరించుట సహజము. వీరరాజు గద్యను కూడ ప్రతివిలేఖకులు తొలగించుట సహజము. ఇంత మాత్రమున అనంతభూపాలుడు మఱొక వచనభారతమును రచించెననుట అసంగతము.

ఆనుశాసనికపర్వమునుండి ఒక మచ్చుతునుక:

> " - యుధిష్ఠిరుండు జ్యేష్ఠభ్రాతయగు నతండు కనిష్ఠులయెడ నెట్లు ప్రవర్తింపనగు, కనిష్ఠులును జ్యేష్ఠునియం దెవ్విధంబున నడవవలయునది యెఱింగింపుమనిన, సురనదీసూనుండు ధర్మజుం గనుంగొని, ధర్మనందనా!నీవు గుణజ్యేష్ఠుండ వగుటంజేసి తమ్ములయెడ నుచితప్రకారంబున చరింపందగు. వారలును నీయందు శిష్యుండు నిజాచార్యులయెడ నెట్టి విశ్వాసంబున మెలంగవలయు నట్టెరంగున నడవవలయు. గురువునకు ప్రజ్ఞావిశేషంబు లేకుండెనేని శిష్యున కతని సన్నిధానంబున మెలంగుట యశక్యంబైయుండు. గురువులయెడ శిష్యుండు నడవందగిన క్రమం బెఱిగించెద నాకర్ణింపుము. గురువులు తనకుం దెలియబడకయుండ నొక్క కార్యంబు గావించిన నదితెలిసియు, తెలియనట్లు యుండవలయు. కనియుం గనని యట్లు యుండవలయు. వార లొక యక్రమంబు జేసిన రహస్యంబున బర్యాయక్రమంబునం దెలిపి చక్కదిద్దం జను."

**తుపాకుల అనంతభూపాలుడు:** ఇతని కృతులు 1.సుందరకాండము. 2.విష్ణుపురాణము. రెండును వచనకావ్యములు. రెండును అముద్రితములు. కాని సుందరకాండము పదకొండవసర్గప్రారంభము, విష్ణుపురాణము ద్వితీయాంకములోని పదమూడవ అధ్యాయము మాత్రము ముద్రణభాగ్యము నందినవి.

సుందరకాండము: ఇది వాల్మీకిరామాయణములోని సుందరకాండమునకు తెనుగుసేత. ఇందు ఆశ్వాసవిభాగము లేదు. సర్గవిభాగము కలదు. అది వాల్మీకిరామాయణసరణి. పదకొండవ సర్గ ప్రారంభము.[95]

" అంత నా తలంపు నిలిపి స్వస్థచిత్తుండగుచు నా వానరవర్యుండు సీతానిమిత్త్యంబున వేరొక చింత్త దలంచ్చె యా సీతావరారోహా రాము నెడ బాసి నిదురింపంజాలునె భోజనంబు సేయుటకును తంన్నలంకరించుటకును మధుపానంబుసేయుటకును నొడంబడునే నరేంద్రునివంట్టివాండైన వేరొక్క పురుషని చెంత నుండ్డ తలంచునె రామునకు సమానుండగువాండు త్రిదశుల లోనైన కలుగంజాలునె కావున నిది వేరొక్కవనిత యని నిశ్చయించి యచ్చోటు బాశి పానభూమియందు సంచరించుటయు అందు కొందరు మగువలు క్రీడ సలిపియు గానంబు చేశియు నాట్యంబు లాచరించ్చుటయు పరిశ్రాంతులగుచు మధుపానంబుల వలన మయిమరిచి నిద్రింపుచునుండ్డ కొండ్దరు చెలువులు మృదంగంబుల యందును పీఠికలయందును తమ దేహంబులు మోపుగ నిదురింపుచుంన్నుండ మరియును గొంద రుత్త మాంగనలు -- "

ఇది హనుమంతుడు మందోదరిని చూచి, సీత అని హర్షించి, మఱల సీత గుఱించి తలపోసిన విధము. వాల్మీకి సుందరకాండమునందలి పదకొండవసర్గములోని మొదటి అయిదుశ్లోకములకు మూలానుసారమైన తెనుగుసేత.

ఇందు "చింత్త" మొదలైన శబ్దములలోని ద్విత్వములు పూర్ణబిందుసూచకములు. "చిత్తుండు" మొదలైన శబ్దములలోని సున్నమీద ద్విత్వము లేమి అర్ధబిందుసూచకములు. "నిమిత్త్యంబున" "చేశి" మొదలైనవి లేఖకవ్యవహారములు. "తంన్ను" ప్రాచీనలేఖన పద్ధతి. వ్యావహారికభాష కాదు. ఇప్పటి లేఖనపద్ధతికి మార్చిన ఎప్పటి గ్రాంథికభాష అగును. ఈ లేఖనపద్ధతి వచనమునకే పరిమితము కాదు. పద్యమునకును పర్యాప్తము. పరిష్కరణయోగ్యము.

విష్ణుపురాణము:- ఇది బ్రహ్మాండపురాణమునుండి ఉద్ధృతమైన పారాశర్యసంహిత లోని విష్ణుపురాణమునకు తెనుగుసేత. విష్ణుపురాణము ద్వితీయాంశములోని పదమూడవ అధ్యాయము మైత్రేయపరాశరసంవాదము. అందు సౌవీరరాజు వృత్తాంతము ఏబదినాలుగు శ్లోకములందు కలదు. (51-104) అది తుపాకుల అనంతభూపాలుని విష్ణుపురాణమునందు అయిదుపుటల వచనమయినది[96]. సౌవీరరాజు తత్త్వజ్ఞానము పడయుటకు కపిలమహాముని కడకు శిబికారూఢుడై బయలుదేరిన, శిబికావాహకుడైన విప్రకుమారుడే తత్త్వోపదేశము సేయును. అందొక అంశము:

" అవ్విప్రవర్యుం డతని నవలోకించి భూపాలకా! సావధానంబుగానాకర్ణింపుము. నీ వెవ్వండవని యడిగితివి? ఆత్మకు జాతికులగోత్రనామధేయాదివిశేషంబు లెవ్వియు లేవు గావున వే

నిటువంటివాఁడనను వచనంబె యుచ్చరింపంగూడదు. ఏమి ప్రయోజనంబుగా నెచ్చటికిం జనియెదవని యడిగితివి? ప్రారబ్ధకర్మానుభవనిమిత్తంబుగా నెల్లదిక్కులకుం జనవలయును. దేహేంద్రియజన్యంబులైన ధర్మాధర్మంబులకు ఫలంబులగు సుఖదుఃఖంబు లనుభవించుటకై జీవుండు దేహేంద్రియాదుల నొందు నరవరేణ్యా! సకలజీవులకును ధర్మాధర్మంబులె సమస్తసుఖదుఃఖానుభవంబులకుం గారణంబు లయియుండ నా గమనప్రయోజనంబు వేఱె యడుగనేల? యనుటయు - సౌవీరమహీరమణుండు భూదేవకుమారు నీక్షించి విప్ర పుంగవ! సర్వకార్యంబులందును ధర్మాధర్మంబులు కారణం బను టకును,దేహాంతరప్రాప్తి కర్మఫలానుభవార్థంబుగా ననుటకు సందియంబు లేదు. తా నిట్టివాఁడ ననియెడి శబ్దం బెయ్యెడన్ బ్రయోగింపంగూడదంటి వయ్యర్థంబు విశదంబుగా నాకర్ణింపఁగోరెద దేహంబునందు - సోహమని'యెడి వచనం బేమిటికి పలుకంగూడదు? ఆత్మయం దహంశబ్దంబు ప్రయోగించుటవలన దోషంబు లేదని తోచుచున్నయది - అనవుడు నమ్మహీసురోత్తముం డిట్లనియె. "

ఇంతమాత్రమున విష్ణుపురాణము కేవలము తత్త్వశాస్త్రగ్రంథము కాదు. ప్రహ్లాద చరిత్రము, శ్రీకృష్ణచరిత్రము, ఖాండిక్యకేశిధ్వజోపాఖ్యానము మొదలైన కథాఘట్టములు కలవు.

తుపాకుల అనంతభూపాలుని భాష గ్రాంధికము. శైలి సరళము.

**కళులె నంజరాజు:** ఇతని కృతులు 1.హాలాస్యమాహాత్మ్యము. 2. బ్రహ్మోత్తరఖండము. 3.కాశీమహిమార్థదర్పణము. మూడుమ వచనకావ్యములు. మూడును అముద్రితములే. కాని, హాలాస్యమాహాత్మ్యములోని ముప్పదియెనిమిదవ అధ్యాయము, బ్రహ్మోత్తరఖండములోని పదవ అధ్యాయము ముద్రణభాగ్యము నందినవి. ఈ రెండును గ్రాంధికభాషయందు కలవు. కాశీమహిమార్థదర్పణము వ్యావహారికభాషను కలదు.

ఇతడు మహీశూరసేనాధిపతి కళులె దొడ్డరాజు మనుమడు. వీరరాజు కుమారుడు. దళపతి దేవరాజు సోదరుడు. విద్వజ్జనకల్పతరువు. (గద్య).

**హాలాస్యమాహాత్మ్యము:-** ఇది స్కాందోక్తము, అగస్త్యసంహితా ప్రతిపాదితము అని గద్యమ కలదు. హాలాస్యమాహాత్మ్యమునకు మధురాఖండము, మధురాపురాణము, చొక్కవిలాసము, చొక్కనాథవిలాసము, చొక్కనాథచరిత్రము అని నామాంతరములు కలవు. ఇంతకు పూర్వము పచ్చకప్పురపు తిరువెంగళరాజు చొక్కనాథచరిత్రము కలదు. ఇది పూర్వోక్తము.[97] అది ద్విపదకావ్యము. ఇది వచనకావ్యము. అందలి ముప్పదియొకటవ లీల, ఇందలి ముప్పది యెనిమిదవ అధ్యాయము. అది సంగ్రహము. ఇది సవిస్తరము. అది సంయమితము. ఇది విశృంఖలము. సుందరేశ్వరుని గాజులసెట్టి వేషము[98] సహజ సుందరము.

" శుభ్రంబగు పాగయు, బహిర్వసనంబు ధరియించిన వాఁడయ్యును, సుగంధాలిప్తశరీరుండయ్యును, కాశ్మీరతిలకకలితఫాలుండయ్యును, పట్టుపచ్చడంబు గప్పుకొనినవాఁడయ్యును, పాదుకాలంకృత చరణుండగుచు నొక్క కరంబున గొడుగు బట్టుక కటక కుండ లాంగుళీయాదులు చెలంగ గంధసారయుక్తం బగు కర్పూరతాంబూ లంబునం బరిమళింపుచున్న ముఖంబును, నక్షత్రమాలాభ్యంచిత కంఠంబునుం గలవాఁడగుచు, మందస్మితంబు సలుపుచు, కపోలమ్ములం బొడమిన చెమటబిందువులు విలాసంబునం గొనగోట మీటుచు, వీడెంపుటాకులు చేతంబట్టుక, సకలాభరణభూషితుండగుచు, మట్టిగాజులును, కంచుగాజులును, వెండిగాజులును, బంగారుగాజులును, కాళ్లయుంగరమ్ములును, చిన్నవియుఁ బెద్దవియునగు వ్రేళ్ల యుంగ రమ్ములుం బట్టుపగ్గంబులుం గూర్చి వీపుమీద వేసి కుండోదరుండు పరచిన కంబళంబునందు సుఖంబున గూర్చుండుక గాజులసంచి ముంగలఁ బెట్టుకొని .... "

బ్రహ్మోత్తరఖండము:- ఇది స్కాందపురాణాంతర్గతమని గద్యను కలదు. పదమూడవ అధ్యాయము ఋషభయోగిమహిమానువర్ణనము. ఇందు సుమతి అను రాజపత్నికథ హృదయవిదారకము. అందొక అంశము[99].

" అనంతరంబ యా సుమతి యాకలిచేతను దప్పికచేతను కష్టపడుచున్నదగుచుఁ దన కొడుకు నెత్తుకొని యడుగడుగునకుం ద్రెళ్లుచుఁ దామ గావించిన పాపకర్మమ్ముల నిందింపుచు నొక్కయెడ ముండ్లపొదలు సోకి చీలిన శరీరంబు గలదయ్యును, నొక్కయెడ బెబ్బులుల రొదలకుఁ దల్లడిల్లుచున్నదయ్యును, ఒక్కయెడ సర్పమ్ములచేత దరుమంబడినదయ్యును, ఒక్కయెడ పిశాచభూతబేతాళమ్ములచేత వెఱపింపంబడిన దయ్యును, ఒక్కయెడ మొనరాళ్లు తాకి పగిలిన కాళ్లు గలదై యడవియందుఁ ద్రిమ్మరుచు దైవయోగంబున వర్తకు లరిగెడు పెద్ద మార్గంబున బహుప్ర యాసంబుచేతం బరతెంచి యచ్చట నొక పట్టణంబు విలోకించి యా పట్టణంబునకుం జమదెంచుచుండ -- "

కాశీమహిమార్థదర్పణము:- ఇది "కర్ణాటభాషావిరచితంబుగా ..... కళులె నంజరాజభూపాలుడు స్కాందపురాణోక్తమైన కాశీమహిమార్థదర్పణమందు కాశీమహిమ వివరించునది" అని గద్య. కనుక నంజరాజా కాశీమహిమార్థదర్పణము కర్ణాటభాషావిరచితమైన కాశీమహిమార్థదర్పణమునకు అనుసరణమని ఒక అభిప్రాయము కలదు [100]. అది అనన్వితము. దూరానేయము. "కర్ణాటభాషావిరచి తంబుగా" అవగా "కర్ణే అటతీతి కర్ణాటః" అను వ్యుత్పత్తివి వ్యావహారికభాషావిరచి

తంబుగా" అని కవిహృదయము కావచ్చును. అతని హాలాస్యమాహాత్మ్యము, బ్రహ్మోత్తర ఖండము గ్రాంథికభాషావిరచితములు. కాశీమహిమార్థదర్పణము మాత్రమే వ్యావహారిక భాషావిరచితము.

> " - వేదవ్యాసులు విశ్వాసం గల్గినటువంటి ప్రియశిష్యుడైన సూతునకు ప్రత్యుత్తరం ఇచ్చేటందుకు ఉపక్రమించెను. ఓయి సూక్ష్మబుద్ధి కలిగిన సూతుడా! భక్తివిశ్వాసం కల్గినవాడవయి వినుము. ఆ దేవతలు ఋషిసమేతులై కాశీపట్నం జొచ్చి శీఘ్రంగా మణికర్ణికలో స్నానం చేసి, తిలాక్షతదర్భల నుంచి దేవఋషి పితృతర్పణ లిచ్చి తీర్థవాసులకు దానములు ఇచ్చిరి. "

అసలు కన్నడభాషయందు కాశీమహిమార్థదర్పణము అను గ్రంథము కలదా? అను విషయము కూడ ఆలోచనీయము-

# ఏకోజీ - శివాజీ

తంజావూరు రాజ్యమునకు తుళజాజీ (1728-36) తర్వాత అతని జ్యేష్ఠపుత్త్రుడు హరిశ్చంద్రుడు, ద్వితీయపుత్త్రుడు జయసింహుడు పాలకులు కారు. తృతీయపుత్త్రుడు రెండవ ఏకోజీ (1736-37.) అతని భార్య సుజనాభాయి (1737-39) అనుజాడు ప్రతాపసింహుడు (1739-62) కుమారుడు రెండవ తులజాజీ (1762-87) అతని అనుజాడు అమరసింహుడు (1787-98) రెండవ తులజాజీ పుత్త్రుడు రెండవ శరభోజీ (1798-1833) అతని కుమారుడు శివాజీ (1833-55) వరుసగ మహారాష్ట్రపాలకులు.

జయసింహుడు: ఇతడు పాలకుడు కాకపోయినను కవిపోషకుడు. నెల్లూరి శివరామకవి కామకళానిధి అను గ్రంథమునకు కృతిభర్త. అది కామశాస్త్రగ్రంథము. శివరామకవి ఆస్థానకవి కాడు; అభ్యాగతకవి.

రెండవ ఏకోజీ: ఈతని కృతులు 1. రామాయణము. ద్విపదకావ్యము. 2.విఘ్నేశ్వరకల్యాణము. యక్షగానము. అముద్రితము. ఇతడు రచించుట సంభవమే కాని, సందేహరహితము కాదు. బాలకాండము మధ్యను,

" మేదిని జాహ్నవి మెలఁగునందాక
పొందుగా కోసలభోసలాన్వయులు
నందాక వర్థిల్లి యభివృద్ధి గాంచు
పొంకంబుగను దివ్యభోగము ల్గనుచు
శంకరాకృతులను జరియింతు రనుచు" పుటలు 27-28.

భగీరథుడు భావించినట్లు కలదు. ఇది ఏకరాజు స్వీయాన్వయస్తోత్రపారాయణ మగుట కంటె, ఆస్థానకవి రాజాన్వయస్తోత్రపారాయణమగుట సహజము. అంతేకాదు.

" ఘనమైన శుభపుణ్యకలితమై శ్రీలఁ
దనరారు గంగావతరణమాహాత్మ్య
మెచ్చుగా తుళజేంద్రులేకేంద్రునికిని
ఇచ్చు సత్పుత్రుల, నిచ్చు పౌత్రులను
హెచ్చైన సౌభాగ్యమిచ్చు జయంబు
లిచ్చు దీర్ఘాయుష్య మిచ్చు రాజ్యముల
నిచ్చు వైభవముల నిచ్చు సత్కీర్తు
లిచ్చు కామ్యార్థంబు లిచ్చు సద్భక్తి
నిచ్చు సద్గుణముల నిచ్చు శౌర్యముల
నిచ్చు సామజముల నిచ్చు నశ్వముల
నిచ్చు దైవబలంబు లిచ్చు సౌఖ్యముల
నిచ్చు సదాచార మీ పుణ్యచరిత " పుట 28.

మని ఫలశ్రుతి కలదు. ఇది ఏకరాజు స్వీయజ్యోతిషమగుట కంటె, ఆస్థానకవి

బుడబుక్కల జోస్యమగుట సహజము. ఉపరి, కాండాంతద్విపదలందు ఏకరాజు "ఉత్తముఁడు" అని కలదు. ఇది ఏకరాజు స్వీయకతపత్రమగుట కంటె, ఆస్థానకవి స్తోత్రకతపత్రమగుట సహజము.

**రామాయణము:-** పయి గంగావతరణమాహాత్మ్యఫలశ్రుతిని "తుళజేంద్రు కేకేంద్రునికిని" అని కలదు. అంతేకాదు. కాండాంతద్విపదలందు "ఇది తుళజేంద్రుల కేకేంద్రులకును" సంపదలు మొదలైనవి ఒసగునని కలదు. అవతారికను "ఏకధరణీపాలుడు" అనగా ఏకరాజు అనియే కలదు. రాజలాంఛనములు లేవు. కాఁబట్టి రచనాకాలము తుళుజాజీ కాలమే అగును. ఏకరాజు యువరాజు కావచ్చును. ఆ కాలము స్థూలముగ 1735 వ సంవత్సరమగును.

" అరుదుగా వాల్మీకి యల రామకథను
రచియించినట్లు సారము గాగ ద్విపద
రచియింతు " పుట 2.

నని అవతారికను కలదు. అట్లే ద్విపదకావ్యమిది వాల్మీకి రామాయణమునకు పరమసారగ్రహణము. అతిసంక్షిప్తీకరణము. ప్రధానకథాసూత్రము మాత్రము కలదు.

దశరథుడు స్వయముగ "నే వశ్వమేధంబు ఘటియించి మరి పుత్రకామేష్టిఁ జేసి తనయులఁ బడయుదునని వసిష్ఠాదులకు చెప్పును. (పుట9.) అహల్యాశాపమోక్షమే గాని, అహల్యాశాపవృత్తాంతము లేదు. (పుట29.) దశరథుడే శ్రీరామపట్టాభిషేక ముహూర్తము పెట్టును. (పుట54.) గుహుడు సీతారామలక్ష్మణులను గంగను దాటించెను గాని, రాముని పాదములు ప్రక్షాళనము చేయలేదు. (పుట94) లక్ష్మణరేఖల వృత్తాంతము లేదు. (పుట131.) శబరి కందమూలముల విందు కావించెనుగాని, రామునికి ఎంగిలి పండ్లు పెట్టలేదు. (పుట137.) తారావిలాపఘట్టము లేదు. (పుట153.) సేతువిర్మాణవిషయము కలదుగాని, సేతునిర్మాణవృత్తాంతము లేదు. (పుట201) హనుమంతుడు సంజీవనీపర్వతమును తెచ్చినట్లు కలదుగాని, తెచ్చిన విధానము లేదు. (పుట255.) అవాల్మీకవృత్తాంతము లేదు. అసలు వాల్మీకవృత్తాంతమే అంతయును లేదు. మహాసంక్షేపరామాయణము.

భాష సరళాతిసరళము. కవిత్వము విరళాతివిరళము. దశరథుని భార్యలు "శోభిలిరి త్రిశక్తులో యనఁగ" అనుట (పుట8) తాటక "కాటుకకొండ కరణి దీపించి" అనుట (పుట18.) కైక,

" కిమక మాని రసాలకిసలయగ్రాస
ఘనకషాయితకంఠకలకంఠి మాడ్కి
కలకంఠి మిగుల గద్గదకంఠి యగుచు "

అనుట (పుటలు61-62) కైక రాముని అరణ్యమునకు పంపుమన దశరథుడు,

" కటకటా! నీ కింత కరుణ లేదటవె

కోపంబు నిర్దయ కుటిలతాసూయ
పాపంబు తెగువ కాపట్యంబు లూర్చి
చేకొద్ది తేల్చి మచ్చిక చిన్ననాఁడు
నీ కుగ్గు పోసెనో నీ తల్లి తోన "

అనుట (పుట63) వంటివి అపూర్వములు కాకపోయినను అరుదుగ కలవు. మారీచుడు,

" రతియన్న రవియన్న రాజీవమన్న
రతనంబులన్నను రాజసం బన్న
మహిని రేఫాదినామమ్ములు విన్న
సహితభీషణరాముఁడని తలంపుచును
ఈ విధి నున్నాఁడ నీ బుద్ధి మాని
రావణ పొమ్మ "

అనుట (పుట129) కూడ అంతే. రావణుడు సీతను చంపబోయిన, మండోదరి వారించి,

" వలనొప్ప నీ మీఁద వలచి వర్తించు
చెలులతోఁ జూడ నీ సీత యేపాటి
మనసిజకేళిని మనసు రంజిల్ల
నను బొందు నా ప్రాణనాథ! రమ్మ- "

అనుట (పుట178) చిత్రము. కైకేయి మంథరకు "ఊనపాదంబుల కొనర రత్నాల బిరుదు పెండేరంబుఁ బెడుదు" ననుట సమకాలికసమాచారము. ద్విపద రామాయణమిది ధీమాన్యపాఠకులకు కాకపోయినను, సామాన్యపాఠకులకు ఉపాదేయము.

విఘ్నేశ్వరకల్యాణము: ఇది "ఏకమహారాజప్రణీతంబైన విఘ్నహరగణేశ పరిణయము' అని, "ఏకమహారాజప్రణీతం విఘ్నేశ్వరపరిణయం నామ నాటకమ్ అని, "సిద్ధిబుద్ధినాయికావినాయకపరిణయనాటకం" అని, "విఘ్నేశ్వరకల్యాణము" అని వ్రాతప్రతియందు కలదు. నాటకమన యక్షగానము. తుదిని,

" ఎలమితోఁ దుళజేంద్రయేకేంద్రునికిని
బలములు సంతానసౌభాగ్యసంపదలు
ప్రణవస్వరూపుఁడు భక్తపాలకుఁడు
గణనాయకుం డిచ్చుఁ గరుణ మీఱఁగను "

అని కలదు. ఇది స్వీయాశీర్వాదమగుట కంటె, ఆస్థానకవి ఆశీర్వాదమగుట సహజము. రామాయణము వలె విఘ్నేశ్వరకల్యాణమును ఆస్థానకవి కృతము కావచ్చును.

ఇందు సిద్ధిబుద్ధినాయికావినాయకుల పరిణయమే ఇతివృత్తము. ఇందుకు వ్యాసుడు "తుళజమహారాజదేవేంద్రుడు కల్పించిన మహాదేవపట్టణమందు ధవళవరాహ స్వామి యుత్సవమంటపసమీపంబున"కు వచ్చును. వచ్చిన విధము:

"సారవేదాలు వెంటరాగా
షట్శాస్త్రములు పొగడఁగా

నారదూఁడు గొలువఁగా
నయముతో వ్యాసులు వెడలెనూ॥ "

వ్యాసుడు "ధవళవరాహస్వామిని దర్శనము చేసి శృంగారవనమందు సుఖాసీనుఁడై యుండి భారతము సేయవలెనని" విఘ్నేశ్వరుని ప్రార్థించి, రప్పించి, "సన్మానముతోఁ బూజించి" ; సరస్వతిని ధ్యానించిన, సిద్ధిబుద్ధికన్యలతో సరస్వతి వచ్చును. వ్యాసుడు సరస్వతిని పూజించి కూర్చుండుమనునెడ, విఘ్నేశ్వరుడు సిద్ధిబుద్ధికన్యలను మోహించి ఇట్లు పలుకును.

" చక్కని చెలులార మీరెవ్వరె నాతో
సరసముగా మాట లాడరే
ముద్దుచన్నులఁ జూచి మోహించియున్నాను
మోవితేనెల నిచ్చి కరుణింపరే
గ్రక్కున నన్నుఁ జేరి కౌఁగిలించరె
యిపుడు కాముని కలిసి కూడరె "

ఇది విని సిద్ధిబుద్ధికన్యలు తమ చెలులను జూచి (?) ఇట్లు పలుకుదురు.

" వీఁడెవ్వఁడే యో యమ్మా
జోడుగూడ రమ్మనె నమ్మా
వవరసముగ మాటాడెవమ్మా
పరసుండు వీఁడెవ్వఁడో యమ్మా
చన్నులంటి వచ్చేవమ్మా
చక్కెరమోవి యిమ్మనె వమ్మా "

ఇది "సంగీతమకరంద" మట! మఱి సాహిత్యమలినము. కడకు,

" ఏమిసేయుదు మోహమెటుల సహింతు
నా మీఁద నెవరుంచి నన్నుఁ గౌఁగిలించి
చక్కెరకెమ్మోవి పరగున యాని
గ్రక్కునఁ గూడరె కమలాక్షులార! "

అని విఘ్నేశ్వరుని కడగండ్లు. సిద్ధిబుద్ధికన్యకలు సమ్మతింతురు. శ్రుతి మించిన శృంగారఘట్టమిదియెల్ల వ్యాసుని సన్నిధిని! నారదుని సమీపమున!! సరస్వతీదేవి సమక్షమున!!!- ఇంత జరిగిన వ్యాసుడు "మేముఁ జేసిన భారతము మాకు వ్రాసి యిప్పించవయ్యా!" అని విఘ్నేశ్వరుని అడుగును. విఘ్నేశ్వరుడు,

" వినవయ్య వ్యాసమునీంద్రా!
గ్రాస మీయకనె కొలువుసేతురా
పూజ సేయకనె దేవుడు వరమిచ్చునా
యీ సిద్ధిబుద్ధికన్యలను దవకుఁ
బెండ్లి చేసిన భారతము వ్రాసియిచ్చెదవయ్యా! "

అనిన, వ్యాసుడు అంగీకరించును. సరస్వతిని "గరిమతోడుతఁ బెండ్లి గావించి

యిపుడు పరమభారతపుణ్యఫలము చేకొనుము" అని ప్రార్థించును. సరస్వతి, నారదసహాయమున బ్రహ్మాదిదేవతలను రప్పించును. సిద్ధిబుద్ధినాయికలతో వినాయకునికి వివాహము జరుగును. ఇది విఘ్నేశ్వరుని పెండ్లి. విఘ్నములు లేవుగాని వికారములు కలవు.

**ఏకరాజాస్థానకవి:** తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమునందు "ఏకోజీసాహిత్యము" అని రెండు గ్రంథములు కలవు[101].

మొదటి గ్రంథమునందు సంస్కృతకీర్తనలు, మరాఠీకీర్తనలు, తెనుగు కీర్తనలు కలవు. ఒక కీర్తనయందు "ఏకేంద్రతుళజేంద్రులకు" అని కలదు. ఏకేంద్రుడు రెండవ ఏకోజీ, తుళజేంద్రుడు - అతని కుమారుడు రెండవతుళజాజీ అగుదురు. ఇంకొక కీర్తనయందు "తుళజేంద్రపూజిత" అని కలదు. మఱొక కీర్తనయందు" తుళజేంద్ర ధరణీశపూజితుడు, శరభేంద్రతనయైకజనపాలవినుతుడు" అని కలదు. శరభేంద్రతనయుడు దత్తపుత్త్రుడు రెండవ ఏకోజీయే. ఇతని కన్నతండ్రి తుళజేంద్రుడు. వేఱొక కీర్తనయందు "లలితయేకేంద్రవినుత" అని కలదు. పూజితుడు, వినుతుడు విష్ణువు.

రెండవ గ్రంథమునందు మరాఠీపదములు, తెనుగు పదములు కలవు. ఇవి త్రివిధము. 1.నీతిపదములు 2.కీర్తనలు. 3. శృంగారపదములు. ఇందు "నగరి పుస్తకం పట్టుకోటలో వ్రాసిన కొత్తపదాలు నీతి 18. కీర్తన 28. శృంగారం 27. అంతు వివరం - 86" అని కలదు. 18+28+27=73. కనుక పాతపదాలు 86-73=13 కావలయును. ఒక శృంగారపదమునందు "చతురయేకేంద్రవినుత సదయతుళజరాజేంద్ర" అని కలదు. ఏకేంద్రవినుతుడు తుళజరాజేంద్రుడే. కన్నతండ్రి. కనుక "ఏకేంద్రవినుత" కవిముద్ర కావలయును. ఆ పదమిది:

" సంతోసమాయరా చాల హోరి నా సామి
మంతు కెక్కిన తుళజమహీపాలచంద్ర.
విరహము జెంది నేను విరులశయ్య నుండగ
సరసుడు నా మనసు తెలిసి సరసకు వచ్చినప్పుడే.
వలరాజు బారికి నే కలఁగుచున్నది జూచి
తలిరుఁబోణి వెరువ వలదని దయజేసి కౌగిలించినప్పుడే.
చతురయేకేంద్రవినుత సదయతుళజరాజేంద్ర
చతురత రతికేళిని చేరి నన్ను కూడినప్పుడే. "

ఇట్లు ఏకరాజు కన్నతండ్రి మీద వచ్చి శృంగారపదమును రచించుట కంటె ఆస్థానకవి రచించుట సహజము. శరభోజి, తుళుజాజి, ఏకోజి, రెండవ తుళుజాజి నలుగురి మధ్య నాలుగుస్తంభముల ఆట ఆడిన కవి ఏకరాజాస్థానకవి అగును. అతడే మఱి రామాయణద్విపదకావ్యకర్త కూడ కావచ్చును.

. **మెలట్టూరు కాశీనాథయ్య:** ఇతని కృతులు శబ్దములు. అవి

దైవపరముగను, శహాజీపరముగను (1684-1712), మొదటి శరభోజీపరముగను (1712-28) ప్రతాపసింహుని పరముగను (1739-62) కలవు. కనుక ఇతడు మొదట శహాజీ ఆస్థానకవి, క్రమముగ మొదటి శరభోజీ, ప్రతాపసింహుల ఆస్థానకవి అగును. కాఁబట్టి శబ్దముల రచనాకాలము స్థూలముగ 1701-1750 మధ్య కావచ్చును.

ఇతడు పదునేడవశతాబ్ది ప్రారంభమునందు, తెలుగుదేశమునుండి తమిళదేశమునకు వలసవెళ్లి, మెలట్టూరు భాగవతు లనబడిన వారిలో ఒకడు. ఇతని దైవపరమైన శబ్దములు గోపాలకృష్ణ, కంచి వరదరాజ, నరసింహ, కస్తూరిరంగ, శ్రీరామాంకితములు. తాళానుగుణముగా నేర్పఱచిన జతులతో, కొలది సాహిత్యముతో కూడిన, నాట్యభేదములైన, రచనలు శబ్దములు. అవి బహువిధములు. మండూకశబ్దము ప్రసిద్ధము.

శ్రీరామాంకితమైన శబ్దమిది:[102]

" తక్కిణం తరి తరికు ధింకుకు తారితక తక ధింకు తక్కిణ
కినా తకిణకి నాదణ తధణతా దై ధత్తతా
తాకు తక రేకు తక ఝకినా
సారె సారెకు కాశినాథుడు సన్నుతించె
నీరజాక్షా వినవయా, నీరతనములు మిగులజేసిన
ఘోరరావణకుంభకర్ణాదుల జయించిన రామవరా
కీర్తి యనియెడి తీగెలు మేరువయ్యె
చెట్టుపై యిట్టటు కదలకు చుట్టుకొన్నది తీగ విడిచి-
తాకిణం తరిత ఝకు ఝంతరి
మేఘమండలమనే పందిరి మీద తారాగణము తెల్లని
పువ్వు లాయెర, విదియచంద్రుడు
పిందె అయెను, పిందె కాయై, నాటి నాటికి పండు పండిన
పండు రీతిని నిండుపున్నమ వెన్నెలాయెర మాన్యధీరా ....
........................ రవికులాంబుధిసోమ దశరథరామచంద్రా
ధీర మేలు శాబాసు సలామురే. "

ఇందు తీగెలు, పందిరి, పువ్వులు, పిందె, కాయ, పండు తోడి రూపకపరిణామము మనోజ్ఞము.

మెలట్టూరు వీరభద్రయ్య: ఇతని కృతులు పదములు. అవి ప్రతాపసింహుని ఇష్టదైవము శ్రీరాముని పరముగ, అచ్యుతాబ్ధివరదుని పరముగ, ప్రతాపసింహుని పరముగ కలవు[103]. ప్రతాపసింహుని మీద రచించినవి పదములేగాక; దరువులు, తిల్లానాలు, స్వరజతులు మొదలైనవి కూడ కలవు[104].

ఇతడు ప్రతాపసింహుని కాలమునందే, తెలుగుదేశమునుండి తమిళదేశములోని వెణ్ణెటిగట్టునకు వచ్చి, రాజదర్శనము కొఱకు వేచియుండెనని, ఇతని గుఱించి విని ప్రతాపసింహుడే ఇతని దగ్గఱకు వచ్చి, తంజావూరు తీసికొనిపోయి ఆదరించెనని సంగీత

సంప్రదాయప్రదర్శినియందు కలదు. కాని అచ్యుతాబ్ది అన మెలట్టూరు. ఇతడు పదు నేడవశతాబ్దినే వలసవచ్చిన మెలట్టూరు భాగవతుల కుటుంబి అగును. మెలట్టూరు నుండి ప్రతాపసింహుడు ఆహ్వానించియుండవచ్చును. ఇతడు ప్రతాపసింహుని ఆస్థానకవి అగును కాఁబట్టి పదముల రచనాకాలము 1740-60 మధ్య కావచ్చును.

ప్రతాపరామముద్రాంకితమైన పదమిది:

పల్లవి: ఓ మనసా యేమరకే - శ్రీరామనామము ॥ఓ॥
అనుపల్లవి: పామరత్వము జెందక యొకటి - పట్టుగాబట్టి యా ప్రతాప
రామా యను నామమే - నిరంతరము చలియింపక దలచు ॥ఓ॥
చరణము: వారిజాసనప్రభృతి - దేవతావర్ణమయంబగు నామము
క్రూరపాపాగ్నిదావాగ్నికెల్ల - వారణాస్త్రము నామము
కోరి నమ్మియున్న వారికెల్లను - కోర్కెలిచ్చు శుభనామము ॥ఓ॥

**పచ్చిమిరియము ఆదియప్పయ్య:** ఇతని కృతులు పదములు. వేంకటరమణపరముగ కలవు. ఇతడు ప్రతాపసింహుని, రెండవతుళుజాజీ (1762-87) కాలములందు కలడు[105]. కాఁబట్టి పదముల రచనాకాలము 1750-80 మధ్య కావచ్చును.

ఇతని "విరిబోణి" పదము భైరవి వర్ణము వంటిది[106].

ఇతడు త్యాగయ్యకు వృద్ధసమకాలికుడు. గురుతుల్యుడు.

**వీణ కృష్ణయ్య:** ఇతని కృతులు సప్తతాళేశ్వరప్రబంధములు. అవి మూడును విజయనగరము, మైసూరు, పుదుక్కోట పాలకుల మీద రచించినవి[107].

ఇతడు పచ్చిమిరియము ఆది అప్పయ్య కుమారుడు. వీణావాదనవిశిష్టతను వీణ కృష్ణయ్య అని ప్రసిద్ధుడు. ప్రబంధముల రచనాకాలము 1770 ప్రాంతము కావచ్చును.

**ముద్దుపళని:** ఈమె కృతి రాధికాసాంత్వనము. చిన్నికృష్ణునికి అంకితము. సప్తపదులు - గోదాదేవి తమిళభాషలో రచించిన తిరుప్పావై అను ముప్పది పాశురములకు తెనుగుసేతలు - ముద్దుపళని కృతముగ ముద్రితము. కాని, అవి ముద్దుపళని కృతములు కావు. అట్లు ముద్రితమగుటకు ఆధారము,

" శ్రీనివాసగురునిఁ దలఁచి చిత్తమునను ముద్దుపళని
పూని చేయు ద్రవిడపాటలోని భావమూ "

అను ప్రథమచరణము. అది సరియైన పాఠము కాదు.

"శ్రీనివాసగురుఁడు విష్ణుచిత్తు కూర్మి ముద్దుపట్టి
పూని చేయు ద్రవిడపాటలోని భావమూ "

ఇది సరియైన పాఠము. ఇందులోని ముద్దుపట్టి అందులోని ముద్దుపళని అయినది! అంతేకాదు. సప్తపదుల తుదిని,

" వారిరిగ నిటుల శ్రీనివాసదేశికుండు

తిరుప్పావు భావమెల్ల సప్తపదుల గూర్చిరి. "

అని స్పష్టముగ కలదు. కనుక సప్తపదులు శ్రీనివాసదేశికకృతమే.[108]

ముద్దుపళని విద్యాగురువు వీరరాఘవదేశికుడు. (12వచ.అవ.) వైష్ణవగురువు తిరుములల తాతయాచార్యులు (గద్యము.) జీవితప్రభువు ప్రతాపసింహుడు (1739-62) "ఆ మహారాజు కృపఁ జెందె"నది. (15ప.అవ.) అతడు బహూకరించిన "అనేక చామీకరాంబరాభరణ"ములు అందినది. (గద్యము.) కాఁబట్టి రాధికాసాంత్వనము రచనా కాలము 1750 ప్రాంతము కావచ్చును.

ముద్దుపళని సాహిత్యవిద్యావిశారదశారద. (30ప.అవ.) కవితాజాతు లెటింగినది. (36ప.అవ.) రామకోటి వ్రాయించినది. పండితులకు పైకమిచ్చినది. కావ్యములు స్వీకరించినది. (32ప.6వ.) అంతేకాదు. ప్రతాపసింహుని పెంపును చెందిన రంభ. ముద్దులక్ష్మితో పుట్టిన కల్పలత. (ముద్దులక్ష్మి తోఁబుట్టువు.) ముత్యాలలో నుండి పొడలిన సుగుణరత్నము. (ముత్యాలు తండ్రి.) శ్రీనివాస ప్రాప్తిని చెలగిన సుగంధప్రద. లలితసకల కళాప్రౌఢి వెలయు చంద్రరేఖ. (33ప.అవ.)

ఇల సుగంధప్రదమిదియె కాకున్నచో
శ్రీనివాసప్రాప్తిఁ జెలఁగనేల? "

అను సీసపాదమునకు అర్థమేమి? ప్రాప్తి భక్తి కాదు. అది సుగంధప్రదమును కాదు. మఱి?-

రాధికాసాంత్వనము సత్యభామాసాంత్వనమునకు సహోదరము. జన్మమున చిన్న. ధన్యతను మిన్న. సత్యభామాసాంత్వనములోని సంభోగశృంగారమును తలదన్నునది రాధికాసాంత్వనములోని సంభోగశృంగారము. అది రతిక్రీడ. ఇది మన్మథమల్లయుద్ధము. అంతేకాదు. "గ్రంథములోని భాగము లనేకములు స్త్రీలు వినదగినవియు, స్త్రీ నోటి నుండి రాదగినవియు గాక దూష్యములై యున్నవి." అని ఒక అభిప్రాయము కలదు[109]. "సిగ్గనునది స్త్రీజనమునకేగాని పురుషులకు మాత్రము స్వాభావికము కాదుకాబోలును. ఇక్కవయిత్రి వేశ్య గనుక సిగ్గుమాలి సంభోగాదివర్ణనలు పచ్చిగా వ్రాసిన వ్రాయవచ్చును. శిష్టు లనిపించుకొన్న పురుషు లట్లు వ్రాయఁగూడదుగదా" అని ఒక ప్రత్యభిప్రాయమును కలదు[110]. శిష్టు లనిపించుకొన్న పురుషు లట్లు వ్రాయగూడని మాట నిజము. కాని, వ్రాసిన శిష్టులు కలరు. శిష్టలు లేరు. అంతేకాదు. ఎంత వేశ్య అయినను, మఱెంత బరి తెగించినను, ఇంకెంత బడువుకెత్తినను, సిగ్గు విడిచి స్త్రీలు రచింపలేని, రచింపరాని పద్యములు రాధికాసాంత్వనమునందు కలవు. సిగ్గు పురుషులకును స్వాభావికమైనను, సిగ్గు మాలిన పురుషకవులు కలరు. వికటకవి గోపాలరాయడు ప్రథమోదాహరణము. కూచిమంచి జగ్గకవి ప్రముఖోదాహరణము. సిగ్గు మాలిన కవయిత్రులు లేరు. కవయిత్రి మొల్లకు గల ఔచిత్యదృష్టి కవిపుంగవులకు లేదు. వేశ్య అయినను, కాకపోయినను పసుపులేటి రంగాజమ్మ పచ్చి శృంగారమును వర్ణింపలేదు. రాధికాసాంత్వనములోని

శృంగారము పచ్చిశృంగారమే కాదు; పిచ్చి శృంగారము. మదపిచ్చి శృంగారము. అది కవిపుంగవుల కండూతి. కనుక రాధికాసాంత్వనము కవిపుంగవకృతము కావచ్చును. ఆ కవిపుంగవుడు శ్రీనివాసదేశికుడు అయిన, శ్రీనివాసప్రాప్తిని చెలగిన ముద్దుపళని "ఇల సుగంధప్రద" అగును. కావ్యము యత్కృతమైనను, కావ్యసుగంధము తత్కృతమే. పాశురములు రచించిన శ్రీనివాసదేశికుడు, పాశవికశృంగారమును రచించుట అసంభవము కాదు. ధేనుమాహాత్మ్యము రచించిన లింగనముఖి తిరుకామయ సత్యభామాసాంత్వనమును రచించుట సుసంభవమైనది కదా!

రాధికాసాంత్వనములోని 66, 70, 82, 101, 103, 105, ప. 1ఆ; 66, 113, 116,132, 139 ప. 2ఆ; 105, 110, 111, 115, 117, 123, 125, 127, 133 ప. 3ఆ; 103, 104, 105 ప. 4 ఆ. పరిశీలనార్హములు. వానిలో కొన్ని ఉదాహరణయోగ్యములు కావు. పాయసపాత్రలోని విషబిందువులు.

> "ఈ కావ్యమందు రెండు కృషులు బయలుదేరుచున్నవి. లలిత శృంగారరసమందు చెప్పిన పద్యములు సాక్షాత్ స్త్రీకావ్యమేగాని యిసు వంటి క్లిష్టమైన పద్యములు (అవ.13మొ.) దాని గురువు రచించుకొన్నాడని యోచింపవలసినది. "

అని ముందే ఒక అభిప్రాయము కలదు[111]. అవతారికలోని పదమూడవ పద్యమే కాదు; రాధికాసాంత్వనము మొత్తము మీద ఏ పద్యమును క్లిష్టమైన పద్యము కాదు. ప్రతిపద్యమును స్పష్టమైన పద్యమే. క్లిష్టమైన పద్యములు కాదుగాని, భ్రష్టమైన పద్యములు గురువు రచించినవని యోజింపవచ్చును.

> " ఈ కావ్యం కృష్ణరాధికల గురించి వుండగా నిజమైన మూలం ఏమంటే రాజావారు ముందుగా యీ తంజినాయికను వుంచుకొనివుండి, అటు తర్వాత దీని పెంపు కూతురైన ముద్దుపళని అను యీ కవీశ్వరాలును వుంచుకొని, అటు వెనుక తిరిగి తల్లితో సమాధానం పరిచినాడు గనుక ఆ సాంత్వనం - అనగా సమాధానమును గురించి యీ కావ్యం రచించినది, యీ కథ తంజావూరులో విననవును."

అని కూడ ఒక జనశ్రుతి కలదు[112]. గతశతాబ్ది పూర్వార్ధమునందే.

ముద్దుపళని తల్లి పోటి. తండ్రి ముత్యాలు. ముత్యాలును, అతని తోబుట్టువు ముద్దు తంజనాయకిని తంజనాయకి దత్తుగొన్నది. (18,21,28ప.అవ.) తంజావూరు జనశ్రుతిలోని తంజినాయకి ముద్దుతంజనాయకి అగును. ముద్దుపళనికి మేనత్త ముద్దు తంజనాయకి. ఇళాదేవికి మేనత్త రాధాదేవి.

రాధిక ఇళను పెంచి పెద్దచేసినది. ఇళ రజస్వల కాగానే కృష్ణునితో శోభనము చేయించినది. "అవనాయ మొదలగు పేరఁటాండ్రు మన యిళామాధవులకు శోభనమటంచు చల్లగాఁ బాడి"రని కలదు. (39ప.1ఆ.) పెండ్లి చేయలేదు. పెండ్లి కాని శోభనము కన్నెరికము పేర్కొలు. ఇది ముద్దుతంజనాయకి ముద్దుపళనికి చేయించిన

కన్నెటికము వీడ్కోలు వలె కలదు. అంతేకాదు. రాధిక "గోపీవిటు నటు రతికేలి విడువంగ" (3ప.2ఆ.) ఇళ ఎదుటికి వచ్చిన, "ఎచటికి జరిగితనుచు నిళను జేపట్టుకొని రాధ యింటికేఁగె"నని కలదు. (4ప.2ఆ.) ఇళ శోభనము రాధ ఇంటిలోనే జరిగినది. ఇంటి నుండి ఇంటికేగుట ఏమి? గదియా? రాధిక ఇల్లు ఒకటి, ఇళ ఇల్లు మఱొకటి కాదు. ఒకటే ఇల్లు. ఇది ముద్దుతంజనాయకి ముద్దుపళనికి రాజాంతఃపురమునందు శోభనము జరిపించి, ఇంటికి తీసికొనివచ్చుట వలె కలదు.

ఇళ శోభనమునకు రాధిక ఇళ కన్నతండ్రి కుంభకుని పిలువలేదు. కనీసము తెలుపలేదు. అయినను శోభనము అయిన తర్వాత అతడే వచ్చును. (16ప.2ఆ.) "ఇళామాధవులను దోడ్కొని మా నివాసంబునకు నీవు రావలయు"నని రాధికను ఆహ్వానించును. మాటవరుసకైన చెప్పకుండ శోభనము చేయించితివని అవడు. రాధిక ఇళను పెంచి పెద్దచేసితిని. మీ ఇంటికి పంపించ"నని అనదు. తాను వలసినప్పుడు వచ్చెదనని ఇళామాధవులను పంపించును. (19వచ.2ఆ.) ఇది ముద్దుతంజనాయకి ముద్దుపళనిని రాణివాసమునకు పంపినట్లు వలెనే కలదు. కనుక తంజావూరు జనశ్రుతి తథ్యము కావచ్చును.

ఇళను పంపించిన తర్వాత రాధిక విరహము. చిలుక రాయబారము. అది ఫలించలేదు సరికదా, ఇళ "పరవశుఁడైన శౌరిఁగని... రాధికామణిన్ దొరఁగు మటంచు వేడుకొనెఁ ద్రోయక మాధవుఁ డిచ్చె నమ్మికల్" అని చిలుక పితూరి. (4ప.3ఆ.) అది విని రాధిక మూర్ఛ. ఈర్ష్య. అంతేకాదు. కృష్ణుడు ఇళకు "వలపుల దొరసాని" అని బిరుదప్రదానము చేసినట్లును చిలుక ఫిర్యాదు. (41ప.3ఆ.) అది విని రాధిక ఆక్రోశము. ఆక్రందనము. ఇది రాణివాసము చేరిన ముద్దుపళని మురిపెము, రాణివాసము వీడిన ముద్దుతంజనాయకి తిరిపెము వలెనే కలదు.

అర్జునుడు "రాధిక పంచిన చిలుక యలుకఁ జెప్పకపోయె"నని చెప్పగా (ప.963ఆ.) కృష్ణునికి రాధ గుఱించి విరహము కలుగును. శ్రీదాముడు పరిహాసమాడగా (140-142ప.3ఆ.) కృష్ణుని విరహము విజృంభించును. మఱునాడు శ్రీకృష్ణుడు బృందావనము లోని నిజమందిరమునకు వచ్చి, శ్రీదాముని వలన రాధ సంగతి తెలిసికొని, రాత్రి రాధామందిరము చేరును. (3వచ. 4ఆ.) స్వాగతము లేదు. బహిష్కారమును లేదు. చిలుక సోల్లుంఠనము సేయును. కృష్ణుడు బ్రతిమాలును ప్రవేశము లభించును. రాధను అనునయించును. రాధ కృష్ణుని నిరసించును. కృష్ణుడు రాధకు పాదాభివందనము సేయును. రాధ కృష్ణునికి వామపాదతాడనము సేయును. కృష్ణుడు ప్రాధేయపడును. రాధ విలపించును. కృష్ణుడు వలపించుమ సంభోగశృంగారమే సాంత్వనము. రాధామాధవుల పునస్సమాగమునకు శ్రీదాముడు వలె ముద్దుతంజనాయకీ తంజాపురపాలకులకు శ్రీనివాసదేశికుడు కావ్య ప్రబోధము చేయవచ్చును.

ఇది వంది తిమ్మన పారిజాతాపహరణమునకు అంతఃపురరహస్యము

చారిత్రికనైపథ్యము వలె, ముద్దుపళని రాధికాసాంత్వనమునకు చారిత్రికనైపథ్యము కావచ్చును. అది బహిరంగసంగీతము. ఇది నేపథ్యసంగీతము. పారిజాతాపహరణ ప్రభావము, సత్యభామాసాంత్వనస్వభావము రాధికాసాంత్వనమునందు సమధికము.

సత్యభామాసాంత్వనమునందు కృష్ణుడు మధురనాటకశాలలోని ఆహార్యమును ధరించిన ముద్దళఘురి అని, రాధికాసాంత్వనమునందు కృష్ణుడు తంజావూరునాటకశాల లోని ఆహార్యమును ధరించిన ప్రతాపసింహుడు అని అనిపింతురు. అసలు కృష్ణుడు అనిపించడు. రాధికాసాంత్వనము సత్యభామాసాంత్వనమును మించిన అసత్కావ్యము. అది శృంగారశృంగాటకము. శృంగారశృంగాగ్రసరము. ఇది శృంగారమహాశృంగాటకము. శృంగారమహాశృంగాగ్రసరము.

రాధికాసాంత్వనములోని పలుకులు తళుకులు. సామెతలు ఆమెతలు. అన్యాప దేశములు విన్యాసకోశములు. చమత్కారములు చారుతరములు. ధారాశుద్ధి ధారాళము.

"మల్లెలు మొల్లమొగ్గలును మంకెనపువ్వు సువర్ణకోశమున్
దెల్లనివవ్వు పల్వరుస తియ్యని వాతెర నిక్కు ముక్కునై
యల్లుకొవన్ ముఖాబ్జమువ నాతఁడు మాధవుఁ డొటెఱింగి మేల్
చెల్లవె వీనికిన్ బుధులు చెప్పెడి యా సుమనోఽభిధానముల్." 45ప. 2ఆ.

"ఏమేమీ వెఱపింత లేకయె యిళాహేలావతిట్లాడెనే!
యామాట ల్విని మంచిదంచనియెనే యా ధూర్తగోపాలుఁ డో
రామా! యట్లనె కాని, మంచివని, మేలాయెన్, మఱేమాయె, నా
భామారత్నముఁ దామ గూడి సుఖియై వర్ధిల్లినం జాలదే?" 6ప. 3ఆ.

"ఆశుకవిత్వంబు అల్లితేనే సరా?
చిత్రప్రబంధముల్ సేయ వలదె?
గోటిచేతను వీణ మీటితేనే సరా?
కొంచక రాల్ కరఁగించ వలదె?
పదపడి రాగముల్ పాడితేనే సరా?
హితవొప్ప వర్ణంబు లెత్త వలదె?
యల నాట్యభేదమ్ము లాడితేనే సరా?
పవరసంబుల వంటి విడువ వలదె?-" 14ప. 3ఆ.

అసమానమైన కవితాశక్తి అస్థానపతితము.

మాతృభూతకవి: ఈతని కృతి పారిజాతాపహరణనాటకము. ఇది మహానాటకము. బృహద్యక్షగానము. మూడు వందల పుటల ముద్రితగ్రంథము. అమరసింహునికి (1787-98) అంకితము. కాఁబట్టి పారిజాతాపహరణనాటకరచనా కాలము 1790 ప్రాంతము కావచ్చును.

ఇందు అయిదంకములు కలవు. ఏకరాత్రిప్రదర్శనీయము కాదు. పాంచరాత్ర ప్రదర్శనీయము. ఆశ్వాసాదిపద్యముల వలె అంకాదిపద్యములు కలవు. ఆశ్వాసాంత

గద్యముల వలె అంకాంతగద్యములు కలవు. "అవధరింపు"మను పద్యములు కలవు. అందును అంకిత విషయము కలదు. అవతారిక కలదు. అందు ఇష్టదేవతాస్తుతి కలదు. పదము, మంగళము, ద్విపదఘట్టము. పదము, మంగళము కృష్ణపరము. కృష్ణుడు త్రిశిరగిరివాసుడైన శివుని మిత్రుడు. ఇది గ్రంథమంతట కలదు. ద్విపదఘట్టము నందు విఘ్నేశ్వరస్తుతి, విష్ణుస్తుతి, లక్ష్మీస్తుతి, బ్రహ్మస్తుతి, బ్రాహ్మీస్తుతి, శివస్తుతి, పార్వతీస్తుతి కలవు. వ్యాసవాల్మీకాదివరకవీశ్వరుల, నన్నయభట్టాదినానాంధ్రకవుల సుకవిస్తుతి, కుకవినింద, కవిచరిత్ర కలవు.

" మాతృభూతస్వామిమహితకటాక్ష
చాతుర్యపరిలబ్ధసరససాహిత్య
సంగీతమధురవాగ్ఝరి గల్గు వాఁడ
శృంగారరసము తెల్పిన మేలువాఁడ
కవి మాతృభూతనాఖ్యానంబుచేత
భువిలోపలఁ బ్రసిద్ధి పొందినవాఁడ "

అని కవి స్వీయచరిత్ర. కృతిపతి అభివర్ణన మూడు శ్లోకములందు, ముప్పది ద్విపదలందు, మఱల ఒక శ్లోకమునందు కలదు. ఇతని మంత్రి శివరాయని వర్ణన పది ద్విపదలందు మఱల ఒక శ్లోకమునందు కలదు. అతడు ప్రతాపరుద్రునికి యుగంధరుడు, సారంగధరునికి సుబుద్ధి, కృష్ణరాయలకు అప్పాజీ వలె అమరసింహునికి మంత్రి. అంతేకాదు. అమరసింహుడు పచివాయత్తసిద్ధుడు. యుగంధరుడు, సుబుద్ధి వాఙ్మయప్రసిద్ధులు. అప్పాజీ చరిత్రప్రసిద్ధుడు. అప్పాజీ ప్రసక్తి అపూర్వము. ఇదియెల్ల కావ్యసరణి.

పారిజాతాపహరణకథ ప్రసిద్ధము. పారిజాతాపహరణకావ్యము సుప్రసిద్ధము. పారిజాతాపహరణనాటకము అప్రసిద్ధము. కాని బహువిషయబంధురము.

ప్రథమాంకమునందు విఘ్నేశ్వరాగమనము, వేత్రపాణి ఆగమనము తర్వాత 'ధార్మికపంతులు' ఆగమనము కలదు. అతడు 'దార్మికపండితుడు' కూడ. నిర్వహించినది నిండుమన్న. అనంతరము పార్వతీపరమేశ్వరుల ఆగమనము, దేవతాస్త్రీల పార్వతీపరమేశ్వరస్తోత్రపారాయణము, పార్వతీపరమేశ్వరపరిహాసప్రసంగము కలదు. ప్రయోజనము పూజ్యము. తర్వాత భోజకన్యక ఆగమనము. పట్టెమంచము మీద పవ్వళించి మఱియు ప్రవేశించును. ఆమెను ఎవ్వరవని మాధవి అడుగును. మాధవి స్త్రీ కాదు; పురుషుడు. ఇది మాతనపాత్ర. సూత్రధారికి ప్రత్యామ్నాయము. భోజకన్యక భోజుని కూతురేగాని రుక్మిణి కాదు. లీలావతి. కన్నగాడు వంచన గావించి వసుధకు తెచ్చెనట. ఆమె కర్ణకారుని చూచి వెతచెందును. కర్ణకారుడు మాధవి కావచ్చును. ఆమె వెత తీరకుండగావే గొల్లభామ ఆగమనము భోజకన్యక ప్రమేయము శూన్యము. గొల్లభామ కూడ మాతనపాత్ర. కొరవంజి పాత్రకు పద్యశము. ఆమె చల్ల అమ్ముకొను

ఘట్టము సుదీర్ఘము. సుంకరి వచ్చి అల్లరి పెట్టును. "అంతట అత్త వచ్చుట" అని కలదుగాని అత్త ఆగమనము లేదు. గ్రంథపాతము కావచ్చును. గొల్ల భామ ఘట్టము కూడ ఇతివృత్తనిర్వహణమునకు నిరుపయోగము. 'కర్టెన్‌రైజర్'గా సరిపెట్టు కొనవలయును. "తదనంతరంబ" ద్వారకాపురవర్ణనము. కృష్ణుడు కొలువుకూటమునకు వచ్చుట కలదు. ముందు తెరమఱుగున నుండి మాధవునితో మాటలాడును. తెర యీవలకు రమ్మని మాధవుడు అడిగినను, తెరమఱుగున నుండియే రాధను తలంచుకొని విరహవేదన అనుభవించును. రాధికామణి ఆగమనము. రాధ వచ్చినదని మాధవుడు చెప్పగా, కృష్ణుడు తెర ఈవలికి వచ్చును. రాధికామణి విరహనివేదన. రాధాకృష్ణుల నాట్యము. కృష్ణుడు రుక్మిణిని తలంచిన, రుక్మిణి తెరమఱుగునకు వచ్చును. రుక్మిణి విరహవేదన. మాధవుని అనునయము. రుక్మిణి తెర మఱుగు నుండి వచ్చును. మఱల రుక్మిణి విరహవేదన. మాధవుడు చెప్పగా కొలువైన గోవిందుని చూచి ఊరట చెందును. అష్టమహిషుల చెలికత్తెల ఆగమనము. విష్వేశ్వరాగమనము మొదలు చెలికత్తెల ఆగమనము వఱకు అరువది మూడు పుటల నాటకమిది. ఆకస్మికముగ నారదుని ఆగమనము. పారిజాతపుష్పసమర్పణము. ఎవరికిచ్చుట అని సందేహడోలలో ఊగిసలాడు కృష్ణునికి రుక్మిణికే ఇమ్మని నారదుడు చెప్పును. కృష్ణుడిచ్చును. రుక్మిణి ధరించును నారదుడు పారిజాతపుష్పమును వర్ణించును. నంది తిమ్మన "అలినీలాలక' పద్యమునకును అనుసరణము కలదు. ఇతరపద్యములకును కలదు. ప్రధానకథా ఘట్టమిది ఎనిమిది పుటలందు కలదు. అందును ముఖ్యఘట్టము నాలుగు పుటలే.

ద్వితీయాంకమునందు సత్యభామ కొలువుకూటము కలదు. అది రాజుల కొలువు కూటములకు సదృశము. అంతేకాదు. "ఇల్లాంద్రసభ." (పుట100) అందు సత్యభామ విరహము ప్రధానవిషయము. సత్యభామ సుస్వప్నవృత్తాంతము, దుస్స్వప్నవృత్తాంతము, అపశకునవృత్తాంతమును కలవు. చెలికత్తె వచ్చి జరిగిన వృత్తాంతము చెప్పిన, సత్యభామ కోపావేశమున కృష్ణుని యొద్దకు పోయి గోలపెట్టును. కృష్ణుడు సత్యభామను తూలనాడును. అయినను సత్యభామ 'రారా కృష్ణా' అని బ్రతిమాలిన, కృష్ణుడు 'రానే భామా' అని తిరస్కరించును. ఇంటికి మరలి వచ్చిన సత్యభామకు మఱల విరహాతి శయము. సరస్వతి ఎఱుకతగ, బ్రహ్మ సింగనిగ వచ్చుట కలదు. ఎఱుకత సోదె, సింగిసింగుల రగడ యథావిధిగ కలవు. ఇది యెల్ల మాతృభూతన స్వీయకల్పనము. యక్షగానసరణి.

తృతీయాంకమునందు సత్యభామ విరహోద్వేగము కలదు. చెలికత్తె రాయబారము కలదు. కృష్ణుని నిరాకరణము కలదు. సత్యభామ విరహతాపము కలదు. మాధవి రాయబారము మఱల కలదు. కృష్ణుని నిరాకరణము మఱల కలదు. సత్యభామ విరహవిజృంభణము కలదు. చెలికత్తెల శైత్యోపచారములు కలవు. సత్యభామ ప్రాణత్యాగప్రకటనము కలదు. మన్మథాద్యుపాలంభములు కలవు. ఇదియెల్ల మాతృ

భూతన స్వీయకల్పనమే. కావ్యయక్షగానోభయసరణి.

చతుర్థాంకమునందు సత్యభామ మఱల కృష్ణుని సన్నిధికి వచ్చి, సంస్కృతకర్ణాట తమిళమహారాష్ట్రహిందీభాషలందు వేడుకొనుట, శతకోటి పైగా దండములు పెట్టుట కలదు. నమస్కరించినందుకు కృష్ణుడు ఆశీర్వదించుట కలదుగాని అంగీకరించుట లేదు. సత్యభామ నిందారోపణలు చేయుట, కృష్ణుడు సమాధానము లిచ్చుట కలదు. రుక్మిణీసత్యభామల మధ్య, రాధికాసత్యభామల మధ్య సవతికయ్యములు కలవు. కృష్ణుడు రాధికను బుజ్జగించుట, సత్యభామను మందలించుట కలదు. సత్యభామ నిజగృహమునకు వచ్చి, విరహోద్రేకమునందుట, శృంగారవనికి వచ్చి భాగవతములోని గోపికల వలె కృష్ణుని అన్వేషించుట కలదు. అంతేకాదు. విరహసంరంభమును భరింపలేక కోపగృహప్రవేశము చేయుట కలదుగాని, అలకపాన్పు అధివసించుట లేదు. నేలమీద పవ్వళించి హరిధ్యానము చేయుట కలదు. కృష్ణుడు వచ్చుట కలదు. కథ అడ్డము తిరిగి, కృష్ణుడు బ్రతిమాలుట సత్యభామ తిరస్కరించుట కలదు. అయినను, కృష్ణుడు కోపగృహములో ప్రవేశించి, చెలి చేతిలోని సురటి తీసికొని విసురుట, పారిజాత సువాసనలకు సత్యభామ ముసుగుదన్నుట, కృష్ణుడు ప్రాధేయపడుట, జగన్నాటక సూత్రధారి పాదాభివందనము సేయుట, సత్యభామ పాదతాడనము చేయుట పారిజాతా పహరణకావ్యమునందు వలె కలదు. సత్యభామ కృష్ణుని నిష్ఠురము లాడుట, కృష్ణుడు మృదులము లాడుట మఱల సుదీర్ఘఘట్టము. కడకు సత్యభామ పారిజాతప్రసూనమును తెమ్మనుట, కృష్ణుడు పారిజాతవృక్షమును తెత్తుననుట కలదు. ఇందు మాతృభూతన స్వీయకల్పనము గురుపీఠము. పారిజాతాపహరణకావ్యానుసరణము లఘుశిల్పము.

పంచమాంకమునందు సత్యభామ కృష్ణుని ప్రశంసించుట, పన్నీట జలకమార్చుట, కైసేయుట, తానును గుజ్జగొజ్జిగి నీట మజ్జనమాడుట, ఇద్దఱు పొత్తు భుజించుట కలవు సత్యభామాశ్రీకృష్ణులు మన్మథసామ్రాజ్యమును కైవసము చేసికొనుట కలదు. కృష్ణుడు, సత్యభామాసమేతుడై కొలువున్న సమయమునందు వచ్చిన నారదుని ద్వారా వర్తమానము పంపి, అమరావతికి ఏగుట, పారిజాతాపహరణము సేయుట, యుద్ధమునందు ఇంద్రుని జయించుట, పారిజాతవృక్షమును ద్వారకానగరమునకు తెచ్చుట పారిజాతాపహరణ కావ్యానుసరణములుగ కలవు. అనంతరము సత్యభామాశ్రీకృష్ణులు ఆనందసాగరమున ఓలలాడునెడ, రుక్మిణి విరహము నందుట, కృష్ణుడు వచ్చుట, రుక్మిణి కోపావేశమున కృష్ణుని సూటిగా మీటుట, కలవు. అంతేకాదు. కృష్ణుడు "పారిజాతంబు దానింట బాగు మీఱఁ బువ్వు లెల్ల నీ యింట నివ్వటిల్ల వెలయఁజేసితి" నని చెప్పుట రుక్మిణి కొనియాడుట కలవు. తదనంతరము కృష్ణుడు రుక్మిణీసత్యభామలకు అన్యోన్యత కలిగించుట, రుక్మిణీసత్యభామాసమేతుడై సుఖముండుట కలదు. ఆ మీద జలక్రీడలు. అందు గోపికావస్త్రాపహరణము. గోపస్త్రీల శ్లోకములు; వలుగు, పూజ పాటల నాటకాంతము. తదుపరి మూడు పద్యముల అమరసింహుని కైవారము, పదకొండు

ద్విపదల ఫలశ్రుతి.

ఇది రుక్మిణీపాణిపీడితుడు, సత్యభామాపాదతాడితుడు అయిన కృష్ణమూర్తి చరిత్రము ఇతివృత్తమైన పారిజాతాపహరణమహానాటకము. పెద్దయక్షగానము. ఇందు కథాప్రారంభము నుండి కథాంతము వఱకు శ్లోకములు 21, వృత్తములు 57, కందములు 41, సీసపద్యములు 106, గీతపద్యములు 19, కందపద్యములు 41, ద్విపదఘట్టములు 52, పదములు, పాటలు 124, దరువులు 15 చూర్ణికలు 4 స్తోత్రము 1 కలవు. ద్విపదపద్యములు గాక ఇతరపద్యములు మొత్తము 244 కలవు. ఇన్ని పద్యములు కల యక్షగానము ఇతరత్ర మృగ్యము. పద్యములందు అక్కడక్కడ వ్యావహారికభాషా పదప్రయోగములు కలవు. సీసపద్యములందు సమత సర్వత్ర కలదు. ధార ధారాళము.

పోతన పద్యమును కరగించి పోతపోసిన ఒక పద్యము:

" ఈ పదాబ్జంబులే యింతిరో, మహనీయ
వేదాంతవీథికావిహరణమ్ము
లీ పదాబ్జంబులే యింతి, శ్రీకుచలిప్త
ఘనతరపత్రలేఖాంచితములు,
ఈ పదాబ్జంబులే యింతిరో, సనకస
నందనముఖమౌనివందితములు,
ఈ పదాబ్జంబులే యింతిరో నిజభక్త
సంచయకైవల్యసాధనంబు
లీ పదంబులె సుజ్ఞానదీపకళిక
లీ పదంబులె నతకలుషాపహములు
ఈ పదాబ్జంబు లిటనుండ గోపతనయుఁ
డిచట నున్నాఁడు కాఁబోలు నింతులార! " పుట222.

నంది తిమ్మన పద్యమును నందివర్ధనము చేసిన ఒక పద్యము:

"పతి తనకు వశ్యుఁ డమచున్
బ్రతిదినము మదించు సత్యభామకుఁ జెలు లీ
విత మెఱిఁగించినఁ జూచిన
ధృతి వదలి మనంబులోన దిగ్భ్రమఁ జెందున్." పట89.

పారిజాతాపహరణకావ్యములోని రుక్మిణి సాత్త్వికగుణవతి. పారిజాతాపహరణ నాటకములోని రుక్మిణి రాజసగుణవతి. పారిజాతాపహరణకావ్యములోని సత్యభామ అభిమానవతి. పారిజాతాపహరణనాటకములోని సత్యభామ అతిదీనమతి. పారిజాతా పహరణము లోని సత్యభామ బెట్టుసరిని మించినది పారిజాతా పహరణనాటకములోని కృష్ణుని బెట్టుసరి. సత్యభామాసాంత్వనములోని సత్యభామ ధీర. పారిజాతాపహరణము లోని సత్యభామ ముగ్ధ. రాధికాసాంత్వనములోని రాధిక స్వతంత్ర. పారిజాతాపహరణ నాటకములోని రాధిక సమతంత్ర. రాధికాసాంత్వనములోని రాధికావిరహమును తివ్వ తీసినది పారిజాతాపహరణనాటకములోని సత్యభామావిరహము. అంతేకాదు. రాధికా

సాంత్వనము 'వారసత్వము' పారిజాతాపహరణనాటకమునందు సంక్రమించినది. తదన్యము గణ్యము. మాధుర్యధుర్యము.

శివాజీ: ఇతని కృతి అన్నపూర్ణాపరిణయనాటకము. యక్షగానము. శివాజీ రచించినట్లు కలదు. (పుటలు67,115) అంతేకాదు. ఇందు రెండు అంకములు కలవు. అంకాంతగద్యలును శివాజీ రచించినట్లు కలవు. శివాజీ రచించుట సంభవమేగాని, సందేహరహితము కాదు. ఏ మహారాష్ట్రపాలకుని పేరిటి కృతియందును లేని విశేషమిందు కలదు. అది సూత్రధారి సూచనమున శివాజీరాజునకు, పరంపరాశ్రితుడైన రంగనాథకవీశ్వరుడు కావించిన ఆశీర్వచనపద్యము. (పుట115.) ఆస్థానకవు లందఱి ఆశీర్వాదములు కాక, ఒక్క రంగనాథకవి ఆశీర్వాదమే ఉండుట సందేహము కలిగించును. అతడే అసలు గ్రంథకర్త కావచ్చును. ప్రతి "వ్రాయించిన అమృతకవి తులసీరంగయ్యంగారు' రంగనాథకవీశ్వరుడు కావచ్చును. నాటకము కడపట పాత్రధారుల పట్టిక తోపాటు ప్రదర్శనకాలము కలదు. అది మన్మథనామసంవత్సర శ్రావణమాసము. 1835 వ సంవత్సరము. కాఁబట్టి అన్నపూర్ణాపరిణయనాటకరచనా కాలము 1835 వ సంవత్సరము కావచ్చును.

ఇందు సుశర్మ అను వైశ్యునికి, తంజావూరులోని సిద్ధపుష్కరణితటాకములోని తామరపువ్వునందు లభించిన అన్నపూర్ణకు, కొంకణసిద్ధుని కోరికను సిద్ధపుష్కరిణి తీర్థము తీరమున వెలసిన కొంకణేశ్వరునికి పరిణయము జరుగుట ఇతివృత్తము. సుశర్మ లక్షధనము, పది లక్షల గోవులు, మిద్దె మేడలు, గృహములు, అద్భుతమణిభూషణాదులు తత్క్షణమే వరదక్షిణ ఇచ్చి సంబంధము నిశ్చయించునెడ, అన్నపూర్ణ అభిప్రాయ మడిగిన, ఆమె ధనమదాంధులను వరింపనని, ఇతరులను గాక ఈశ్వరుని పెండ్లాడుదునని ఖండితముగ చెప్పుట విశేషము. అందుకు అన్నపూర్ణ తపస్సు చేయుట, ఈశ్వరుడు వృద్ధబ్రాహ్మణరూపమున వచ్చి అనుగ్రహించుట, అంగీకరించుట పార్వతీకల్యాణమునకు అనుసరణము. అన్నపూర్ణాకొంకణేశ్వరుల పరిణయమునకు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, సప్తర్షులు, సకలదేవతలు, రంభాద్యప్సరసలు దివి నుండి భువికి దిగివచ్చుట యథాప్రకారమే. రచన సామాన్యము.

వేంకటకృష్ణాజెట్టి: ఇతని కృతి శివపారిజాతము. గ్రంథాంతగద్యను "- శివాజీమహీపాలుని తెలుగు కవి కనకాజెట్టి వేంకటకృష్ణాజెట్టి చేసిన కవిత్వం" అని కలదు. కనకాజెట్టి తండ్రి పేరు. కనకయ్య. గ్రంథాదిని "పసిబాలుఁడను వేను పశుపతి పొగడంగ, రసికు లెల్లరు విని రమ్యమొంద, వేదములయందు దాగిన వింత యొకటి ..... ధరణిలో వేను బొగడెద"నని కలదు[113]. అముద్రితము.

ఇతరాస్థానకవులు: సరస్వతీమహాలు గ్రంథాలయమునందు శివాజీపేరముల అవి అయిదు గ్రంథములు కలవు[114]. అవి శివాజీ ఆస్థానకవులు రచించినవి అగును. అముద్రితములు.

# పుదుక్కోట నాయకరాజులు

పుదుక్కోట సంస్థానము 1716 వ సంవత్సరమునందు పుట్టినది. పుదుక్కోట అన కొత్తకోట. నవసాలపురమని నామాంతరము. సంస్థానధ్వజమునందు "శ్రీబృహదంబా సహాయం" అని తెలుగు భాషను కలదు. సంస్థానాధిపతుల ఇంటిపేరు కోటి. కాఁబట్టి తెలుగు నాయకరాజులు. తొండమాన్ బిరుదము. తొలి సంస్థానాధిపతి రఘునాథతొండ మాన్[115]. (1682-1730) ఇతని జ్యేష్ఠపుత్త్రుడు తిరుమల తొండమాన్. సంస్థానాధిపతి కాడు. కవిపోషకుడు.

**నుదురుపాటి సీతారామయ్య:** ఇతని కృతులు 1. తిరుమల రాయోదాహరణము. 2.చాటుపద్యములు. వివిధప్రబంధములు రచించినట్లు కలదుగాని లభింపలేదు.

**తిరుమలరాయోదాహరణము:-** ఇది ఉదాహరణము. తిరుమల తొండమాన్ మీద రచించినది. అసమగ్రముగ లభించినది. అది కూడ లుప్తభాగములు కలది. తృతీయావిభక్తి కళిక, చతుర్థీవిభక్తి కళిక, పంచమీవిభక్తి వృత్తము, కళిక మాత్రమే లభించినవి. ఇతడు మహోద్దండకవిబిరుదప్రశస్తుడు. ఉదాహరణమునకు ఒక ఉదాహరణము[116].

" స్ఫాయద్దంతిఘటోద్భవమదాసారస్ఫురద్వాహినీ
. . . . . . . . . ధరారుహవరస్తోమావతంసభ్రమ
ద్గాయద్భృంగసమూహనిష్కుటముల్ దారిన్ సుధీగేహముల్
. . . . . . . . . ధీరువలనన్ రంజిల్లు నెల్లప్డుడున్. "

**చాటుపద్యములు:-** ఇవి తిరుమలతొండమాన్ మీద, అతని కుమారుడు విజయరఘునాథతొండమాన్ మీద చెప్పినవి. తండ్రి మీద చెప్పినవి ఆరు, తనయుని మీద చెప్పినవి నాలుగు లభించినవి. ఈ విజయరఘునాథతొండమాన్ కూడ సంస్థానాధిపతి కాడు. తండ్రి వలె కవిపోషకుడు. చాటుపద్యములకు మచ్చుతునుకలు:

" స్థిరజయసాంద్ర! కోటికుల తిర్మలరాయధరాధరేంద్ర! నీ
కరకరవాలఘాతలను గాంచిన వైరికిఁ బోటు దాన నం
బరమణి మేనఁ దూటు బలవైరికిఁ దత్తఱపాటు రంభ వా
తెఱపయిఁ గాటు సొరసుదతీమణి కబ్బురపాటు చిత్రమే? "

" గజఘంటఘణఘణల్ ధ్వజముల పెటపెటల్
గుంటుకోవిఫిరంగి గుభగుభలును
బలు తుపాకీగుండ్ల ఫెళఫెళల్ కత్తుల
భళభళ లీటెల ధగధగలును
శరముల బిసబిసల్ చక్రాల జరజరల్

బాణాల బిరబిరల్ భటుల రథుల
భూరిభేరీధ్వనుల్ వారణఘీంకృతుల్
జవనకంకాణఘోషలు చెలంగ
నళుకు బెళుకును లేక యాహవము సొచ్చి
ఘోరవైరుల శిరములఁ గూల్తు వౌర!
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర! "

పయి రెండు పద్యములను బట్టి తిరుమలతొండమాన్, అతని కుమారుడు విజయరఘునాథతొండమాన్ ఇద్దఱు కూడ సేనాధిపతులు కావచ్చును.

శేషయ్య: ఇతని కృతులు చాటుపద్యములు. తిరుమలతొండమాన్ కుమారుడు విజయరఘునాథతొండమాన్ మీద చెప్పినవి. అతని మీద సీతారామయ్య చెప్పిన సీసపద్యములలోని మకుటమే శేషయ్య సీసపద్యములందును కలదు. ఇద్దఱు సోదరులు కావచ్చును. ఒక ఉదాహరణము[117]:

" తూవిక దాతాయె తొలుదొల్త శిబిరాజు
చంచలదాతాయె జలధరంబు
కఱివదాతాయెను గాంచఁ జింతామణి
వీసపు దాతాయె వెలయు విభుఁడు
పరక దాతాయెను బరికింప కి...
పాతిక దాతాయె భానుసుతుఁడు
అరవాసి దాతాయె నంబికారమణుండు
ముక్కాలు దాతాయె మున్నె బలియుఁ
గావ నీ పాటి నెఱదాతఁ గలియుగాన
వరసి చూడంగ నేఁ గాన హరిసమాన
భళిర! తిరుమల తొండమాన్ ప్రభుకుమార!
విజయరఘునాథ! తొండమాన్ విభువజీర! "

శ్రీమన్నారాయణయ్య ఉరఫు మన్నారయ్య: ఇతని కృతులు 1.రసమంజరి. 2.చాటుపద్యములు

రసమంజరి:- ఇది అలంకారశాస్త్రము. భానుదత్తుని రసమంజరికి తెనుగుసేత. నాయికానాయకభేదములను సోదాహరణముగా నిరూపించువది. శ్రీమన్నారాయణయ్య రసమంజరి విజయరఘునాథతొండమాన్‌కు (1730-69.) అంకితము[118]. అముద్రితము. విజయరఘునాథతొండమాన్ తిరుమలతొండమాన్ అనుజుడు. తొలి సంస్థానాధిపతి రఘునాథతొండమాన్ ద్వితీయపుత్త్రుడు. తండ్రి అనంతరము సంస్థానాధిపతి.

చాటుపద్యములు:- ఇవి తిరుమల తొండమాన్ పుత్త్రుడు,

విజయరఘునాథతొండమాన్ దత్తపుత్త్రుడు, విజయరఘునాథతొండమాన్ అనంతరము పుదుక్కోట సంస్థానాధిపతి అయిన రాయరఘునాథతొండమాన్ మీద చెప్పినవి. కోటి రాయరఘునాథతొండమాన్ రాజ్యకాలము 1769-89. విజయరఘునాథతొండమాన్ కాలమునందు **(1730-69)** కోటిరాయరఘునాథతొండమాన్ కాలమునందును కల **(1769-89)** శ్రీమన్నారాణయ్య లేక మన్నారయ్య కాలము తన్మధ్యకాలమగుట తథ్యము. తండ్రి కొడుకుల కాలములందు ఒక కవి ఉండుట అసాధారణము కాని, అసహజము కాదు. చాటుపద్యములకు ఒక మచ్చుతునుక:[119]

" కీర్తిచే ధైర్యవిస్ఫూర్తిచే సతతంబుఁ
గంధౌతగిరిలీల వెలసినావు
దానంబుచేఁ బూర్ణమానంబుచే సదా
రాజరాజఖ్యాతిఁ బ్రబలినావు
జయముచే నుతదయోదయముచే ననిశంబు
కృష్ణప్రభావంబు గెలిచినావు
చెలువుచే విద్యల వలుపుచే సంతతం
బాత్మభూవైఖరి నలరినావు
రాజమాత్రుండవే! నీవు రాజలోక
సన్నుతౌన్నత్యగాంభీర్యశౌర్యధుర్య!
విజయరఘునాథమేదినీవిభుతనూజ!
రాయరఘునాథభోజ! విక్రమబిడౌజ! "

**రాయ రఘునాథతొండమాన్:** **(1769-89)** ఇతని కృతులు **1.**పార్వతీపరిణయము. **2.**కవిజనోజ్జీవని. మొదటిది పద్యగద్యకావ్యము. రెండవది సమస్యాపూరణగ్రంథము. ఇతడు తిరుమలరాయల కుమారుడు. తృతీయసంస్థానాధిపతి కాలము **1769-89.**

**పార్వతీపరిణయము:-** ఇది పద్యగద్యకావ్యము. రాయరఘునాథుని ఇష్టదేవతారమణుడు గోకర్ణేశ్వరునికి అంకితము. శ్రీకారము చుట్టిన మొదటి పద్యమునందే మొట్టమొదటి పాదమునందే వ్యావహారికశబ్దము కలదు. "శ్రీమత్పర్వత రాజకన్యను వరించే వేళ". ఇది "ప్రథమకబళే మక్షికాపాతః" అన్నట్లు కలదని, ఇట్టి దుష్ప్రయోగములు ఇంకను కలవని "కవికి తెనుగు బాగుగా రానట్లు తోచుచున్నది" అని ఒక అభిప్రాయము కలదు. ప్రప్రథమపాదమునందే వ్యావహారికశబ్దప్రయోగము చింత్యమే గాని, ఇట్టి ప్రయోగములు దక్షిణాంధ్రయుగకవులకు సర్వసాధారణము. కారణము తెనుగు బాగుగా రాకపోవుట కాదు. అతి స్వాతంత్ర్యము కావచ్చును. పార్వతీ పరిణయము నుదురుపాటి వెంకన్న రచించినట్లు వదంతి కలదు. అసంభవము కాదు గాని, మఱి సుసంగతమును కాదు. నుదురుపాటి వెంకన్న ఒసగిన కఠినసమస్యలను

పూరించిన రాయరఘునాథతొండమాన్ పార్వతీపరిణయము రచించుట సుసంభవమే. కవిజనోజ్జీవని సమీక్షను అరయునది. ముందు వివరింతును.

పార్వతీపరిణయము కథాప్రారంభములోని హిమవంతుని పరిపాలనవిధానము, మేనకాహిమవంతుల లీలావిహారము, సంతానప్రాప్తికి హిమవంతుని తపస్సు, బాలాంబ సాక్షాత్కారము, పార్వతి జననము; కథాంతములోని వల్లీకల్యాణము వినా, ప్రధానకథ కాళిదాసు కుమారసంభవములోని కథకు అనుసరణము. కథానుసరణమే కాని, కవిత్వానుసరణము కాదు. శ్లోకాంధ్రీకరణము లేదు. సర్వము స్వతంత్రకల్పనము. స్వీయకవిత్వము. ఇదొక ప్రయోగము. ప్రశంసాపాత్రము. ఉత్తమకవిత్వము తోపాటు చౌకబారు కవిత్వమును ఉండుట కాలదోషము.

ఇంద్రాదిదేవతలు బ్రహ్మను సందర్శించినపుడు బృహస్పతి, "పదపసంఖ్యను కాదు ...... "

" అని యొక పద్యముఁ జదివిన
విని ప్రమదము మది వెల్లివిరియఁగ గురునిం
గనుఁగొని యెవ్వఁడు రచియిం
చెను దీని బలారి మగుడఁ జెప్పు మటన్నన్.
శిరము మునుఁ జూచి వంచుచుఁ జేతి వ్రేళ్ల
హృదయకమలస్థలంబున కెదురు సేసి
నేనె యని పల్క నౌఁగాక నీకుఁ దొల్లి
కవనమున శక్తి లేదె యే గతిని గల్గె?
ఆ వాగ్దేవి గొలిచితొ
దేవ పరే మాకుఁ దెలియదే యా రీతుల్
జీవ యిదియేమి యుండని
పై వినవలె నింకఁ గొన్ని పద్యము లనినన్." పుట 23.

అను ఘట్టము రాయరఘునాథుని స్వానుభవరపోద్ధారము వలె కలదు. తారకాసురుని దుశ్చర్యలు భయానకరసమును గాక హాస్యరసమును ఒలికించును.

" భైరవి వినుపింప బాగాయె శంకరా
భరణం బిటంచును బ్రస్తుతించి
శార్దూలవృత్తంబు చదివిన నిది కంద
పద్యంబు గణములఁ బంచుమనుచు
నటతాళమునఁ బాత్ర మాడుచు వచ్చిన
ఘాతుకరూపకాంగముల నైనుఁ
బాణిపీయాన మపస్వరించిన వానిఁ
బద్మినీలైంగికప్రశ్న మడుగు
వెదిరి కాదన్న వారల కేమి యిడఁడు

అనుసరించిన నవ్వి పొమ్మనుచుఁ బలుకు
మెచ్చినను మెచ్చుకున్న నేమియును లేదు
కఠినచిత్తున కే రీతిఁ గలిగె భూతి." పుట 25

ఇది సంగీత, సాహిత్య, నాట్య, శాస్త్రపరిజ్ఞానము, సహనము, ఉపజ్ఞ, ఈవి లేని సాటి రాజునకు సోల్లుంఠనము కావచ్చును. అంతేకాదు. అవి రాజులకు ఆవశ్యకములైన లక్షణములని భంగ్యంతరసూచనము. ఏతల్లక్షణలక్షితుడు రాయరఘునాథతొండమాన్ అగును.

" గుడిగుడి (గ్రాఁగ, భంగు జతఁగూర్చిన చిల్మి గుడారుముద్దపైఁ
బడి రవిలించి క్రోలి పొగవచ్చెడు రీతిని మించఁ గీలముల్
పొడవును గాక యాఱియును బోవక నేర్చున వీతిహోత్రుఁ డ
చ్చెడుగులఁ గొల్వు గొర్తపయిఁ జెక్కిన రీతి సభాంకణంబునన్. "

ఇది హుక్కాగొట్టము పీల్చు పక్కా నవాబుల ఫక్కీ. తారకాసురునిపరివారమునకు ఆపాదితము. సమకాలికసమాచారము.

రతివిలాపఘట్టము సుదీర్ఘముగ కలదు. స్వతంత్రరచనమే. అందు,

" సన్నంపు చీరఁ గట్టుక
తిన్నఁగ నే నడువ తోడి తెరవ లొసీ! నీ
కన్నే నెల లన నవ్వుచు
నెన్నో యని మొగము విసురు టెపుడిఁక మదనా! " పుట 46.

వంటి పద్యములు ఉదాత్తముగ లేవు. కాని,

" దుఃఖాబ్ధిలో నన్నుఁ ద్రోచెనే వీనికి
శంకరనామ మే జాడ నిలుచు?
పారస్యమెఱుఁగక మారునిఁ గూల్చెనే
వీఁడు సర్వజ్ఞుఁడై వెలయఁగలఁడె?
న్యాయంబు దప్పిన నడక గల్గిన వీని
రాజశేఖరుఁ డనరాదు గాదె?
పాప మటంచని భయముఁ జెందని వాని
నచలధర్ముఁ డటంచు నాడఁదగునె?
అధికముగఁ దిట్టవలదని యడఁపవలదు
కోప మీతఁడు చేసిన కొదువ యేమి?
నేను నా పతి సౌఖ్యంబుఁ బూనఁ జెప్పు
మా వెఱపు లేదు నా చెంత నో వసంత! " పుట 48.

వంటి పద్యములు సందర్భోచితములే.

పార్వతి తపస్సు పరీక్షించుటకు పరమేశ్వరుడు, కుమారసంభవమునందు వలె కపటవటురూపమున కాక, పార్వతీకల్యాణమునందు వలె వృద్ధబ్రాహ్మణరూపమున

వచ్చినట్లు కలదు. అది దాక్షిణాత్యకథ అగును. వృద్ధవిప్రుని శివనిందకు పార్వతి దుఃఖించి, "వీని నావలఁ బొమ్మటంచు ద్రొబ్బి వైవుడు" అనిన చెలికత్తె లిట్లు చేయుదురు.

" నీలకంఠు నిటేల నీవు దూఱితి వంచుఁ
  బంకజాక్షి యొకర్తు చెంపఁ గొట్టె (?)
దేవదేవుని నేల తిట్టితి వీ వని
  కీరవాణి యొకర్తు గిండి దోఁచె
ధూర్జటి నేమంచు దూషించితి వటంచుఁ
  బువ్వుబోణి యొకర్తు బుగ్గ నులిమె
నిందుశేఖరు నేల నిందించితి వటంచు
  నీలాలక యొకర్తు నెత్తి గొట్టె
నౌర బాగాయె నీ కేమి యంత సలిగ
యీమె శివభక్తురాలని యెఱుక లేక
యతని గర్హించు టొప్పునే యనుచుఁ గనలి
సుదతి యొక్కతె గట్టిగా జుట్టు పట్టె. " పుట 68.

పార్వతి ఎంత శివభక్తురాలైనను వృద్ధవిప్రుడు పరమశివుడు. కనుక చెలికత్తెల చేష్టలు అనుచితములు.

పార్వతీపరమేశ్వరుల విరహఘట్టములందు పరమేశ్వరుని విరహమే పరకాష్ఠ.

" వందీ కన్నుల వశ్రుల
చిందీ తాపంబు మేనఁ జెందీ హృదయం
బందీ కుందీ యెందీ
యిందీవరనయన వెదకి యిందన లేవా? " పుట 80.

అని పరమేశ్వరుని ఆరాటము. అంతేకాదు. విష్ణువు ఏకాంతముగ,

" సామీ మీ తనువేటికి
సామీకృతమయ్యె గౌరి సన్నిధిలోనం
గాముని గమటనో యిపు డిం
కా మునివృత్తినిఁ దలంపఁగా లేరేమో " పుట 80.

అని పరిహాసమాడిన, పరమేశ్వరుడు-

"పెటిలు పెటిల్లన వ్రయిక పెట్లు నొయారపు జిల్గు పైటలోఁ
బుటములు ద్రొక్కు నబ్బులితపుంజిగిగుబ్బలతోడఁ జేడె ముం
దటఁ దమకంబున న్నిలిచినప్పుడు సొమ్మని వెన్క నాత్మ వ
క్కట యని కుందు వెంగలిని గావుము నీకు సలాము చేసెదన్. "

అని పలుకుట పాత్రోచితము కాదు. అంతేకాదు. పరమేశ్వరుడు పెండ్లి కొడుకయి, నిలువుటద్దములో చూచుకొని తన సొగసును తానె పొగడుకొనుట, కాముకరీతిని అనుసరించుట (పుట92) లోకామ్రగ్రహార్థమైన విలాసములైనను పౌరాణిక ప్రతిపత్తి లేదు. వివాహభోజనఘట్టము (పుటలు97,98) మఱింత విపరీతము.

వివాహానంతరము పార్వతీసమేతుడై పరమేశ్వరుడు కొలువు సేయుట, రంభ నటనము సేయుట, అభినయము పట్టుట, సప్తతాళేశ్వరజతిని విన్నపమొనర్చుట, బిరుదిమ్మని అడుగుట, నలకూబరుడు అర్థమనుట, ఊర్వశి ప్రతిఘటించుట మొదలైనవి (పుటలు98-100) సమకాలికసమాచారములు.

పార్వతీపరమేశ్వరుల శోభనము పరమవిచిత్రము. పరమేశ్వరుడు "పూర్ణకారుణ్యా రసదృష్టిఁ బ్రోవుమనిన", పార్వతి "పాదమాత్రంబు పరఁగఁజేసెను." (పుట106) "ఈ న్యాయ మే దారి" అని పరమేశ్వరుడు పందొమ్మిది పద్యముల భావకవిత్వము చెప్పును. (పుటలు106-108) పార్వతి "పాన్పుఁ జేరి ఏమది తెల్పుఁ" డనిన, పరమేశ్వరుడు ఆమె మౌగ్ధ్యమునకు ఆశ్చర్యపడును. అనంతరము పార్వతీపరమేశ్వరుల సంభోగశృంగారము ఒక్క పద్యమునందే ఉండుట విశేషము. అది కూడ గోప్యముగ నుండుట ఇతోధిక విశేషము. ఇది పరమౌచిత్యము. అంతేకాదు. దక్షిణాంధ్రయుగ శృంగార శృంగాటకమునకు అపవాదము.

కుమారస్వామిజననము కూడ క్రొత్తపోకడ. పరమేశ్వరుడు పార్వతి మోము కాంక్షను పరికింప, నొసటి కంటిచూపు కాంతి కోటికోటిసూర్యకాంతిసదృశమై ప్రకాశించును. అప్రాకృతమైన తేజ మదియే ఆరు ముఖములతోను, పండ్రెండు బాహువులతోను సాకారమై బాల్యదశనందును. (పుట114) ఆ శిశువును పార్వతియే పెంచును. కుమారస్వామి పెరిగి అస్త్రవిద్యలు నేర్చి తారకాసురుని సంహరించును. (పుటలు115-116) యుద్ధవర్ణనము రెండు పద్యములందు మాత్రమే గౌడీరీతిని కలదు. (పుట116) ఇంద్రుడు కుమారస్వామిని అమరావతికి ఆహ్వానించి కూతురు దేవసేన నిచ్చి వివాహము చేయును. కుమారస్వామి సభార్యుడై వచ్చి స్కంధపర్వతము మీద వసించును. భిల్లులు వేటకు కొంపోవుదురు. వేట వర్ణనము సుదీర్ఘము. (పుటలు117-123.) కుమారస్వామి వేటాడి వచ్చు సమయమున కొట్టిచేనులో మంచె మీద ఉన్న కన్యను చూచి, ఆమె సౌందర్యమునకు (పుటలు 123-125) ముగ్ధుడగును. వల్లీకల్యాణము జరుగును. ఇదియెల్ల రాయరఘునాథుని స్వతంత్రకల్పనమే.

మొత్తము మీద కోటి రాయరఘునాథతొండమాన్ పార్వతీపరిణయము మోతాదు మించని రసగుళిక.

**కవిజనోజ్జీవని:-** ఇది వంద సమస్యలను పూరించిన కావ్యము. ఏకాశ్వాసగ్రంథము- రాయరఘునాథతొండమాన్ "ఆశురచనీయమధురాదికవితా ధౌరేయు"డని గ్రంథాంతగద్యము కలదు. చతుర్విధకవితానిర్వాహకుడు సమస్యా పూరణము చేయుట సుకరము. సమస్య లొసగినవది ఆస్థానకవి మదురుపాటి వెంకన్న. పూరించినవది సంస్థానాధిపతి రాయరఘునాథతొండమాన్.

" వెంకనకవీంద్రుఁ డుద్దండబిరుదశాలి
మమ్ముఁ గొలిచియుఁ గఠినసమస్య లొసఁగ

నొప్పుకొని యేము పద్యముల్ సెప్పినంత
నందఱును విని కృతికిని నర్హమనిన.
కవిజనోజ్జీవని యటంచుఁ గావ్యమొకటి
దుర్ఘటసమస్యలకు నెల్లఁ ద్రోవఁ దెలియఁ
గవిజనంబులకును నుపకారముగఁ
జేతు దయచేత బృహదంబ చిత్తగింప "

అని కవిజనోజ్జీవని యందు కలదు.[120] ఇది అష్టావధానములు, శతావధానములు చేయు కవిజనులకు ఉపకారకమే. ఇందు "బృహదంబ చిత్తగింప" అని కలదుగావున, పుదుక్కోట సంస్థానాధిపతుల ఇలువేలుపు బృహదంబకు అంకితమగును.

సమస్యాపూరణములకు కతిపయోదాహరణములు:

1. అక్షరవంచనాత్మకసమస్య: "కలుషగిరిభేదశంబ శ్రీబృహదంబా" ఇది కందపద్యపాదము. కాని ఒక అక్షరము లేదు. అది యతిమైత్రికి అనుకూలముగ ఊహించి సమస్య పూరించవలయును. అట్లు పూరించిన పద్యమిది:

" వకుళవవనిత్యవాసిని
పకలాభీష్టముల నిచ్చు చక్కని తల్లీ
ప్రకటితము సేయు మీ కృతి
వృకలుషగిరిభేదశంబ శ్రీబృహదంబా. "

2. యతిమైత్రివంచనాత్మకదుష్కరప్రాస: "గ్లావిమలాక్ష వేంకటవగాధ్యక్షా." ఇది కందపద్యపాదము. ఆద్యక్షరము లేదు. అది టకారము తోడి అక్షరమైత్రికి అనుకూలముగ ఊహించి, "గ్లా" అను దుష్కరప్రాసను సమస్య పూరించవలయును. అట్లు పూరించిన పద్యమిది:

" దిగ్గలవాకబరీభర
ప్రగ్లాలితకీర్తిజాల సద్గుణశీలా
విగ్లపితరక్షమార్తాం
డగ్లావిమలాక్ష వేంకటవగాధ్యక్షా. "

3. అంతర్లాపిసమస్య: "దొనవులి మొనయమ్ము శాఖి తుదలని పల్కెన్. " ఇది కంద పద్యపాదము. సమగ్రము. కాని దొన, పులి, మొన, అమ్ము, శాఖి అను పదముల తుది అక్షరముల కలయిక వలినముఖి అగును. అది గ్రహించి, తదనుగుణముగ సమస్య పూరించవలయును. అట్లు పూరించిన పద్యమిది:

" వవజాంబకుండు వనుఁ గని
గిమకం గనలుచును గమలఁ గెంపుల నింపన్
వనతూపు వేసి రమ్మను
దొవపులిమొనయమ్ముశాఖి తుదలవి పల్కెన్. "

ఒక నాయిక పుష్పబాణుడు తన్ను చూచి, మండిపడుచు, కన్నులు జేవురింప,

పూలబాణము ప్రయోగించి నలినముఖి! రమ్మనుమని పలికెనని చెలికత్తెతో చెప్పెనని అర్థము.

4. వృత్తగోపనసమస్య: "నారదవంద్య కాంతిజితనారద కౌఁగిలి నీయవేమిరా". ఇది ఉత్పలమాల పాదము. దీనిని ఉత్పలమాలలో గాక వేఱొక పద్యములో పూరించవలయును. ఇందు వేఱొక పద్యలక్షణము గోప్యముగ కలదు. అది గ్రహించి ఆ పద్యమున పూరింపవలయును. అట్లు పూరించిన పద్యమిది:

" మదనుఁడు కోపముచేతం
గదనంబును జేయఁదొడఁగె గ్రక్కున నో నా
రదవంద్య! కాంతిజితనా
రద! కౌఁగిలి నీయవేమిరా యిదియేరా! "

ఇచ్చిన ఉత్పలమాల పాదము కందపద్యమునందు ఇమిడిపోయినది.

5. ఏకపాదపూరణసమస్య. పరస్పరసంబంధము లేకుండ మూడు పాదములు ఇచ్చిన, వానికి పరస్పరసంబంధము కల్పించి, ఒక్క పాదమును చేర్చి అర్థవంతముగ పద్యమును రూపొందించవలయును.

" చిటికెన వ్రేలియుంగరము చేడియ కొడ్డెనమాయె భూవరా!
కటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్
కటకట దోసపం డ్లిముపకట్లకు తాళువటే తలోదరీ! "

ఇందు మొదటి, రెండు పాదములకు పరస్పరసంబంధము లేదు. రెండు, మూడు పాదములకును పరస్పరసంబంధము లేదు. మూడు పాదములకు మొత్తము మీద అర్థము లేదు. పరస్పరసంబంధము, అర్థము ఉండునట్లు ఒక్క పాదమును పూరించవలయును. అట్లు పూరించిన పద్యమిది:

" చిటికెన వ్రేలియుంగరము చేడియ కొడ్డెనమాయె భూవరా!
కటకట దోసపం డ్లిముపకట్లకు తాళువటే తలోదరీ!
కటకచరత్కరేణుకరకంపితసాలము శీతశైలమున్
ఘుటిటితని గాంతు నే నని నిజాంగన తోడను దెల్పు వేగమే. "

ఇందు భూవరుడు నాయకుడు. తలోదరి నాయికసఖి. నాయకుడు దూరదేశ గతుడగుట వలన నాయిక విరహముచేత స్రుక్కి, చిక్కిపోయినదని నాయికసఖి నివేదనము. అది విని నాయకుడు నాయికసఖికి నాయిక యెడల సామభూతి ప్రకటించుట. అంతేకాదు. నాయిక హిమాలయము దగ్గఱ ఉన్నను, వెంటనే వచ్చెదనని నాయికకు వేగమే చెప్పుమని నాయకుని నిర్దేశము.

**మదురుపాటి వెంకన్న:** ఇతని కృతులు 1.ఆంధ్రభాషార్ణవము. 2.రఘువాటీయము. 3.పార్వతీకల్యాణము. 4.తొండమాన్ వంశావళి. 5.బృహన్నాయి కాదండకము. 6.దేవమల్లుచరిత్రము. 7.చాటుపద్యములు. 8.తురంగపంచకము.

ఇతడు మదురుపాటి సీతారామయ్య కుమారుడు. తండ్రి వలె మహోద్దండకవి

బిరుదాంకితుడు. ఇతని గద్యలందు " రాయరఘునాథమహీసభాంకణబిరుదాయమాన", "మహోద్దండకవిబిరుదప్రశస్త" అను విశేషణములు కలవు.

**ఆంధ్రభాషార్ణవము:-** ఇది పద్యనిఘంటువు. కావ్యము కాదు. కాని కావ్యములకు కావలసినది. కావ్యరచనకు, కావ్యపఠనకు శబ్దార్థజ్ఞానము కావలయును. సంస్కృతశబ్దములకు అమరకోశము కలదు. సంస్కృతసమేతరశబ్దములకు నిఘంటు సంఘటన ఆంధ్రభాషార్ణవము. అదే ప్రణాళిక. ప్రతిపద్యము పర్యాయపదమంజరి. మాతృభూతేశస్వామికి అంకితము. ఆ కాలమునందు ధారణాయోగ్యము. ఈ కాలమునందు అకారాద్యనుక్రమణికనిఘంటువులకు ఆధారము.

**రఘునాథీయము:-** ఇది అలంకారశాస్త్రము. నరసభూపాలీయము వంటిది. ఉదాహరణములు రాయరఘునాథపరము.[121]

**పార్వతీకల్యాణము:-** ఇది యక్షగానము. మీనాక్షీసుందరేశ్వరులకు అంకితము. అముద్రితము. ఇందు పార్వతీపరమేశ్వరుల కల్యాణమే ఇతివృత్తము. తపస్సు చేయు పార్వతిని పరీక్షించుటకు శివుడు వృద్ధ బ్రాహ్మణరూపముననే వచ్చును. "రచన సరళము సరసము జాతివార్తాచమత్కారసముపేతము" అని ప్రశస్తము.[122] ఇందు కీర్తనలు సంస్కృతభాషను కలవు. ఒక ఉదాహరణము.[123]

" ఘనమణిదీపే కల్పితధూపే కనదతిచిత్రకలాపే
కనకమయోల్లసదనుపమనైజభవనశుకమధురాలాపే
శ్రీకరవిభవశ్శివయా పమేతశ్శేతే మాణిక్య పాదే
శ్రీకామహర హరహర హరేతి గీతం ప్రాకారరక్షణం కుర్వంతు. "

**తొండమాన్ వంశావళి:-** ఇది చరిత్రగ్రంథము. రాయరఘునాథరాయలకు పూర్వము ఇరువది తరముల చరిత్రము, పుదుక్కోట నిర్మాణము, మధుర తంజావూరు నాయకరాజులతోడి యుద్ధములు, విజయములు మొదలైనవి వర్ణితములు.[124] చరిత్రోపయోగి.

**బృహన్నాయికాదండకము:-** ఇది దైవస్తుతి కాదు; ప్రభుస్తుతి. పుదుక్కోటపురవరాధీశ్వరి బృహన్నాయికను ఉద్దేశించినది. ఉన్నది రాయరఘునాథశ్లాఘనము. ప్రారంభమిది:[125]

> "శ్రీమత్ బృహన్నాయికానామధేయే, మహాదేవజాయే, మహావిఘ్న మాయే, నవాంభోదకాయే ........ శ్రీలసన్మేఖలామాపురాలంకృతే, దివ్య పీతాంబరాలంకృతే యం చనన్ దేవబృందంబుచే సన్నుతుల్ గాంచు శ్రీచక్ర రాజంబుపై విందుకొల్వుండు శ్రీమన్మహారాజరాజేశ్వరైవట్టి మేల్ భక్తచింతా మణింగాను రంజిల్లు .......... సంగీతసాహిత్యలోలుండు సత్కీర్తిశీలుండు శ్రీమన్మహారాజ రాజాబహాద్దర్ రఘునాథంపవాథుండు బల్ హాయిగా వంత నానావిధావర్ణ్యరత్నాంబరాలంకృతుండై ..... "

ఇందు "రాజాబహద్దర్" బిరుదము గమనార్హము.

దేవమల్లుచరిత్రము:- ఇది మల్లపురాణము. పుదుక్కోటకు ఇరువదిమైళ్ల దూరములోని గంధర్వకోట నివాసి బిరుదు కుప్పాల్ మల్లునికి అంకితము. ఇందు బ్రహ్మాండపురాణములోని దేవమల్లుచరిత్రమునకు ఆంధ్రీకరణమని కలదు[126]. దేవమల్లుడు తారకాసురుని మనుమడు వజ్రదంతుని ఓడించుట ఇతివృత్తము. మల్లుల ఉత్పత్తి, మల్లయుద్ధవిన్యాసములు కలవు.

చాటుపద్యములు:- ఇవి రాయరఘునాథతొండమాన్ మీద చెప్పినవి. వృత్తములు, సీసపద్యములు కలవు. వృత్తములకు "రాయరఘునాథా! యోధయోధాగ్రణీ!" అని మకుటము. సీసపద్యములకు "రఘునాథనృపవజీర!", "రాయబిరుదాంక రఘునాథరాణ్మృగాంక", రఘునాథచంద్ర! యాహవమృగేంద్ర!", "రాయరఘునాథ భూతలరాజరాజ" "రాయరఘునాథభూప విక్రమదిలీప!" అని వివిధ మకుటములు కలవు. మచ్చుతునుకలు.[127]

" గంభీరోద్భటగంధసింధురఘటాఘంటాఘణాత్కారముల్
దంభాడంబరభేరికాధణధణంధాణంధణాత్కారముల్
జృంభింపన్ రణరంగమందు రిపులన్ శిక్షింతువౌ దిగ్జయ
స్తంభశ్రీరమణీయరాయరఘునాథా! యోధయోధాగ్రణీ."

" కార్యంబునకు లేక గ్రాప మిమ్మను వాని
పట్టుక ముచ్చెను గొట్టవలయు
సమరం బనినఁ జాతి చదురున నుండెడి
వారి మీసముఁ బీకివైవవలయు
బంతిగూటికిఁ బొంచి బారు కేఁగని వాని
వీథిలో నిడి పొడ్ల వేయవలయుఁ
బడియుండు మమచోటఁ బాటివచ్చిన వానిఁ
జలమునఁ గొట్టుపై నిలుపవలయు
ననుచు రోషము లాడుచు నహితవరుల
నెగ్గు పిగ్గులు దీతురు నీదు భటులు
కోటికులవర్య! రణనిరాఘాటచర్య!
రాయబిరుదాంక! రఘునాథరాణ్మృగాంక! "

తురంగపంచకము:- ఇది రాయరఘునాథతొండమాన్ గుఱ్ఱమును, అశ్వశాస్త్రసంప్రదాయానుసారముగ వర్ణించిన అయిదు సీసపద్యముల సంపుటి. ఒక సీసపద్యము.[128]

" ఆస్కందితాశుప్రహసితాశుగోద్యత్తు
రంగమంబగు నీ తురంగమంబు
ధౌరితకత్వరోద్ధతిధుతస్థావర

జంగమంబగు నీ తురంగమంబు
రేచితోద్వేగాధరీకృతహరిభృద్వి
హంగమంబగు నీ తురంగమంబు
వల్గితస్యదవినిర్భగ్నఫణాద్యభు
జంగమంబగు నీ తురంగమంబు
ప్లుతజనవినిర్జితసురాశ్వవితతగమన
చంగమంబగు నీదు తురంగమంబు
కవితగుణపేటి! కవికోటికల్పవాటి!
రాయరఘునాథపంచనప్రభుకిరీటి! "౧

సూర్యశేఖరుడు: ఇతని కృతులు చాటుపద్యములు. అవి కోటిరాయ రఘునాథతొండమాన్ మీద చెప్పినవి. వృత్తములు, కందపద్యము, సీసపద్యములు కలవు. వృత్తములకు "శ్రీరఘునాథభూవరా!" అని మకుటము. కందపద్యమునకు "రఘునాథనృపా!" అని మకుటము. సీసపద్యములకు "రాయరఘునాథభోజ! విక్రమ బిడౌజ!" అని మకుటము. ఇది నుదురుపాటి వెంకన్న సీసపద్యముల మకుటముల లోనిది. ఇతడు అతని సోదరుడో, సన్నిహితుడో అగును. ఒక మచ్చుతునుక:[129]

" సమరతలం బనే మడిని శాత్రవరక్తజలంబు నించి దు
ర్దమకరికుంభమౌక్తికపరంపరవిత్తనముల్ ఘటించి వ్యో
మ మనెడు కాయమానమున మంజులకీర్తిలతాలి తారకా
సుమసహితంబుగాఁ బ్రబలఁ జూచెదు శ్రీరఘునాథభూవరా! "

నుదురుపాటి సాంబన్న: ఇతని కృతులు 1.బిల్హణీయము. 2.చంద్రాననాదండకము. 3. తొండమాన్వంశప్రతాపమాలిక. ఇతడు నుదురుపాటి వెంకన్న ఆరుగురు కొడుకులలో ఆఖరివాడు.

బిల్హణీయము:- ఇది సుప్రసిద్ధమైన సంస్కృతబిల్హణీయమునకు ఆంధ్రీ .కరణము. ఆఱవ పుదుక్కోట సంస్థానాధిపతి అయిన, రెండవ రాయరఘునాథ తొండమాన్‌కు (1825-39.) అంకితము. కాఁబట్టి బిల్హణీయము రచనాకాలము 1830 ప్రాంతము కావచ్చును.

" అఙ్కం కేపి శశఙ్కిరే జలనిధేః పఙ్కం పరే మేనిరే
సారఙ్గం కతిచిచ్చ సంజగదిరే భూచ్ఛాయ మైచ్ఛన్ పరే
ఇన్దౌ యద్దలితేన్ద్రనీలశకలశ్యామం దరీదృశ్యతే
తత్సాన్ద్రం నిశి పీత మన్ధతమసం కుక్షిస్థ మాచక్ష్మహే- " 47శ్లో.

అను ప్రసిద్ధమైన శ్లోకమునకు ఆంధ్రీకరణమిది:[130]

" కొందఱు లేడి యండ్రు మఱి కొందఱు చిహ్నమటండ్రు పిమ్మటం
గొందఱు యుక్తిఁ జేసి కమఁగొంటిమి భూప్రతిబింబమండ్రు పో
చందురులోనఁ గానఁబడు ఛాయవచాయ యదౌనె రేల నం

దంద తమంబు మ్రింగ నది తజ్జఠరంబునఁ గానవచ్చెడిన్. "

ఇందు జలనిధిలోని పంకమను కొందఱి శంక లేదు. భూచ్ఛాయ భూప్రతిబింబమైనది. చామనచాయకు దళితేంద్రనీలశకలసామ్యము లేదు. ఉన్నంతవఱకు సరసము.

చంద్రాననాదండకము:- ఇది శృంగారదండకము. భోగినీదండకము వంటిది. రెండవ రాయరఘునాథతొండమాన్ పరముగ రచించినది.[131] రచనాకాలము 1835 ప్రాంతము కావచ్చును.

తొండమాన్వంశప్రతాపమాలిక:- ఇది చరిత్రగ్రంథము. మూడువందల నలుబది రెండు పంక్తుల సీసమాలిక. తండ్రి వెంకన్న రచించిన తొండమాన్‌వంశావళికి తరువాతి చరిత్రము.[132] ఇందు రెండవ రాయరఘునాథ తొండమాన్‌కు "హిజ్‌ఎక్సలెన్సీ" అను బిరుదము కలదు. రచనాకాలము 1840 ప్రాంతము కావచ్చును. చరిత్రోపయోగి.

నుదురుపాటి చిదాకారకవి: ఇతని కృతి చంద్రాననాదండకము. ఇది కూడ భోగినీదండకము వంటిదే అగును. రెండవ రాయరఘునాథతొండమాన్ పుత్త్రుడు రామచంద్ర తొండమాన్ (1844-46) పరముగ రచించినది[133]. రచనాకాలము 1845 ప్రాంతము కావచ్చును.

ఇతడు నుదురుపాటి వెంకన్న పౌత్త్రుడు. మాతృభూతయ్య పుత్త్రుడు.

నుదురుపాడు పశ్చిమగోదావరిజిల్లా నరసాపురము తాలుకాలోనిది. ఇచటనుండి పుదుక్కోట వలస వెళ్లిన నుదురుపాటివంశము, ఇంచుమించు పుదుక్కోట సంస్థానము పుట్టినప్పటి నుండి, గిట్టినప్పటివఱకు సంస్థానకవివంశమగుట చిత్రము.

# ఇతరకవులు

తంజావూరు, చెంజి, మధుర, మైసూరు, పుదుక్కోట ఆస్థానములందు మాత్రమే గాక, ఆ కాలమున అచట కవుల గృహములందును తెలుగు సాహిత్యము వెలుగు రేఖలు వెల్లివిరిసినవి. ఆ కవులు తెలుగు వారైనను తమిళకర్ణాటకదేశస్థులు. స్థలపరము గను, కాలపరముగను, ఆ కవులు దక్షిణాంధ్రయుగములోని ఇతరకవులు.

చల్లా సూరయ: ఇతని కృతి వివేకవిజయము. యక్షగానము. చంపకవనమునందు చెంగమలను గూడిన, దక్షిణద్వారకాధాముడు రాజగోపాలస్వామికి అంకితము. ఇది తంజావూరు నాయకరాజుల కాలమును సూచించును. ఇతడు "పోదవాకాహ్వాయపురవాసి" (పుట51) మాత్రమేగాక, "పోదవాకాహ్వాయపురనిత్యవాసి" (పుట167). పోదవాక చెంగల్పట్టు జిల్లాలోని గ్రామము.[134] కృతికి శ్రీకారము చుట్టిన ప్రథమద్విపద పాదమునందు సదానందచిన్మయయోగి ప్రసక్తి కలదు. (పుట49.) నెల్లూరు నుండి చెన్నపట్టణమునకు పోవు మార్గమున, నెల్లూరికి సమీపమునందు కల ఒక శిలాశాసనమునందు "శ్రీమద్విశ్వాధిష్ఠాపనపరమహంస సద్గురు దత్తాత్రేయస్వాముల వారి ధర్మమఠం" అని కలదు.[135] తరిగొప్పుల మల్లన (1586-1614) దత్తాత్రేయుల శిష్యుడు. ధేనువుకొండ తిమ్మయ కూడ దత్తాత్రేయుల శిష్యుడు. తిమ్మయ్య శిష్యుడు చింతల లింగావధానులు. లింగావధానుల శిష్యుడు సదానందుడను అవధూత[136]. సదానందావధూత సదానందచిన్మయయోగి కావచ్చును. అయిన మల్లన తరములోని తిమ్మయ్య శిష్యుడు లింగావధానుల కాలము 1606-1634, లింగావధానుల శిష్యుడు సదానందావధూత కాలము 1626-1654 అగును. అయిన చల్లా సూరయ కాలమును అదే అగును. కాబట్టి వివేకవిజయము రచనాకాలము 1630 ప్రాంతము కావచ్చును.

చెంగల్పట్టు జిల్లాలోని పోదవాకనివాసి, తంజావూరు జిల్లాలోని రాజగోపాల స్వామికి అంకిత మిచ్చుట అసంభవము కాదుగాని, తంజావూరు నాయక రాజాస్థాన ప్రవేశకాంక్షను సుసంభవము. కాని తంజావూరు నాయకరాజ్యము రఘునాథ నాయకుని అనంతరము మూడు సంవత్సరములు (1630-33) అరాజకము.[137] కనుక చల్లా సూరయ రాజాస్థానప్రవేశకాంక్షకు స్వస్తి పలికి, పోదవాకనిత్యనివాసి కావచ్చును. ఇది భంగ్యంతరముగ వివేకవిజయము రచనాకాలము 1630 ప్రాంతమగుటకు ఉపబలకము.

సూరయ వివేకవిజయము కృష్ణమిశ్రుని ప్రబోధచంద్రోదయమునకు మానస పుత్రిక అని ఒక అభిప్రాయము కలదు. కాని ఔరసపుత్రికయే. తల్లిని మించిన తనయ. వివేకవిజయము ముగింపులోని ముక్తికాంతాస్వయంవరము, ప్రబోధచంద్రో దయమునందు లేని ప్రత్యేకమైన బిగింపు.

తెలుగు ప్రబోధచంద్రోదయమునందు కథారంగము చిదానందనగరము. వివేక విజయమునందు సచ్చిదానందపట్టణము. రెండును ఒకటే. ప్రబోధచంద్రోదయము

లోని ప్రధానపాత్రలెల్ల వివేకవిజయమునందు కలవు. అదే కథ. ప్రబోధచంద్రోదయము నందు ఉపనిషద్దేవీవివేకమహారాజులకు విద్య అను పుత్రిక, ప్రబోధచంద్రుడు అను పుత్త్రుడు మాత్రమే ఉదయింతురు. వివేకవిజయమునందు ముక్తికన్య కూడ జన్మించును. ముక్తికన్య యుక్తవయస్కురాలు కాగానే, వరుని కొఱకు విష్ణుభక్తి వివేకమహారాజుచేత స్వయంవరము ప్రకటింపజేయును. సకలమతసిద్ధాంతులు స్వయంవరమునకు వత్తురు. వైశేషికుడు, తార్కికుడు, రామానుజుడు, మాధ్వపతి, శైవసార్వభౌముడు, మీమాంసాపతి, యోగివీరుడు, సాంఖ్యఘనుడు, అద్వైతపతి ముఖ్యులు. వారిని భారతీదేవి పరిచయము సేయును. ముక్తికాంత అద్వైతపతిని వరించును. వివాహము వైభవముగ జరుగను. ఇది ముక్తికాంతాస్వయంవరము.

ముక్తికాంత శృంగారనేపథ్యము ముచ్చట గొలుపును

" చెలులు సత్సంగతిస్నేహంబు పేర
నలరు సంపఁగి తైలమంటిరి వేడ్క
పలుమారు తెలివను పన్నీట జలక
మలరించి నైర్మల్యమను వెలిపట్టు
మడుఁగు నెఱిక గట్టి మహితప్రకాశ
మడరు నొడ్డాణము నమర గీలించి
xxx xxx xxx
అమర సద్వాసనలను విరుల్ దురిమి
సమదృష్టులను సూర్యచంద్రుల నునిచి
లలితమౌ నాసాగ్రలక్ష్యంబు పేరఁ
బొలుపొందు ముత్యపు ముక్కర వెట్టి
xxx xxx xxx
పొందుగా సుఖదుఃఖముల లేము లనెడి
మట్టెలు పెట్టె నీ మాడ్కిని మఱియు-- "

**రేవూరి అనంతయ:** ఇతని కృతులు 1.గాధేయోపాఖ్యానము. 2.వృద్ధాచలమాహాత్మ్యము. 3.శేషార్యోదాహరణము. ఇతడు భట్టుమూర్తి వసుచరిత్రమును సంస్కృతభాషను సంతరించిన కాళహస్తి పౌత్త్రుడు అతడు అప్పయ్య దీక్షితుల (1560-1610) శిష్యుడని, సంస్కృతవసుచరిత్రరచనాకాలము 1600 ప్రాంతమని పూర్వోక్తము[138]. అతని పౌత్త్రుడు అనంతయ గాధేయోపాఖ్యానము రచనా కాలము 1640 ప్రాంతము, వృద్ధాచలమాహాత్మ్యము రచనాకాలము 1645 ప్రాంతము, శేషార్యోదాహరణము రచనాకాలము 1650 ప్రాంతము కావచ్చును.

**గాధేయోపాఖ్యానము:-** ఇది అయిదాశ్వాసముల కావ్యము. ఇతివృత్తము విశ్వామిత్రచరిత్రము. అందు మేనకావిశ్వామిత్రశృంగారఘట్టము మాత్రమే శృంగార గాధేయోపాఖ్యానమను పేర ముద్రితము. అది పంచమాశ్వాసమనియే ప్రకాశకుల

మాట. మొదటి నాలుగాశ్వాసములు ముద్రితము కాలేదు. బదిర కృష్ణభూపాలునికి అంకితము.

ఇది వాల్మీకి రామాయణములోని విశ్వామిత్రచరిత్రమునకు అనుసరణము. అది బాలకాండమునందు 51 వ సర్గ మొదలు 65 వ సర్గ వఱకు కలదు. 61 వ సర్గ మొదలు గాధేయోపాఖ్యానములోని పంచమాశ్వాసము. వాల్మీకిరామాయణమునందలి రచనా వైభవము, రసప్రాభవము అనుసరణములకు అందని ఫలములు. అనంతయ అనుసరణమును అందుకు లక్ష్యమే కాని, దక్షిణాంధ్రయుగవిపరీతలక్షణములు లేకపోవుట విశేషము. విశ్వామిత్రుని చిత్తజవేదన కొంత ముదిరినను, మొత్తము మీద లక్ష్యశుద్ధి కల గ్రంథము. ఇందు "యోగభోగానుకూలవచోగరిమ" కల మేనక వరూథిని కంటె వగలాడి.

" ప్రకృతి నీలో వడంచు వభ్యాసివె కద
నీ కవుంగట వన్నెడ లేక తమవు
లేకముగఁ జేర్చి యద్వైతపాకలక్ష్మి
మెండుగ వఖండసుఖలబ్ధి మండవయ్య" 35పు.

అన్నది మేనక ఆ విశ్వామిత్రునిI అంతేకాదు. ఇంకను గడుసరి.

" వమఁ గలసి మలసి విలసిలు
మవయము నే పతివవిత్రవయ్యెద నీచే
వినుము పరుసంపు పోకునఁ
గవకం బగు విధము మీఱ గాధికుమారా!" 35పు.

అనంతయ అనుసరణము అతిసూక్ష్మములైన అంశములందును మూల విధేయము. "ఉదరవటపత్రము" (పుట31) వంటి రూపకములు, "కన్నుల కఱవెల్లఁ దీరఁ గనుంగొనె" (22పు) వంటి జాతీయములు, "మృణాలసూత్రాన్తర మప్యలభ్యం" అను కాళిదాసుభావమునకు, "పద్మనాళతంతువున కంతరం బీయక" (30పు)అను తెనుగుసేతలు మోదావహములు. మోతాదు మించినది "చేమకూర యమకము."

| | |
|---|---|
| " యువతిమనోరాగాధేయా! రమింపరా గాధేయా!" | 24పు. |
| " పరాకా రూపరాకాశశీ" | 25పు. |
| " నమ్మినవాఁడ నీకు మెయినమ్మినవాఁడ" | 42పు. |

మొత్తము మీద వాల్మీకి కాళిదాసుల కవితావైభవమును కనులార గాంచి, చేమకూర వేంకటకవి చేరువకు వచ్చు కవి రేవూరి అనంతయ.

**వృద్ధాచలమాహాత్మ్యము:-** ఇది క్షేత్రమాహాత్మ్యకావ్యము. తురయూరు పాలకుడు లింగారెడ్డికి (1632-67) అంకితము[139]. వృద్ధాచలము దక్షిణదేశమునందు దక్షిణకాశి అని ప్రసిద్ధి వహించిన ప్రసిద్ధక్షేత్రము. ఇందు లింగారెడ్డి వెంగనూరులో వృద్ధాచలేశ్వరునికి దేవాలయము కట్టించినట్లు కలదు.[140]

శేషార్యోదాహరణము:- ఇది ఉదాహరణము. తిర్మలపండితుని పుత్త్రుడు శేషార్యుని మీద రచించినది. (చ.వి.శా.) అతడు "మధురాధీశుఁడంచి తామాత్యేశుఁ డనఁదగు వాడని కలదు. (ద్వి.వి.ఉత్క.) ఇంటిపేరు నల్లందిగళ్. (ప్ర.వి.శా.) నల్లంది వా రగును. మధురాధీశుడన మధురపాలకుడు కాడు. మధురపాలకుని మంత్రి కావచ్చును. తదంకితము.

" చెలఁగు నుదాహరణం బిది
నలసన్నిభబాలకవి యనంతయ నీకై
వెలయించె దీనిఁ గైకొను
మలఘుసమున్మేష! తిరుమలార్యుని శేషా! "

రేపూరి అనంతయ అయిదేండ్ల నాడే వేదాదివిద్యలు నేర్చి విభుల మెప్పించిన, అష్టభాషల చతుర్విధకవితలు రచించిన, ఘటికాశతదినైకప్రబంధముల మైసూరు, చెంజి పాలకుల మెప్పించిన, నూఱు ఘంటములకు నోరార కవిత పలికిన (శతలేఖిన్యవధానము), దుర్గ్రహగ్రంథసహస్రముల ఏకసంధానము చేత మండలాధీశుల మెప్పించి, సన్మానము లందిన బాలకవి అని, అతని పౌత్త్రుడు అనంతయజ్వ శ్రీముష్ణమాహాత్మ్యమునందు కలదు.[141] అతడును బాలకవియే.

పోలూరి గోవిందయ్య: ఇతని కృతులు 1.ఇందుమతీపరిణయము. 2.పర్వతనారదచరిత్రము. 3.తాళదశప్రాణదీపిక. 4.రాగతాళచింతామణి. మొదటి రెండు కావ్యములు. కడమ రెండు సంగీతశాస్త్రములు.

ఇతడు దక్షిణాదిజిల్లాల వాడని, తంజావూరు తెలుగురాజుల కాలము వాడని, సౌరాష్ట్రరాజు తనయ ఇందుమతి పరిణయము ఇతివృత్తముగ ఇందుమతీపరిణయము రచించెనని, ద్రవిడదేశములోని వివిధదేవాలయశాసనములు అనేకములు రచించెనని ఒక సమాచారము కలదు. పర్వతనారదచరిత్రము రచించెనని తాళదశప్రాణదీపిక యందు కలదు. (16ప.1అ.) తాళదశప్రాణదీపిక అయిన తాళదశప్రాణలక్షణ గ్రంథాంతమునందు "ప్లవవర్షం పెరట్టాశిమాసం" అని కలదు[142] తంజావూరు తెలుగు రాజుల కాలమునందు ప్లవనామసంవత్సరము 1661. అది తాళదశప్రాణదీపిక రచనా కాలమైన, ఇందుమతీపరిణయము రచనాకాలము 1650 ప్రాంతము, పర్వతనారదచరిత్రము రచనాకాలము 1655 ప్రాంతము, రాగతాళచింతామణి రచనా కాలము 1665 ప్రాంతము కావచ్చును. పర్వతనారదచరిత్రము, తాళదశప్రాణదీపిక వంటరెడ్డి చెరుకూరి సదాశివనాయకునికి అంకితములు. పోలూరు గోవిందయ్య విజయ రాఘవనాయకుని సమకాలికుడు.

చల్లాపల్లి వేంకవ: ఇతని కృతి శ్రీకృష్ణవిలాసము. పద్యకావ్యము. అముద్రితము. ఇతడు పోలూరిగోవిందయ్య మిత్రుడు. శ్రీకృష్ణవిలాసమునందు ఇట్లు కలదు.[143]

" పొందుగ నాదు సన్నిధికి పోలురి యోబనమంత్రిపుత్త్రు గో
విందకవీంద్రు మత్సఖుని వేడ్కఁ దలిర్పఁగఁ జేరఁబిల్చి తా
నందముగా నిశిం గనిన యాకల దెల్పిన నాలకించి యా
నందము మీఱ నా సుకవినాయకుఁ డిట్లనియెన్ మృదూక్తులన్."

శ్రీకృష్ణవిలాసము రచనాకాలము 1660 ప్రాంతము కావచ్చును.

**కట్టమూరి ఉదవిందనాయకుడు:** ఇతని కృతి పర్వతనారదోపాఖ్యానము. అసమగ్ర ప్రతి లభించినది. అముద్రితము. ఇతడు చెరుకూరి సదాశివనాయకుని అనుజుడు. కాని, కట్టమూరి నాగయ్యానాయకునికి దత్తుడు. పర్వతనారదోపాఖ్యానమునందు సదాశివనాయకుని ప్రశంస ఇట్లు కలదు.[144]

" వాగర్థప్రతిభాగభీరతరకావ్యప్రౌఢినిర్మాణరే
ఖాగీర్వాణమనోమనోహరసమాఖ్యన్ మీఁతె మా తమ్ముఁ డా
వాగక్ష్మాధిపపాలితాత్మజుఁడు నానాసత్కవిస్తూయమా
నాగేయస్ఫుటధీవిహారి యుదవిందాఖ్యప్రభుం డిమ్మహిన్. "

పర్వతనారదోపాఖ్యానము రచనాకాలము 1670 ప్రాంతము కావచ్చును.

**వెలిదండ్ల వేంకటపతి:** ఇతని కృతి రాధామాధవసంవాదము ఇతడు శుద్ధాంధ్రకృతిసహస్రము రచించినట్లు కలదుగాని, వేయి అచ్చతెనుగు కృతులందును ఒక్కటి కూడ లభింపలేదు. రాధామాధవసంవాదము అచ్చతెనుగు కావ్యము కాదు. ఇందు అవతారిక లభింపలేదు. ఆశ్వాసాద్యంతపద్యములు కలవు. తృతీయాశ్వాసాంత పద్యములు లేవు. ప్రళయకావేరీపట్టణాధ్యక్షుడైన మగదల రామదాసామాత్యునికి అంకితము. వెలిదండ్ల వేంకటపతి అనుజుని కుమారుడు వెలిదండ్ల అళఘురి. అతని మదంతాకల్యాణము రచనాకాలము 1705 ప్రాంతమని పూర్వోక్తము. మగదల రామదాసామాత్యుడు -ధరణిదేవుల రామయమంత్రి దశావతారచరిత్రమునకు కృతిభర్త అయిన మగదల కృష్ణమంత్రి కుమారుడు. దశావతారచరిత్రము రచనాకాలము 1650 ప్రాంతము. ఇది క్షీణయుగమునందు వివరింతును. కాఁబట్టి రాధామాధవసంవాదము రచనాకాలము 1680 ప్రాంతము కావచ్చును.

చింతలపూడి ఎల్లనార్యుని రాధామాధవమునందు రాధ స్వీయ. వెలిదండ్ల వేంకటపతి రాధామాధవసంవాదమునందు రాధ పరకీయ. "ఒక్క యనామధేయుఁ బిన్నప్పుడె పెండ్లియాడె మగఁ డంచుమ జూడదు వాని; వాఁడు నా యొప్పులకుప్పఁ గన్గొనఁగ నోడును వ్రీడను." (2పుట) భర్తృవిముఖురాలైన రాధ, బాలకృష్ణసుముఖురాలు. కృష్ణునికి నందుని ముద్దుచెల్లెలు రాధ మేనత్త.

" అల్లుఁడ దొండపండు పలెవా యవి వాతెర లానవిచ్చు నీ
కొల్లవె పుట్టచెండు లివిగో యని చన్గవఁ బట్టవిచ్చు రా
గిల్లి మయూరపించమడిగేవని పెన్నెలు అంటవిచ్చుఁ బో
కల్లవి యంచు కృష్ణుఁడు నగన్ నగి రాధ యదేమిరా యనున్." 3పుట.

రాధ కృష్ణుని పెంచుచు, శృంగారచేష్టలు చేయుచు, పానుపు చూపించును. కృష్ణుడు బాల్యము, పెంపకము, వావి వరుస, ధర్మము మొదలైనవి కారణములుగ తిరస్కరించును. వాని కెల్ల రాధ ప్రత్యాఖ్యానము చేయును. అంతేకాదు.

" అల్లుఁడవైనందులకున్
చెల్లగ నుపకారమైన సేయుము నా మే
నెల్లఁ గడు కాఁగుచున్నది
చల్లని నీ మేన నొత్తి చల్లార్పు మిఁకన్. " 9 పుట

అని కృష్ణుని "కేలుఁదమ్మి నందపుటురమందు మోపుకొని తల్పు బిరాలున మూసి, గొబ్బున శయ్యకున్ దిగిచి, . . . . ముద్దులఁ గొల్లలాడె"ను. కృష్ణుడు తబ్బిబ్బు గుట తోపాటు తన్మయత్వము నందును. ఇట్లు రాధామాధవుల సంభోగశృంగారరసము ప్రథమాశ్వాసమునందు పొంగి పొరలినది.

రాధామనోరమణుడైన మాధవుడు మధుర నుండి ద్వారకకు వెడలెను.

"పది రెండేండ్లగు ప్రాయమందు నిటు గోపాలుండు భూపాలురన్
మొదలన్ మీఱఁగ నీక లోఁగొనుచు రుక్మిణ్యాదుల న్కన్యలన్
బదియార్వేల వివాహమైన గుణరూపబ్రహ్మమై, కన్న వి
న్నది గాదీ మహిమం బటంచు జను లెన్నంగాఁ జెలంగెన్ మహిన్." 12పుట

పదిరెండేండ్ల ప్రాయమందు పదియార్వేలమందిని పరిణయమాడినను, కృష్ణుడు రాధను మఱచిపోలేదు. రాధావిరహము బాధాబహుళమైనది.

" పెనఁగుచో రుక్మిణి మునువలె నీదు మే
నత్త లేదని పల్క నలసి నవ్వ
కథ దెల్పుమన సత్య, రాధ రాదని పల్క
వది విని య ట్లుస్సురనును (?)
మరుమాట దెల్ప జాంబవతివా నీ వల్ల
వింటి లేదని కంట నీరు విడుచు (?)
రతివేళ కాళింది నుతియింపుచును రాధ
రా యని పై వ్రాయ హా యటంచు
బలిమి పడతులపైఁ బక్కఁబడెడు వేళ
నొడువు మాటల వ్యంగ్యముల్ దడబడుటలు
చతురులును సంధి నేర్పులు వెతకి చూడ
రాధ తలపైన మదిఁ గుందు మాధవుండు. " 13పుట

ఇట్లు బహువ్యథ లందుటయేగాక, కృష్ణుడు ప్రాణసఖుడైన ఉద్ధవునికి తన విరహవేదన వెళ్లగ్రక్కును.

" ఆరును దూఱునుం బడియె నా చెలి యేమిటి కంటివేని నే
నీరును వారునుం బలెను వెత్తిదయన్ వలపింపలేదు శృం
గారరసప్రభావములు కన్నియ నా కుపదేశమీయఁగా

నేరిచినాఁడ దాని విడనేర్తునె? నేర్చిన దైవమోర్చునే?" 14పుట

అని కృష్ణుని ఆవేదన. రాధ మహాశోకాబ్ధిని మునిగినది.

" ఆసించి నీవు చేసిన
బాసల కే నమ్మియున్న పసిగోల నయో
దోసమున కెంత గ్రక్కున
రోసితి వెంతటి దయాపరుండవు కృష్ణా " 17పుట

అని విలపించి, వెక్కి వెక్కి యేడ్చి, పెంపుడుచిలుకకు వివరించి, కృష్ణుని కడకు రాయబారము పంపును. ఇట్లు ద్వితీయాశ్వాసమునందు రాధామాధవుల విప్రలంభ శృంగారము వెల్లివిరిసినది.

చిలుక రాయబారము ఫలించి, రాధామాధవుల పునస్సమావేశము కొత్తపుంతలు త్రొక్కినది.

" అమ్మ నేఁ జెల్ల యిది యెవ్వరమడు రాధ,
యి[చ్చ]టి కుఁ బోవ విందెవ్వఁ డేల వచ్చు
నేమ నీ యల్లుఁడ వటంచు నెవరు దోఁప
పాదముల మీఁద వ్రాలె గోపాలమూర్తి.
లేవయ్య దొడ్డవాఁడవు
నీవని తా నవలి కేఁగి నిన్నేమనుచుం
దీవింప నిందు మునుపే
గోవిందుఁడు నిత్యపెండ్లికొడుకని విందున్.
పాన్పు మీఁద [ను] గూర్చుండి పలుకవయ్య
మీరలు[ను] మహారాజులైనారు గనుక
నే నమస్కృతి చేసెద నిదిగొ యనుచు
మ్రొక్కి తా పాన్పు దిగువ నింపున వసించె. " 26పుట

కృష్ణుడు ఆశ్చర్యపడి మౌనము వహించిన, రాధ వ్యంగ్యబాణములు వర్షించును.

" దోసము కృష్ణ కృష్ణ నిను దూఱిన, నా నొసలందు ధాత మున్
వ్రాసిన వ్రాత కాదనుచు వ్రాయఁగ నీ వశమౌనె? నీవు దా
వేసట లేక యేరికని వేడుక సేసెదు పైని పైని యా
పాసల మేమె మేమె పయినాడిన విన్నవ దోస మున్నదే." 27పుట

" పాలు వెన్నలకుఁ బైఁబడెడు నాఁటికిఁ గదా
యాదరించు యశోద మీఁది ప్రేమ
వేడుకతోడ ముద్దాడు నాఁటికిఁ గదా
మిక్కిలి నందుని మీఁది ప్రేమ
వ్రేపల్లె దూడల మేపు నాఁటికిఁగదా
మేలమౌ గొల్లల మీఁది ప్రేమ
యచ్చిన యెడల మల్లాడు నాఁటికిఁ గదా

మెల్లనె మాబోంట్ల మీఁది ప్రేమ
తండ్రి వసుదేవుఁ డాయెను తల్లి యిపుడు
దేవకీదేవి యయ్యెను దేవరకును
సఖులు నృపులైరి రాబోంట్లు సఖియ లైరి
చాలదే నేఁడు కొత్త సంసారమయ్యె" 28పుట
"ఎనిమిది రసముల కాంతల
నెనమండ్రను బెండ్లి యాడి యింకొక కొదవై
పెనుపొంద హాస్యరసమున
నను మచ్చికసేయ వచ్చినాఁడవె కృష్ణా" 29పుట

కృష్ణుడు ఒక్కొక్కరిని ఒక్కొక్క కారణము చేత వివాహమాడవలసి వచ్చినదని వివరించిన, రాధ-

"నిన్నెవ్వ రడిగి రీ కథ
లిన్నియు నిన్నెవరు కొదవ లిటులాడిరి మా
కున్నవి దయలని యెవరని
యున్నా రీ చిక్కులేలనోయి మహాత్మా" 31పుట

అని సవరించును. అంతేకాదు. కృష్ణుడు ప్రాధేయపడినను లెక్కసేయదు. కృష్ణుడు వెడలిపోబోయిన రాధ శయ్య మీదికి లాగి కౌగిట గదించును. ఇట్లు తృతీయాశ్వాసమునందు మఱల రాధామాధవుల సంభోగశృంగారరసము కట్టలు త్రెంచినది.

**రేవూరి అనంతయజ్వ:** ఇతని కృతులు 1.శ్రీముష్ణమాహాత్మ్యము. 2.శివరహస్యఖండము. మొదటిది క్షేత్రమాహాత్మ్యము. వెంగుళము కృష్ణరాజునకు అంకితము. రెండవది స్కాందపురాణఖండము. పురాణము. తుఱైయూరులోని నందికేశ్వరునికి అంకితము. రెండును అముద్రితములు. ఇతడు రేవూరి అనంతయ మనుమడు. యజ్వసంజ్ఞ భిన్నత్వసూచకము.

"అనఘున్ ధీనిధి బాలకవ్యుదితపూర్వానంతపౌత్త్రున్ జగ
జ్జననేయోదయకాళహస్తికవిభాస్వత్పూనుఁ గౌండిన్యపా
వనగోత్రాంకు ననంతనాము నను నాపస్తంబసూత్రున్ బ్రియం
బున రావించి సుధారసోఘముల సొంపుల్ గుల్కఁ బల్కెన్ దయన్."

అని శ్రీముష్ణమాహాత్మ్యమునందు తాత, మనుమల సంబంధము ఇదమిత్థముగ కలదు.[145] పూర్వానంతుడు తాత. ప్రస్తుతానంతుడు మనుమడు. అతడు లింగవ పుత్త్రుడు. ఇతడు కాళహస్తి పుత్త్రుడు. లింగన తండ్రి కూడ కాళహస్తియే. అతడు సంస్కృతవసుచరిత్రకర్త.

తాత అనంతయ కృతుల రచనాకాలములు 1640, 1645, 1650 ప్రాంతములని పూర్వోక్తము. కాఁబట్టి శ్రీముష్ణమాహాత్మ్యము రచనాకాలము 1680 ప్రాంతము, శివరహస్యఖండము రచనా కాలము 1685 ప్రాంతము కావచ్చును.

**కోడూరి వేంకటాచలము:** ఇతని కృతి శివరహస్యఖండము. స్కాందపురాణఖండము. పురాణము. ముసురు ముళువాగళు భూపతికి అంకితము. అతడు "మధురాపురీవిభుని దర్పం బెల్ల వారించి", వేంకటపతిరాయలచే (1584-1616) చికరాజాఖ్య వహించిన ముళువాగళునృపతికి దౌహిత్రుని మనుమడు.[146] ఇరువురి నడుమ నాలుగు తరములు కలవు. తరమునకు పాతికసంవత్సరములు పరిగణించిన, కృతిపతి కాలము 1684-1716 అగును. కాఁబట్టి శివరహస్యఖండము రచనాకాలము 1690 ప్రాంతము కావచ్చును.

ఇతడు బాలసరస్వతి బిరుదాంకితుడు. ఇతని శివరహస్యఖండములోని కాండము, ఆశ్వాసముల వివరము కలదు.[147] 1.సంభవకాండము. 5ఆశ్వాసములు. 2.అసురకాండము. 2ఆశ్వాసములు. 3.వీరమాహేంద్రకాండము. 1ఆశ్వాసము. 4.యుద్ధ కాండము. 4ఆశ్వాసములు 5.దేవకాండము. 2ఆశ్వాసములు. 6.దక్షకాండము. 4ఆశ్వాసములు. 7. ఉపదేశకాండము. 10ఆశ్వాసములు. మొత్తము కాండములు 7. ఆశ్వాసములు28. ఇందు 15 ఆశ్వాసములు మాత్రమే లభించినవి. అందు సంభవ, వీరమాహేంద్రకాండములు ముద్రితములు.

**శివనారాయణతీర్థులు:** ఇతని కృతి పారిజాతాపహారము. సంస్కృత కృతులు అనేకము. అందు కృష్ణలీలాతరంగిణి అత్యంతప్రసిద్ధము. కృష్ణలీలాతరంగిణి యందు అంతర్వేది లక్ష్మీనృసింహస్వామి, వేదాద్రి నృసింహస్వామి, వరాహపురవేంకటేశ్వర స్వామి స్తుతులు కలవు. వరాహపురమన తిరుమల అని ఒక అభిప్రాయము కలదుగాని, అది తంజావూరు దగ్గఱి వరహూరు కావచ్చును. నారాయణతీర్థుల గురువు శివరామతీర్థులు కంచియందుండు వాడని, అతని కాలము 1660-72 అనగా 1675 ప్రాంతమని ఒక అభిప్రాయము కలదు.[148] నారాయణ తీర్థులు తెలుగుదేశము నుండి కంచి, కంచి నుండి తంజావూరు దగ్గఱి వరహూరు వెళ్లియుండవచ్చును. వరహూరు నందున్న కాలము 1670-1700 కావచ్చును. పారిజాతాపహారమునందు "అచ్యుతాబ్ధి ప్రభో వరద రాజ" అను సంబుద్ధి తోడి స్తుతి కలదు.[149] అచ్యుతాబ్ధిపురమన తంజావూరు దగ్గఱి మెరట్టూరు. కాఁబట్టి పారిజాతాపహారము రచనాస్థలము మెరట్టూరు, రచనాకాలము 1690 ప్రాంతము కావచ్చును. కాని పారిజాతాపహారమునందు కర్తృనిర్దేశము లేదు. నారాయణతీర్థుల కృతి అని ఒకరి అభిప్రాయము.[150] కాని పారిజాతాపహారములోని సత్యభామ విరహ ఘట్టమువందలి దరువు ఇట్లు కలదు.[151]

"ఎంత దుడుకువాడు గోపాలుడమ్మ
దాని వలపులకె వశమాయెనమ్మ
తలచుకొంటేనే తాళలేనమ్మా
నారాయణతీర్థనామధేయుడమ్మ
హరిహరిహరి ఆనందగోపకుమారుడు

అలిగితే నన్నాదరించు వారెవరు
ఎన్నరాని గుణరత్నాకరుడని
విన్నవింతురే వేదాంతములో
చిన్నవాడు ధీరనారాయణతీర్థ
చిత్తవృత్తిరంగనటనవినోది. "

ఇందు నందగోపకుమారుడు నారాయణతీర్థనామధేయుడని నారాయణతీర్థులే రచించుట సంశయము కలిగించును. ఇంకను పరిశోధనీయము.

విశ్వేశ్వరుడు: ఇతని కృతి కృష్ణవిలాసము. పద్యకావ్యము. అముద్రితము. తలమల రామచంద్రనాయకునికి అంకితము. అతడు తిరుచునాపల్లి జిల్లాలోని తలమల నివాసి. గ్రామనామమే గృహనామము. అతని జీవితకాలము 1652-1718 అని కలదు.[152] కాఁబట్టి కృష్ణవిలాసము రచనాకాలము 1695 ప్రాంతము కావచ్చును.

ఇతడు తర్కశిరోమణి. అయినను కృష్ణవిలాసము శృంగారకావ్యము. "న భ్రాతరం తార్కికం . . . . కవితాకన్యా వృణీతే స్వయం" అను మాట వర్తించలేదు. ఇతని కవితాశయము విలక్షణము.[153]

" కర్కశం బగునట్టి తర్కశాస్త్రంబున
మిగుల శిరోమణి మించినట్లు
రాణఁ దలిర్చు పురాణంబులం దెల్ల
భాగవతంబు చొప్పడిన పగిది
భవ్యసంస్కృతనవ్యకావ్యంబులం దెల్ల
కడు నైషధం బొప్పుఁ గాంచినట్లు
బాగైన యాంధ్రప్రబంధంబులం దెల్ల
నాముక్తమాల్యద యలరు కరణి
నేను రచియించినట్టి సంస్కృతకృతులను
తెలుగు కృతులను గూఢార్థకలన గలుగ
సంస్కృతాంధ్రాదిలక్ష్యలక్షణములందుఁ
దెలియఁజాలని వారికిఁ దెలియవశమె. "

ఇతడు హర్షనైషధము వలె రచించిన సంస్కృతకావ్యము గాని, ఆముక్తమాల్యద వలె రచించిన తెలుగు కావ్యము గాని లభింపలేదు. భాగవతము వలె రచించిన తెలుగు కావ్యము కృష్ణవిలాసము లభించినది. అందు గూఢార్థశబ్దకలన కంటె శబ్దచమత్కారము కలదు. ఒక ఉదాహరణము:[154]

" తలఁపున వమ్ము నిల్పు నెలఁతా! నెలతాపము హెచ్చి వచ్చెవే
యలరుల తేనె చిల్కు నవలా! నవలాలితసూక్తి వల్కనే
వలపులు సందడింపఁ జెలువా! చెలువానఁగఁ గౌఁగిలింపవే
తలిరుల తావి గుల్కు వనితా! వని తావుల వమ్ముఁ గూడవే. "

మధుర శ్రీనివాసయ్య: ఇతని కృతులు పదములు. "విజయగోపాల' 'ముద్రాంకితములు. మూడు పదములు మాత్రమే లభించినవి. ఇతని కాలము[155] 1704-1731. ఇతడు మీనాక్షీదేవి ఆలయమున పరిచారకుడని, మీనాక్షీదేవి అనుగ్రహమున తెలుగు, తమిళభాషలందు కవి, సంగీతసాహిత్యములందు పండితుడు అయ్యెనని ఐతిహ్యము కలదు.[156] "నిను మించినవాఁడు", "నీవే బ్రోవలె నన్ను" "ఇంకా దయ రాదా" అనునవి లభించిన పదములు.

భాస్కరుని వేంకటాచలము: ఇతని కృతి సేతుమాహాత్మ్యము. క్షేత్రమాహాత్మ్యకావ్యము. అముద్రితము. ఇతని కాలము 1731-67 అని ఒక అభిప్రాయము కలదు.[157] అయిన సేతుమాహాత్మ్యము రచనాకాలము 1750 ప్రాంతము కావచ్చును.

సేతుమాహాత్మ్యమునందు శ్రీరామకథ, సేతువృత్తాంతము, రామేశ్వరక్షేత్ర మాహాత్మ్యము కలవు.[158]

భాస్కరుని శేషాచలము: ఇతని కృతి నాంచారుపరిణయము. యక్షగానము. శ్రీరామునికి అంకితము. దైవాంకితము. ఇతడు భాస్కరుని వేంకటాచలము తమ్ముఁడు. ఇతని కృతియందు అన్న పేరు కలదుగాని, సేతుమాహాత్మ్యము ప్రవక్తి లేదు. అతని కృతియందు తమ్ముని పేరు, నాంచారుపరిణయము ప్రసక్తి కలదు. కనుక నాంచారు పరిణయము సేతుమాహాత్మ్యము కంటె పూర్వరచనమగును. కాఁబట్టి నాంచారుపరిణయము రచనాకాలము 1745 ప్రాంతము కావచ్చును.

నాంచారుపరిణయమన గోదాదేవీరంగనాథుల వివాహము. ఇందు గోదాదేవి విష్ణుచిత్తునికి నందవనమునందు లభించును. అది సంపంగివనము. (పుటలు7-8)

" ఆలరుల నందవనంబున
అలరారుచు నొక్కకన్య యావిర్భవమై
అల సీత మున్ను భూమిని
చెలువుగ నుదయించినట్లు శ్రీ యొప్పారెన్." 9.పుట

విష్ణుచిత్తుడు "పువ్వులయెడ శిరోరుహము। కని తన కూరిమి కన్య ధరించి।నట్టి పువ్వులటంచు నవ్వలవైచి। పుట్టికలో వేఱె పువ్వులు దెచ్చి। హరికి సమర్పింప" (13-14పు) "ఆ కమలాక్షుండు అధికకోపమున। చేకొన"డు. (14పు.) "ఆ కన్య ధరియించి నట్టి మాల్యములు। మా కింపుగాన యమ్మాల్యముల్ దెచ్చి" సమర్పింపుమనును. (14పు.) విష్ణుచిత్తుడు అట్లు చేయును. (15పు) అది మొదలు ఆమె చూడికుడుత్తనాంచారు. ఆముక్తమాల్యద.

ఇందు గోదాదేవి "శ్రీరంగనాథునందలి ప్రేమ యగ్గలంబునకు సుమశరసాయక పీడితయై తదధీనమానస యగుచు చింతాక్రాంతయై యున్న" అని మాత్రమే కలదు

(20పు) ప్రత్యేకవిరహఘట్టము లేక పోవుట ప్రత్యేకవిశేషము. ఎఱుకత సోదె కలదు. (16-20పు) వివాహఘట్టము విపులము. (26-54పు.) తెలుగు వివాహమే. ఊరేగింపు, కాళ్లు కడిగి కన్యాదానము, తలుపు దగ్గఱ పేరులు చెప్పించుట, నాగవెల్లి, అప్పగింతలు, అరణములు కలవు. శోభనము, సువ్వాల, అల్లో నేరేళ్లు, మంగళము, హారతి మొదలైన స్త్రీల పాటలు కలవు. మొత్తము మీద మోదావహమగు యక్షగానము.

**వెచ్చ కస్తూరి రంగయ:** ఇతని కృతులు 1.లక్షణచూడామణి ఉరపు ఆనందరంగరాట్ఛందము. 2.సాంబనిఘంటువు. 3.కృష్ణార్జునసంవాదము. 4.పద్మనాయక చరిత్రము. మొదటిది ఛందశ్శాస్త్రము. లక్షణగ్రంథము. రెండవది అచ్చతెనుగు నిఘంటువు. మూడవది పద్యకావ్యము. అముద్రితము. నాల్గవది చరిత్రగ్రంథము. మొదటిది ఆనందరంగపిళ్లకు అంకితము. అతడు డూప్లే కడ దుబాసి. అతని కాలము[159] 1742-54. కాఁబట్టి లక్షణచూడామణి ఉరపు ఆనందరంగరాట్ఛందము రచనాకాలము 1745 ప్రాంతము, సాంబనిఘంటువు రచనాకాలము 1750 ప్రాంతము, కృష్ణార్జున సంవాదము రచనాకాలము 1755 ప్రాంతము, పద్మనాయకచరిత్రము రచనాకాలము 1760 ప్రాంతము కావచ్చును.

ఆనందరంగరాట్ఛందము గణపవరపు వేంకటపతి ఆంధ్రప్రయోగరత్నాకరము నకు అనుసరణము. ఇందలి లక్ష్యములెల్ల ఆందలివే. అది నేటివఱకు ముద్రణభాగ్యము నందలేదు. ఇది ముద్రితమైనది. ప్రసిద్ధమైనది.

సాంబనిఘంటువు ఆంధ్రనిఘంటుత్రయమునందు ఒకటి. ప్రామాణిక నిఘంటువు.కృష్ణార్జునసంవాదము గయోపాఖ్యానవృత్తాంతము.[160] పద్మనాయక చరిత్రమునందు కర్తృనిర్దేశకపద్యము లేదు కాని, ఒక పద్యము విడిగా కలదు

" ఆది బడబాగ్నిభట్టమ వమితయశుఁడు
కేళి భీమన దీని సంస్కృతమొనర్చె
రసికతఁ జెలంగ కస్తూరిరంగసుకవి
దానిఁ దెనిఁగించియుండె సుధారసోక్తి. "

బడబానలభట్టు, భీమన పద్మనాయకచరిత్రము సంస్కృతమున రచించుట కల్పనము.

**సాంబయ్య ఉరపు శంబరధరుడు:** ఇతని కృతి కిరాతార్జునీయము. యక్షగానము. ఇది తంజావూరి ప్రతియందు సంబయ్య తమ్ముడు శంబరధరుడు రచించినట్లు, మదరాసు ప్రతియందు సిద్దయ్య తమ్ముడు సాంబయ్య రచించినట్లు, అడయారు ప్రతియందు శంబయ్య తమ్ముడు శంభువీరుడు రచించినట్లు కన్నడామవాద ప్రతియందు సంబయ్య తమ్ముడు సంబయ్య రచించినట్లు కలదు. కనుక సాంబయ్య లేక సంబయ్య, శంబయ్య, పంబయ్య, శంబరధరుడు, శంభువీరుడు అను వారు అందఱును రచించిన కుటుంబకృతి అని ఒక అభిప్రాయము కలదు[161]. కాని సంబయ్య, శంబయ్య ఒకడు. సాంబయ్య, శంబరధరుడు, శంభువీరుడు ఒకడు. ఇద్దఱు

అన్నదమ్ములు. మదరాసు ప్రతిలోని అన్నపేరు లేఖకప్రమాదము కావచ్చును. కన్నడానువాదప్రతిలోని తమ్ముని పేరును లేఖకప్రమాదము కావచ్చును. అది సంబయ్య, ఇది సాంబయ్య అగును. శంభు + అయ్య = శంభయ్య -- సంబయ్య. సాంబ + అయ్య = సాంబయ్య. శంబరమన చిన్నలేడి. అది ధరించువాడు సాంబశివుడే. శంభు వీరుడును శివుడే. సంబయ్య, సాంబయ్య సన్నిహితనామములగుట వలన సాంకర్యము సంభవము. కాఁబట్టి కిరాతార్జునీయనాటకము సాంబయ్య ఉరపు శంబరధరుని కృతమే.

సంబయ్య, సాంబయ్య అన్నదమ్ముల తండ్రి మోహనకవి యైన బొమ్మలాట సిద్ధయ్య అని మదరాసు ప్రతియందు కలదు. అన్న సంబయ్య బొమ్మలాట శాసనుడు, ఘనకావ్యభూషణుడు అని తంజావూరి ప్రతియందు కలదు. తమ్ముడు సాంబయ్య సంగీతసాహిత్యకోవిదుడు అని అడయారు ప్రతియందు కలదు. కనుక సాంబయ్య ఉరపు శంబరధరుడు కిరాతార్జునీయము రచించుట సుసంగతము.

సాంబయ్య 1750 ప్రాంతము వాడని కలదు[162]. అతని కిరాతార్జునీయమునకు అప్పుడే కన్నడానువాదము వెలయుట తెలుగు యక్షగానమునకు గర్వకారణము.

కిరాతార్జునీయమునందు తమిళ, మహారాష్ట్రభాషలు లేవుగాని, దక్షిణాంధ్రయుగ యక్షగానలక్షణములు కలవు. అరణ్యవాసము సేయు ధర్మరాజునకు గౌతమాదిమునులు సకలశాస్త్రములు తెలుపుట, భీమార్జునాదులు రారాజు మీది కార్యములు తెలుపుట, భూసురవర్యులు ఆశీర్వదించుట, ద్రౌపది సేవ సేయుట సహజమేగాని; "సచివాది సామంతసారథ్యముఖ్యులు దివసరులు తెలుపుట, కవిగాయకులు కామినీనటముఖ్యులు విద్యారహస్యములు తెలుపుట, ధర్మరాజు రత్నసింహాసనమున కొలువుండుట అసందర్భము. (పుట170.) అది దక్షిణాంధ్రయుగయక్షగానలక్షణము. అంతేకాదు. అర్జునునికి తపోభంగము కలిగించుటకు రంభ బయలుదేరిన, సోమయాజులు సత్యధనులు వెంటబడి గోలపెట్టుట (పుటలు176,177) దక్షిణాంధ్రయుగయక్షగానముద్రా ముద్రితము. ఉపరి, అర్జునుడు వారసతులను నిరసించిన, రంభ-

" పొలఁతి యధరామృతము గ్రోలని పురుషు వాతెర పాడుపాతర
మెలఁత చనుఁగవ మీఁద మోపని మేను గ్రామ ॥౧॥
చెలఁగి గళరవ మాలకింపని చెవులు రాట్నపు చెవులు
ఇంతుల చెలువుఁ గనుఁగొన లేని [క్రమలు] వలల కనులు ॥౨॥
భావమెప్పఁగ సతిఁ గౌఁగిలింపని చేతులెల్లను మదవచేతులు
మోవి నొక్కని పండ్లు కిటికిటి మోరపండ్లు ॥౩॥
వినుతితో సతి కురులు దువ్వని వేళ్లు గ్రాఁకుల వ్రేళ్లు
ఎప్పుడు వనిత పొందిక లేని వరుఁడె వానరుండు ॥౪॥
రంగు మీఁగ పూర్వమందు పరాశరుఁడు మొదలైన
వారలు అంగనల భోగింపలేదా అవఁగి పెనఁగి " ॥౫॥ పుట183.

అవి ఉపదేశించుట దక్షిణాంధ్రయుగయక్షగానవైదగ్ధ్యమే. కాఁబట్టి సాంబయ్య

ఉరవు శంబరధరుని కిరాతార్జునీయము దక్షిణాంధ్రయుగములోనిది కావచ్చును.

కిరాతార్జునీయము నన్నయ భారతములోని అర్జునుని పాశుపతాస్త్రసంపాదన కథకు అనుసరణము. అర్జునతపోభంగమునకు ఇంద్రుడు రంభను పంపుట (పుట175) రంభ ప్రయత్నము విఫలమైన, ఇంద్రుడు వృద్ధబ్రాహ్మణరూపమున వచ్చి దొంగకమ్మ వక్కణ ఇచ్చుట (పుట185) అర్జునుని తపస్సును ధూర్జటి లెక్కసేయుట లేదని సురసతులు శివుని నిరసించుట (పుటలు186-187) ఆ మాటలకు పరమేశ్వరుడు ఉలికిపడి కలకల నవ్వుట, పార్వతి హాసకారణము ప్రశ్నించుట, పరమేశ్వరుడు సమాధాన మిచ్చుట (పుట187) పార్థుని కడకు పయనమగు నెడ, అగస్త్యుడు వచ్చి "దేవర వేగ విచ్చేసి వరము లీవలయు"నని కోరుట (పుట188) మొదలైనవి కథను రక్తి కట్టించు స్వతంత్రకల్పనములు. పాశుపతాస్త్రము పడసిన పార్థునికి నకులసహదేవులు స్వాగతము పలుకుట, ద్రౌపది మొదలైన పుణ్యాంగనలు నివాళు లొసగి శోభనము, మంగళము, ధవళము పాడుట యక్షగానలక్షణము.

సలక్షణమైన, సరళమైన, సరసమైన యక్షగానము కిరాతార్జునీయము.

**ఆలూరి కుప్పన:** ఇతని కృతులు 1.పంచనదీస్థలపురాణము. క్షేత్రమాహాత్మ్య కావ్యము. 2.రామాయణము. యక్షగానము. 3.భాగవతము యక్షగానము. 4. పరమభాగవతచరిత్రము. పద్యకావ్యము. 5.ఇందుమతీపరిణయము. పద్యకావ్యము. 6.హరికథాసుధారసము, 7.ఆచార్యవిజయము. యక్షగానము. 8.పద్యగద్యతతులు. భాగవతయక్షగానభాగము పార్థసారథివిజయము. పార్థసాంథివిజయము, ఆచార్య విజయము మాత్రమే లభించినవి.

పార్థసారథివిజయము చోళపురము వేంకటాచలవిభునికి అంకితము.[163] అతడు చరిత్రకు అందని వ్యక్తి. ఆచార్యవిజయమునందు ఆలూరి కుప్పన కస్తూరి రంగకవి శిష్యుడని కలదు.

"-- నలువ చెలులకు నెవ్వఁ డెన్నఁదగు పుత్త్రుఁ
డట్టి కస్తూరిరంగార్యు నచలధైర్యు
నార్యనుతచర్యు మద్గురువర్యు నెంచి
ప్రణుతిఁ గావింతుఁ బలుమాఱు ప్రస్తుతింతు. "

ఇతడు తుళుజాజీ వలన ఆంధ్రకాళిదాసబిరుదము నందినట్లును ఇందుకలదు[164].

" ఘనుఁడగు తుళజేంద్రుఁడు దయ
తనరఁగ నీ కాంధ్రకాళిదాసాభిధ మ
న్ననగా నొసంగెనట! నీ
యనుపమసాహిత్యమున కహో! యెన గలదే. "

"శ్రీమద్భోసలతుళుజమహారాజకటాక్షసముల్లసితాంధ్రకాళిదాసప్రణీతంబు-"

డూప్లే (1742-55) దుబాసి అయిన కస్తూరి రంగకవి శిష్యుడు ఆలూరి కుప్పనకు

ఆంధ్రకాళిదాసబిరుదప్రదానము కావించిన తుళుజరాజు రెండవతుళుజాజీ (1762-87) అగును. కాఁబట్టి కుప్పన కృతుల రచనాకాలములు పంచనదీస్థలపురాణము 1760 ప్రాంతము, రామాయణయక్షగానము 1765 ప్రాంతము, భాగవతయక్షగానము 1770 ప్రాంతము. ఇందుమతీపరిణయము 1773 ప్రాంతము, హరికథాసుధారసము 1776 ప్రాంతము, ఆచార్యవిజయము 1780 ప్రాంతము కావచ్చును.

పార్థసారథివిజయము:- ఇది భాగవతదశమస్కంధము. బృహత్తర యక్షగానము మహత్తరరచనము కాదు.[165] అముద్రితము.

ఆచార్యవిజయము:- ఇది శంకరాచార్యచరిత్రము. దుర్లభము.

అన్నదానము వేంకటాంబ: ఈమె కృతి రామాయణము. బాలకాండము ముద్రితము. (1912) అందు కాండాంతద్విపదను అన్నదానము వేంకటరామావధానుల భార్య వేంకటాంబ రచించినట్లు కలదు[166]. కాని, అముద్రితమైన సుందరకాండాంతమునందు హోసూరి సాకమ్మ రచించినట్లు కలదు. ఆమె ముక్తికాంతావిలాసమునందు రామాయణము హోసూరి సాకమ్మ రచించినట్లే కలదు. కనుక రామాయణము అన్నదానము వేంకటాంబ కృతము కాదు; హోసూరి సాకమ్మకృతమే అని ఒక అభిప్రాయము కలదు[167]. కాని, అన్నదానము వేంకటాంబ, హోసూరి సాకమ్మ ఒకరే కావచ్చును. హోసూరు గ్రామనామము హోసూరి గృహనామము. అది అన్నదానమహిమను అన్నదానము గృహనామము కావచ్చును. అన్నదానమహిమనే వేంకటాంబ సాకమ్మ (సాకు+అమ్మ) కావచ్చును. అసలు పేరు హోసూరి వెంకమ్మ అయిన, హోసూరి సాకమ్మ, అన్నదానము వేంకటాంబ అగుట అసంభవము కాదు. రామాయణము లిఖితరూపమున లభింపలేదు. ముఖస్థరూపమున లభించినది. ముఖస్థవ్యవహారమునందు రెండు పేరులును ఉండవచ్చును. అసలు పేరు ఉండకపోవచ్చును. తల్లిదండ్రులు సర్వేపల్లి వేంకటాంబావేంకటరామావధానులు కావచ్చును. భర్త పేరును వేంకటరామావధానులు కావచ్చును. కాలము 1760 ప్రాంతము[168] కావచ్చును.

సాకమ్మ పేర రామాయణము మాత్రమేగాక, ముక్తికాంతాకల్యాణము (విలాసము?) రంగవిలాసము, గురుశిష్యసంవాదము మొదలైన గ్రంథములు రచించినట్లు కలదు. అవి కూడ ముఖస్థరూపములే. అన్నదానము వేంకటాంబ రచనలే అగును.

> " ఇప్పటికి సుమారు రెండువందల సంవత్సరముల క్రిందట సేలం జిల్లా హోసూరు తాలూకా తోగీరఅగ్రహారమను గ్రామమందు నా పూర్వికు రాలైన అన్నదావము వెంకటరామావధానుల భార్య "

అన్నదావము వేంకటాంబ రచించివదని బాలకాండమును ప్రకటించిన, అన్న దానము రామలక్ష్మమ్మ ప్రకటవము అబద్ధమును కాదు. నిర్నిమిత్తమును కాదు. ఇందు హోసూరుతాలూకా సేలం జిల్లాలోనిదని కలదు. అప్పుడు సేలంజిల్లాలోనే కలదు. ఇప్పుడు

ధర్మపురిజిల్లాలో కలదు. ఎల్లలు మాఱినట్లే ఇంటిపేరులు, వ్యక్తిపేరులు మాఱుట సహజము.

అన్నదానము వేంకటాంబ రామాయణము బాలకాండము పేరునకు యక్షగానము. తీరునకు స్త్రీలపాట. కవయిత్రి స్త్రీలు పాడుకొనుటకు మాత్రమే ఉద్దేశించినది. అది నేటికిని హోసూరు ప్రాంతమునందు స్త్రీలు పాడుట కలదు. అవి సేకరింపదగినవి. శేఖరింపదగినవి.

**ధూర్జటి వేంకటరాయడు:** ఇతని కృతి రత్నావళీపరిణయము. అముద్రితము. చేకూరి రామస్వామిమంత్రికి అంకితము. అతడు చరిత్రకు అందని వ్యక్తి. కాని, "గరుడసింధుదక్షిణపినాకినీతటస్థానపూర్వశరధిసంగమపాటల పురనివాసుఁడు [169]". దక్షిణ పినాకినీతటమునందలి పూర్వసముద్రసంగమస్థలమైన పాటలపురము తిరుప్పళయూరు. కావున వేంకటరాయడు దక్షిణాంధ్రయుగకవి కావలయును. ఇతడు కుమారధూర్జటి కుమారుడైన ధూర్జటి లింగరాజు కుమారుడు.[170]

" శ్రీకాళహస్తీశసేవనాన్వితచిత్త
చిత్తజాకరలక్ష్మీవిహార
రమణీయశీల భారద్వాజగోత్రప
వి(త యాపస్తంబసూత్రమహిత
ధూర్జటివంశపాథోధిచంద్ర కుమార
ధూర్జటినామవిస్ఫూర్తితాంక
స్తుతమతి వేంకటపతితమాభవ లింగ
రాజకులేంద్ర ధైర్యాచలేంద్ర "

అని లింగరాజు పెదకాళహస్తి మాహాత్మ్యమునందు కలదు.

" ఘనగౌరీశకటాక్షలబ్ధకవితాగాంభీర్యసంతుష్టభూ
జనిరాడ్దత్తసువర్ణచేలమణిభూషాగ్రామపల్యంకికా
ఘనదంతావళఘోటకాదిబహుసత్కారప్రతిష్ఠాత్ము మ
జ్జనకున్ ధూర్జటిలింగరాజకవిరాజశ్రేష్ఠుఁ గీర్తించెదన్. "

అని వేంకటరాయని రత్నావళీపరిణయమునందు కలదు. కుమారధూర్జటి కృతుల రచనాకాలములు 1705, 1710 ప్రాంతములు. ఇది క్షీణయుగమునందు వివరింతును. కావున లింగరాజు కృతిరచనాకాలము 1735 ప్రాంతము కావలయును. కాఁబట్టి రత్నావళీపరిణయము రచనాకాలము 1765 ప్రాంతము కావచ్చును.

శ్రీకృష్ణదేవరాయల అష్టదిగ్గజకవులలో ఒకడైన ధూర్జటి వంశీయుడు, నూజివీటి నరసప్పారావు ఆస్థానమున, ఆరవీటి చిన వేంకటపతిరాయల ఆస్థానమున మసలిన కుమారధూర్జటి మనుమడు, శ్రీకాళహస్తినివాసుడైన లింగరాజు కుమారుడు అయిన ధూర్జటి వేంకటరాయడు దక్షిణాంధ్రయుగకవి అగుట చిత్రము.

అక్కనామాత్యుడు: ఇతని కృతి బాలకృష్ణలీలావిలాసము. యక్షగానము. తిరుపతి వేంకటేశ్వరునికి అంకితము. గ్రంథాంతమునందు "ప్రమోదూతనామ సంవత్సరశ్రావణ బహుళ ॥ ౨ మద్దాలి వల్లభుండు వ్రాసినాడు." అని కలదు. అది 1690 అని, శహాజీ ఆస్థానకవి అని ఒక అభిప్రాయము కలదు[171]. అది ప్రతి వ్రాసిన కాలము కావచ్చునని, అప్పటికి పూర్వమే గ్రంథరచన జరిగియుండునని, అది శహాజీ పరిపాలనకాలమని ఊహింపవచ్చునని మఱొక అభిప్రాయము కలదు[172]. ఇది ఘట్టకుటీకాప్రభాతన్యాయమునకు నిదర్శనము. ప్రమోదూతనామసంవత్సరశ్రావణ బహుళవిదియ 1690లోనే కాదు; 1570, 1630, 1690, 1750, 1810 లోను ఉండును. వారము లేవిది సంవత్సరము నిర్ణయించుట సాధ్యము కాదు. బాలకృష్ణలీలావిలాసనాటకమునందు తమిళభాష, మహారాష్ట్రభాష కలవుగావున, అది దక్షిణాంధ్రయుగయక్షగానమగును. నాటకమునందు మహారాష్ట్రపాలకుని ప్రసక్తి లేదు. కాఁబట్టి శహాజీకాలమే కాదు; శివాజీకాలము కూడ కావలసిన ఆవశ్యకము లేదు. అంతేకాదు. బాలకృష్ణలీలావిలాసనాటకము, మాతృభూతన పారిజాతాపహరణ మహానాటకమునకు ఏకదేశానుకరణము. పారిజాతాపహరణమహానాటకరచనాకాలము 1790 అని పూర్వోక్తము. కృతి వ్రాసిన కాలము, ప్రతి వ్రాసిన కాలమును ఒకటి కావచ్చును. కాఁబట్టి బాలకృష్ణలీలావిలాసనాటకరచనాకాలము 1810 వ సంవత్సరము.

ఇందు శ్రీకృష్ణుడు అష్టమహిషీసమేతుడు. షోడశసహస్రగోపికాసహితుడు. కనుక బాలకృష్ణలీలావిలాసమనుట ఉచితముగ కానరాదని ఒక అభిప్రాయము కలదు.[173] 1750 ప్రాంతము రచనాకాలమగు రాధికాసాంత్వనములోని చిన్నికృష్ణుడు "కటిఁ జట్టి కట్టిన కనకాంబరము" కలవాడు. "రాధికారమణి కైదండ రమణఁ బూని"న వాడు. (9ప.అవ.) అంతేకాదు. "శ్రీకృష్ణదేవుడు" (12వచ.అవ.) "భారతసఖుడు" (1ప.2ఆ.) "గోపవధూమనోహరణుడు" (169ప.3ఆ.) "రుక్మిణీభామాద్యష్టమహిష్యావృతుడు" (169ప.3ఆ.) చిన్ని కృష్ణుడైనను, బాలకృష్ణుడైనను శ్రీకృష్ణదేవుడే. కాఁబట్టి ఉచితముగ కానరాదనుట సంగతము కాదు.

ఇందు రుక్మిణీసత్యభామల సవతికయ్యమే ఇతివృత్తము. అది మాతృభూతన పారిజాతాపహరణమహానాటకమునకు అనుకరణము. అందువలనే ఇందు శ్రీకృష్ణుడు సత్యభామావిధేయుడు కాని సర్వతంత్రస్వతంత్రుడు. అందు శ్రీకృష్ణుని సత్యభామా విమర్శనము కలదు. ఇందు శ్రీకృష్ణుని సత్యభామాదూషణము కలదు. అది సరసము. ఇది విరసము. అది మహానాటకము. ఇది బాలనాటకము.

అష్టావధాని: ఇతని కృతి చంద్రశేఖరవిలాసము. యక్షగానము. కృత్యాదిశ్లోకమునందు "అష్టావధానీ కవిః" అని కలదు. కవి పేరు లేదు. దేశకాలములు లేవు. కాని, తమిళమహారాష్ట్రభాషలు కలవు. కనుక దక్షిణాంధ్రయుగయక్షగానము కావచ్చును. అష్టావధాని శహాజీ ఆస్థానకవి అని ఒక అభిప్రాయము కలదు[174].

అవిచారమూలకము. ఇందు మాతృభూతన పారిజాతాపహరణమహానాటకప్రభావము, అక్కనామాత్యుని బాలకృష్ణలీలావిలాసనాటకస్వభావము కలవు. కాఁబట్టి చంద్రశేఖరవిలాసము రచనాకాలము 1820 ప్రాంతము కావచ్చును.

ఇందు గంగాపార్వతులను వెదకుచు చంద్రశేఖరుడు వచ్చుట, గంగ కనబడి ఆమెతో విహరించుట, పార్వతి సరస్వతీసమేతముగ చంద్రశేఖరుని వెదకుట, నారదుడు పారిజాతపుష్పమును పట్టుకొని వచ్చి, గంగతోనున్న చంద్రశేఖరునికి ఇచ్చుట, చంద్రశేఖరుడు గంగకు ఇచ్చుట, గంగాచంద్రశేఖరుల విహారము గుఱించి నారదుడే గౌరికి చెప్పుట, గంగాగౌరుల సవతికయ్యము, అది తీర్పలేక చంద్రశేఖరుడు కొడుకు విఘ్నేశ్వరుని సఖ్యపఱుచుమనుట మాత్రమేగాక, గంగాగౌరుల పొందు కూర్చుమనుట, విఘ్నేశ్వరుడు గంగాగౌరులకు పతివ్రతాధర్మములు బోధించి సఖ్యపఱుచుట, సఖ్యపడిన సవతులు సదాశివుని సమీపించుట ఇతివృత్తము.

నారదుడు గంగాచంద్రశేఖరులకు పారిజాతపుష్పమును సమర్పించుట పురాణప్రసిద్ధము కాదు. పారిజాతపుష్పము కారణముగ గంగాగౌరుల సవతికయ్యమును పురాణప్రసిద్ధము కాదు. స్త్రీల పాటలందును లేదు. నారదుడు పారిజాతపుష్పమును కృష్ణునికి సమర్పించుట, తన్నిమిత్తమున రుక్మిణీసత్యభామల సవతికయ్యము మాతృభూతన పారిజాతాపహరణమహానాటకమునందు మాత్రమే కలదు. నారదుడు పారిజాత పుష్పమును చంద్రశేఖరునికి సమర్పించుట, తన్నిమిత్తమున గంగాగౌరుల సవతికయ్యము అష్టావధాని చంద్రశేఖరవిలాసమునందు మాత్రమే కలదు. ఇది తత్ప్రభావము. అష్టావధాని ఇష్టావలంబనము. సవతికయ్యము అక్కనామాత్యుని బాలకృష్ణలీలావిలాసము నందు విరసముగ కలదు. అష్టావధాని చంద్రశేఖరవిలాసమునందు వికటముగ కలదు. ఇది తత్స్వభావము. చంద్రశేఖరుని పాత్ర విపరీతము.

కథ ముగిసిన తదుపరి మన్నెమాదిగ ఘట్టము కలదు. అందు కొమ్ముకాళ్ల బదనీల తిమ్మసానిని, నవనాథసిద్ధుల పిలిపించి శక్తిపూజ చేయుట కలదు. ". తాళ్లపాక వారి సంకీర్తన నూరు సరి. నాది యొకటి సరి" అని దరువు పాడుట కలదు. (పుట163.) అందు "సారాయ పోయవే తిమ్మసానీ!" అని కలదు అంతేకాదు. ఒక వచనమునందు "మిటాపాణి" కలదు. (పుట165.) సారాయి, మిఠాపాన్ వ్యవహారము చంద్రశేఖరవిలాసము పరమార్వాచీనతకు పరమనిదర్శనము.

# త్యాగరాజు

పూర్తిపేరు కాకర్ల త్యాగరాజు. వాడుక పేరు త్యాగయ్య. ఇతని కృతులు 1.సీతా రామవిజయము. 2.నౌకాచరిత్రము. 3.ప్రహ్లాదభక్తివిజయము. 4.కీర్తనలు. జన్మదినము[175] సర్వజిన్నామసంవత్సరవైశాఖశుద్ధషష్ఠీసోమవారము. 4-5-1767. అంత్యదినము[176] ప్లవంగ నామసంవత్సరపుష్యబహుళపంచమీబుధవారము 6-1-1847. జీవితకాలము 1767-1847. సీతారామవిజయము రచనాకాలము 1692 ప్రాంతము, నౌకాచరిత్రము రచనాకాలము 1802 ప్రాంతము, ప్రహ్లాదభక్తివిజయము రచనాకాలము 1817 ప్రాంతము, కీర్తనల రచనాకాలము 1785-1847 మధ్యకాలము కావచ్చును.

**సీతారామవిజయము:** ఇది ముద్రితమయినట్లు ఒక అభిప్రాయము కలదు.[175] "పూర్తిగా లభించినట్లు లేదు. ఇందులోని ఇతివృత్తం ఉత్తరరామాయణంలోని కథ. కాంభోజి రాగంలోని 'మా జానకి చెట్టబట్టగా మహారాజవైతివి' అనే కీర్తన ఈ నాటకంలోని ఒక పాత్ర, రాముని గుఱించి పాడినదట. అశ్వమేధయాగానికి ముందు శత్రుఘ్నుడు యాగాశ్వంతో జైత్రయాత్రకు తరలి వెడలాడనగా, రాముడు తమ్మునికి యుద్ధధర్మాలను బోధించడం ఈ నాటకంలోని ఒక ఘట్టం. అప్పుడు లక్ష్మీనిధి అను ఒక పాత్ర - రాముని "నీవు వాలితోను తాటకితోను చేసిన యుద్ధములన్నీ ఈ ధర్మాలను పాటించే చేశావా" అని అడిగినాడట. దాని కేవో తగిన ప్రత్యుత్తరాలువుంటాయి" అని మఱొక అభిప్రాయము కలదు.[178] ముద్రితగ్రంథము అలభ్యము. లిఖితగ్రంథము అదృశ్యము.

**నౌకాచరిత్రము:** ప్రక్రియానిర్దేశము లేదుగాని యక్షగానప్రాయము. యక్షగానములందు వలె కవివచనములు, ద్విపదలు, పద్యములు, దరువుల బదులు కీర్తనలు (21) కలవు. ఆదిని అవతారికాప్రాయమైన రచన, అంతమున ఫలశ్రుతి కలదు. ఇందు గోపికల గర్వభంగము ఇతివృత్తము. పురాణప్రసిద్ధము కాదు. జానపదకథ కావచ్చును. ఇట్టి కథలు వంగసాహిత్యమునందు కలవట.[179]

నౌకాచరిత్రములోని గోపికలు బ్రహ్మజ్ఞలు. శ్రీకృష్ణదేవుడు బ్రహ్మము. బ్రహ్మజ్ఞలైన గోపికలు సంసారములను మఱతురు. వారిపై ప్రేమతో శ్రీకృష్ణదేవుడు వేణుగానము సేయును. విని గోపికలు వీధిని పడుదురు. శ్రీకృష్ణదేవుడు వచ్చును. గోపికలు కృష్ణ బ్రహ్మావేశమున శ్రీకృష్ణదేవుని తోడ్కొని యమునాతీరమునకు వెళ్లుదురు. అదే సమయమున నవరత్నఖచితరజితమయమైన నావ వచ్చును. గోపికామణులు, శ్రీకృష్ణ దేవుడు నౌకావిహారము సేయుదురు. రాసక్రీడ సాగును. గోపికలు యౌవనమదాంధ కారలు, సౌందర్యగర్వితలు అగుదురు. మైమఱచి శ్రీకృష్ణదేవుని పరిహసింతురు. శ్రీకృష్ణదేవుడు గాలివాన, గాఢాంధకారము కల్పించును. నావకు రంధ్రమేర్పడి నీరు లోనికి రాసాగును. భయభ్రాంతలైన గోపికలు శ్రీకృష్ణుని క్షేమము కోరి యమునాదేవిని

ప్రార్థింతురు. ప్రయోజనముండదు. గోపికలు వ్యసనాక్రాంత లగుదురు. కృష్ణుడు తమ్ము తీసికొనివచ్చిరని నెపము వేయును. గోపికలు మఱింత వ్యసనాక్రాంత లగుదురు. గోలపెట్టుదురు. కృష్ణుడు కంచుకములు విప్పి నౌకారంధ్రమును కప్పుడని చెప్పును. గోపికలు అట్లు సేయుదురు. కంచుకములు నీటికి కొట్టుకొని పోవును. గోపికలు మహావ్యసనాక్రాంత లగుదురు. శ్రీకృష్ణుడు నౌకారంధ్రమున కోకలు విడువుడని చెప్పును. గోపికలు లజ్జాక్రాంతలై, గత్యంతరము లేక కోకలు విప్పి కప్పుదురు. అవి కూడ నావలోనికి వచ్చు నీటికి కొట్టుకొనిపోవును. నగ్నలైన గోపికల గర్వము భగ్నమగును. శ్రీకృష్ణదేవుడు సర్వాధారుడు గాను, నిర్వికారుడుగాను, నిరంజనుడుగాను, ఆదిమధ్యాంతరహితుడు గాను జగన్మోహనాకారుడుగాను దర్శనమిచ్చును. గోపికలు ప్రార్థింతురు. శ్రీకృష్ణదేవుడు గోపికలను తన్నే ధ్యానము సేయుచు, కన్నీరు నిలిపి, కరయుగములచే కన్నులు మూసికొని భజింపుడని చెప్పును. గోపికలు అట్లు సేయుదురు. అంధకారము, వర్షము అణగిపోవును. గోపికలు కాంచనచేలములను కంచుకములను చూచి ఉప్పొంగి పోవుదురు. శ్రీకృష్ణపర మాత్మను శృంగారింతురు. మంగళము పాడుదురు.

ఇది గోపికావస్త్రాపహరణమునకు ప్రత్యామ్నాయకల్పనము కాదు. గోపికావస్త్రాపహరణము జరిగిన తర్వాతనే గోపికాగర్వభంగము. గోపికలు యమునాతీరమునకు బయలుదేరునెడ కృష్ణుని, "జలకము లాడువేళ వలువలు దాచి మమ్మలయింపగ లేదా" అని అడుగుదురు అది గోపికావస్త్రాపహరణము. ఇది గోపికాగర్వభంగము. ఇందు బ్రహ్మజ్ఞలైన, సంసారములు మఱచిన గోపికామణులు రాసక్రీడానంతరము యౌవనమదాంధకారలు, సౌందర్యగర్వితలు అగుట సందేహము కలిగించును. అదొక శ్రీకృష్ణలీల అగును. రాసక్రీడ మధురభక్తి.

ఇందు కీర్తనలు ఇరువదియొకటి కలవు. అందొకటి:

" గంధము పుయ్యరుగా పన్నీరు - గంధము పుయ్యరుగా ॥
అందమైన యదునందనుపై - కుందరదన తిరువొందగ పరిమళ ॥గం॥
తిలకము దిద్దెరుగా కస్తూరి - తిలకము దిద్దేరుగా
కలకలమని ముఖకళ గని సొక్కుచు - పలుకుల నమృతము లొలికే సామికి ॥గం॥
చేలము గట్టేరుగా బంగరు-చేలము గట్టేరుగా
మాలిమితో గోపాలబాలురతో-నాల మేపిన విశాలనయనునికి ॥గం॥
హారతు లెత్తేరుగా ముత్యాల-హారతు లెత్తేరుగా
నారీమణులకు వారము యౌవన-వారక మొసగే వారిజాక్షునికి ॥గం॥
పూజలు సేయరుగా మనసార-పూజలు సేయరుగా
జాజులు మరి విరవాజులు దవనము-రాజితత్యాగరాజనుతునిపై ॥గం॥ పుట15.

త్యాగరాజా సీసపద్యము :

" బాలభావముతోడఁ బంతుల సాలిండ్ల
పైఁ బవ్వళించెడి పద్మనాభు

నింటింటఁ జొరఁబడి యిల్లాండ్రఁ బట్టుచు
వేడ్కగాఁ దిరిగెడి విమలహృదయు
ముద్దు గారగ నూరి ముదితల నేలుచు
నీడను శోభిల్లు నిర్మలాత్ము
స్త్రీబుద్ధివల్లను జెరుచుకొంటిమి గాక
యేలఁదెచ్చితిమమ్మ యేలు విభుని
తల్లడిల్లెడి కాళింది దాఁటి తల్లి
చెంతఁ గృష్ణుని నే వేళఁ జేర్తు మమ్మ
యనుచుఁ దారుణ్యవతులెల్ల నలరుచుండఁ
జూచి మదిలోన నగుచుండె సుముఖుఁ డపుడు. పుట10

త్యాగరాజు నౌకాచరిత్రమునందు పోతన ప్రభావము, రామదాసు ప్రభావము కలదు. " మసగొని రేగుఁబండ్లకును మౌక్తికముల్ వెలవోసినట్లు" అని దాశరథిశతకము నందు కలదు.

" వ. ఆ సమయంబున శ్రీకృష్ణదేవుండు రేగుపండ్లకొను వ్యాజంబున కరముల నిండ ముత్యము లిడుకొని పుట2.

"ద్వి. భామ లమ్మెడు రేగుపండ్లకై నేను
కామించి ముత్యముల్ కరముల నిండ
నునుచుక నే రాఁగ నుప్పొంగి మీరు " పుట11.

మొత్తము మీద నౌకాచరిత్రము మోదావహమగు నూతనసృష్టి.

**ప్రహ్లాదభక్తివిజయము:** ప్రబంధమను నిర్దేశము (పుట1) కావ్యమను నిర్దేశము (పుట1) నాటకమను నిర్దేశములు (పుటలు2,2,2;3,3;4.) కలవు. ప్రబంధమన కావ్యము. కావ్యభేదము నాటకము. నాటక మన యక్షగానము. అయినను సంస్కృత నాటకప్రభావము కలదు. ఇష్టదేవతాస్తుత్యాదికము నాందీప్రాయము. సూత్రధారదౌవారిక సంవాదము ప్రస్తావనాతుల్యము. అంకవిభాగము నాటకలక్షణము. ఫలశ్రుతి భరతవాక్య సదృశము. ఇష్టదేవతాస్తుతియందు తులసీదాసును, పురందరదాసును, రామదాసును వినుతించుట విశేషము. అనంతరము సద్గురుధ్యానము సల్పి, పూర్వభక్తవ్రాతమును కొనియాడి, "మఱియుఁ బాండురంగ, నామదేవ, జ్ఞానదేవ, సహదేవ, తుకారామ, శ్రీనారాయణతీర్థాదిభగవద్దాసుల కెల్లం బ్రణమి"ల్లుట ప్రత్యేకవిశేషము.

ప్రహ్లాదభక్తివిజయము ప్రహ్లాదుని చరిత్రము కాదు. ప్రహ్లాదుని భక్తివిజయమే.

" జ్ఞానవైరాగ్యవిజ్ఞానసద్భక్తి
దీని భావములెల్ల దివ్యమై వెలుఁగు
కనకకశిపుఁడు మున్ను కడు చలంబునను
తనయుని సకలబాధలఁ బెట్టి మఱియు
నాగపాశంబున నడుమునఁ గట్టి
సాగరంబున వేయ సెలవిచ్చు మొదలు

ప్రహ్లాదయోగికి ప్రబలవారిధికి
నాహ్లాదమగు వాద మందు రాజిల్లు
ఘనుఁడైన నారదాగమనంబు చేత
జనియింపఁ బడి జాలిఁజెంది మూర్ఛిల్ల
నా మీద మాధవుం డావిర్భవించి
సామర్థ్యముల నేచి సలలితుం డగుచు
ముమ్మారు నెదురుగ ముదముతో నిల్చి
సొమ్మసిల్లిన వేడ్క సొంపుగా మందు
రాగతాళమృదంగరవళిచేఁ జెలఁగు
నాగరికం బభినయముచేఁ జెలఁగు
భక్తాగ్రగణ్యుఁడై పరగు ప్రహ్లాద
భక్తివిజయమన బాగైన కృతిని " పుట2

అని త్యాగరాజు అందిచ్చిన కథాసంగ్రహము.

నాటకారంభమున విఘ్నేశ్వరాగమనము, సుత్రాధారదౌవారికసంవాదము యక్షగానలక్షణములు. దౌవారికుడు సూత్రధారుని,

" ఈ సభయేమి, ఈ దివిటీల ప్రభలేమి, ఈ మృదంగాదివాద్య
ఘోషలేమి, ఈ సొగసైన వేషము లేమి, ఈ నాటకంబునకుఁ బేరేమి ,
దీని ఫలమేమి, ఈ నాటకం బాడుమని యెవ రానతిచ్చిరి? "

అని ప్రశ్నించుట కవి ప్రదర్శనోద్దేశమును ప్రకటించును. ప్రదర్శనోద్దిష్టమైనను ప్రదర్శనయోగ్యత ప్రశ్నార్థకచిహ్నాయోగ్యము. ఇది సంస్కృతనాటకప్రభావము.

ప్రథమాంకమునందు సముద్రమహారాజు నాగపాశబద్ధుడైన ప్రహ్లాదయోగిని సమాదరించుట, గరుత్మంతుని చేత నాగపాశవిమోచనము కలిగించుట, కానుక లొసగి పూజించుట ప్రశంసించుట, ప్రహ్లాదుడు "హృదయారవిందమున ముమారమణునిఁ గూడ దారిఁ దెలుపు"మనుట, సముద్రమహారాజు ప్రహ్లాదస్వామికి భగవద్దర్శనోపాయము తెలుపుట కలదు. సముద్రరాజు తెలిపిన భగవద్దర్శనోపాయమిది:

" ధీరుని శితపంచశరా
కారుని సతతంబు పూర్ణకాముని భక్తా
ధారుని దశరథరాజకు
మారుని మతియింపవయ్య మహిజాధిపునిన్. పుట8.

వచ్చును హరి నిన్నుఁజూడ - వచ్చును నిన్నుఁజూచి
మెచ్చును హరి నిన్నుఁజూచి ॥వ॥
కుచ్చితవిషయాదులఁ జొచ్చు రీతి నెంచి నీవు -
హెచ్చుగాను మా స్వామిని - మచ్చికతో మతియింపుము ॥వ॥
ధీరుని సీతారామును - తారుని సకలలోకా
ధారుని నిజభక్తమం - దారుని మతియింపవయ్య ॥వ॥

ధన్యుని వేల్పులలో మూ - ర్ధన్యుని ప్రతి లేని లా
వణ్యుని పరమకా - రుణ్యుని నుతియింపవయ్య ॥వ॥
ఏ జపతపములకు రాఁడు - యజనాదులకు రాఁడు
రాజిగా నుతియించు త్యాగ - రాజనుతుఁడు ఈ వేళ. " ॥వ॥ పుట9.

ఇది త్యాగరాజు భక్తిసిద్ధాంతము. జపతపముల కంటె, యజ్ఞయాగాదిక్రతువుల కంటె, కీర్తనమే భగవత్సాక్షాత్కారమునకుః భావమే, త్యాగరాజు కీర్తనలకు జీవము. ప్రహ్లాదభక్తివిజయమునకు ప్రాణము.

ద్వితీయాంకమునందు ప్రహ్లాదుడు శ్రీహరిని నానావిధముల కీర్తించుట, శ్రీనారదగురుస్వామి సనకసనందనాదులకు ప్రహ్లాదుని వృత్తాంతము చెప్పుట, శ్రీహరి సభకు వేంచేయుట, ప్రహ్లాదుడు నారదవీణానాదము విని శ్రీహరి ప్రత్యక్షమగుటకు ప్రతిజ్ఞలు సేయుట, నారదమౌని ప్రహ్లాదుని యొద్దకు వచ్చుట, ప్రహ్లాదుడు నారదగురు మూర్తిని ప్రస్తుతించుట, నారదుడు వైకుంఠప్రభావము వర్ణించి (చూర్ణిక), నారాయణాగ మనసునిశ్చయవార్తను సూచించుట, ప్రహ్లాదుడు పరవశించుట, నారదుడు వైకుంఠము లోని లక్ష్మీనారాయణసంవాదమును వివరించుట కలదు. అందలి సంవాదపద్యమిది:

" తెలవార ప్రొద్దుగూకులు మీకు నిజదాస
వెట్టి యేలనొ పనుల్ వేతి లేవె?
అటువంటి వరభక్తుఁ డరుదాయెఁగాని నీ
వీ మాటలందు వేతెంచవలదు
మాటిమాటికి మీరు మహికి నేగుటవల్ల
మది తల్లడిల్లును మదనజనక!
ఎన్నాళ్ల కెన్నాళ్ల కెవరికోసము నేను
నిమఁబాసి చనితివో నీరజాక్షి!
ధ్రుతముగా నాఁడు చనలేద ధ్రువుని కొఱకు
ఒకడు కోటానకోట్లలో నుత్తముండు
అందుకే నేను నిమఁబాసి యార్తిఁ బడితి
నింత మాత్సర్య మెందుకే యిందువదన. " పుట17.

తృతీయాంకమునందు ఇంకను శ్రీహరి ప్రత్యక్షము కాలేదని ప్రహ్లాదుడు పరితపించుట, మూర్ఛిల్లుట, అది తెలిసి ఆ క్షణమునంద శ్రీహరి ప్రహ్లాదుని చెంతకు వచ్చుట, పరిష్వంగము సేయుట, ప్రహ్లాదుడు మూర్ఛఁదెలిసి సాక్షాత్కరించిన శ్రీహరిని నేత్రానందముగ సేవించి, నిశ్చయించుట, బ్రహ్మానందజలధిలో ఓలలాడుట, శ్రీమన్నారాయణుని స్తోత్రము చేయుట, శ్రీహరి పాదములు పట్టుకొని పరవశించుట, దర్శనానందజలధిలో ఈదుట కలదు. ఇంకను శ్రీహరి ప్రత్యక్షము కాలేదని ప్రహ్లాదుడు పరితపించిన కీర్తన కరుణరసనిర్భరము.

" ఎన్నఁగ మనసుకు రాని - పన్నగశాయి సొగసు
పన్నుగఁ గనుఁగొనని - కన్నులేలే - కన్నులేలే - కంటిమిన్నలేలే ॥ఎ॥

మోహముతో నీలి వారి - వాహకాంతినిఁ గేరిన
శ్రీహరినిఁ గట్టుకొనని - దేహమేలే - దేహమేలే - యీ గేహమేలే॥ఎ॥
సరసిజ మల్లె తులసి - విరువాజి పారిజాతపు
విరులచేఁ బూజించని - కరము లేలే - కరము లేలే - యీ కాపురము లేలే ॥ఎ॥
మాలిమిని త్యాగరాజు - నేలిన రామమూర్తిని
లాలించి పొగడని - నాలికేలే - నాలికేలే - సూత్రమాలికేలే ॥ఎ॥ పుట18.

ఇందు పోతన ప్రభావము భంగ్యంతరముగ కలదుగాని; విఱుపులు, ఆవృత్తులు, కాకువులు వలన కరుణరసనిర్భరము. శ్రీహరి పాదములు పట్టుకొని ప్రహ్లాదుడు పరవశించిన కీర్తన:

"ఏనాటి నోము ఫలమో - ఏ దానబలమో ॥ఏ॥
శ్రీనాథ బ్రహ్మకైనను నీదు - సేవ దొరకునా తనకుఁ గలుగుట ॥కే॥
నేను కోరిన కోర్కెలెల్లను - నేఁడు తనకు నెరవేరెను
భానువంశతిలక నా పాలి - భాగ్యమా సజ్జనయోగ్యమా తన ॥నే॥
నీదు దాపు నీదు ప్రాపు దొరికెను - నిజముగానే నీ సొమ్మైతిని
ఆదిదేవ ప్రాణనాథ నా - దంకమందు నుంచి పూజించ ॥నే॥
సుందరేశ సుగుణబృంద దశరథ - నందనారవిందనయన పావన
అందగాడ త్యాగరాజనుత సుఖ - మనుభవింప దొరికెఁ గానఁ దన కిఁక" ॥ఏ॥ పుట21.

తృతీయాంకవిషయము చతుర్థాంకమునందు కొనసాగినది. తృతీయ చతుర్థాంకముల విషయము నిజమునకు ఏకాంకవిషయము. ఏకాంకము చేసిన సుదీర్ఘతరమగును. అంతేకాదు. పంచమాంక ముండదు. తృతీయాంకమునందు బ్రహ్మానందజలధిలో ఈదులాడు ప్రహ్లాదుని శ్రీహరి కామ్యవరము లందుకొమ్మనుట, ప్రహ్లాదుడు నిరాకరించుట, శ్రీహరి మఱల కామ్యవరము లందుకొమ్మనుట, ప్రహ్లాదుడు మఱల నిరాకరించుట, శ్రీహరి నిర్దయుని వలె పలుకుట, ప్రహ్లాదుడు దయనీయముగ పలుకుట, శ్రీహరి సాదరముగ పలుకుట, ప్రహ్లాదుడు సంతోషముగ పలుకుట, శ్రీహరి ప్రహ్లాదుని భక్తిహృదయమును పరీక్షించుట, ప్రహ్లాదుడు హృదయమర్మము తెలుపుట, పరిచారకభక్తిని కోరుట, శ్రీహరి అధికార మడుగుమనుట, ప్రహ్లాదుడు భక్తినే కోరుట, శ్రీహరి ప్రహ్లాదుని ఆంతరభక్తిని పరీక్షించుట, ప్రహ్లాదుడు అంతరానుభవము తెలియజేయుట, శ్రీహరి అంతరాంతరభక్తిని పరీక్షించుట, ప్రహ్లాదుడు సీతాభక్తిని కోరుట, శ్రీహరి ప్రహ్లాదునికి అభీష్టసిద్ధి కలిగించుట, ప్రహ్లాదుడు శ్రీహరిని షోడశోపచారముల పూజించుట బ్రహ్మానందపరవశు డగుట కలదు. ఇందు ప్రహ్లాదుడు జ్ఞానానందమయునిగ, బ్రహ్మజ్ఞాననిష్ఠునిగ ప్రసంగించును.

ప్రహ్లాదుని అభీష్టమిది:

"వెన్నయుండఁగ నేతికెవనంబు పడనేల
అన్నముండఁగ జొన్నయంబలేల

తల్లి గల్గు సుతకు దాదివెసనమేలఁ
దన్నుఁ దాఁ దెలిసిన తత్త్వమేల
వ్యాధిహీనునకును వైద్యుని చెలిమేల
స్వధనంబు లుండఁ బంచాంగమేల
నన్ని నీవనువాని కమర భేదంబేల
ధీరున కొకవైరి దిగు లదేల
నాదు భావంబు నీ వెంచి నన్నుఁబ్రోవు
మవ్యమైన సహింపలే నప్రమేయ
నీవు నాయొద్దనుండుటే నిండుసుఖము
క్ష్మాసుతాధీశ నీ కటాక్షంబె చాలు." పుట 27.

పంచమాంకమునందు శ్రీమన్నారాయణమూర్తి మఱల వత్తుననుట, ప్రహ్లాదుడు దుఃఖించుట, ఒకటి రెండు దినములలో తిరిగివచ్చునట్లు పంపుట, పంపిన తర్వాత మొఱలు పెట్టుట, ప్రహ్లాదుని ప్రేమదుఃఖము సైరింపలేక శ్రీమన్నారాయణమూర్తి లక్ష్మీ సమేతముగ వచ్చుట, ప్రహ్లాదుడు సేవించుట, ప్రహ్లాదుడు శ్రీమన్నారాయణమూర్తిని చేరి అత్యంతకుతూహలమున ఉన్న వార్త విని, బ్రహ్మాదులు వచ్చుట, ప్రహ్లాదుడు శ్రీహరిని పూజించి, భజించి మంగళము పాడుట కలదు. ఇందు ప్రహ్లాదుడు మొఱలు పెట్టిన ఘట్టము హృదయవిదారకము.

" ఎంత పాపినైతి నేమి సేయుదు హా - ఏలాగుఁదాళుదు నే - ఓ రామ ॥ఎం॥
అంత దుఃఖములను తీర్పు హరినిఁజూచి - యెంతవారైనను బాయ సహింతురే ॥ఎం॥
మచ్చికతోఁ దాను ముచ్చటలాడి మోస - పుచ్చి యేచ మది వచ్చెనే కటకటా ॥ఎం॥
ఆస మించి ఆయాసపడను విధి - వ్రాసెనా నా ముద్దువెన్నునిఁ గానమే ॥ఎం॥
సేవఁజేయుటె జీవనమని యుంటి - దైవము నా పాలిటి భాగ్యమిట్లాయెనా ॥ఎం॥
రాజిల్లు శ్రీత్యాగరాజు తాఁ బొంగుచుఁ - బూజించు శ్రీరఘురాజిందు లేనందు ॥ఎం॥

మఱొక కీర్తనయందు ప్రహ్లాదుడు విష్ణువును "నా వంశధనము" అని పేర్కొనును. (పుట40) ప్రహ్లాదుని తండ్రి హిరణ్యకశిపుడు విష్ణుద్వేషి కద. కనుక విష్ణువు ప్రహ్లాదుని వంశధనము కాదు. త్యాగరాజు వంశధనము. ప్రహ్లాదభక్తివిజయమునందు ప్రహ్లాద స్వామి త్యాగరాజస్వామియే.

ప్రహ్లాదభక్తివిజయమునందు పద్యములు, ద్విపదలు, వచనములు కాక నలుబది యైదు కీర్తనలు కలవు.

**కీర్తనలు:** ఏడు వందలు పైగా కలవు. ఇవి చతుర్విధము. 1.ఘనరాగపంచ రత్నములు (5). 2.దివ్యనామకీర్తనములు (83). 3.ఉత్సవసంప్రదాయకీర్తనలు(28). 4.ఇతరములు. కృతులు. (589). మొత్తము 5+83+28+589=705.

ఘనరాగపంచరత్నముల సాహిత్యశైలి, సంగీతశైలి రెండును ప్రౌఢములు. ఒక ఉదాహరణము.

" కనకన రుచిరా - కనకవసన నిన్ను ॥క॥
దినదినమును మనసున చనువున నిన్ను ॥క॥
పాలుగారు మోమున శ్రీ య -
పారమహిమ దనరు నిన్ను ॥క॥
కలకలమను ముఖకళ గలిగిన సీత
పలుకుచు నోర కన్నులను జూచే నిన్ను ॥క॥
బాలార్కాభసుచేలమణిమయ
మాలాలంకృతకంధరసరసిజాక్షవరక
పోలసురుచిరకిరీటధర సతతంబు మనసారగ ॥క॥
సాపత్నీమాతయౌ సురుచిచే
కర్ణశూలమైన మాట వీనుల
చురుక్కున తాళక శ్రీహరిని
ధ్యానించి సుఖింపఁగలేదా యటు ॥క॥
మృగమదలలామశుభనిటల
వరజటాయుమోక్షఫలద
పవమానసుతుఁడు నీదు మహిమఁ దెల్ప సీత
తెలిసి వలచి సొక్కలేదారీతి నిన్ను ॥క॥
ముఖాస్పదవిముఖాంబుధరపవనవిదేహమానస
విహారాప్తసురభూజమానితగుణాంకచిదానంద
ఖగతురంగధృతరథాంగపరమదయాకర
కరుణారసవరుణాలయభయాపహరా శ్రీరఘుపతే ॥క॥
కామించి ప్రేమ మీఱ కరముల నీదు పాదకమలములఁ
బట్టుకొనువాఁడు సాక్షి రామనామరసికుడు కైలాస
సదనుడు సాక్షి మఱియు నారదపరాశరశుకశౌనక
పురందరనగజాధరణముఖ్యులు సాక్షి గాద
సుందరేశ సుఖకలశాంబుధివాసాశ్రితులకే ॥క॥
సతతము ప్రేమపూరితుఁడగు త్యాగరాజ
మత ముఖజితకుముదహిత వరద నిన్ను ॥క॥ 4.

సుప్రసిద్ధమైన "ఎందరో మహానుభావు - లందఱికీ వందనములు" అను కీర్తన ఘనరాగపంచరత్నములలోని ఒక రత్నమే.

దివ్యనామకీర్తనల సాహిత్యశైలి, సంగీతశైలి రెండును సరళములు. ఒక ఉదాహరణము.

" బ్రోచేవారెవరే రఘుపతీ నిను వినా శ్రీరామా నెనరున
సకలలోకనాయక! వరవర నీ సరి ॥బ్రో॥
దేవేంద్రాదులు మెచ్చుటకు లంక దయతో

దాన మొసంగి సదా ॥బ్రో॥
ముని సవంబుఁ జూడ వెంటఁజని ఖల
మారీచాదుల హతంబు సేసి ॥బ్రో॥
వాలి నొక్క కోలనేసి రవిబాలుని
రాజుగఁ గావించి జూచి ॥బ్రో॥
భవాబ్ధితరణోపాయము నేరని
త్యాగరాజుని కరం బిడి ॥బ్రో॥

ఉత్సవసంప్రదాయకీర్తనలు ఉత్సవములకు, వేడుకలకు సంబంధించినవి. చూర్ణిక, హెచ్చరిక, కొలువుసేత, పెండ్లివేడుక, పవ్వళింపుసేవ, మేలుకొలుపులు లాలి, జోల, శోభనములు, మంగళములు మొదలైనవి. ఒక ఉదాహరణము.

" బడలిక దీర పవ్వళించవే ॥బ॥
సడలని దురితములను తెగ
గోసి సార్వభౌమ సాకేతరామ ॥బ॥
పంకజాసనుని పరితాపము గని
పంకజాప్తకులపతివై వెలసి
పంకజాక్షితో వనమున కేగి జింకను వధియించి
మంకురావణుని మదము నణచి
నిశ్శంకుడౌ విభీషణునికి బంగారు
లంక నొసఁగి సురల బ్రోచిన
నిష్కలంక త్యాగరాజనుత రామ ॥బ॥ 13.

ఘనరాగపంచరత్నములు, దివ్యనామకీర్తనములు, ఉత్సవసంప్రదాయకీర్తనలు కానివి ఇతరములు. ఇవి కృతులని వ్యవహారప్రసిద్ధము. ఇందు త్యాగరాజు భక్తి, ఆర్తి, ఆనందము, స్తుతి, వర్ణన, విరక్తి, ముముక్ష, క్షేత్రదైవస్తుతి మొదలైనవి కలవు. క్షేత్రయ్య వలె త్యాగయ్య కూడ క్షేత్రపర్యటన చేసిన వాగ్గేయకారుడు. తిరువైయూరుకు చెందిన త్యాగరాజు తిరువొత్తియూరు, కోవూరు, నాగులాపురము, తిరుపతి, పుత్తూరు, కంచి, వాలాజీపేట, శ్రీరంగము, నాగపట్టణము, ఘటికాచలము మాత్రమేగాక భద్రాచలమును సందర్శించినట్లు కలదు.

" గిరిపై నెలకొన్న రాముని గురితప్పక గంటి భద్ర ॥గి॥
సరివారులు విరిసురటులచే నిల
బడి విసరుచు కొసరుచు సేవింపగ ॥గి॥
పులకాంకితుడై యానందాశ్రు
వుల నింపుచు మాటలాడవలెనని
కలువరించగని పదిపూటలపై
గాచెదనను త్యాగరాజవినుతుని ॥గి॥ 143.

ఇది చరమదశ కీర్తనమైనను పూర్వసందర్భనపురస్కారమగును.

త్యాగరాజు శిష్యసమేతముగ తిరుపతివేంకటేశ్వరస్వామిని సందర్శించినపుడు స్వామికి తెరవేసియున్న పాడినదని ప్రసిద్ధమైన కీర్తన:

" తెర తీయగరాదా లోని
తిరుపతి వెంకటరమణ మచ్చరమను ॥తె॥
పరమపురుష ధర్మాదిమోక్షముల
పారఁదోలుచున్నది నాలోని ॥తె॥
ఇదవొందగ భుజియించు సమయమున
ఈఁగ తగులు రీతి యున్నది
హరిధ్యానము సేయు వేళ చిత్తము
అంత్యజు వాడకుఁ బోయినట్లున్నది ॥తె॥
మత్స్యము ఆకలిఁగొని గాలముచే
మగ్నమైన రీతి యున్నది
అచ్చమైన దీపసన్నిధిని మరు
గిడఁబడి చెఱచినట్లున్నది ॥తె॥
వాగుర యని తెలియక మృగగణములు
వచ్చి తగులు రీతి యున్నది
వేగమె నీ మతము నమసరించిన
త్యాగరాజమత మదమత్సరమను॥తె॥ 177.

ఇందు బాహిరమైన తెర, ఆంతరమైన మదమత్సరమను తెర. అది తొలగించు కొనవలయునని ఉపదేశము. ఉపదేశము తోపాటు సద్యఃపరనిర్వృతి కలిగించునది.

ఎవరికైన శాంతము ప్రధానమని హెచ్చరించు కీర్తన:

" శాంతము లేక సౌఖ్యము లేదు - సారసదళనయన ॥శాం॥
దాంతునికైన వే - దాంతునికైన ॥శాం॥
దారసుతులు ధన - ధాన్యము లుండిన
సారెకు జపతప - సంపద కల్గిన ॥శాం॥
యాగాదికర్మము - లన్నియుఁ జేసిన
బాగుగ సకలహృ - ద్భావము దెలిసిన ॥శాం॥
ఆగమశాస్త్రము - లన్నియుఁ జదివిన
భాగవతులమను - బాగుగఁ బేరైన ॥శాం॥
రాజాధిరాజ శ్రీ-రాఘవత్యాగ
రాజవినుత సాధు-రక్షక తవ కృప ॥శాం॥ 417

వాల్మీకిరామాయణములోని రామకథాంశములేగాక, అన్యరామాయణములలోని రామకథాంశములును త్యాగరాజు కృతులందు కలవు.

" మా జానకి చెట్టఁబట్టఁగ మహారాజువైతివి ॥మా॥

రాజరాజ వరరాజీవాక్ష విను
రావణారి యని రాజిల్లు కీర్తియు ॥మా॥
కానకేగి యాజ్ఞ మీఱక మాయా
కారమునిచి శిఖిచెంతనే యుండి
దానవుని వెంటనె చని యశోకతరుమూలనుండి
వాని మాటలకు కోపగించి కంట
వధియించకనే యుండి
శ్రీనాయక యశము నీకే కల్గఁ
జేయలేదా త్యాగరాజపరిపాల ॥మా॥ 320

ఇందు రావణుడు అపహరించిన సీత అసలు సీత కాక మాయాసీత అని కలదు. ఇది అవాల్మీకవృత్తాంతము. కృతి వ్యాజస్తుతి.

త్యాగరాజా జీవితము సంగీతము. భక్తి. అంతకంటె సన్మార్గము లేదను కీర్తన:

" సంగీతజ్ఞానము భక్తి వినా - సన్మార్గము గలదె మనసా ॥సం॥
భృంగినటేశసమీరజఘటజమ
తంగనారదాదు లుపాసించే ॥సం॥
న్యాయాన్యాయము దెలుసును జగములు
మాయామయమనె దెలుసును దుర్గుణ
కాయజాదిషడ్రిపుల జయించే
కార్యము దెలుసును త్యాగరాజునికే " ॥సం॥ 415

ప్రతి కృతి సంగీతశ్రుతి, సద్భక్తిస్మృతి అయిన త్యాగరాజా కృతులు తెలుగు సాహితికి వెలుగు దీధితులు.

పులైయూరు దొరసామయ్య: ఇతని కృతులు కీర్తనలు, పదములు.[180] సుమారు ఏబది వఱకు లభించినవి. ఇతడు తిరువయ్యూరులో చాలకాలము గడిపిన వాడు. కాలము 1782-1816. పల్లవి దొరసామయ్య అని ప్రసిద్ధుడు.

చిదంబరదేవాలయములోని నటరాజస్వామి తాండవవిలాసములను వర్ణించిన నాలుగు కీర్తనలు నాట్యశాస్త్రపాండిత్యమును ప్రకటించునవి. ఒక ఉదాహరణము:

" ప. అద్భుతనటనం బాడీని మా అంబరకేశుండు . . .
అ.ప. అద్భుతమద్భుతమని ధర్మవర్ధని అడుగడుగు జూచి మెచ్చ
మోదము హెచ్చ
హరహర శివశివ యనుచు, సురలందఱును వందనము సేయ . . . .
1చ. ధాత వెంట నిల్చి చేత తాళము బూని, తాతైతై యనగా పల్కుల
నాతి యమ జీమూతంబూ సంగీతము వర్ణింపగ - పురు
హూతు డపుడు మేలుగీతము సేయ; సభాతలమునను కృపాతటి నీశుడు
తాతకిట; ఝణుత, కిటకిట, తకతరి, కిటతకఝోంతర,
కిటితకఝోమని ...
2చ. అంగజా తండ్రి మృదంగము పూని, ధళాంగని వినిపించగ, ఆ
ఇంగితంబు గని మంగళదేవి కరంగి, లయము వేయగా, కు
రంగనేత్రియౌ ధరాంగన నాదము భంగము లేక చెలంగింపనపుడు
తత్తోంగ్ తకతోంగ్ తకణం తరితోంతరి కిటతకతోంతరి
కిటతకతోమని . . .
3చ. కరములెత్తి మైమఱచి ఋషులెల్ల హర హర హర యనగా, నందికే
శ్వరు డందఱికి ముందఱను నిల్చి, హెచ్చరికె పరాకనగా, లంబో
దరసుబ్రహ్మణ్య లిరుగడలను శంకర భవ మా ముద్దర యని మొఱలిడ
ధరితకిట ఝణుతకిట ధృగ్ధుతక తద్ధిత్తళాంగు ధృగ్ధుతళాంగు
తక తధిం గిణతోమ్మని . . . . ॥అద్భుత॥

ఇతరకీర్తనలు " ధూర్జటి నటించిన ప్రదోషసమయమునను ", "ఆడీనమ్మా హరుడు భ్రుకుట్టితై యని ", " తత్తధిమి తధిద్ధియని సదాశివు డాడేనె " అను మూడును ప్రసిద్ధములు. ఇందు "ధూర్జటి నటించిన". "ఆడీనమ్మా" అను రెండు కీర్తనలును సంగీతజగత్తునందు ప్రాచుర్యము వహించినవి.

" దాని దగ్గఱ కేగలేదని దాచేవేరా ", " దానికే తగుమగాని మఱి యేదానికైన తగునా " " మందు గైకొనరే", " అటువంటి వేళ నన్నాదుకోవయ్య " మొదలైనవి పదాలు.

గుంటూరి రాజగోపాలయ్య: ఇతని కృతులు 1.భక్తజనపారిజాతము. 2.పదములు. ఇతని కాలము 1787-1833 కావచ్చును. త్యాగరాజా సమకాలికుడు[181]. ఇతడు గుంటూరు నుండి తంజావూరు జిల్లాలోని మెరత్తూరు (మెరట్టూరు, మేలటూరు)

వలస వెళ్లిన వాగ్గేయకారుడు. పల్లవి గోపాలయ్య అని ప్రసిద్ధుడు. పల్లవి పాడుటలోని ప్రత్యేకత తన్నిమిత్తము.

భక్తజనపారిజాతము పద్యకావ్యము. పరమభాగవతుల చరిత్రము. అముద్రితము. కీర్తనలు "వేంకట" ముద్రాంకితములు. "వనజాక్షి", "అంబ నాదు", "హరి సర్వ", "మహిషాసుర", "శ్రీపురవాసిని, అమృతపావని", "శ్రీరమారమణి మనోహర" అను కీర్తనలు ప్రసిద్ధములు.[182]

**మెరట్టూరు వేంకటరామశాస్త్రి:** ఇతని కృతులు 1.ప్రహ్లాదచరిత్ర. 2.రుక్మాంగదచరిత్ర. 3.మార్కండేయచరిత్ర.4.ఉషాపరిణయము.5.హరిశ్చంద్రనాటకము. 6.సీతాకల్యాణము. 7.రుక్మిణీకల్యాణము. 8.కంసవధ. 9.శివరాత్రినాటకము. 10.సత్సంగనాటకము. 11.అసత్సంగరాజానాటకము.12.జగల్లీలానాటకము. అన్నియు నాటకములని ప్రసక్తములు. యక్షగానములే. అముద్రితములే. అంతేకాదు. మొదటి ఆఱు మాత్రమే లభించినవి[183].

తెలుగు దేశమునందు కూచిపూడి వలె, తమిళదేశమునందు మెరట్టూరు భాగవతమేళనాటకములకు ఆటపట్టు. కూచిపూడి భాగవతులకు సిద్ధేంద్రయోగి వలె. మెరట్టూరు భాగవతులకు మెరట్టూరు వేంకటరామశాస్త్రియే కులపతి. ఇతని కాలము[184] 1798-1855 కావచ్చును.

**స్వాతి తిరునాళ్:** ఇతని కృతులు పదములు, జావళులు[185]. ఇతడు తిరవాన్కూరు మహారాజు. సంస్కృతాంధ్రమలయాళభాషలందు సంగీతవిద్వాంసుడు. వాగ్గేయకారుడు. జీవితకాలము 1813-47. పాలితకాలము 1829-47. ఇతని తెలుగు కృతులు అయిదు లభించినవి. "సామి నిన్నే", "చలమేల", "ఎంత వేడిన", "వలపు తాళవశమా", "ఇటు సాహసము లేల" అనునవి. ఉదాహరణములు:

పదము;

ప. "వలపు తాళవశమా నా సామికి
చలము సేయ న్యాయమా॥ ॥వలపు॥

అ.ప. అలరువిల్తుని సమానుడౌ శ్రీపద్మనాభుడు
నెలత యిపుడు నన్ను నిరాకరించెనే ॥ ॥వలపు॥

1చ. చిఱుత ప్రాయము నాడే చిగురుబోణి వాని
కరుణాసాగరుడని కలికి చాల నమ్మితి
మరుని బాణము చేత మగువ వా మనసెంతో
పరవశమాయెనే భాగ్య మిటులాయెనే॥ ॥వలపు॥

2చ. సోమకిరణము చేత సొగసైన నిన్నటిరేయి
రామరామ నాకు రమణి యుగ మాయెనే
కామకేళిలో నన్ను కలపియుండిన విభుఁడు

నా మీద నున్న నెనరు నాతి మఱచెనే " ॥వలపు॥

జావళి:

ప. "ఇటు సాహసములు ఏల నాపై చక్కని సామి ॥ ॥ఇటు॥
అ.ప. ఇటులు పగలు తాళ నా తరమా ॥ఇటు॥
1.చ. ఇక చిన్నదాన నేను మగవాని ముఖము నెఱు
గక నేనున్నాను వగకాడ నీకిది మేర
నాదే వలపు న్యాయమెరుగు నా సామి ॥ఇటు॥
2.చ. మనసు రంజితమయ్యే నీకు తగిన మగువతో
ఈ వగలుంచ వలను విని వేర నా పలుకులు
ఈ వేళను వింతలు చాలు చాలు నా సామి ॥ఇటు॥
3.చ. సరసిజనేత్రుడ నీ కరుణవల్ల బాల
యౌవనము వచ్చేనాఁడు మరుకేళిలోనే నిను
లాలింతు సరసపంకజనాభ నా సామి ॥ఇటు॥

ఇందు శైలి మృదుమధురము. తెనుగుదనము తేజరిల్లినది. శృంగారము సుకుమారము. స్వాతి తిరునాళ్ మళయాళదేశస్థుడైనను, తెలుగు భాషలో రచించుట విశేషము. సంఖ్యాబలము లేకపోయినను స్థాయిబలము కలదు. ఇతనికి పదకవితా రచనమున సహకరించిన వారు ఇద్దఱు భరతాచార్యులు. 1.పొన్నయ్య. 2.వడివేలు. పొన్నయ్య స్వాతి తిరునాళ్‌కు అంకితముగా తెలుగుభాషలో రచించిన ఆటతాళశబ్దము, త్రిశ్రశబ్దము కలవు. కనుక స్వాతి తిరునాళ్ తెలుగు పదకవితారచనమునందు పొన్నయ్య సహకరించుట సంభవము.

ఎల్లయ్య: ఇతని కృతి చంద్రతారావిలాసము. యక్షగానము. ఇందు ఎల్లయ "చేరదేశములోని సేలపురము చేరువనున్న ఉద్దండమల్లసముద్రమను గ్రామమున నుండు రామభద్రునిపౌత్త్రు"డని కలదు[186]. ఇతని గుఱించి కోలా శేషాచలము నీలగిరి యాత్రయందు ఇట్లు కలదు.

" కావేరి యావలి తీరంబున నుండు సత్రం బచ్చటి కొక్కింత తక్కువగ ముక్కాలు కోసెడు దవ్వున నున్న యీరోడమను నూరఁ గాపురం బున్న యెల్లయ్య యను విప్రునిచే నిర్మింపబడినయది . . . . . . . . . .
అయ్యుర్వీగీర్వాణుండు సంగీతసాహిత్యవిద్యాప్రవీణుండు గావునఁ దారాశశాంకప్రభృతికతిపయనాటకప్రబంధంబులు శృంగారాదిరసాను బంధంబులుగ రచియించియున్నవాఁడు. " (పుటలు20-21)

నీలగిరియాత్ర [redacted]కాలము 12-5-1846 - 13-1-1847. అప్పటికే ఎల్లయ కతిపయనాటకములు రచించినవాడు. కాఁబట్టి చంద్రతారావిలాసము రచనాకాలము 1840ప్రాంతము కావచ్చును.

చంద్రతారావిలాసము తారాశశాంకమే. అంతేకాదు. శేషము వేంకటపతి శశాంక

విజయములోని పద్యములకు అనుకరణములు కలవు.

మూవనల్లూరు సభాపతయ్య: ఇతని కృతులు పదములు[187]. ఇతడు మూవనల్లూరు నివాసి. మన్నారుగుడి, తంజావూరులందు ప్రసిద్ధుడు. మన్నారుగుడిలోని రాజగోపాలునిపై పదములు రచించుట వలన రాజమన్నార్గుడి సభాపతయ్య అని వ్యవహృతుడు. కాలము1860 ప్రాంతము.

సభాపతయ్య పదములందు గీతిమాధుర్యము. తెనుగుదనము, జాతి సమధికము. ఒక ఉదాహరణము:

" దారి చూచుచున్నది నీదు ప్రియతరళాక్షియౌ చిన్నది . . . .
వారిజముఖి నీవు వచ్చు వేళనుకొని కోరికతో రాజగోపాలసామి ॥నీదారి॥
వెన్నెల గాయగ వేడ్క, మీఱ మంచి సన్నజాజివిరిసరులుమ గంధము
పన్నీరుచెంబులు పడకింటిలోనుంచి, వన్నెలాడి తలవాకిట నిలిచి ॥నీదారి॥
ఏ వగనైనము ఎందు చప్పుడైన నీవో యని యెంచి నిలిచి తిరిగిచూచి
ఈ వగ చిత్తము నిచట నిలిపినట్టి, భావం బెవరికి బయలుగానీక ॥నీదారి॥
పచ్చిపచ్చిగా పదములు పాడుచు, వచ్చి రాజగోపాలసామీ నీవు
ముచ్చటలాడుచు ముద్దులు వెట్టుచు, గుచ్చి కౌగిటజేర్చి కూడుట దలచి" ॥నీదారి॥

మారుపెద్ది చెంగల్వరాయశాస్త్రి: ఇతని కృతులు 1.సుందరేశ్వర విలాసము. యక్షగానము. 2.చారులీలావిలాసము. పద్యకావ్యము. 3.ముద్దు కుమారశతకము. మూడును అముద్రితములు. ఇతని జన్మస్థలము చెంగల్పట్టు జిల్లాలోని మరకాణము దగ్గఱి పెరుంవేడు. చెయ్యూరు జమీందారుల సన్మానము లందినవాడు. వైద్యనాథుడను జమీందారు కోరికపై సుందరేశ్వరవిలాసము రచించెను. అది అక్షయసంవత్సరచైత్రమాసమునందు రచించినట్లు అందు కలదు[188]. ఇతని జీవితకాలము 1810-1900. అక్షయసంవత్సరము 1866. కాబట్టి సుందరేశ్వరవిలాసము రచనాకాలము 1866 వ సంవత్సరము, చారులీలావిలాసము రచనాకాలము 1870 వ సంవత్సరము, ముద్దుకుమారశతకము రచనాకాలము 1872 వ సంవత్సరము కావచ్చును.

సుందరేశ్వరవిలాసమునందు ఇతివృత్తము మీనాక్షీసుందరేశ్వరుల కల్యాణము. ఇందు చిత్రకవిత ఇతోధికవిశేషము. చెలికత్తెలు "నీ మగని పేరేమి?" అని అడిగిన, మీనాక్షి సమాధానమిది:[189]

" ఇభరాజగమన నా విభుని పేరడిగేవు
వివమ్మ చెప్పెద విశదముగను
తఱ్రితాడుగాఁ జేయఁదగు పాము పేరేమి?
కదలీ ద్రచ్చిన గొప్ప కవ్వమెద్ది?
పూలతేనియలను గ్రోలెడు పురువెద్ది?
అరదంబునకు ముందు నఱుచునెద్ది?
ఇలు నిండ వెలుఁగొందఁగల భూషణం బెద్ది?

విఘ్నేశ్వరుని చేత వెలయు నెద్ది?
అన్నిటికిఁ జూడ మూఁడేసి యక్షరములు
మధ్యవర్ణంబునందు నా మగనిపేరు
గానఁబడుచుండునమ్మ నా పైన మరసి
యిందఱకుఁ దెల్పఁ బల్కవే కుందరదన! "

ఇందు ఏమి? ఎద్ది? అను ప్రశ్నలకు, మూడక్షరముల సమాధానములు వరుసగ, వాసుకి, మందరం, ద్విరేఫం, అశ్వము, తరుణి, కుడుము. వీనిలోని మధ్యవర్ణములు సుందరేశ్వరుడు.

ఇది నాటకమని పేర్కొనబడినది. నాటకీయత కలదు.

చారులీలావిలాసము అసమగ్రముగ లభించినది. ఇందలి కథాసంవిధానము, కళాపూర్ణోదయములోని కథాసంవిధానమును సరిపోలునని ఒక అభిప్రాయము కలదు.[190] కాని, కళాపూర్ణోదయమునకు, చారులీలావిలాసమునకు హస్తిమశకాంతరము కలదు. చారులీలావిలాసమునందలి కథలోని[191] సుదర్శనభూపాలుని జపమాల, చారులీల-

" ఆడది చూచిన యెడ మగ
వాఁడై కనుపట్టుఁ బురుషవర్యుఁడు ప్రీతిన్
జూడఁగ నాడదియై కను
వేడుక లలరించు నదియు విస్మయలీలన్ "

అను విషయములు పయి అభిప్రాయమునకు నిమిత్తములు కావచ్చును. జపమాల కళాపూర్ణోదయములోని మణిహారము వంటిది కాదు. చారులీల స్త్రీలకు పురుషునిగ, పురుషులకు స్త్రీగ కనిపించుట వలన కథాప్రయోజనము లేదు. చిలుక రాయబారము, చారులీల విరహము, స్వయంవరము సగటు ప్రబంధసరణులు. అనుపలబ్ధభాగమునందు చారులీలాసారసధ్వజుల సంభోగశృంగారము వినా, కథాక్రమము నిరవకాశము. చారులీలావిలాసము చిత్రకథాకావ్యము మాత్రమే.

# కాలము తెలియని కవులు

**కవిధాటి బలభద్రయ:** ఇతని కృతి గజారణ్యసంహిత. క్షేత్రమాహాత్మ్య కావ్యము. ద్వితీయాశ్వాసమునుండి షష్ఠాశ్వాసమువఱకు అసమగ్రముగ లభించినది అముద్రితము. శ్రీగిరి గౌరరాజునకు అంకితము. అతడు చరిత్రకు అందని వ్యక్తి. గజారణ్యక్షేత్రమన జంబుకేశ్వరము. అచటి శంకరాచార్యమఠమునకు విజయరంగచొక్కనాథుడు దానమిచ్చిన శాసనకాలము 1780 వ సంవత్సరము కావున, గజారణ్యసంహితరచనాకాలము 1780 వ సంవత్సరమే అని ఒక అభిప్రాయము కలదు.[192] విజయరంగచొక్కనాథుని దానశాసనకాలమునకు, బలభద్రుని గజారణ్య సంహితరచనా కాలమునకు గల బాదరాయణసంబంధము దురవగాహము. కాలము తెలియని కవిగ పరిగణింపవలయును.

**సీనయ:** ఇతని కృతి షణ్ముఖసహస్రము. అముద్రితము. ఇతడు సంధిగ్రామ నివాసి. అది తిరునల్వేలి జిల్లాలోని తిరుసెందూరు కావచ్చును. కాలము తెలియని కవి.

షణ్ముఖసహస్రమునందు షణ్ముఖసహస్రనామావళి మాత్రమేగాక; లోకనీతులు, పురాణగాథలు, శాస్త్రచర్చలు, శ్లోకాంధ్రీకరణములు మొదలైనవి కలవు.[193] నూరేసి పద్యములు ఒక్కొక్క విభాగము.

**శృంగారకవి తిరుమలనాథము:** ఇతని కృతులు 1.నాసికేత పురాణము. 2.పరమభాగవతచరిత్రము. 3.పరమార్థదీపిక. 4.పద్మినీపరిణయము. 5.దేవమల్లుచరిత్రము. ఇందు నాసికేతపురాణము మాత్రమే లభించినది. అది కూడ అముద్రితము. ద్విపదకావ్యము. పెద్దగరిడియందు వెలసిన శ్రీకృష్ణునికి అంకితము. దైవాంకితము కృతిప్రేరకుడు తిమ్మాజెట్టి[194]. అతడు చరిత్రకు అందని వ్యక్తి. ఇతడు కాలము తెలియని కవి.

**బడగలనాటి నరసయ:** ఇతని కృతి నింబజామాహాత్మ్యము. ఏకవీరామాహాత్మ్యమని నామాంతరము. ద్విపదకావ్యము. అముద్రితము. ధేనువారము గరిడిలోని శ్రీరామునికి అంకితము. దైవాంకితము. కృతిప్రేరకుడు తొక్కడము మన్నారుజెట్టి[195]. అతడు చరిత్రకు అందని వ్యక్తి. ఇతడు కాలము తెలియని కవి.

**అక్కయ్య:** ఇతని కృతులు 1.భీమసేనవిజయము. 2.శ్రీకృష్ణలీలావిలాసము. రెండును యక్షగానములే. రెండిట "తిమ్మయదండనాథతనయుఁ డక్కయ సత్కృతం బై తనర్చు"నని మాత్రమే కలదు. రెండును తిరుపతి వేంకటేశ్వరునికి అంకితములు. దైవాంకితములు. మొదటిదానియందు "వేంకటరాయనికి" అని కలదు. రెండవ దాని యందు "శ్రీవేంకటేశ్వరుఁడైన శ్రీరంగపతికిన్" అని కలదు[196]. రెండు యక్షగానము లందును దక్షిణాంధ్రయుగయక్షగానముల భాష గాని, భావములు గాని, లక్షణములు

గాని లేవు. రెండవ యక్షగానమునందు "చలపోరు" అను శబ్దము మాత్రమే కలదు. అది నిర్ధారకసాధనము కాదుగాని, వేంకటేశ్వరుని శ్రీరంగపతి అనుట వలన దక్షిణాంధ్ర యుగకవి కావచ్చును.

**భీమసేనవిజయము:** ఇది తిక్కన భారతములోని కీచకవధఘట్టమునకు అనుసరణము. భాష గ్రాంథికము. భావములు సామాన్యము. రచనము పేలవము.

**శ్రీకృష్ణలీలావిలాసము:** ఇది పోతన భాగవతములోని శ్రీకృష్ణలీలలకు అనుసరణము. బాలకృష్ణుని దుండగములు, గోపికల మొఱమ్రొక్కులు కలవుగాని, విశ్వరూపప్రదర్శనము లేదు. గోపికావస్త్రాపహరణఘట్టమునందు గోపికల స్వగతములు, పొరిచూపులు (పుటలు289-94) రక్తి కట్టించును. రాసక్రీడ వస్తుతః రసరమణీయము. భాష గ్రాంథికము. ఒకటి రెండు మాత్రమే విశేషములు.

"ఘనతామసైంద్రజాలికుఁ
డొనరెడు కెంబట్టుబంతి యొక చేతను లే
దని యొకచే చూపిన క్రియ
వనజాప్తుఁడు గ్రుంకె వనజవైరియుఁ దోఁచెన్." పుట295.

"వెన్నుని యురమునఁ జేర్చని
చన్నులు వివరింప మొగలిచన్నులు, వానిన్
జెన్నలరఁ జూడకుండెడు
కన్నులు వివరింప నెమలికన్నులు దలఁపన్." పుట296.

**తిరుమెక్కొళ తిరువేంగళాచార్యులు:** ఇతని కృతి కూరత్తాళ్వారు చరిత్ర. యక్ష గానము. విల్లుపుత్తూరులోని నాగేంద్రశయానునికి అంకితము. ఇతడు విల్లుపుత్తూరి నివాసి కావచ్చును.[197] పదునేడవశతాబ్దికవి అని ఒక అభిప్రాయము కలదు.[198] ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

కూరత్తాళ్వారు రామానుజాచార్యుల శిష్యుడు. అతని చరిత్ర దివ్యసూరిచరిత్రము, ప్రపన్నామృతము, గురుపరంపరాప్రభావము, పరమయోగివిలాసము మొదలైన గ్రంథము లందు కలదుగాని, అందెందును లేని రెండు కథలు ఇందు కలవు.[199] యక్ష గానమైనను కవిప్రోక్తమైన కథ అధికము. పాత్రలచేత ప్రవర్తితమైన కథ అల్పము. తిలఘాతకికి కథ హాస్యరసాన్వితము. చోరకథ ఉదాత్తరసా న్వితము. కూరత్తాళ్వారు పాత్రచిత్రణము, అతని భార్య ఆండాళు పాత్రచిత్రణమును అద్భుతావహము.

తిలఘాతకి కూరత్తాళ్వారును రోకలితో పొడిచిన మహాపాతకి. రోకటిగింజలు వాలుగు కూరత్తాళ్వారు అక్షయపాత్రలో పడుట వలన పుణ్యము లభించును. మరణా వంతరము యముడు, "పాపమే యమభవించెదొ ముందఱ లేక పుణ్యమే చూడను ముమ్ము గోరెదవా" అనిన, తిలఘాతకి ముందు పుణ్యఫలమే కోరును. యముడు తిలఘాతకికి అవతిదూరము నుండి వైకుంఠము చూపించి, చూచితివని పలికించి, తీసికొని

రమ్మని భటులకు ఆజ్ఞాపించును. తిలఘాతకి తాను మహాపాతకి గనుక వైకుంఠము కనిపించుట లేదని, యమభటులే వైకుంఠప్రవేశము చేయించునట్లు వ్యవహరించి, వైకుంఠములో ప్రవేశించు సన్నివేశము హాసజనకము.

చోరుడు కూరత్తాళ్వారును, అక్షయపాత్రలోని విత్తమును అపహరించుటకు, వక్షస్థలమున కటారితో పొడుచును. కూరత్తాళ్వారు "దేహము నాత్మ నొగి నెడఁబాపి కడఁజేర్చెఁగాన" చోరుడు ఆత్మబంధువని, ఆచార్యుడని, పుణ్యుడని, మంత్రోపదేశము, జ్ఞానోపదేశము చేసి, పశ్చాత్తప్తుడైన చోరుని జ్ఞానపుత్రునిగ, శిష్యునిగ స్వీకరించి పరమపదించును. చోరుడు పుత్రునిగ కూరత్తాళ్వారునకు అగ్నిసంస్కారములు చేసి, గురుని "అక్షయపాత్ర విరిపియు తిరుమణి పడియములు, చేరములు" గుఱుతుగ తీసికొని, శ్రీరంగములోని కూరత్తాళ్వారి తిరుమాళిగ చేరి, కూరత్తాళ్వారు భార్య ఆండాళుకు జరిగినదంతయు వివరించును. అది తెలిపిన, భాగవతులు చోరుని దండింపబోవుదురు. ఆండాళు చోరుని "తన వెన్కనిడుకొని దండముల్ వెట్టి"

" పురుషుండు చనిన పిమ్మట
యిరవందఁగ సుతుఁడు ప్రోచు నెల్లసఖియలన్
గురుఁడు సనె పరమపదముకు
ధర నా సుతు చోరుఁ జంపఁ దగునే మీకున్" పుట33

అని దండింపవలదని వేడుకొనును. అంతేకాదు. శ్రీరంగధాముడు ప్రత్యక్షమై చోరుని సుతునిగా రక్షించినందుకు ఆండాళును ప్రశంసించి, "నీకు కోరుము వలసినది " అనిన, ఆండాళు -

" లోకనాయక! సద్భక్తలోకవరద!
మిమ్ము కనుఁగొంటిఁ గోర్కె లిమ్మెయి ఫలించెఁ
బతినిఁ గడతేర్చినట్టి యీ పరమపుణ్యుఁ
డైన చోరుని రక్షింపు మతిముదమున" పుట40

అని కోరును. కూరత్తాళ్వారు అంత మహోదాత్తుడు. అతని భార్య ఆండాళు ఇంత మహోదాత్త. వైష్ణవమాహాత్మ్యప్రతిపాదకమైనను, కూరత్తాళ్వారుచరిత్రము మహోదాత్తము. అంతేకాదు. తిలఘాతకి వికృతవర్ణనము వినా వికటహాస్యము, ప్రకట శృంగారము లేని ఉత్తమయక్షగానము.

గొట్టుముక్కల కృష్ణమరాజు: ఇతని కృతులు 1.సీతాకల్యాణము. యక్షగానము. 2.దశావతారచరిత్రము. ద్విపదకావ్యము. అముద్రితము. సీతాకల్యాణము రామభద్రునికి అంకితము. దైవాంకితము. ఇతడు రాజపాళయము నివాసి. ఇతని కాలము "17 వ శతాబ్ది తుది లేదా 18 వ శతాబ్ది ప్రారంభము " అని ఒక అభిప్రాయము కలదు[200]. ఆధారము లేదు. ఊహామాత్రశరణ్యము.

సీతాకల్యాణము ప్రసిద్ధమైన ఇతివృత్తము. వాల్మీకిరామాయణములోని

బాలకాండమునందలి విషయము. ఇందు దశరథుని పుత్రకామేష్టి, రామలక్ష్మణభరత శత్రుఘ్నజననము, విశ్వామిత్రాగమనము, తాటకవధ, అహల్యాశాపవిమోచనము, మిథిలా నగరప్రయాణము, శివధనుర్భంగము, సీతాకల్యాణము, పరశురామగర్వభంగము, అయోధ్యానగరప్రవేశము కలవు. పాయసవిభాగము,

" సగము కౌసల్యకును సగము లోపల
సగము తగనిచ్చె నా సుమిత్రాకాంత కెలమిన్
కైకేయికిచ్చె నుత్కంఠ నా సగములో
ప్రకటంబుగ సుమిత్రకు నిచ్చె " పుట10

అని కలదు. ఇందు స్పష్టత లేదు. వాల్మీకిరామాయణమునందు దశరథుడు సగము కౌసల్యకు, మిగిలిన సగములో సగము సుమిత్రకు, సుమిత్రకు ఇచ్చిన తర్వాత మిగిలిన దానిలో సగము కైకకు, కైకకు ఇచ్చిన తర్వాత మిగిలినది మఱల సుమిత్రకు ఇచ్చినట్లు కలదు. (27-29శ్లో.16స.)

దశరథుడు విశ్వామిత్రునితో, "చిన్నపాపఁడు వీఁడు కయ్యము నెఱుఁగఁ డెన్నఁడును మీ వెనుక నెట్లంపనేర్తున్" అనిన, విశ్వామిత్రుడు ఆగ్రహోదగ్రుడగును.

" ఏ నల్గినపుడె యీరేడులోకములుఁ
బూని భస్మీకరంబనఁ జేయలేనె
అని రోషతామ్రాక్షుఁడై వలుదిశలు
కమగొన జగములు కంపింప నపుడు
కటకట పెదవులు తాటించుకొనుచు
పెటపెట యని దంతపీడ యొనర్చి
కటములు పొంగ నుత్కటకోపుఁడగుచు
కటకట యని శిరఃకంపంబుఁ జేయ
కన్నుల విస్ఫులింగంబులు చెదర
వెన్నున జడముడి వీడి నటింప
రోషించు లయకాలరుద్రుని భంగి
భీషణాకారతఁ బేర్చి లేచుటయును" పుట 15

ఇది హరిశ్చంద్రోపాఖ్యానము ప్రభావము. తాటకవధకు,

" వనజనేత్రుఁడు దృఢవ్రత యనఁగ భృగుపత్ని
మొనసి చంపఁడె జగంబులు బాధ సేయన్
ఇంద్రుండుఁ జంపండె యిల మునుల బాధింప
సాంద్రరోషత విరోచను కూఁతు నెలమిన్ " పుట18

అను సమర్థనములు కలవు. అహల్య శిలారూపశాపమునకు హేతువు "ఇంద్రు నీ పతి పొందుట" అని ఇదమిత్థముగ కలదు. శివధనుర్భంగమునకు స్వయంవరసంద ర్భము లేదు. విశ్వామిత్రుడు జనకునితో,

" రాముండు నీ యింట సోమధరు విల్లుంట
ప్రేమమునఁ గనుఁగొంటకై మెరసి వచ్చెన్" పుట28.

అనిన, జనకుడు అప్పుడే "విల్లు దెప్పింప నుద్యోగపడు"ను. "రేపు చూతము గాక" అని విశ్వామిత్రుడు సంధ్యాదిక్రియలు నిర్వర్తింపనరుగును.

రాముడు వచ్చునప్పుడే సీత సఖీసమేతముగా సౌధము మీదినుండి చూచి, రాముని సౌందర్యమునకు ముగ్ధురాలగును. (పుట6) ఆ రాత్రి విరహము నందును. శిశిరోపచారములు సాగును.

" మేడ మీఁదట నుండి రాముఁడు చూడనేలా - మదనుఁడు -
గూడి పుష్పశరంబు నేయఁగఁ గుందనేలా
రాముఁడెన్నఁడు విల్లు విఱుచును ప్రేమ మీరా - యెన్నఁడు -
తామసింపక నన్నుఁ గలయును దయ దలిర్పన్ " పుట31

అని పరితపించుటయేగాక; చంద్రుని, చందనాచలమందానిలుని, మన్మథుని నిందించి "కరకు వెన్నెలలోనఁ బడి వడిఁబొరలు"ను. (పుటలు31-32.) ఇదియెల్ల ఏనుగు లక్ష్మణకవి రామవిలాసము ప్రభావము.

సీతారాముల వివాహము తెలుగు వివాహమే. వధూవరుల మంగళస్నానములు, మంగళహారతులు తోపాటు "స్త్రీలు కొట్లములు దంచు"ట (పుటలు40-41) " సుముహూర్తంబునఁ దెర యెత్తు"ట (పుట46) అరుంధతి, అనసూయ ధవళములు పాడుట (పుట46) భూసురాంగనలు శోభనము పాడుట (పుట47) "అరణంబిచ్చు"ట (పుట48) మొదలైనవి కలవు.

పుర (పుట6), సూర్యాస్తమయాదిసూర్యోదయపర్యంత (పుటలు29-30,33), విరహ (పుటలు31-33) వివాహ (పుటలు37-50) ప్రభృతివర్ణనములు కలవు. మొత్తము మీద సీతాకల్యాణము సగటు యక్షగానము.

గొట్టుముక్కల కుమార పెద్దిరాజు: ఇతని కృతి సావిత్రీచరిత్రము. యక్షగానము. రామాంకితము. ద్విపదాంకితము. ఇతడు కృష్ణమరాజసత్కవికి, రంగాంబకు సుతుడు. (పుట106.) కృష్ణమరాజసత్కవి సీతాకల్యాణము రచించిన గొట్టుముక్కల కృష్ణమరాజా. అతని కాలము తెలియదు. ఇతని కాలము తెలియదు.

సావిత్రీచరిత్రము ప్రసిద్ధమైన ఇతివృత్తము. భారతారణ్యపర్వములోని సావిత్ర్యుపాఖ్యానము. ఇందు ఆదిలోనే హంసపాదు వలె ఆరంభమునందు గ్రంథపాతము కలదు. శిథిలములైన స్థలములును అధికము. మద్రపతి లక్షణభద్రుడని, అతని భార్య మాళవి అని కలదు. సావిత్రి నవయౌవనవతి కాగానే వివాహప్రయత్నము జరుగును. చిత్రకారులు రాకుమారుల చిత్రపటములు ప్రదర్శింతురు. సావిత్రి సత్యవంతుని చిత్రపటము చూచి సమాచారమడుగునెడ, నారదుడు వచ్చి, "జనని జనకులఁ గూడి యడవిన్ . . . . భ్రష్టుఁడై చరించును . . . . . పూజ్యు మాయువు నేటి

మీఁదట బొంకు గాదు . . . . ఒరు వరియింపఁబనుపుము సుత" నని మద్రపతికి చెప్పిన, సావిత్రి పతివ్రతాధర్మములు వర్ణించును. సావిత్రీసత్యవంతులకు వివాహము జరుగును. అనంతరకథ భారతకథానుసారియేకాని, వరప్రదానమునందు వ్యత్యాసము కలదు. సావిత్ర్యుపాఖ్యానమునందు యముడు మొదట సాళ్వపతికి దృష్టి, పిదప సాళ్వపతికి రాజ్యము, తరువాత మద్రపతికి పుత్రశతము వరుసగ వరము లిచ్చును. సావిత్రీచరిత్రమునందు సాళ్వపతికి దృష్టి, రాజ్యము; మద్రపతికి పుత్రశతము ఒక్కసారే ఇచ్చును. (పుట120) సావిత్ర్యుపాఖ్యానమునందు యముడు నాల్గవసారి "అభీష్టంబైన వరంబొక్కటి యిచ్చెద వేఁడు" మనిన, సావిత్రి "సత్యవంతుని ప్రాణంబులు దక్క" అను మాట లేనందున సత్యవంతుని పునర్జీవితుని చేయుమని కోరును. యముడు చేయును. సావిత్రీచరిత్రమునందు యముడు మూడువరములును ఒక్కసారే ఇచ్చి, అంతర్ధానమైన, సావిత్రి "ఏమ పతివ్రతనేని కృతాంతుఁడు కానుపించు నాకు" అనిన యముడు ప్రత్యక్షమగును. "వరము గోరు వరుని దక్క" అనిన, సావిత్రి పుత్రశతమును కోరును. యముడు అనుగ్రహించును. సావిత్రి "నగవు మిగుల" -

" ధర్మరాజవయ్యుఁ దగుఁ దగదని గాన
కిట్లు పలుకనగునె హేయమనక
వరము గొనుచు నేఁగి వరహీననై యెట్లు
పుత్రశతముఁ గాంతుఁ బూతచరిత " పుట121

అని వివరించిన, సావిత్రి ప్రౌఢిమకు సంతసించి, యముడు సత్యవంతుని పునర్జీవితుని చేయును. ఇది జానపదగేయప్రభావము.

సావిత్రికి బ్రహ్మవిష్ణుమహేశ్వరులు, ఇంద్రుడు వరము లిచ్చుట అదనము.

**గొట్టుముక్కల సింగరాజు:** ఇతని కృతి పారిజాతాపహరణము. యక్షగానము. సీతారామాంకితము. దైవాంకితము. ఇతని పితామహుడు కుమార పెద్దిరాజసుకవి. తండ్రి కృష్ణరాజు. తల్లి పెద్దమాంబ లేక పెద్దాంబ. (పుటలు58,100.) కుమార పెద్దిరాజసుకవి అన సావిత్రీచరిత్రము రచించిన గొట్టుముక్కల కుమార పెద్దిరాజు. కృష్ణరాజు కీర్తి వర్ధిష్ణుడనియే కాని కవి అని లేదు. ఇతడు సీతాకల్యాణము రచించిన గొట్టుముక్కల కృష్ణమరాజు కాడు. అతని తండ్రి వరదరాజు. ఇతని తండ్రి కుమారపెద్దిరాజు. వరదరాజు తండ్రి పెద్దిరాజు కావచ్చునుగాని, కుమారపెద్దిరాజు కాడు. కుమారపెద్దిరాజు మనుమడు సింగరాజు.

కవులకు స్వప్నమునందు కన్నతండ్రియో, ఇష్టదైవమో - సాక్షాత్కరించి కృతిప్రసంగము చేయుట పరిపాటి - సింగరాజునకు స్వప్నమునందు "సత్యభామ కృష్ణసహితయై" సాక్షాత్కరించుట అపూర్వవిశేషము. అంతేకాదు. సత్యాకృష్ణులు "పారిజాతాపహరణయక్షగానంబు సీతారామాంకితంబు గావింపు"మనుట అంతకంటె అత్యపూర్వవిశేషము. (పుట59).

సింగరాజు పారిజాతాపహరణయక్షగానము, నంది తిమ్మన పారిజాతాపహరణ కావ్యమునకు రూపాంతరీకరణము. పారిజాతాపహరణప్రబంధములోని పాదతాడన ఘట్టము మాత్రము, సింగరాజు పారిజాతాపహరణయక్షగానమునందు లేదు. కడమ సమానము. నంది తిమ్మన పద్యములు జంపెలు, ద్విపదలు, అర్ధచంద్రికలు, ఆటతాళ ములు మొదలైనవిగ రూపొందినవి.

జంపె: "ఏ వేళ నే యింతి యే లీలఁ గోరునో
ఆ వేళ నా యింతి కవి దెచ్చి యిచ్చున్
ఏ యింటఁ జూచినా నెలమి మెలంగుచు పెక్కు
మాయావినోదరూపాయత్తుఁ డగుచున్" పుట62

ద్విపద: " ఇది భీష్మపుత్రికి నిచ్చినఁ గినుక
మది సత్యభామ యేమని యెంచునొక్కొ
యెల్లిదముం జేసి యిది సత్యకంపఁ
జెల్లదువో యిందు చెలఁగి నే నున్కి " పుట66

అర్ధచంద్రికలు: " తల వాంచియు ముసుం గెలమి . . . .
. . . కనుల బాష్పోదకణములు రాల్చెన్
వేడి యూర్పు లల్లె పోడిమి మించెన్" పుట71

ఆటతాళము: "మానమె భూషణము లెంతయు మానినులకున్ తలంపంగ
మానమె ప్రాణాధికంబగు మగువలకును" పుట73

పారిజాతాపహరణప్రబంధములోని మాధ్యాహ్నికవిధులు, సూర్యాస్తమయాది సూర్యోదయపర్యంతవర్ణనము, వైతాళికగానము, అమరావతీప్రయాణము, యుద్ధము, పారిజాతాహరణము, పుణ్యకవ్రతము పారిజాతాపహరణయక్షగానమునందు కలవు. సత్యభామ వచస్సంధానము బదులు శరసంధానము విశేషము.

# దక్షిణాంధ్రయుగవైలక్షణ్యము

తెలుగు ప్రదేశమునందు గాక, తమిళ, కర్ణాటక ప్రదేశములందు తెలుగు సాహిత్యము తేజరిల్లినది. తంజావూరు, చెంజి, మధుర, మైసూరు, పుదుక్కోట పాలకులు కవిపోషకులు. కొందఱు స్వత: కవులు. మఱి కొందఱు పరత: కవులు. వివరములు పూర్వోక్తము. అరయునది. అనుసంధించునది.

కవులు సమర్థులు. స్వతంత్రులు కారు. ప్రభుభక్తిపరాయణులు; ప్రభుదాస్య పరాధీనులు. కవయిత్రులు ఆశుకవితాప్రవీణలు, సమస్యాపూరణసమర్థలు మాత్రమేగాక, కావ్యనిర్మాణధురీణలు. వివరములు పూర్వోక్తము అరయునది. అనుసంధించునది.

వివిధప్రక్రియలు విలసిల్లినవి. పద్యకావ్యము వలె వచనకావ్యము వైభవము నందినది. పదకవిత్వము పట్టము గట్టుకొన్నది. పద్య, గద్య, పదకవిత్వముల త్రివేణి యక్షగానము నాటకప్రాయమైనది. ద్విపద, చాటుశతకోదాహరణకావ్యములును కలవు. వివరములు పూర్వోక్తము. అరయునది. అనుసంధించునది.

భాష వ్యాకరణమును అతిక్రమించినది. గ్రాంథికభాష తోపాటు వ్యావహారిక భాష సాహిత్యగౌరవము నందినది. ఆ వ్యావహారికభాష కూడ చాలవఱకు పాత్రోచిత భాష. వివరములు పూర్వోక్తము. అరయునది. అనుసంధించునది.

వస్తువు పురాణగతము. చరిత్రయుతము. సమాజస్థితము. పౌరాణిక ప్రతిపత్తి సన్నగిల్లినది. ప్రభుభక్తిపరాయణత, ప్రభుదాస్యపరాకాష్ఠదశ పరిఢవిల్లినవి. చరిత్ర చరితార్థమయినది. సమాజము సాక్షాత్కారమైనది. వివరములు పూర్వోక్తము. అరయునది. అనుసంధించునది.

భావము గతానుగతికము. జాతివార్తాచమత్కారములు, ప్రతిపద్య చమత్కారములు ప్రముఖమైనవి. కతిపయప్రయోగములు కలవు. వివరములు పూర్వోక్తము. అరయునది. అనుసంధించునది.

శృంగారరసమునకు శృంగములు వచ్చినవి. పారదారికశృంగారము పారాయణమైనది. హాస్యరసము లాస్యమాడినది. అశ్లీలత, అపభ్రంశ, అపహ్వాత అందల మెక్కినవి. భక్తిరసము భాసించినది. భక్తియందును రక్తి ముద్రపడినది. శాంతరసము ప్రశాంతమైనది. వివరములు పూర్వోక్తము. అరయునది. అనుసంధించునది.

స్థానికవిశేషములు సకృన్మాత్రము. స్థానికప్రకృతిచిత్రణము సమృద్ధిప్రాయము. సమకాలికసమాచారము సమధికము. కడపటిది గ్రంథస్థము కాని కృతి అరుదు. వివరములు పూర్వోక్తము. అరయునది. అనుసంధించునది.

సత్కావ్యములు స్వల్పము. అసత్కావ్యములు అత్యధికము. సద్యఃపరనిర్వృతి సముజ్జ్వలము. ఉపదేశము పూజ్యము. ఉత్థానస్థితి కంటె పతనావస్థ మిన్న. ఇది క్షీణలక్షణము.అరయునది. అనుసంధించునది.

# సంఖ్యాసూచిక

1. రఘునాథనాయకాభ్యుదయము. & రఘువాథాభ్యుదయము. 1951. పీఠిక. పుటలు 12 -13.
2. పైది. పుట 11.
3. Maratha Rule in carnatic 1944 PP 221,236, 243, 244,314,318.
4. A History of South India. 1984. P. 288.
5. Ibid.
6. History of the Nayaks of Madura. 1924.
7. దాక్షిణాత్యాంధ్రసాహిత్యము. 1967 పుటలు 10-11.
8. దక్షిణదేశీయాంధ్రవాఙ్మయము. ద్వితీయముద్రణము. 1960. పుట 409.
9. A. Mythic Society Quarterly Vol. xii. No. 4 July, 1923. P. 738.
   B. History of Mysore. 1943 PP 462, 514.
10. Sources of Vijayanagara Empire. 1919 P 269.
11. తంజాపురాంధ్రనాయకరాజచరిత్రము. 1932 పుట 196.
12. As 10.
13. దక్షిణాంధ్రయుగవాఙ్మయచరిత్ర. 1955 పుట 196.
14. సిరిప్రగడ ధర్మయ వలచరిత్రము. విమర్శనాత్మకపరిశీలన. 1990పుట122.
15. ఏడు వలె. పుట 80.
16. ఒకటి వలె. Introduction PP 28 - 30.
17. Camatkara Candrika 1969 Introduction PP xxxv - xxxvii.
18. ఆంధ్రకవితరంగిణి. పంద్రెండవ సంపుటము. 1958. పుట 45.
19. ఏడు వలె. పుటలు 73 - 74.
20. పదునెన్మిది వలె. పుటలు 46 - 47.
21. సారంగధరచరిత్రము. చిత్రభాను. విజయదశమి. పుటలు 6 - 14.
22. పైది. 1967 పీఠిక. పుట 1.
23. పదునెన్మిది వలె. పుటలు 47 - 48.
24. పైది. పుటలు 44 - 45.
25. Proceedings of Andhra Pradesh oriental conference 1979 pp 65 - 66.
26. ఒకటి వలె. పీఠిక. పుటలు 30-31.
27. పైది. పుట 52.
28. పైది. పుట 20. అ. సూ. 1.

29. పైది. పుట 21. అ. సూ. 1.
30. రాజగోపాలవిలాసము. 1951. పీఠిక. పుట 48.
31. తెలుగు విజ్ఞాన సర్వస్వము. తృతీయ సంపుటము. 1959. పుట 419.
32. మన్నారుదాసవిలాసము. 1962. భూమిక. పుటలు iv -vi
33. యక్షగానములు (తంజావూరు) సంపుటము ౧. 1955. ఉపోద్ఘాతము పుటలు i- ii.
34. ఎనిమిది వలె. పుటలు 164 - 66.
35. ఆంధ్రకవిసప్తశతి. 1956. పుటలు 213 - 214.
36. ఏడు వలె. పుటలు 10 - 11.
37. పైది. అ. సూ. పుటలు 11 - 13.
38. రాయవాచకము. 1982. పీఠిక. పుట iv.
39. పైది.
40. పైది.
41. పైది. Forward. PP 7 - 12; పీఠిక. పుట v.
42. పైది.
43. పైది.
44. పైది. పీఠిక. పుట vii.
45. పైది. పుట ix.
46. పైది.
47. పైది.
48. ఏడు వలె. పుట 92.
49. శ్రీకృష్ణదేవరాయదినచరి. 1983. Dairy of Srikrishnadevaraya. P. V.
50. ఏడు వలె. పుట 93.
51. ముప్పది యెన్మిది వలె. పుట xiii.
52. A Discriptive Catalogue of the Telugu Manuscripts in the Tanjor Maharaja Sarfozi's Saraswathi Mahal Library. 1935. pp.279-280.
53. ఎనిమిది వలె. పుట 321.
54. ముప్పది మూడు వలె. సంపుటము 3. 1957. పీఠిక. పుటలు ii-iii.
55. ఆంధ్రయక్షగానవాఙ్మయచరిత్ర. 1961 ద్వితీయభాగము. పుట 302.
56. ఎనిమిది వలె. పుట 193.
57. ముప్పది మూడు వలె. సంపుటము ౭. 1972. ఉపోద్ఘాతము. పుట x.
58. ఏబదియైదు వలె. పుట 317.

59. పైది. పుటలు 302 -303.
60. క. భారతి. 1953 డిశంబరు. పుట 500.
చ. ఏబదియైదువలె. పుట 299.
ట. తెలుఁగు వాఙ్మయము - సంగ్రహచరిత్ర. 1960. పుట 109.
61. పై 'చ' వలె. పుటలు 299 - 301.
62. A. A Discriptive Catalogue of Sanskrit Manuscripts, Tanjore Saraswathi Mahal Library Kavyas. Vol. viii p.p. 3275-77.
క. ఎనిమిది వలె. పుటలు 212 - 213.
63. పై 'క' వలె. పుట 212.
64. As 52. Vol. II. p.p. 59, 83 - 85, 87 - 88.
65. As 52. p.p. 173 - 174 & Vol. II. p.p. 83 - 84.
66. As 64. p.p. 85 - 87.
67. Ibid p.p.78 - 82.
68. Ibid p.p.78 - 81.
69. తెలుగు సాహిత్యచరిత్ర. తృతీయభాగము. 1994. పుటలు 202 - 203.
70. ఎనిమిది వలె. పుట 227.
71. ద్విపదసాహిత్యచరిత్ర. 1979. పుట 416.
72. ఏబదియైదు వలె. పుట 474.
73. అరువది తొమ్మిది వలె. పుటలు 478 - 483.
74. ఏబదియైదు వలె. పుటలు 275 - 277.
75. పైది. పుటలు 278 - 279.
76. ఎనిమిది వలె. పుట 449.
77. History of Mysore. Vol. II p.p. 1 - 17.
78. ఏబదియైదు వలె. పుటలు 280 - 284.
79. ఎనిమిది వలె. పుటలు 458 - 464.
80. ముప్పది మూడు వలె. సంపుటము. ౧౧. 1976. ఉపోద్ఘాతము. పుట xv.
81. ఏడు వలె. పుట 94.
82. ఎనిమిది వలె. పుట 329.
83. భారతి. 1952. ఫిబ్రవరి పుట 3.
84. ఎనిమిది వలె. పుట 330.
85. అరువది తొమ్మిది వలె. ద్వితీయభాగము. 1992. పుట 259.
86. రాధికాసాంత్వనము. ఏకాశ్వాసము. 1953. పీఠిక. పుట ii.
87. అహల్యాసంక్రందనము. 1976. అనుశీలనము. పుట 4.

88. ఎనిమిది వలె. పుట 349.
89. ఆంధ్రవాగ్గేయకారచరిత్రము. 1975. పుటలు 288 - 289.
90. ఎనిమిది వలె. పుటలు 383 - 391.
91. పైది. పుట 393.
92. పైది. పుటలు 400 - 401.
93. ఏడు వలె. పుటలు 98 - 100.
94. ఎనిమిది వలె. పుట 477.
95. గద్యచింతామణి. మొదటి భాగము. 1933. పుట 8.
96. ఆంధ్రగద్యచంద్రిక. 1966. పుటలు 239 - 244.
97. అరువది తొమ్మిది వలె. పుటలు 437 - 441.
98. తొంబదియారు వలె. పుటలు 221 - 225.
99. పైది. పుటలు 225 - 231.
100. ఆంధ్రవచనవాఙ్మయము. ఉత్పత్తి వికాసములు. 1974. పుటలు 548 - 551.
101. As 64. pp. 74 - 77.
102. ఎనుబది తొమ్మిది వలె. పుట 283.
103. పైది. పుట 284.
104. పైది.
105. పైది. పుట 302.
106. పైది.
107. పైది.
108. భారతి. 1938. మార్చి పుటలు 236 - 241.
109. ఆంధ్రకవులచరిత్రము. 1899. తృతీయభాగము పుట 465.
110. రాధికాసాంత్వనము. 1960. పుటలు 5 - 7.
111. పైది. 1972 పుట xxxiii.
112. పైది.
113. ఎనిమిది వలె. పుటలు 286 - 287.
114. As 64 pp. 17 - 19.
115. ఏడు వలె. పుటలు 72 - 73.
116. ఎనిమిది వలె. పుటలు 412 - 413.
117. పైది. పుటలు 533 - 539.
118. పైది. పుట 435.
119. పైది. పుటలు 539 - 541.
120. పైది. పుటలు 419 - 422.

121. పైది. పుట 427.
122. ఏబది యైదు వలె. పుట 332.
123. ఎనిమిది వలె. పుట 428.
124. పైది.
125. పైది. పుట 429.
126. పైది. పుట 431.
127. పైది. పుటలు 529 - 531.
128. పైది. పుటలు 541 - 542.
129. పైది. పుటలు 531 - 532.
130. పైది. పుట 444.
131. పైది. పుట 445.
132. పైది. పుటలు 444 - 445.
133. పైది. పుట 446.
134. ఏబదియైదు వలె. పుట 274.
135. పదునెన్మిది వలె. పదియవసంపుటము. 1953. పుట 183.
136. పైది.
137. ఒకటి వలె. పీఠిక. పుటలు 27 - 31.
138. అరువది తొమ్మిది వలె. పుట 305.
139. ఎనిమిది వలె పుట 377.
140. పైది.
141. పైది. పుట 375.
142. As 64. p. 218.
143. ఎనిమిది వలె పుట 236.
144. As 52 p.p. 42 -46.
145. ఎనిమిది వలె. పుట 378.
146. నూట తొమ్మిది వలె. పుట 416.
147. ఎనిమిది వలె. పుట 492.
148. ఎనుబదితొమ్మిది వలె. పుటలు 163 - 164.
149. పైది. పుట 163.
150. ఏబదియైదు వలె. పుట 285.
151. ఎనుబది తొమ్మిది వలె. పుటలు 179 - 180.
152. ఎనిమిది వలె. పుట 497.
153. పైది. పుటలు 497 -498.

154. పైది. పుట 498.
155. ఎనుబదితొమ్మిది వలె. పుట 288.
156. పైది.
157. ఎనిమిది వలె. పుట 403.
158. పైది. పుట 402.
159. ఏబదియైదు వలె. పుట 327.
160. ఎనిమిది వలె. పుట 152.
161. ఏబదియైదు వలె. పుటలు 46 -48.
162. పైది. పుట 48.
163. పైది. పుట 327.
164. పైది.
165. పైది. పుట 328.
166. పైది.
167. ఎనిమిది వలె. పుట 408.
168. పైది. పుట 407.
169. పైది. పుట 405.
170. నూటతొమ్మిది వలె. పుట 455.
171. ఎనిమిది వలె. పుట 234.
172. ముప్పదిమూడు వలె. సంపుటము ౧౦ 1976. ఉపోద్ఘాతము. పుట xxii.
173. పైది. పుట xii.
174. ఎనిమిది వలె. పుట 234.
175. త్యాగరాజా కవిత్వము. 1988. పుట 3.
176. పైది. పుటలు 10 - 11.
177. ఏబదియైదు వలె. పుట 341.
178. ఎనుబది తొమ్మిది వలె. పుట 341.
179. పైది. పుట 340.
180. పైది. పుటలు 358 - 360.
181. Journal of the Madras University Vol. X. No. 1. p. 153.
182. ఎనుబది తొమ్మిది వలె. పుటలు 307 - 308.
183. ఏబదియైదు వలె. పుట 336.
184. పైది.
185. ఎనుబది తొమ్మిది వలె. పుటలు 385 - 90.
186. ఎనిమిది వలె. పుట 405.

187. ఎనుబది తొమ్మిది వలె. పుటలు 362 - 365.
188. ఏబదియైదు వలె. పుటలు 348 -349.
189. ఎనిమిది వలె. పుట 511.
190. పైది. సాహిత్యసమీక్ష. పుటలు 71 - 72.
191. మానవల్లికవి - రచనలు. 1972. పుటలు 175 - 178.
192. ఎనిమిది వలె. పుటలు 401 - 402.
193. పైది. పుట 404.
194. పైది. పుట 289.
195. పైది. పుట 291.
196. ముప్పదిమూడు వలె. సంపుటము. ౪. 1959 పుట 279.
197. కూరత్తాళ్వారుచరిత్ర. 1987. పీఠిక. పుట 5.
198. పైది. పుట 4.
199. పైది. పుట 6.
200. రాజపాళయం రాజకవుల యక్షగానములు. 1981. మున్నుడి. పుట 6.

# కవిత్రయయుగము

ఆంధ్రవాఙ్మయరంగమున నేటివరకు ఆ యా విషయములపై సాగిన అనేకానేకచర్చలను, చారిత్రకాధారములను, శాసనప్రమాణములను నిశితముగా పరిశీలించి, పరిశోధించి, రెండు పుష్కరముల కాలము సాహితీరసతరంగములలో నిరంతరము మునిగి తేలుచు, పఠనపాఠనకార్యక్రమమును పాటించుచు వచ్చిన ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు, తమ పదవీవిరమణానంతరము యు. జి. సి. ఎమెరిటస్ ఫెలోగా తెలుగు సాహిత్యచరిత్రను రచించుటకు పూనుకొనుట అత్యంత ముదావహము. వీరి అనుభవసారము పిండితార్థమై సాహిత్యవిద్యార్థులకు, జిజ్ఞాసువులకు పసందైన విందు అగును.

ఆంధ్రసాహిత్యచరిత్ర విద్యార్థిలోకమునకు ఏ తీరులో ఉండవలెను? ఏ శైలిలో ఉండవలెను? అను విషయమును, ఆంధ్రవిశ్వవిద్యాలయము తెలుగు శాఖ ప్రథమాధ్యక్షు లైన పింగళి లక్ష్మీకాంతముగారు, కవులను యుగకర్తలగా గౌరవించి, సాహిత్యచరిత్రను సరళసుందరశైలిలో పవదరించిరి. అది వ్రాతప్రతి గానే పెక్కేళ్లు సాహిత్యవిద్యార్థులకు, అధ్యాపకులకు హస్తామలకమైనది. అదే శాఖలో ఆచార్యులైన శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి గారు మహాకవులపరమైన యుగవిభజనమే ఉత్తమమైనదిగా భావించి, నిరూపించి, తెలుగు సాహిత్యచరిత్రమ క్రొంగ్రొత్తగా ఉత్తంసమైన ఉపపత్తులతో, విశిష్టమైన వివరణలతో, నూత్నపరిశోధితాంశములతో సర్వాంగసుందరముగా తీర్చిదిద్దిరి.

"మహి మున్ వాగనుశాసనుండు సృజియింపన్" అని రామరాజభూషణుడు ప్రశంసించినను, వాగనుశాసనునికి ముందు తెలుగు భాషాఛందస్సుల స్వరూప స్వభావములు తెలియపరచు వాఙ్మయము అధికముగానే ఉన్నది. ఆ విషయము ఈ పుస్తకములో కూడినంత విపులముగా వివరణ పొంది ఉన్నది. నన్నయకు పూర్వము ఆంధ్రదేశములోని భౌద్ధజైనకావ్యముల విషయము కూడ ఈ గ్రంథములో కూలంక షముగా చర్చింపబడినది. పరంపరగా చెప్పుకొను విషయములలో ఆంధ్రరాష్ట్రమునకు దగ్ధరాష్ట్రమను పేరు ఉండెడిదమట ఒకటి. ఆ పేరు ఉండెననుటకు ఆధారము మృగ్యమని; వేంగిదేశమునకు మాత్రమే, అది కూడ నన్నయ తర్వాతనే దగ్ధరాష్ట్రమను పేరు వచ్చుటకు అవకాశమున్నదని శాసనప్రమాణముతో నిరూపింపబడినది.

మహాభారతసంహితారచనబంధురుడైన నన్నయకు నారాయణభట్టు తోడయి నిర్వహించుటను బట్టి కొందరు విమర్శకులు వారిరువురు జంటకవులని తలంచిరి. అది వాస్తవము కాదని నిర్ధరింపబడినది. ఒక కవియొక్క ఒకానొక కవితాలక్షణమును ఆ కవియే పేర్కొన్నప్పుడు, ఆ లక్షణ మా కవి కవితలో సయమన్వయింపవలసియున్నది. నన్నయ ప్రసన్నకథాకవితార్థయుక్తికి ప్రసన్నకథాకలితార్థయుక్తి అనుపాఠాంతరమును గ్రహించి ఇచ్చిన ఉదాహరణములే గతానుగతికముగా పఠనపాఠవాదులయందు చోటు చేసికొన్నవి. ప్రసన్నకథాకవితార్థయుక్తి అను పాఠమే కవిహృదయమని అర్థ, యుక్తిశబ్దముల

నన్నయ ప్రయోగాంతరములనుబట్టి నిర్ణయించి సమన్వయింపబడినది. అక్షరరమ్యత కుంతకుడు ప్రతిపాదించిన వర్ణవిన్యాసవక్రత అని వివరింపబడినది. నన్నయ ప్రసన్నకథాకవితార్థయుక్తి, అక్షరరమ్యత ఉన్నంత, కన్నంత విప్పిచెప్పగల శక్తి కలిగించు వివరణ మీ గ్రంథమునందు కలదు.

"భక్తిమీఁది వలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుఁ బాయంగలేమ నే బసవలింగ" అని మల్లికార్జునపండితుడు అన్నట్లు పరంపరగా వ్రాయుచున్నారు. కాని ఈ సీసపాదము నకు ఆకరము మృగ్యము. పై వాక్య మాధారముగా మల్లికార్జునపండితుని చూచిన దృష్టిని మార్చుకొనవలసిన అవసరము, మల్లికార్జునపండితుని గ్రంథమునుబట్టి వివరింపబడినది. పాల్కురికి సోమన కాలమును గూర్చి వంద సంవత్సరములు ఇటునటు జరుపు వాదము లున్నవి. అవియెల్ల పరిశీలించి, చారిత్రికాధారముల తోపాటు ఆంతరంగిక సాక్ష్యములను కూడ జతకూర్చి ఇందు నిర్ణయింపబడినది. పాల్కురికి సోమనాథుని కవితారీతులు, పాండిత్యప్రతిభలు, మతోద్యమతీవ్రతలు విశదీకరింప బడినవి. చక్రపాణి రంగనాథుని కృతుల గూర్చి, యథావాక్కుల అన్నమయ్య పూర్వకవితాచర్వణము గూర్చి ప్రత్యేకముగ వివరింపబడినది.

ఆంధ్రకవులలో తిక్కన ధ్రువతార. తిక్కన పునరుద్ధరించిన హరిహరనాథ తత్త్వము ప్రత్యేకవివరణము కోరునట్టిది. తిక్కన భారతరచన సామాన్యముగా చేయలేదు. "మహాకవిత్వదీక్షావిధినొంది.. రచించెద"నని చెప్పుకొనినాడు. ఆ మహాకవిత్వదీక్షావిధి స్వరూపస్వభావము లెట్టివి? అనునది సాహిత్యవిద్యార్థులకు, జిజ్ఞాసువులకు తెలియవలెను. ఇట్టి కవుల స్వీయవచనముల వివరణము సోదాహరణనిరూపణమును అత్యంతావశ్య కములైన విషయములు. ఈ రీతి వివరణలతో, నిరూపణలతో ఈ గ్రంథము పరమప్రయోజనకారి.

సాహిత్యచరిత్రకారులకు పాఠనిర్ణయము ప్రధానవిషయము కాకపోవచ్చును. కాని ప్రకరణార్థమునకు, కవిహృదయమునకు, పాత్ర పరమార్థమునకు ఆఘాతము కలిగించు పాఠముల విషయము ప్రస్తావించుట అవసరమే. తిక్కన భారతములోని "ఈ వెండ్రుకలు వట్టి యీడ్చిన యీ చేయి" అని ద్రౌపది చెప్పిన సీసపద్యము అతి ప్రసిద్ధము. అందులో "అలుపాలఁ బొనుపడునట్టి చిచ్చే యిది" అను వాక్యమున్నది. అల్పశబ్దమునకు అలుపము ప్రసిద్ధరూపాంతరము కాదు. తిక్కన ప్రయోగాంతరమును లేదు. శబ్దస్వరూపమే కాదు అర్థసంగతి కూడ సరిగా లేదు. ఆ పాఠము "అఱపాల" కావచ్చునని శ్రీరామమూర్తిగారు సూచించిరి. ఇది అర్థసంగతమగుటయేగాక ద్రౌపది హృదయావేదవమ బహిర్గతము చేయువట్టిది. శ్రీకృష్ణుని సంధిప్రయత్నము అల్ప ప్రతిక్రియ, అల్పకార్యము, స్వల్పకార్యముమ కాదు. అర్ధరాజ్యముమ కాదు. ఈ అర్థమువ "అఱపాల" అను పాఠమే ప్రకరణోచితము.

రంగనాథరామాయణకర్తృత్వము, రంగనాథుడెవరు? అను విషయముల వివరణములతోపాటు రంగనాథరామాయణకవితారామణీయకము, అవాల్మీక

వృత్తాంతముల అపూర్వవిషయముల వివరణము ఈ గ్రంథమునందు సర్వసమర్థముగ ఉన్నవి.

సాహిత్యచరిత్రలో ఎఱ్ఱన కృతుల పౌర్వాపర్యము ఒక సమస్య. అరణ్యపర్వశేషమే ఎఱ్ఱన ఆదిరచనమను సోపపత్తికసమన్వయము, ప్రబంధపరమేశ్వరప్రశంసలోని పరమార్థ వివరణము, సూక్తివైచిత్రిస్వరూపవిశదీకరణము ఇందులోని నూతనాంశములు. నాచన సోముని కాలనిర్ణయమునకు ప్రధానాధారముగా గ్రహించు పెంచుకలదిన్నె శాసనము నిర్ధారకసాధనము కాదన్న నిరూపణము అపూర్వము. సోముని ఆశ్వాసాంతగద్యములోని విశేషణములు స్థూలముగా నిర్వచించి సూక్ష్మముగా వివరింపబడినవి. సకలభాషాభూషణ విశేషణము భాషావిషయమని, సాహిత్యరసపోషణవిశేషణము సాహిత్యవిషయమని, సంవిధానచక్రవర్తి విశేషణము కథావిషయమని, నవీనగుణసనాథవిశేషణము కావ్యగుణవిషయమని సముచితముగ సమన్వయింపబడినది. భాస్కరరామాయణ రచనములో మంత్రి భాస్కరునికి ఎట్టి సంబంధమును లేదని, భాస్కర రామాయణరచనా ప్రణాళిక హుళక్కి భాస్కరునిదే అని సోపపత్తికముగా నిరూపింపబడినది. ఈ రామాయణము షట్కాండముల సమీక్ష సవివరముగ ఉన్నది.

ప్రాఙ్నన్నయయుగమునుండి ఎఱ్ఱనయుగపర్యంతము గల ఈ ప్రథమభాగము వివేకభక్తియుతమైన శరభాంకలింగశతకసమీక్షవరకు సాగినది. ప్రతి యుగమునకు చారిత్రికనైపథ్యమును సమకూర్చుట, ప్రధానగ్రంథములు సవివరముగాను, ఇతర గ్రంథములు సంగ్రహముగాను సమీక్షించుట, ప్రసిద్ధకవుల ఆత్మీయతలను అవలో డించుట, ప్రతియుగవైశిష్ట్యమును సూక్ష్మేక్షికతో పరిశీలించుట ఈ గ్రంథము ప్రత్యేకతలు.

కావ్యసారమును కాచి వడగట్టిన సాహిత్యచరిత్ర ఇది.

సాహిత్యచరిత్రాంశము లెంతగా వివరణ పొందినను, నూత్నపరిశోధి తాంశములు ఎన్ని సమకూడినను, శైలి సరళసుందరము కానిచో ఆ పుస్తకము చదివించదు. చదివించు గుణము శైలికి జీవలక్షణము. అది ఈ గ్రంథములో అంతటను ఉన్నది. శ్రీరామమూర్తిగారి తెలుగుసాహిత్యచరిత్రలోని శైలి గాంభీర్యమాధుర్యముల సమ్మేళనము. కావ్యపఠనదశలో సహృదయుడు పొందు అనుభూతి, ఈ సాహిత్య చరిత్రపఠనదశలో పాఠకుడు పొందుట ఈ గ్రంథము విశిష్టత.

విద్యార్థులకు విషయవిస్తరము,
పరీక్షార్థులకు సమాధానసౌకర్యము,
పరిశోధకులకు ప్రరోచనపాటవము,
జిజ్ఞాసువులకు ప్రామాణికదర్శనము

అందించగల 'వేడీమెకమ్' (Vademecum) ఈ తెలుగు సాహిత్యచరిత్ర.

---- ఆచార్య కోలవెన్ను మలయవాసిని

# శ్రీనాథయుగము

సలక్షణమైన భాషలో విలక్షణంగా సంతరించబడిన ఉద్గ్రంథం తెలుగు సాహిత్య చరిత్ర. స్నాతకోత్తరతరగతి విద్యార్థుల్ని ఉద్దేశించి వ్రాయబడినా, సాహిత్యజిజ్ఞాసువుల కందరకీ ఉపాదేయం ఈ చరిత్రం. కథలూ కాకరకాయలుగా కాక ప్రమాణసహితంగా నేడు సాహిత్యాధ్యయనం చేసే విద్యార్థులే రేపు ఉత్తమబోధకులు కాగలుగుతారు. కనుక పాఠప్రవచన, పరిశోధనానుభవాల ఫలంగా వెలసిన యీ రచన తెలుగు వారికి ప్రామాణిక మైన సాహిత్యచరిత్రగ్రంథం లేదనే అభిప్రాయాన్ని పరాస్తం చేసి పుణ్యం మూట కట్టుకుంది. ఈ ప్రతిష్ఠ మిత్రులు ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి దక్కడం ముదావహం.

చారిత్రకవిశేషాలు శాసనాధారాలూ కొత్తవి లభ్యమవుతన్న యీనాళ్లలో సాహిత్య చరిత్ర నిర్మాణం అనుకున్నంత సులభం కాదనడం నిర్వివాదం. వాటికే తప్ప స్వాభిప్రాయ ప్రకటనకో ఊహలకో పెద్దపీట వేయడం అభిలషణీయంకాదు. చారిత్రికాధారం, శాసనప్రమాణం. ఆంతరంగికసాక్ష్యం ముప్పిరిగొన్న యీ రచన విశ్వసనీయతను సంతరించుకోవడంలో ఆశ్చర్యం లేదు. ఏది చెప్పినా, సందేహానికి తావు లేకుండా చెప్పడం కొర్లపాటి వారి స్వభావం. దానికి పరిశోధనాపాటవం తోడు కావడం పసిడికి పరిమళం అబ్బినట్టే అవుతుంది. ఈ సందర్భంగా ఒకటి రెండు విషయాలు ముచ్చటించుకోవడం అవసరం.

ఆధునికమైన ఆర్యద్రావిడదృష్టితో రామాయణాంతర్గతవిషయాలు కొన్నిటిని పరి శీలించడం జరుగుతున్నది. ఇందుకు సులోచనావృత్తాంతం ఒక మచ్చుతునక. సీత ఆర్యపతివ్రత, సులోచన ద్రావిడపతివ్రత అవడం అసంగతమనీ, ఆ భేదదృష్టి "బుద్ధారెడ్డి కాలమునందు కలదనుటకు ఆధారము లేదు." అని కుండ బద్దలు కొట్టినంత స్పష్టంగా కొర్లపాటివారు పేర్కొనడం ప్రశంసార్హం. మండోదరి మహాపతివ్రత అని ఆర్యపరిగణనమే అని కూడా ఆయన పేర్కొన్నారు. ఆధునికదృష్టితో ప్రాచీనగాథలను పరిశీలించడం సమంజసం కాదు.

తెలుగు సాహిత్యచరిత్రలో శ్రీనాథయుగవైశిష్ట్యాన్ని లెస్సగా గ్రహించినవారు కనుకనే కొర్లపాటివారు యావదాంధ్రదేశాన్ని ఆవరించిన ఆ యుగానికి ద్వితీయసంపుటాన్ని పూర్తిగా వినియోగించడం సరసమూ సహృదయరంజకమూను.

ప్రథమసంపుటం కవిత్రయం వారికి పరిమితం కాగా ద్వితీయసంపుటం, శ్రీనాథాది మహాకవులకు ఉద్దిష్టం కావడం రచయిత పాటించిన ఔచిత్యాన్ని వ్యక్తంచేస్తున్నది. సాహిత్య చరిత్రరచనాసందర్భంలో ఔచిత్యపోషణం అవసరమే. కాక అభిలషణీయం కూడా. కొర్లపాటివారు వెలిబుచ్చిన కొన్ని అభిప్రాయాలు పరిశీలనార్హాలు.

పలనాటివీరచరిత్ర శ్రీనాథకృతమే. పలనాటియుద్ధం మతయుద్ధం కాదు. పురుషాధిపత్యయుద్ధం. వల్లభామాత్యుని రచన అయిన క్రీడాభిరామంలోని పద్యశతపద్యాలు

శ్రీనాథుని శాలివాహనసప్తశతిలోని పద్యాలు కాజాలవు. పోతనగారి భాగవతావతరణానికి చారిత్రిక నైపథ్యం కలదనీ, ఆ భక్తకవి 12 స్కంధాల భాగవతం వెలయించడం పరమసహజమనీ పేర్కొనవచ్చు.

17 వ శతాబ్దివాడుగా భావించబడుతున్న వేమన 15 వ శతాబ్ది ఉత్తరార్థంలో జీవించినట్లు కొర్లపాటి వారి నిశ్చితాభిప్రాయం. ఈ అంశం సోపపత్తికంగా వివరించబడింది. విశ్వదాభిరామ వినుర వేమ అన్న మకుటానికి గల అర్థాన్ని వివరించిన తీరు హృద్యం. రచయిత తెలిపిన వివిధాంశాలను పర్యాప్తంగా పరిశీలిస్తే, ఆ ప్రజాకవిని గురించి మనం తెలుసుకున్నది తక్కువే అనిపిస్తుంది.

సందర్భానుసారంగా వ్యాకరణవిశేషాలను కూడా తెలపడం కొర్లపాటివారి పాఠప్రవచనానుభవఫలితమని భావిస్తున్నాను. అర్థవివరణ కూడా కొన్ని చోట్ల చేశారు. బాలసఖుడనగా బాల్యసఖుడని గ్రహించడం యుక్తం కాదని నిరూపించారు. కవిహృదయాన్ని అర్థం చేసుకోవడానికి అర్థగ్రహణం చాలా అవసరం. ప్రస్తుతపరిస్థితులలో ఇలాంటి రచనా విధానం ప్రశస్తమనడం సాహిత్యవిద్యార్థుల్ని శంకించడం కాదు.

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తిగారు తలపెట్టిన యీ బృహత్కార్యం అందరినీ అలరించగలదనే నా నమ్మకం. ఇతరసంపుటాలు త్వరలోనే వెలుగుచూడాలి.!

-- ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ

## తృతీయభాగము - పుట 88 పంక్తులు 7-10

### అముద్రితపద్యము - సుముద్రితరూపము

" వీఁడు మనీషి వీఁడు కవి వీఁడు రసజ్ఞుఁడు వీఁడిటెన్నఁడున్
రాఁడని కృష్ణరాయలకు నవ్వుచు విన్నపమాచరించు తన్
వేఁడినచో నభీష్టములు వేమఱు నిచ్చుచు ముక్కుతిమ్మఁడు
న్నాఁడిదె ధాత్రిపైఁ గవిజనంబులుఁ బేదవడంగ నేటికిన్ ?"

# ముద్రితకృతులు

| | | |
|---|---|---|
| 1. చిత్రశాల | చారిత్రికనవల | 1957 |
| 2. గుడిగోపురం | కథలసంపుటి | 1957 |
| 3. వీణ | కథల సంపుటి | 1961 |
| 4. ధర్మజ్యోతి | చారిత్రికనాటకము | 1967 |
| 5. శ్రీనాథుఁడు | పిహెచ్. డి థీసిస్ | 1971 |
| 6. ఈశ్వరార్చనకళాశీలుఁడు | డి. లిట్ థీసిస్ | 1974 |
| 7. ప్రతిజ్ఞ | సంస్కృతనాటకానువాదము | 1976 |
| 8. సువర్ణరేఖలు | కావ్యఖండికల సంపుటి | 1976 |
| 9. కావ్యజ్యోత్స్న | పరిశోధనవ్యాససంపుటి | 1977 |
| 10.నన్నెచోడుని కుమారసంభవము ప్రాచీనగ్రంథమా ? ! | పరిశోధనగ్రంథము | 1983 |
| 11. పోతన సాహిత్యగోష్ఠి | సంకలనగ్రంథము | 1984 |
| 12. పాండవుల మెట్ట | చారిత్రకనాటకము | 1985 |
| 13. ప్రబంధసారశిరోమణి | పరిష్కృతగ్రంథము | 1985 |
| 14. పలనాటి వీరచరిత్ర | చారిత్రికనాటకము | 1985 |
| 15. నాథయోగి మనవేమన | పరిశోధనగ్రంథము | 1987 |
| 16. చరిత్రచర్చ | పరిశోధనవ్యాససంపుటి | 1989 |
| 17. సాహిత్యసంపద | పరిశోధనవ్యాససంపుటి | 1989 |
| 18. సాహిత్యసమస్యలు | పరిశోధనవ్యాససంపుటి | 1990 |
| 19. ప్రబంధరత్నాకరము | పరిష్కృతగ్రంథము | 1991 |
| 20. తెలుగు సాహిత్యచరిత్ర | ప్రథమభాగము | 1991 |
| 21. తెలుగు సాహిత్యచరిత్ర | ద్వితీయభాగము | 1992 |
| 22. తెలుగు సాహిత్యచరిత్ర | తృతీయభాగము | 1994 |
| 23. తెలుగు సాహిత్యచరిత్ర | చతుర్థభాగము | 1996 |

# తెలుగు
# సాహిత్యచరిత్ర

## చతుర్థభాగము

ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

రమణశ్రీ ప్రచురణ